శ్రీమద్వాల్మీకి రామాయణాంతర్గత

# సుందరకాండ వ్యాఖ్యానము

## ప్రథమ భాగము

(1 నుండి 17 సర్గ ఆఖరుకు)

" THIS BOOK IS PUBLISHED WITH THE
FINANCIAL ASSISTANCE OF
TIRUMALA TIRUPATHI DEVASTHANAMS
UNDER THEIR SCHEME
AID TO PUBLISH RELIGIOUS BOOKS "

వ్యాఖ్యాత :

ఇందుకూరి లక్ష్మీనారాయణరాజు

శ్రీ హయగ్రీవాయనమః

# శ్రీమద్వాల్మీకి రామాయణాంతర్గత

# సుందరకాండ

## ("వాణీజ్యోత్స్న" వ్యాఖ్యానము)

### ప్రథమ భాగము

( 1 వ సర్గ నుండి 17 వ సర్గ ఆఖరుకు )

    

ఇది శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానమువారి
ఆర్థిక సహాకారముతో
ముద్రింపబడినది.

వ్యాఖ్యాత :

ఇందుమూరి లక్ష్మీనారాయణరాజు



ఆపద మ్రొక్కులవాడు - విశ్వారాధ్యుడు-

నాపాలిట కల్పతరువు - సుందరకాండవ్యాఖ్యాన

గ్రంథప్రచురణకు ఆర్థికము ననుగ్రహించినవాడు నగు

శ్రీ తిరుమల వేంకటేశ్వరస్వామి

పవిత్ర పదసరోజములకు

భక్త్యంజలి!

ఇందుకూరి లక్ష్మీనారాయణరాజు.



సుందరకాండవ్యాఖ్యాత
ఇందుపూరి లక్ష్మీనారాయణరాజు

సహధర్మచారిణి
బంగారయ్యమ్మ

శ్రీ హయగ్రీవాయనమః

# పీ ఠి క

శ్రియఃపతియగు సర్వేశ్వరుఁడు దుఃఖపఙ్కమగ్నులగు చేతనుల నుద్ధరించుటకై స్వనాభికమల సంజాతుఁడగు చతుర్ముఖునకు వేదముల నుపదేశించెను. ఆవేదములు శిష్యపరమ్పరయా లోకమున ప్రచారమునకు వచ్చినవి. వేదార్థజ్ఞానము శ్రమసాధ్యమగుటంజేసి స్మృతి, ఇతిహాస, పురాణములు వేదార్థవిశదీకారమునకై మహర్షులచే రచింపఁబడినవి.

అందు "ప్రాయేణ పూర్వభాగార్థో ధర్మశాస్త్రైణకథ్యతే। ఇతిహాస పురాణాభ్యాం వేదాన్తార్థప్రకాశ్యతే" అనినట్లుగ పూర్వభాగార్థమును ప్రకాశింపఁజేయునవి స్మృతులును, ఉత్తరభాగార్థమును (వేదాంతార్థమును) ప్రకాశింపజేయునవి ఇతిహాస, పురాణములును అయియున్నవి. అందు శ్రీమద్రామాయణము ఇతిహాసమగుటచే వేదాంతార్థ ప్రతిపాదకము. అందలి యన్నికాండలలోను వేదాంతార్థముబోధింపఁబడినను, పరమపురుషప్రాప్తికి ప్రధానసాధనము ఆచార్య సమాశ్రయణమగుటంజేసి, ఆచార్యస్వరూపమును, ఆచార్యకృత్యమును, విశేషించి సున్దరకాణ్డ యందు ప్రతిపాదించఁబడియున్నవి.

సీతారామలక్ష్మణులు పంచవటియందు నివసించుచున్న కాలమున మారీచుఁడు మాయామృగమై వారిని సమీపించెను. ఆ మృగము మారీచుడని లక్ష్మణుడు చెప్పినను సీత యాపరమభాగవతుని మాటవిశ్వసింపక, రామచంద్రుని విశ్లేషణమును క్షణకాలముగూడ సహించని దయ్యును, మృగచర్మమునందలి యాసచే మృగాహరణకై రామచంద్రునంపెను. అందువలన నామెకు రామచంద్రునియందు గల ప్రేమకు విచ్ఛేదము సంభవించినది. ప్రేమరూపమగు పరమపురుషధ్యానము మోక్షకారణము. దాని విచ్ఛేదము బంధహేతువు ఈ విషయము "యదాహ్యేవైష ఏతస్మిన్నుదరమంతరంకురుతే, అథతస్య భయంభవతి" అను శ్రుతివాక్యము చెప్పుచున్నది. ఇచట రామచంద్రుఁడు పరమపురుషుడు. సీత జీవస్థానీయము.

జీవునకు పరమపురుషజ్ఞానవిచ్ఛేదమువలన ప్రకృతి సంబంధము సంభవించును. ఇటు సీతకు క్షణకాలమాత్రరామచంద్ర విశ్లేషము వలన సంవత్సరకాల లంకావాసము సంభవించినది. లం + కా = లంకా. "లం" అనగా పృథివీతత్త్వము. ఇది విస్తారముగాగలది లంక. మన శరీరము పార్థివమే! అనగా జీవునకు పరమపురుష ధ్యానవిచ్ఛేదము వలన శరీరబంధము సంభవించుననిభావము. ఇట్టి బంధవిముక్తి ఆచార్యులవల్ల లభించును. బంధవిముక్తికి ఆచార్యులు ప్రధానోపాయము. ఇట సీతారూప జీవునకు లంకారూప ప్రకృతి (శరీర) బంధవిముక్తికి కారణము హనుమంతుఁడగుటచే నా హనుమంతుడు ఆచార్యస్థానీయుఁడయ్యెను.

ఈయనయొక్క ఆచార్యకృత్యము సుందరకాండ ప్రారంభమునుండియు చెప్పఁబడినది. ఎట్లనగా సీతాన్వేషణకై హనుమంతుఁడు బయలుదేరుటకు ముందు "తతోరావణనీతాయాః సీతాయాః శత్రుకర్శనః, ఇయేష పదమన్వేష్టుం, చారణా చరితేపథి," అని చెప్పఁబడిన రీతిగా పూర్వాచార్యులచే నాచరింపఁబడిన మార్గమందున్నవాఁడును, కామక్రోధాదిరూప శత్రునాశకుఁడును అగుఆచార్యుఁడు అవివేకవశుడైన చేతనుని అధ్యవసాయమును (అనగా చేతనునకు భగవంతుని చేరవలెననెడి అధ్యవసాయమును) తెలిసికొనుటకై సంకల్పించుట యను ఆచార్యకృత్యము హనుమంతునకు చెప్పఁబడినది, "ఆచార్యో వేదసమ్పన్నః విష్ణుభక్తః" — అని ఆచార్యుఁడు వేదసంపన్నుడు విష్ణుభక్తుఁడును కావలెను. హనుమంతుఁడు వేదసంపన్నుఁడనుటకు "నా నృగ్వేదవినీతస్య, నాయజుర్వేదధారిణః నా సామవేద విదుషశ్శక్యమేవంప్రభాషితుం" అని శ్రీరామవచనమువలన వేదసంపన్నత్వమును "దాసోహంకోసలేంద్రస్య" — అను హనుమద్వాక్యాదుల వలన రామచంద్రభక్త్యాదికమును హనుమంతునందు స్పష్టమగుచున్నది. ఇట దశేంద్రియాధిష్ఠితమైన శరీరమే దశాననాధిష్ఠితమగులంక. రావణ కుంభకర్ణ ఇంద్రజిదాదులు అహంకార, మమకార, కామ, క్రోధాదులు. ఈ లంక యందు బంధింపఁబడిన సీతయే శరీరబద్ధుడగు జీవుఁడు.

ఈ శరీర బంధమునకు కారణము రామచంద్రధ్యానవిచ్ఛేదమే, ఇట బద్ధుడగు చేతనుడు (జీవుఁడు) వివేక సహాయముతో ఆచార్య పురుషకారము వలన భగవంతుని చేరును. ఇట్టి వివేకమే విభీషణుఁడు. హనుమంతుడే ఆచార్యుఁడు. బద్ధుఁడైన చేతనుఁడు భగవానుఁడు తన్ను రక్షించునోలేదో యనెడి సంశయముతోనుండగా వానికి ఆచార్యుఁడు పరమపురుష జ్ఞానము కలిగించి, పరమపురుషలాభమును చేకూర్చునని విషయము సీతాసమీపమున రామగుణ సంకీర్తన మొనర్చి రామచంద్ర సంశ్లేషమునకు పురుషకారమొనర్చిన హనుమత్కృత్యము వలన విదితమగుచున్నది.

పరాశర సంహితలో "సుందరహనుమాన్" అని యున్నది. నామైకదేశాన్నామ గ్రహణం అను న్యాయముచే, భీమశబ్దము భీమసేనుని, భామశబ్దము సత్యభామను చెప్పురీతిగా సుందర శబ్దము హనుమంతుని చెప్పును, 'అతిరూపవతి' సీతయని చెప్పఁబడిన సీతాపి అట్టి త్రిలోకసుందరి యగుటచే సుందరీశబ్దము సీతను చెప్పును. సుందరీ సుందర శబ్దములకు ఏకశేషము చేయగా సుందరి శబ్దమగును. సుందరీచ సుందరశ్చ సున్దరౌ, తావధికృత్య కృతః కాండః సుందరకాండః అనివ్యుత్పత్తి. ఇరువురను గూర్చి ప్రధానముగా చెప్పబడిన కాండ గనుక దీనికి సుందరకాండ మని వ్యవహారము. మరియు "పుంసాంమోహన" రూపుడైన శ్రీరామచంద్రుని సౌందర్యాది గుణగణయుతమగుటచేఁ గూడనది సున్దరకాండ.

సుతరాం ఆద్రియతే ఇతి సున్దరం 'ద్వఙ్' ఆదరే. వారి వారి ఇష్టార్థముల నెరవేర్చుటచే నాదరింపబడుచున్నది కనుక సుందరకాండం, మిగిలిన కాండములకు స్థలమునను సరించిగాని, కార్యమునను సరించిగాని బాలకాండము, అయోధ్యకాండము, యుద్ధకాండమనెడి పేర్లు పెట్టబడినవి. దీనికట్లుగాక మీద పేర్కొనబడిన విశేషములబట్టి సుందరకాండమని పేరు పెట్టబడినది. శ్రీమద్రామాయణ మందలి కాండములన్నిటియందును సుందరకాండము సర్వాభీష్ట ఫలప్రదమగుటచే ఆస్తికులు దీనిని శ్రద్ధాభక్తులతో పారాయణము చేసి, అభీష్టఫలప్రాప్తి నందుట సర్వజన విదితము.

ఇటులనే సుందరకాండమున విశేషార్థములనేకములున్నందున శ్రీమద్రామాయణమున సుందరకాండమత్యంత ప్రధానమైనది. ప్రతి పదార్థ జ్ఞానమున్నగాని విశేషార్థము గోచరింపదు. అను తలంపుతో తండ్రిగారి నీడ సంస్కృత భాషాపాటవమును అందినవారును, విద్వదన్వయ సంభూతులును ఇందుకూరి లక్ష్మీనారాయణరాజుగారు సుందరకాండమునకు ప్రతి పదార్థము తాత్పర్యములను వ్రాసియున్నారు. ఎడనెడ విశేషార్థమును పొందుపర్చి లోకోపకారులై తమ వైదుష్యమును సార్థకమొనర్చిరి.

ముగ్గుళ్ల
20-5-86

ఇట్లు
[శ్రీ॥ఉ॥వే॥శ్రీమాన్ మొలుగు రామానుజాచార్యస్వామి]
న్యాయ-వేదాన్త-ధర్మశాస్త్ర-పూర్వఉత్తరపరియోగ
జ్యోతిషవాస్తు శాస్త్ర నిపుణులు.



శ్రీమతే హయగ్రీవాయనమః

# ఉపోద్ఘాతము

శ్లో॥ చరితం రఘునాథస్య శతకోటిప్రవిస్తరం।
ఏకైక మక్షరం ప్రోక్తం మహాపాతక నాశనం ॥
రామాయ రామభద్రాయ రామచంద్రాయ వేధసే।
రఘునాథాయ నాథాయ సీతాయాఃపతయే నమః॥

వాల్మీకి సాక్షాద్వేదసమ్మితమగు రామాయణమును రచించి "ఇతిహాస పురాణాభ్యాం వేదాంతార్థః ప్రకాశ్యతే" అనురీతిగా ఈ రామాయణమునందు సకల ముముక్షుజనోపజీవ్యములైన వేదాంతార్థములను సాకల్యముగ ప్రతిపాదించి యున్నాడు, ఈవాల్మీకి ఆదికవియనియు రామాయణము ఆదికావ్యమనియు నిర్ణయింపబడుచున్నది. ఇట్టి గ్రంథము ఏ వాఙ్మయమునందు గానరాదు. ఇట్టి ఉత్తమకావ్యమునకు కథానాయకుడు ఉత్తమశ్లోకుడగు శ్రీరామచంద్రుడు. "పుణ్యశ్లోకస్య చరితం ఉదాహరణమర్హతి." రామకృష్ణావతార చరిత్రముల తర తమ భావ మాలోచింపగా రామావతారచరిత్రమే ఆసేతు శీతాచలము వ్యాపించి విలసిల్లుచున్నది.

ఈ రామాయణమున నేడు కాండలు కలవు. కిష్కింధా యుద్ధకాండల మధ్య జరిగిన విశేషములకు సీతాన్వేషణకాండ అనికాని హనుమత్కాండ అనికాని పేరు పెట్టవచ్చును. కాని అట్లుగాక సుందరకాండ అని నామకరణము చేసిరి. అనగా "సుందరే సుందరో రామః సుందరే సుందరీ కథా సుందరే సుందరీ సీతా సుందరే సుందరో కపిః" అమనట్లు సుందరకాండ యందలి కథసౌందర్యం సీతసౌందర్యం శ్రీరామచంద్రుని సౌందర్యం లంకానగరము సౌందర్యము లంకానగరంలోఉన్న కమనీయ కామినీజన సౌందర్యం రావణుని రాజస వీర సౌందర్యం జానకి శీల సౌందర్యం హనుమత్ పరాక్రమసౌందర్యం హనుమద్విశ్వరూప శరీర సౌందర్యం మొదలగు సర్వవిషయములు సుందరమగుటచే దీనికి సుందరకాండ యని అన్వర్థనామ మిడిరి.

ఇట్టి శ్రీమద్రామాయణమును విశేషించి సుందరకాండను ప్రాచీనా ర్వాచీనకవులు గద్యాత్మకముగాను పద్యాత్మకముగాను మరికొంతమంది ప్రతిపదార్థములతోను విశేషార్థములతోను వారి వారి అభిరుచి ననుసరించి యెందరో వ్రాసియుండిరి.

అట్టివారిలో ప్రకృతమున ఆత్రేయపురగ్రామ వాస్తవ్యులును, ఆత్రే యాశ్రమ నివాసులును, మాకు అంతేవాసులును, చిరపరిచితులును అయిన శ్రీ ఇందుకూరి లక్ష్మినారాయణరాజుగారు శ్రీమద్రామాయణ మందలి సుందరకాండకు బహుకాలము బహుశ్రమ కోర్చి బహువిఘ్నములను ఎదుర్కొని ప్రతిశ్లోకమునకు ప్రతిపదార్థమును, తాత్పర్యమును, అచ్చ టచ్చట విశేషార్థములను ధ్వన్యర్థములను చక్కగా వ్రాసియుండిరి. ఈ గ్రంథమును ఆమూలాగ్రముగ పరిశీలించితిని. వీరు వ్రాసిన శ్లోక ప్రతి పదార్థ సహాయమున ఎంత స్వల్పసంస్కృతజ్ఞానము కలవారైనను అవ గతము చేసికొందురని నా ఆశ. ఇట్టి ఈ సుందరకాండను ఎందరు ఎన్ని భాషలలో ఏవిధముగా వర్ణించినను చర్వితచర్వణముగాక తనివితీరని అమృతపానమువంటిది కదా!

భగీరథుడు భూమికి గొనితెచ్చిన భాగీరథిని తరువాతవార లందరు స్నానపానాదులకు ఉపయోగించినట్లు వాల్మీకికి అర్వాచీనులయిన కాళిదాసా దులును వాల్మీకిగ్రంథములను చూచియే తమ తమ శక్తి భక్త్యనుసారముగా కావ్యనాటకాదులను రచించిన రీతిని శ్రీ ఇందుకూరి లక్ష్మినారాయణరాజు గారు కూడా ఈ సుందరకాండకు ప్రతిపదార్థములను రచించి లోకమునకు మహోపకార మొనర్చినారు. వీరికి వీరి కుటుంబమునకు ఇహపర సౌఖ్య ములు శ్రీ రామచంద్రుడు కృపచేయుగాక!

ఇట్లు
బుధజనవిధేయుడు, భాగవత పాదరేణువు,
శ్రీమాన్ మొఱుగు తిరువెంగళనరసింహాచార్య
పురాణ వాచస్పతి

ముగ్గుళ్ల.
20-5-86

# విన్నపము

పరమపురుషుడైన శ్రీమన్నారాయణుడు శ్రీరాముడుగా రఘువంశమున జన్మింపగా వాల్మీకినోట వేదమే రామాయణముగా నవతరించినది. రాముడు వేదవేద్యుడగు పురుషోత్తముడు. రామాయణము సాక్షాద్వేదము, సప్తకాండములతో విలసిల్లు శ్రీమద్రామాయణము పారాయణగ్రంథము, ఇష్టకామ్యసిద్ధిప్రదము. అందలి సుందరకాండము మిగుల పవిత్రము, పారాయణ యోగ్యమును.

"బీజకాండ మితిప్రోక్తం సర్వరామాయణేష్వపి" అని ప్రసిద్ధి నందినది. కథాకథనములో, రచనా విన్యాసములో, భావప్రకటనములో, ధర్మనిర్ణయములో, ఔచితీవిచారణములో, ప్రభుభక్తిలో, సేవాతాత్పర్యములో, గుణశీలపాలనలో, నుత్తమమార్గముల జూపి ధార్మికసౌందర్య విలసితమయినది సుందరకాండ. ఇందలి ప్రతిపదము, ప్రతిశ్లోకము రమణీయార్థప్రతిపాదకము. సర్వులు పఠించి యవగాహన మొనరించి తరింపవలసిన గ్రంథము.

అట్టిదానిని ప్రతిపదార్థ తాత్పర్యములతో వ్యాఖ్యానించి ఆస్తిక మహాశయుల కందింపవలె నను సంకల్పముతో దైవానుగ్రహ బలమునను - మిక్కిలి ప్రోత్సహించి నాకు అన్నివిధముల చేదోడుగ నుండి సుందరకాండ పఠనాసక్తుడయి దివి నలంకరించిన నాల్గవ కుమారుడు వెంకటవివేకానందుని సహకారముననురచన పూర్తిగావించినాను. అతనికి శాశ్వతశాంతి కలుగవలెనని కోరుచు, వ్యాఖ్యానాసక్తత గలుగజేసిన నా జనకులు పూజ్య గురుదేవులు శ్రీ గోవిందరాజుగారికి ముందు వందనము లర్పించుకొనుచున్నాను—

ఈ "వాణీజ్యోత్స్న" వ్యాఖ్యానమును 4 భాగములుగ ప్రకటింపనెంచి తొలిభాగమును 17వ సర్గాంతమునకు సిద్ధపరచితిని. వ్యాఖ్యానరచనకు కావలసిన పాండిత్యము అర్హత లేకున్నను పరమేశ్వరానుగ్రహము, హనుమ

త్కృప, వేంకటేశ్వర కరుణము రాశీభూతమయి దీనిని పూర్తి చేసినవి. ఇందలి గుణములనే గ్రహించి దోషములను పరిహరింప గోరుచున్నాను. ఆక్షరాస్యుల కందరకు వాల్మీకి హృదయము, సుందరకాండవిజ్ఞానము తేలికగ నందింప వలెననెడి గాఢవాంఛయే కారణముగాని నేనొక పండితుడ నని చాటుకొనుటకుగాదు.

రామాయణరచనలో వాల్మీకి రామసాక్షాత్కారమును పొందినట్లు రామాయణము నర్థవంతముగ తత్పరత్వమున జదివి రామతత్వ దర్శనమును పొందుస్థితికి పఠిత రావలె నని నా యాకాంక్ష। అట్లు దర్శింపగల్గిననాడే పఠనప్రయోజనము। వాల్మీకి చూచిన, చూపిన రామాయణ మహార్థమును సులభసుందరముగ నందింపవలెననియే నా యీ యత్నము.

ఈ "వాణీజ్యోత్స్న" వ్యాఖ్యాన రచనలో శ్రీవాసుదాసుగారి భావములను గ్రహించి వారిపోకడలలో కొన్నిటిని అనుకరించితిని. అందులకు ఆమహామనీషికి మనసా నమస్కరింతును. వారి సమన్వయశక్తి భావనాయుక్తి అనుపమానము. వానిపై గల గాఢానురాగమే నా యనుకరణకు కారణము —

ఈ సాగర తరణమునకు రామకృప నావయైనది, అపు డపుడు హనుమత్సాక్షాత్కారభాగ్యము లభించి వ్యాఖ్యానము నిస్సంశయముగ నిర్విఘ్నముగ జరిగినది. ఇది నాపెద్దల ఆశీర్బలము. నా పురాసుకృత సంస్కారఫలమును —

ఈ గ్రంథముద్రణకు ఆర్థికముగా సంపూర్ణ సహకారమందించిన శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానమువారికి కృతజ్ఞతాంజలి। నాకు సర్వధా సకుటుంబముగ సహకరించిన మహారాజ శ్రీ ఇందుకూరి శివరామరాజు గారికి నా నమోవాకములు ।

నా యీ రచనకు అపర రామానుజులవలె ఉపదేశములిచ్చి దధీచి వలె త్యాగభావముతో ఆదరించి పీఠికతో ఆశీర్వదించిన పూజ్యపాదులు శ్రీ ఉ॥వే॥ శ్రీమాన్ మొలుగు రామానుజాచార్య స్వామి పదపద్మములకు ప్రణామములు. దీని నాద్యంతము పరిశీలించి ఉపోద్ఘాతముతో ఆదరించిన శ్రీమాన్ మొలుగు తిరువెంగళనరసింహాచార్య వర్యులకు నమస్కృతులు. తాతలనాటి మైత్రీబంధమును పురస్కరించుకొని నా యీ గ్రంథము అచ్చు నారంభించినది మొదలు అహోరాత్రములు శ్రమించి దీని కొక రూపమును దిద్దితీర్చిన మిత్రపుత్రులు "సుకవికోకిల" శ్రీ నరసింహదేవర ఉమా మహేశ్వరశాస్త్రిగారి కెంతయు కృతజ్ఞుడనై నమస్కరించుచున్నాను.

సకాలములో ముద్రించి సర్వవిధముల సహకరించిన శ్రీ వేంకటే శ్వర ప్రింటింగు ప్రెస్సు ఆలమూరువారికి కృతజ్ఞతలు —

ఇందుల కెందరో మహానుభావులు ప్రోత్సహించి సహకరించిరి. వారందరికిని వందనములు —

తక్కిన 3 భాగములును త్వరలో ప్రకటించుకొందును.

ఇట్లు

ఆత్రేయాశ్రమము<br>ఆత్రేయపురము<br>26—5—86

బుధజన విధేయుడు<br>ఇందుకూరి లక్ష్మీనారాయణ రాజు

శ్రీరస్తు ।　　　శుభమస్తు ।　　　శ్రీహయగ్రీవాయనమః ।

# సంప్రార్థనము

శ్లో॥ జ్ఞానానందమయం దేవం నిర్మలస్ఫటికాకృతిం ।
ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవముపాస్మహే ॥

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం ।
ప్రసన్న వదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే ॥

శ్లో॥ దోర్భి ర్యుక్తా చతుర్భిః స్ఫటికమణిమయీ మక్షమాలాందధానా ।
హస్తే నైకేన పద్మం సితమపి చ శుకం పుస్తకం చాపరేణ ।
భాసా కుందేందు శంఖ స్ఫటిక మణినిభా భాసమానా సమానా ।
సా మే వాగ్దేవ తేయం నివసతు వదనే సర్వదా సుప్రసన్నా ॥

శ్లో॥ కూజంతం రామ రామేతి । మధురం మధురాక్షరం ।
ఆరుహ్య కవితా శాఖాం వందే వాల్మీకికోకిలం ॥

శ్లో॥ గోష్పదీకృత వారాశిం మశకీకృత రాక్షసం ।
రామాయణ మహామాలారత్నం వందేనిలాత్మజం ॥

శ్లో॥ అంజనానందనం వీరం జానకీశోక నాశనం ।
కపీశ మక్ష హంతారం వందే లంకాభయంకరం ॥

శ్లో॥ వాల్మీకి గిరి సంభూతా రామసాగర గామినీ ।
శ్రీమద్రామాయణీ గంగా పునాతు భువనత్రయం ॥

శ్లో॥ గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః ।
గురు స్సాక్షాత్ పరబ్రహ్మ తస్మై శ్రీ గురవేనమః ॥

శ్రీ సిద్ధి గణాధిపతయే నమః

శ్రీరస్తు । ఓం శుభమస్తు ।

శ్రీ సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః

# శ్రీమ ద్వాల్మీకి రామాయణే, సుందరకాణ్డే,
# ప్రథమ స్సర్గః ప్రారంభః.

## * హనుమంతుడు మహేంద్రపర్వతమున విహరించుట *

శ్లో॥ తతో రావణనీతాయా స్సీతాయా శ్శత్రుకర్శనః।
ఇయేష పద మన్వేష్టుం చారణాచరితే పథి॥ ౧

టీ॥ తతః = అటుతరువాత, శత్రుకర్శనః = శత్రువులను నశింపజేయు ఆంజనేయుడు. రావణనీతాయాః-రావణ = రావణునిచే, నీతాయాః = తీసికొనివెళ్ళబడిన, సీతాయాః = సీతాదేవియొక్క, పదం = స్థానమును, అన్వేష్టుం = వెదకుటకొరకునాను, చారణాచరితే - చారణ = చారణులచేత, ఆచరితే = సంచరింపబడుచున్నటువంటి. పథి = మార్గమందు (ఆకాశమునందు) ఇయేష = వెళ్ళుటకు నిశ్చయించెను.

తా॥ తరువాత శత్రువుల జయింప సమర్థుడైన హనుమంతుడు రావణునిచే, నపహరింపబడిన సీత యున్నటువంటి ప్రదేశమును చేరుటకు జాంబవదాది కపులచే ప్రోత్సహించబడినవాడై చారణులు సంచరించెడి ఆకాశమునందు వెళ్ళుటకు ఇచ్ఛగించెను.

శ్లో॥ దుష్కరం నిష్ప్రతిద్వన్ద్వం చికీర్ష న్కర్మ వానరః ।
సముదగ్రశిరో గ్రీవో గవాంపతి రివా బభౌ॥ ౨

టీ॥ వానరః = వానరుడైన హనుమంతుడు. దుష్కరం = చేయశక్యముగానటువంటియు, నిష్ప్రతిద్వన్ద్వం = ప్రతిబంధకము లేనట్టియు కర్మ = కార్యమును, చికీర్షన్ = చేయ నిశ్చయించినవాడై, సముదగ్రశిరః-సముదగ్ర = ఎత్తబడినటువంటి, శిరః = శిరస్సుగలవాడై,

గ్రీవః = కంఠముగలవాడై, గవాంపతి రివ = వృషభరాజమువలె, బభౌ = మిక్కిలి ప్రకాశించెను.

తా॥ అసాధ్యమైనటువంటిదియు, ప్రతిబంధకము లేనటువంటిదియు నగు సముద్రమును దాటుట యనెడి గొప్పకార్యమును చేయ నుద్యుక్తుడైన ఆంజనేయుడు శిరస్సును కంఠమును పైకెత్తి ధైర్యోత్సాహసాహసవంతుడై వృషభరాజమువలె మిక్కిలి ప్రకాశించెను.

శ్లో॥ అథ వైడూర్య వర్ణేషు శాద్వలేషు మహాబలః।
ధీర స్సలిల కల్పేషు విచచార యథా సుఖమ్॥ ౩

టీ॥ అథ = ఆటుతరువాత, మహాబలః = గొప్పపరాక్రమముగలిగినవాడును. ధీరః = ధైర్యవంతుడునైన హనుమంతుడు, వైడూర్యవర్ణేషు - వైడూర్య = వైడూర్యమాణిక్యములయొక్క, వర్ణేషు = కాంతులు గలిగినట్టియు, సలిలకల్పేషు-సలిల = ఉదకములతో, కల్పేషు = సమానము లైనట్టి, శాద్వలేషు = పచ్చికభూములందు, యథా సుఖం = సుఖముగా, విచచార = విశేషముగా సంచరించెను. (పచారు చేయుచుండెను.)

తా॥ మిక్కిలి బలవంతుడు ధైర్యవంతుడునైన హనుమంతుడు మరకత మాణిక్యముల ఛాయలు గలిగి ఉదకములవలె గన్పట్టుచున్న పచ్చిక భూములయందు యథాసుఖముగ విహరించెను.

శ్లో॥ ద్విజా న్విత్రాసయ న్ధీమా నురసా పాదపా న్హరన్।
మృగాంశ్చ సుబహూ న్నిఘ్నన్ ప్రవృద్ధ ఇవ కేసరీ॥ ౪

టీ॥ ధీమాన్ = బుద్ధిమంతుడైన హనుమంతుడు, ద్విజాన్ = పక్షులను విత్రాసయన్ = భయపెట్టుచున్నవాడగుచు. ఉరసా = వక్షస్థలముచే పాదపాన్ = వృక్షములను, హరన్ = కొట్టుచున్నవాడై, కేసరీవ = సింహమువలె, ప్రవృద్ధః = విజృంభించెను.

తా॥ బుద్ధిమంతుడైన హనుమంతుడు గమనోత్సాహుడై వక్షస్థలముచే వృక్షములను కూలద్రోయుచు, పక్షులను భయపెట్టుచు, సమస్త మృగములను కొట్టుచు సింహామువలె విజృంభించెను.

శ్లో॥ నీల లోహిత మాంజిష్ఠ పత్రవర్ణై స్సితాసితైః।
స్వభావ విహితై శ్చిత్రై ర్ధాతుభి స్సమలంకృతమ్॥ ౫
కామరూపిభి రావిష్ట మభీక్ష్ణం సపరిచ్ఛదైః।
యక్ష కిన్నర గంధర్వై ర్దేవకల్పై శ్చ పన్నగైః॥ ౬
సతస్య గిరివర్యస్య తలే నాగవ రాయుతే।
తిష్ఠ న్కపివర స్తత్ర హ్రదే నాగఇవా బభౌ॥ ౭

టీ॥ నీల లోహిత మాంజిష్ఠ పత్రవర్ణైః-నీల = నల్లనైన, లోహిత = ఎఱ్ఱనైన, మాంజిష్ఠ = పచ్చనైన, పత్ర = ఆకులయొక్క, వర్ణైః = కాంతులుగలిగినట్టియు, సితాసితైః = తెలుపు నలుపుఅయినటువంటిదియు స్వభావవిహితైః = స్వతస్సిద్ధము లైనటువంటివియు, చిత్రైః = చిత్రములైనటువంటివియు, ధాతుభిః = గైరికాదిధాతువులచేత, సమలంకృతం = అలంకరింపబడినటువంటిదియు కామరూపిభిః = కోరిన రూపములు గలిగినటువంటియు, సపరిచ్ఛదైః = అలంకారములతో కూడి యున్నటువంటియు, యక్ష కిన్నర గంధర్వైః - యక్ష = యక్షులు. కిన్నర = కిన్నరులు, గంధర్వైః = గంధర్వులచేతను, దేవకల్పైః = దేవతలతో సమానములైన, పన్నగైశ్చ = పన్నగుల చేతను, ఆవిష్టం = కూడికొన్నదియు, అభీక్ష్ణం = బాగుగా చూడబడినదియు. నాగవరాయుతే = నాగవర = శ్రేష్ఠమైన యేనుగులతో ఆయుతే = కూడియున్న. తస్య = ఆ. గిరివర్యస్య = పర్వతశ్రేష్ఠమైన మహేంద్రపర్వతము యొక్క, తలే = ప్రదేశమునందు. సః = ఆ. కపివరః = వానరశ్రేష్ఠుడైన హనుమంతుడు, తిష్ఠన్ = ఉన్నవాడై,

తత్ర = అమహేంద్రపర్వతమునందు, హ్రదే = మడుగునందు, నాగ ఇవ = ఏనుగువలె, బభౌ = మిక్కిలిప్రకాశించెను.

తా॥ నలుపు, యెరుపు, పచ్చని ఆకులరంగులతోను, మరియు తెలుపు, నీలపు రంగులతోను, స్వాభావికరంగులు గల వివిధ ధాతువులచే నలంకరించబడినటువంటియు, కామరూపులై, సాలంకారులైన యక్ష, కిన్నర, గంధర్వాదులచేతను, దేవతా సదృశులైన పన్నగులచేతను కూడి యుండినటువంటియు, శ్రేష్ఠమైన ఏనుగులతోను కూడియున్న ఆ మహేంద్రపర్వతముయొక్క సమతల ప్రదేశమునందు వానరశ్రేష్ఠుడైన హనుమంతుడు మడుగునందున్న యేనుగువలె ప్రకాశించెను.

శ్లో॥ స సూర్యాయ మహేన్ద్రాయ పవనాయ స్వయంభువే ।
భూతేభ్య శ్చాంజలిం కృత్వా చకార గమనే మతిమ్॥ ౮

టీ॥ సః = ఆ హనుమంతుడు, సూర్యాయ = సూర్యునికొరకు, మహేంద్రాయ = దేవేంద్రునికొరకు, పవనాయ = వాయుదేవునికొరకు, స్వయంభువే = బ్రహ్మకొరకు, భూతేభ్యశ్చ = భూతములకొరకు, అంజలింకృత్వా = నమస్కరించి, గమనే = వెళ్ళుటయందు మతిం = బుద్ధిని, చకార = చేసెను.

తా॥ ఆ హనుమంతుడు సూర్యభగవానునకు, దేవేంద్రునకు, బ్రహ్మకు, సర్వభూతములకు అంజలి ఘటించి నమస్కరించి ప్రయాణ సన్నద్ధుడయ్యెను.

శ్లో॥ అఞ్జలిం ప్రాఙ్ముఖః కుర్వన్ పవనా యాత్మయోనయే ।
తతోఽభివవృధే గన్తుం దక్షిణో దక్షిణాం దిశమ్॥ ౯

టీ॥ తతః = అటుతరువాత, దక్షిణః = దక్షిణముఖుడుగానున్న అంజలి నేయుడు, ప్రాఙ్ముఖః = తూర్పుముఖము గలవాడై, ఆత్మయోనయే =

తనకు తండ్రియైన, పవనాయ = వాయుదేవునికొఱకు, అంజలిం = దోసిలిని, కుర్వన్ = చేసినవా డగుచు, దక్షిణాం = దక్షిణపుదైన, దిశం = దిక్కునుగూర్చి, గంతుం = వెళ్ళుటకు, అభివవృధే = శరీరమును పెంచెను.

తా॥ అటుతరువాత దక్షిణముఖుడుగా నున్న ఆంజనేయుడు తూర్పు ముఖము గలవాడై, సర్వదేవతలకు, తనతండ్రియగు వాయుదేవునకు నమస్కరించి దక్షిణదిక్కుగా వెళ్లుటకు తన శరీరమును పెంచెను,

శ్లో॥ ప్లవఙ్గప్రవరై ర్దృష్టః ప్లవనే కృతనిశ్చయః ।
వవృధే రామవృద్ధ్యర్థం సముద్ర ఇవ పర్వసు॥ ౧౦

టీ॥ ప్లవంగప్రవరైః = వానరశ్రేష్ఠులచేత, దృష్టః = చూడబడుచున్న వాడై, రామవృద్ధ్యర్థం = రామకార్యార్థమై, ప్లవనే = దాటుటయందు కృతనిశ్చయః-కృత = చేయబడిన. నిశ్చయః = నిశ్చయముగ లిగినవా డగుచు, పర్వసు = పర్వదినములందు. సముద్ర ఇవ = సముద్రుడువలెనే వవృధే = వృద్ధిపొందెను.

తా॥ ఆ హనుమంతుడు రామకార్యార్థియై సముద్రము దాట నిశ్చయించి జాంబవదాది వానరశ్రేష్ఠులు చూచుచుండ పర్వదినములం దుప్పొంగు సముద్రునివలె వృద్ధిపొందెను.

* హనుమంతుని విక్రమమునకు మహేంద్రాద్రి చీకాకుపడుట *

శ్లో॥ నిష్ప్రమాణ శరీరస్సన్ విలఙ్ఘయిషు రర్ణవమ్ ।
బాహుభ్యాం పీడయామాస చరణాభ్యాం చ పర్వతమ్॥ ౧౧

టీ॥ అర్ణవం = సముద్రమును, విలంఘయిషుః = అవలీలగా దాట నిచ్ఛ గలవా డగుచు నిష్ప్రమాణశరీరస్సన్-నిష్ప్రమాణ = పరిమాణము కట్టలేని, శరీరస్సన్ = శరీరముగలవాడై, బాహుభ్యాం = బాహువుల

తోను, చరణాభ్యాంచ = పాదములతోను. పర్వతం = మహేంద్రపర్వతమును. పీడయామాస = కదలించెను.

తా॥ సముద్రమును దాటనిశ్చయించుకొన్న హనుమంతుడు ప్రమాణమునకంద నంతశరీరమును పెంచినవాడై, చేతులతోను పాదములతోను ఆ మహేంద్రపర్వతమును కదలించెను.

శ్లో॥ సచచా లాచల శ్చాపి ముహూర్తం కపిపీడితః।
తరూణాం పుష్పితాగ్రాణాం సర్వం పుష్ప మశాతయత్॥ ౧౨

టీ॥ సః = ఆమహేంద్రపర్వతము, అచలశ్చాపి = కదలనిదైనప్పటికి. కపిపీడితః = హనుమంతునిచే కదలించబడినదై. ముహూర్తం = ముహూర్తకాలము,చచాల = వణకెను. పుష్పితాగ్రాణాం - పుష్పిత = పుష్పించిన, అగ్రాణాం = కొనలుగల, తరూణాం = చెట్లయొక్క, సర్వం = సమస్తమైన. పుష్పం = పూలసముదాయమును, అశాతయత్ = రాల్చెను.

తా॥ ఆ మహేంద్రపర్వతము కదలనిదయ్యుకూడా హనుమంతునిచేత కదలించబడి, క్షణకాలము చలించి చెట్లకొమ్మలనుండి పుష్పములను రాల్చెను.

శ్లో॥ తేన పాదపముక్తేన పుష్పౌఘేణ సుగన్ధినా।
పర్వత స్సంవృత శ్శైలో బభౌ పుష్పమయో యథా॥ ౧౩

టీ॥ శైలః = మహేంద్రపర్వతము, పాదపముక్తేన-పాదప = చెట్లనుండి ముక్తేన = విడువబడినట్టియు, సుగంధినా = మంచిపరిమళముగలిగిన తేన = ఆ, పుష్పౌఘేణ = పూలసమూహముచేత. సర్వతః = అంతటను. సంవృతః = కూడికొన్నదై. పుష్పమయోయథా = పూలమయమైనట్లు బభౌ = ప్రకాశించెను.

తా॥ ఆ మహేంద్రపర్వతము ఆంజనేయునిచే కదల్చబడి, చెట్లకొమ్మల నుండి క్రిందపడి మంచి పరిమళముతో కూడిన పుష్పములచే అంతట నిండి పూలకొండయో అన్నట్లు ప్రకాశించెను.

శ్లో॥ తేన చోత్తమ వీర్యేణ పీడ్యమాన స్సపర్వతః।
సలిలం సంప్రసుస్రావ మదం మత్త ఇవ ద్విపః॥ ౧౪

టీ॥ ఉత్తమవీర్యేణ - ఉత్తమ = శ్రేష్ఠమైన. వీర్యేణ = పరాక్రమముగల. తేన = ఆ హనుమంతునిచేత. సః = ఆ. పర్వతః = మహేంద్రపర్వతము. పీడ్యమానశ్చ = కదలింపబడినదయ్యు. మత్తః = మదించిన. ద్విపః = ఏనుగు. మదమివ = మదమునువలెనే. సలిలం = ఉదకమును సంప్రసుస్రావ = వెంటనే స్రవింపజేసెను.

తా॥ మహాపరాక్రమవంతుడైన హనుమంతునిచే మహేంద్రపర్వతము కదలింపబడినదై మదించిన యేనుగు మదజలమును కార్చినట్లు వెంటనే ఉదకమును స్రవింపజేసెను.

శ్లో॥ పీడ్యమానస్తు బలినా మహేంద్ర స్తేన పర్వతః।
రీతీ ర్నిర్వర్తయామాస కాఞ్చనాఞ్జన రాజతీః॥ ౧౫

టీ॥ బలినా . పరాక్రమశాలియైన. తేన = ఆహనుమంతునిచేత. మహేంద్రః = మహేంద్రమనెడి. పర్వతః = పర్వతము. పీడ్యమానస్తు = బాధింపబడినదై . కాంచనాంజనరాజతీః -కాంచన = బంగారమువలెను. అంజన = కాటుకవలెను. రాజతీః = వెండివలె నున్న. రీతీః = బీటలను. నిర్వర్తయామాస = బహిర్గతముచేసెను.

తా॥ మహాపరాక్రమశాలియైన హనుమంతునిచే ఆమహేంద్రపర్వతము కదలింపబడి పగుళ్లు తీసినదియై బంగారు, కాటుక, వెండి వన్నెలు గలవైయున్న రాళ్ల రేఖలు ప్రకాశించెను.

శ్లో॥ ముమోచ చ శిలా శ్శైలో విశాలా స్స మనశ్శిలాః।
మధ్యమే నార్చిషా జుష్టో ధూమరాజీ రివాఽనలః॥ ౧౬

టీ॥ శైలః = పర్వతము. విశాలాః = విశాలము లైనట్టియు, స మనశ్శిలాః = మనశ్శిలలనేరాళ్లతోకూడినటువంటియు. శిలా శ్చ = రాళ్లను. అనలః = అగ్నిహోత్రుడు. మధ్యమేన = నడుమదైన. అర్చిషా = జ్వాలతో. జుష్టః = వ్యాప్తుడైన. ధూమరాజీ రివ = పొగసముదాయమువలెనే. ముమోచ = విడిచెను.

తా॥ ఆ మహేంద్రపర్వతము బలవంతు డగు హనుమంతునిచే కదల్చబడినదై పెద్దవైన మనశ్శిలలనే ధాతువిశేషములను, అగ్నిహోత్రుడు (కాళీ, కరాళీ, విస్ఫులింగినీ, ధూమ్రవర్ణా, విశ్వరుచి, లోహిత, మనోజవ, అను పేర్లుగల సప్తజిహ్వలలో) మధ్యదైన ధూమ్రవర్ణాజ్వాలతో కూడిన అగ్నినుండి పొగవరుసలు బయలువెడలునట్లు బయటపడెను.

శ్లో॥ గిరిణా పీడ్యమానేన పీడ్యమానాని సర్వతః।
గుహావిష్టాని భూతాని వినేదు ర్వికృతైః స్వరైః॥ ౧౭

టీ॥ పీడ్యమానేన = కంపింపచేయబడిన. గిరిణా = పర్వతముచే. స్వరతః = అంతట. పీడ్యమానాని = బాధింపబడినవై. గుహావిష్టాని - గుహా = గుహలయందు. ఆవిష్టాని = ప్రవేశించియున్నటువంటి. భూతాని = భూతములు. వికృతైః = వికృతములైన. స్వరైః = స్వరములతో. వినేదుః = అరచినవి.

తా॥ హనుమంతునిచే ఊపబడిన మహేంద్రపర్వతముయొక్క గుహలలో దాగియున్న భూతములు భయముచే వికృతస్వరముతో నరచినవి.

శ్లో॥ స మహాసత్త్వ సన్నాద శ్శైలపీడా నిమిత్తజః
పృథివీం పూరయామాస దిశ శ్చోపవనాని చ॥ ౧౮

టీ॥ శైలపీడానిమిత్తజః - శైల = మహేంద్రపర్వతము యొక్క. పీడా = కదుపుటయొక్క. నిమిత్తజః = కారణముగా పుట్టినటువంటి. సః = ఆ. మహాసత్త్వసన్నాదః - మహాసత్త్వ = భూతములయొక్క. సన్నాదః = వికారధ్వని. పృథివీం = భూమిని. దిశశ్చ = దిక్కులను. ఉపవనానిచ = ఉద్యానవనములను. పూరయామాస = నిండించెను.

తా॥ మహాపరాక్రమశాలియగు హనుమంతుడు మహేంద్రపర్వతమును కదుపగా భయపడిన ఆ పర్వతగుహలలో దాగియున్న పెద్దమృగముల యొక్క యేదుపుల వికారధ్వనులు దగ్గర అడవులయందు, దిక్కులయందు భూమియందు నిండి వ్యాపించెను.

శ్లో॥ శిరోభిః పృథుభి స్సర్పా వ్యక్త స్వస్తికలక్షణైః ।
వమన్తః పావకం ఘోరం దదంశు ర్దశనై శ్శిలాః॥ ౧౯

టీ॥ సర్పాః = సర్పములు. వ్యక్తస్వస్తికలక్షణైః - వ్యక్త = స్ఫుటమైన. స్వస్తికలక్షణైః = స్వస్తికచిహ్నములు కలిగినటువంటియు, పృథుభిః = గొప్పవైన. శిరోభిః = శిరస్సులతో, ఘోరం = తీవ్రమైన. పావకం = అగ్నిని. వమంతః = క్రక్కుచున్నవై. దశనైః = దంతములచే. శిలాః = రాళ్ళను. దదంశుః = కరచినవి.

తా॥ ఆ మహేంద్రపర్వతము నందలి సర్పములు పడగలయందలి అర్ధచంద్రాకారముగానుండు స్వస్తికచిహ్నములుగల గొప్పశిరస్సులతో నిప్పుతో సమానమైన విషమును గ్రక్కుచు కోరలచే అచ్చటి రాళ్ళను కఱచినవి.

శ్లో॥ తా స్తదా సవిషై ర్దష్టాః కుపితై స్తై ర్మహాశిలాః।
జజ్వలుః పావకో ద్దీప్తా బిభిదు శ్చ సహస్రధా॥ ౨౦

టీ॥ తదా = అప్పుడు, కుపితైః = కోపగించబడినటువంటివిన్ని, సవిషైః = విషములతో కూడియున్నటువంటి, తైః = ఆసర్పములచే. దష్టాః = కరవబడిన, తాః = ఆ, మహాశిలాః = పెద్దరాళ్ళు. పావకోద్దీప్తాః = పావక = అగ్నిచే, ఉద్దీప్తాః = ప్రజ్వరిల్లిన, జజ్వలుః = జ్వాలలుగా, సహస్రధా = వేయివిధములుగా, బిభిదుః = బ్రద్దలయ్యెను.

తా॥ కోపముతో మహావిషము గ్రక్కుచున్న ఆసర్పములు అచ్చటి పెద్ద పెద్ద రాళ్లను కరవగా అగ్నిచే ప్రేల్చబడినట్లు ఆరాళ్ళు వేయేసి ముక్కలుగా బ్రద్దలైనవి.

శ్లో॥ యాని చౌషధిజాలాని తస్మిన్జాతాని పర్వతే ।
విషఘ్నా న్యపి నాగానాం న శేకు శ్శమితుం విషమ్॥ ౨౧

టీ॥ తస్మిన్ = ఆ, పర్వతే = పర్వతమునందు, జాతాని = పుట్టినటువంటి యాని = ఏ, ఔషధజాలాని = ఓషధీసమూహములు. విషఘ్నాన్యపి = విషమునుహరింపజేయునవై నప్పటికి, నాగానాం = సర్పములయొక్క విషంచ = విషమునుమాత్రము. శమితుం = హరించుటకు, న శేకుః = సమర్థములుగాకపోయెను,

తా॥ ఆ పర్వతమునందలి యోషధులు విషమును హరింపజేయునవే అయ్యును. ఆ క్రూరసర్పములయొక్క విషమును మాత్రము హరింప జాలకపోయెను.

శ్లో॥ భిద్యతేఽయం గిరిర్భూతై రితిమత్వా తపస్వినః ।
త్రస్తా విద్యాధరా స్తస్మా దుత్పేతుః స్త్రీగణైస్సహ॥ ౨౨
పానభూమిగతం హిత్వా హైమమాసవభాజనమ్ ।
పాత్రాణి చ, మహార్హాణి కరకాం శ్చ హిరణ్మయాన్॥ ౨౩
లేహ్యా నుచ్చావచాన్ భక్ష్యాన్ మాంసాని వివిధానిచ ।
ఆర్షభాణి చ చర్మాణి ఖడ్గాం శ్చ కనకత్సరూన్॥ ౨౪

టీ॥ అయం = ఈ గిరిః = మహేంద్రపర్వతము. భూతైః = భూతముల చేత, భిద్యతే = భేదింపబడుచున్నది. ఇతి = ఈలాగునని. మత్వా = తలంచి. తపస్వినః = మహర్షులు. విద్యాధరాః = విద్యాధరులు. త్రస్తాః = భయపడినవారై, స్త్రీగణైస్సహ = స్త్రీసమూహములతోగూడ తస్మాత్ = ఆమహేంద్రపర్వతమునుండి. ఉత్పేతుః = పైకివెళ్లిరి. పానభూమిగతం = పానభూమియందున్నటువంటి. హైమం = బంగారుమయమైనటువంటి. ఆసవభాజనం = మద్యపానయోగ్యమైన పాత్రను. మహార్హాణి = గొప్పవిలువగల. పాత్రాణి = పాత్రలను. హిరణ్మయాన్ = బంగారువికారములైన, కరకాంశ్చ = గిండిచెంబులను. లేహ్యాన్ = నాకునటువంటి. ఉచ్చావచాన్ = పచ్చళ్లను. భక్ష్యాన్ = భక్షించదగిన. వివిధాని = అనేకములైన. మాంసాని చ = మాంసములను. ఆర్షభాణి = వృషభసంబంధములైన. చర్మాణి = చర్మములను. కనకత్సరూన్ = బంగారుపిడులుగల. ఖడ్గాంశ్చ = ఖడ్గములను. హిత్వా = విడిచిపెట్టి. ఉత్పేతుః = పైకివెళ్లిరి.

తా॥ ఆ మహేంద్రపర్వతమునందున్న ఋషులు, విద్యాధరులు ఆపర్వతము పగులుచున్న ధ్వనిని విని భూతములచే యీ పర్వతము పగులగొట్టబడుచున్నదా? అని భయకంపితులై, పానభూమియందున్న పానయోగ్యములై బంగారుమయములైనవియు, గొప్పవిలువగలిగిన పాత్రలను గిండిచెంబులను పచ్చళ్లను, అనేకవిధములైన మాంసములను, వృషభచర్మములను, బంగారుపిడులుగల ఖడ్గాదులను వదలి తమస్త్రీలతో కలిసి పర్వతముపైకి వెళ్లిరి.

శ్లో॥ కృత కణ్ఠగుణాః క్షీబా రక్తమాల్యానులేపనాః।
రక్తాక్షాః పుష్కరాక్షా శ్చ గగనం ప్రతిపేదిరే॥ ౨౫

టీ॥ కృతకంఠగుణాః-కృత = చేయబడిన. కంఠగుణాః = కంఠమాలలు కలిగినటువంటివిన్ని, క్షీబాః = మదించినటువంటియు, రక్తమాల్యాను

లేపనాః-రక్త = ఎఱ్ఱనైన. మాల్యానులేపనాః = మాలలు గంధాదిలేపనములు గలిగినట్టియు. రక్తాక్షాః = మధుపానమువలన నెఱ్ఱని కండ్లు గలవారును పుష్కరాక్షాః = స్వతహాగ తెల్లని కండ్లుగలవారునై. గగనం = ఆకాశమును. ప్రతిపేదిరే = పొందిరి.

తా॥ ఆ పర్వతమునందున్న యక్ష కిన్నరాదులు మద్యపానముచే మత్తిల్లినవారై మద్యపానమువలన నెఱ్ఱబడిన నేత్రములు, స్వతహాగ తెల్లని నేత్రములు గలవారై, శరీరముల నంటియున్న ఆభరణాదులు దక్క తక్కిన వన్నియు ఎక్కడ నెట్లున్న వక్కడ నట్లులే వదలి ఆకాశమున కెగసిరి.

శ్లో॥ హార నూపుర కేయూర పారిహార్యధరాః స్త్రియః।
విస్మితా స్సస్మితా స్తస్థు రాకాశే రమణై స్సహ॥ ౨౬

టీ॥ హారనూపుర కేయూర పారిహార్యధరాః-హార = హారములు. నూపుర = కాలిఅందెలు. కేయూర = భుజకీర్తులు. పారిహార్య = కడియములను. ధరాః = ధరించినటువంటి. స్త్రియః = స్త్రీలు. విస్మితాః = ఆశ్చర్యపడి. సస్మితాః = చిరునగవులతో కూడినవారై, రమణైస్సహ = భర్తలతో కూడ ఆకాశే = ఆకాశమునందు. తస్థుః = ఉండిరి.

తా॥ కంఠహారములు, కాలిఅందెలు, భుజకీర్తులు ధరించిన స్త్రీలు ఆశ్చర్యపడుచు చిరునగవులతో తమ భర్తలతో కూడ ఆకాశమున నుండిరి.

శ్లో॥ దర్శయంతో మహావిద్యాం విద్యాధర మహర్షయః।
సహితా స్తస్థు రాకాశే వీక్షాం చక్రు శ్చ పర్వతమ్॥ ౨౭

టీ॥ విద్యాధరమహర్షయః = విద్యాధరులు, మహర్షులు, మహావిద్యాం = అణిమాద్యష్టమహా సిద్ధవిద్యను. దర్శయంతః = చూచుచున్నవారై. సహితాః = గుంపులుగాకూడి. ఆకాశే = ఆకాశమందు. తస్థుః = ఉన్నవారై. పర్వతం = మహేంద్రపర్వతమును. వీక్షాంచక్రుః = చూచిరి.

తా॥ మహర్షులు విద్యాధరులు తమ తమ అణిమాద్యష్టసిద్ధులను పొందు మహావిద్యను జపించుచు, మహేంద్రపర్వతమును జూచిరి.

శ్లో॥ శుశ్రువు శ్చ తదా శబ్ద మృషీణాం భావితాత్మనామ్।
చారణానాం చ సిద్ధానాం స్థితానాం విమలేఽమ్బరే॥ ౨౭
ఏష పర్వత సఙ్కాశో హనూమా న్మారుతాత్మజః।
తితీర్షతి మహావేగ స్సముద్రం మకరాలయమ్॥ ౨౮

టీ॥ భావితాత్మనాం = ఆత్మభావముకలిగిన. ఋషీణాం = ఋషీశ్వరుల యొక్కయు, విమలే = నిర్మలమైన. అంబరే = ఆకాశమునందు, స్థితానాం = ఉన్నటువంటి. సిద్ధానాం = సిద్ధులయొక్కయు. చారణానాం చ = చారణులయొక్కయు. పర్వతసంకాశః = పర్వతముతోసమానమైనటువంటియు. మారుతాత్మజః = వాయుపుత్రుడైన, ఏషః = ఈ హనూమాన్ = హనుమంతుడు, మహావేగః = గొప్పవేగముగలవాడై మకరాలయం = మొసళ్లకావాసమైన. సాగరం = సముద్రమును, తితీర్షతి = దాటుచున్నాడు (అనెడి) శబ్దం = శబ్దమును, తదా = అప్పుడు విద్యాధరాః = విద్యాధరులు, శుశ్రువుః = వినిరి.

తా॥ మహాబలపరాక్రమవంతుడైన యీ వాయుపుత్రుడు భయంకరమకరాదుల కాలవాలమైన మహాసముద్రమును దాట నిశ్చయించుచున్నాడనే ఋషీశ్వరుల యొక్కయు, సిద్ధచారణుల యొక్కయు మాట నప్పుడు విద్యాధరులు వినిరి.

శ్లో॥ రామార్థం వానరార్థం చ చికీర్ష న్కర్మ దుష్కరమ్।
సముద్రస్య పరం పారం దుష్ప్రాపం ప్రాప్తు మిచ్ఛతి॥ ౩౦
శ్లో॥ ఇతి విద్యాధరా శ్శ్రుత్వా వచ స్తేషాం మహాత్మనామ్।
త మప్రమేయం దదృశుః పర్వతే వానరర్షభమ్॥ ౩౧

టీ॥ రామార్థం = రామునినిమిత్తమును. వానరార్థం చ = సుగ్రీవాది కపుల నిమిత్తమును. దుష్కరం = చేయశక్యముగానటువంటి, కర్మ = కార్యమును. చికీర్షన్ = చేసే యిచ్ఛగలవాడై, దుష్ప్రాపం = పొందశక్యము గాని. సముద్రస్య = సముద్రముయొక్క. పరంపారం = ఆవలియొడ్డును ప్రాప్తుం = పొందేటందుకొఱకు . ఇచ్ఛతి = కోరుచున్నాడు.

ఇతి = ఈప్రకారముగా. విద్యాధరాః = విద్యాధరులు. మహాత్మనాం = మహానుభావులైన. తేషాం = ఆసిద్ధచారణులయొక్క. వచః = వాక్యమును. శ్రుత్వా = విని. అప్రమేయం = సాటిలేని. తం = ఆ. వానరర్షభం = కపిశ్రేష్ఠుడైన ఆంజనేయుని. పర్వతే = పర్వతమునందు. దదృశుః = చూచిరి.

తా॥ ఆ హనుమంతుడు సుగ్రీవాది వానరుల నిమిత్తము, శ్రీరామచంద్రమూర్తి నిమిత్తము యెవరు చేయజాలని పనిని చేయుచున్నాడని విద్యాధరులు, మహానుభావులైన యా సిద్ధచారణాదుల యొక్క మాటను విని కపిశ్రేష్ఠుడైన ఆ హనుమంతుని పర్వతమునందు చూచిరి.

శ్లో॥ దుధువే చ సరోమాణి చకమ్పే చాచలోపమః।
నవాద సుమహానాదం సుమహా నివ తోయదః॥ ౩౨

టీ॥ అచలోపమః = పర్వతముతో సమానుడైన, సః = ఆ హనుమంతుడు రోమాని = వెంట్రుకలను. చకమ్పే = విదలించెను. చ = మరియు, దుధువే = రాల్చెను. సుమహాన్ = గొప్పవాడైన. తోయద ఇవ = మేఘుడువలె. సుమహానాదం = గొప్పధ్వనిని. ననాద = గర్జించెను.

తా॥ ఆ హనుమంతుడు సముద్రమును దాట నుద్యుక్తుడై మహోత్సాహమున రోమములను విదలించి వర్షాకాలమున మేఘుము గర్జించినట్లు గర్జించెను.

శ్లో॥ అనుపూర్వేణ వృత్తంచ లాఙ్గూలం రోమభి శ్చితమ్।
ఉత్పతిష్య న్విచిక్షేప పక్షిరాజ ఇవోరగమ్॥ ౩౩

టీ॥ అనుపూర్వేణ = క్రమముగా, వృత్తం చ = చుట్టబడియున్నటువంటి రోమభిః = వెంట్రుకలచేత. చితం = వ్యాప్తమైయున్న, లాంగూలం = తోకను, పక్షిరాజః = గరుత్మంతుడు. ఉరగ మిన = సర్పమునువలెనే ఉత్పతిష్యన్ = పైకిఎత్తి. విచిక్షేప = పడవేసెను.

తా॥ హనుమంతుడు సముద్రమును దాట నుద్యుక్తుడై, రోమములతో దట్టమై యున్న తన తోకను గుండ్రముగా చుట్టి, గరుత్మంతుడు సర్పమును పైనుండి పడవేసినట్లుగా ఆపర్వతమునందు పడవేసెను.

శ్లో॥ తస్య లాఙ్గూల మావిద్ధ మాత్తవేగస్య పృష్ఠతః।
దదృశే గరుడేనేవ హ్రియమాణో మహోరగః॥ ౩౪

టీ॥ ఆత్తవేగస్య = అతివేగముకలిగినటువంటి. తస్య = ఆ హనుమంతుని యొక్క. పృష్ఠతః = వెనుకను. ఆవిద్ధం = కూర్చబడిన. లాంగూలం = తోక. గరుడేన = గరుత్మంతునిచేత. హ్రియమాణః = కఱచికొనిపోబడుచున్న. మహోరగ ఇవ = పెద్దసర్పమువలె. దదృశే = చూడబడెను.

తా॥ మహావేగమున పోవుచున్న అంజనేయుని వెనుక వంకరైన తోక గరుత్మంతునిచే నోట కఱచికొని పోవు పెద్దసర్పమువలె కనిపించుచుండెను.

* హనుమంతుడు ఆకాశమున కెగిరి కపులచే సెలవు తీసికొనుట *

శ్లో॥ బాహూ సంస్తమ్భయామాస మహాపరిఘ సన్నిభౌ।
ససాద చ కపిః కట్యాం చరణౌ సఞ్చుకోచచ॥ ౩౫

టీ॥ కపిః = వానరుడైన హనుమంతుడు. మహాపరిఘసన్నిభౌ-మహా = గొప్పవైన. పరిఘ = ఇనుపకట్లగుదియలతో. సన్నిభౌ = సమానము లైన, బాహూ = చేతులను. సంస్తమ్భయామాస = స్తంభింపజేసెను. కట్యాం = నడుమును. ససాద = సన్నదిగాజేసెను. చరణౌ చ = పాదములను. సఙ్కోచ = కుంచింపజేసెను.

తా॥ ఆంజనేయుడు ఇనుపకట్ల గుదియలవలె బలమైన చేతులను స్తంభింప జేసి. నడుమును సన్నను జేసి, పాదములను ముడిచికొని సముద్ర ముసు దాట నాయత్తమయ్యెను.

శ్లో॥ సంహృత్య చ భుజౌ శ్రీమాన్ తథైవ చ శిరోధరామ్।
తేజస్సత్త్వం తథావీర్య మావివేశ స వీర్యవాన్॥ ३८

టీ॥ శ్రీమాన్ = శోభాయుక్తుడైన, వీర్యవాన్ = పరాక్రమవంతుడైన. సః = ఆ హనుమంతుడు. భుజౌ చ = భుజములను, సంహృత్య = సంకోచింపజేసికొని, తథైవ = ఆప్రకారముననే, తేజః = తేజస్సును సత్త్వం = బలమును, వీర్యం = పరాక్రమమును. ఆవివేచ = ఆవిర్భ వింపజేసికోనెను.

తా॥ మహాపరాక్రమవంతుడగు హనుమంతుడు సముద్రమును దాటుటకై చేతులను మెడను ముడిచి కుప్పించి యెగురుటకు వలయు స్ఫూర్తి నిమిత్తమై తేజోబలపరాక్రమములను పూరించుకొనెను.

శ్లో॥ మార్గమాలోకయ న్దూరా దూర్ధ్వం ప్రణిహితేక్షణః।
రురోధ హృదయే ప్రాణా నాకాశ మవలోకయన్॥ ३९

టీ॥ ప్రణిహితేక్షణః = తీవ్రమైన చూపులుగలవాడగుచు, దూరాత్ = దూరమునుండియే, ఊర్ధ్వం = పైకి, మార్గం = మార్గమును, ఆలోక యన్ = చూచుచున్నవాడై, ఆకాశం = ఆకాశమును, అవలోకయన్ = చూచుచున్నవాడగుచు, ప్రాణాన్ = ప్రాణములను రురోధ = అరికట్టెను.

తా॥ హనుమంతుడు దూరమునుండియే ఆకాశమును అందు తాను పయనింపవలసిన మార్గమును గమనించుచు, ఎగురుటకై ప్రాణములను హృదయమున బిగియపట్టెను.

శ్లో॥ పద్భ్యాం దృఢ మవస్థానం కృత్వా స కపికుఞ్జరః।
నికుఞ్చ్య కర్ణౌ హనుమా నుత్పతిష్య న్మహాబలః॥ ౩౭
వానరాన్ వానర శ్రేష్ఠ ఇదం వచన మబ్రవీత్।

టీ॥ మహాబలః = గొప్పపరాక్రమముగలిగినటువంటి, సః = ఆ, కపికుంజరః - కపి = వానరులలో, కుంజరః = ఏనుగువంటివాడైన హనుమాన్ = హనుమంతుడు, పద్భ్యాం = పాదములచేత. దృఢం = గట్టిదైన, అవస్థానం = ఉనికిని, కృత్వా = చేసి, కర్ణౌ = చెవులను. నికుఞ్చ్య = ముడిచి, ఉత్పతిష్యన్ = ఎగురబోవువాడై, వానరశ్రేష్ఠ = వానరులలో శ్రేష్ఠుడైన హనుమంతుడు. వానరాన్ = వానరులను గూర్చి, ఇదం = ఈ, వచనం = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా॥ వానరశ్రేష్ఠుడును గొప్పపరాక్రమశాలియు నగు హనుమంతుడు, తన పాదములను పర్వతమందు గట్టిగా అన్చి చెవులను ముడిచికొని, యెగురబోవుచు సమీపమందున్న వానరులతో సిపిథముగా పలికెను.

శ్లో॥ యథా రాఘవ నిర్ముక్త శ్శర శ్శ్వసనవిక్రమః॥ ౩౮
గచ్ఛే త్తద్వ ద్గమిష్యామి లఙ్కాం రావణపాలితామ్।

టీ॥ శ్వసనవిక్రమః = వాయువుపరాక్రమముకలిగినటువంటి. రాఘవనిర్ముక్తః-రాఘవ = శ్రీరామచంద్రుని చేత, నిర్ముక్తః = విడువబడిన, శరః = బాణము. యథా = ఏప్రకారముగా, గచ్ఛేత్ = పోవునో.

తద్వత్ = అదేప్రకారముగా, రావణపాలితాం-రావణ = రావణునిచేత. పాలితాం = పరిపాలింపబడుచున్న, లంకాం = లంకనుగూర్చి, గమిష్యామి = వెళ్లుదును.

తా॥ శ్రీరామచంద్రునిచే విడువబడినబాణము ఏవిధముగా వాయువేగమున బోవునో అదేవిధముగ నేను రావణపరిపాలితమైన లంకకు వెళ్ళుదును.

శ్లో॥ నహి ద్రక్ష్యామి యది తాం లఙ్కాయాం జనకాత్మజామ్॥ ౪౦
అనేనైవ హి వేగేన గమిష్యామి సురాలయమ్।

టీ॥ లంకాయాం = లంకయందు, జనకాత్మజాం = జనకమహారాజకుమార్తె యగు తాం = ఆసీతను. హి = ఏకారణముచేతనైన, నద్రక్ష్యామి యది = చూడకపోయినట్లయిన, అనేన = ఈ వేగేనైవ = వేగముతోనే. సురాలయం = స్వర్గమునుగూర్చి గమిష్యామి = వెళ్లగలను.

తా॥ వానరవీరులారా! ఏకారణమువలననైనను నేను లంకయందు సీతాదేవిని చూడజాలకపోయిన్చో ఇంతవేగముగానే స్వర్గమునుగూర్చి వెళ్లగలను,

శ్లో॥ యది వా త్రిదివే సీతాం నద్రక్ష్యామ్యకృతశ్రమః॥ ౪౧
బధ్వా రాక్షస రాజాన మానయిష్యామి రావణమ్।

టీ॥ త్రిదివే వా = స్వర్గమందును. సీతాం = సీతాదేవిని, న ద్రక్ష్యామి యది = చూడలేకపోయినట్లయితే, అకృతశ్రమః = ఏమియుశ్రమలేనివాడనై, రాక్షసరాజానం = రాక్షసరాజైన, రావణం = రావణుని, బధ్వా = బంధించి, ఆనయిష్యామి = తీసికొనిరాగలను.

తా॥ స్వర్గమందుకూడ సీతాదేవిని చూడలేకపోయినట్లయిన, ఏమియు ఆయాసపడకుండగనే రాక్షసరాజగు రావణుని కట్టి తీసికొనిరాగలను.

శ్లో॥ సర్వథా కృతకార్యో౽హ మేష్యామి సహసీతయా॥ ౪౨
అనయిష్యామి వా లఙ్కాం సముత్పాట్య స రావణాం।

టీ॥ అహం = నేను, సర్వథా = అన్నివిధముల, కృతకార్యః = ఫలించిన కార్యముగలవాడనై, సీతయా సహ = సీతతోకూడ, ఏష్యామి = వచ్చెదను, వా = లేనిచో, సరావణాం = రావణసహితమైన, లఙ్కాం = లంకను, సముత్పాట్య = పెల్లగించి, అనయిష్యామి = తీసికొనిరాగలను.

తా॥ నేను సర్వవిధముల ప్రయత్నించి కార్యమును సఫలీకృతము చేసికొనియే సీతను తీసికొనిరాగలను. ఒకవేళ నేను వెదకుటలో సీతకనబడనిచో రావణునితోసహా లంకను పెకలించుకొని తెచ్చెదను.

• హనుమద్గమనవేగవర్ణనము •

శ్లో॥ ఏవ ముక్త్వా తు హనుమా న్వానరా న్వానరోత్తమః॥ ౪౩
ఉత్పపాతా౽థ వేగేన వేగవా నవిచారయన్।
సుపర్ణ మివ చాత్మానం మేనే స కపికుఞ్జరః॥ ౪౪

టీ॥ వానరోత్తమః = వానరశ్రేష్ఠుడైన, హనుమాన్ = హనుమంతుడు, ఏవం = ఈప్రకారముగా, వానరాన్ = వానరులను గూర్చి, ఉక్త్వాతు = చెప్పి, వేగేన = వేగముతో, ఉత్పపాత = పైకిఎగిరెను. అథ = అటుతరువాత, వేగవాన్ = వేగముగలవాడై అవిచారయన్ = సంతోషముగలవాడగుచు, సః = ఆ కపికుఞ్జరః = వానరశ్రేష్ఠుడగు హనుమంతుడు, ఆత్మానం = తనను, సుపర్ణ మివ = గరుత్మంతుని వలెనే, మేనే = తలంచుకొనెను.

తా॥ మహావేగవంతుడగు హనుమంతుడు వానరుల గూర్చి యీ ప్రకారముగా చెప్పిమహోత్సాహుడై వేగముగా పైకి ఎగిరెను. వేగముగలవాడై తనను గరుత్మంతునిగా తలంచుకొనెను.

శ్లో॥ సముత్పతతి తస్మింస్తు వేగాత్తే నగరోహిణః ।
సంహృత్య విటపాన్ సర్వాన్సముత్పేతు సమన్తతః॥ ౪౫

టీ॥ తస్మింస్తు = ఆహనుమంతుడు. సముత్పతతిసతి = పైకి ఎగిరిన వాడై యుండగానే. వేగాత్ = గమనవేగమువలన, తే = ఆ నగరోహిణః = పర్వతస్థవృక్షములు సర్వాన్ = సమస్తములైన, విటపాన్ = కొమ్మలను, సంహృత్య = తీసికొని, సమంతతః = అంతటను, సముత్పేతుః = పైకి ఎగిరిపడుచుండెను.

తా॥ పైకి ఎగిరిన హనుమంతునియొక్క గమనవేగమునకు పర్వతమందలి చెట్లు విరిగిపోయిన తమ కొమ్మలను గూడ విడిచిపెట్టక పైకెగిరి పడుచుండెను.

శ్లో॥ సమత్తకోయష్టిమకాన్ పాదపాన్పుష్పశాలినః ।
ఉద్వాహ న్నూరువేగేన జగామ విమలేఽమ్బరే॥ ౪౬

టీ॥ సః = ఆహనుమంతుడు ఊరువేగేన = తొడ్డలవేగముచేత. మత్త కోయష్టిమకాన్—మత్త = మదించిన, కోయష్టి = పక్షులయొక్క, మకాన్ = గూళ్ళు కలిగినటువంటి, పుష్పశాలినః—పుష్ప = పుష్పములచేత, శాలినః = ఒప్పుచున్నటువంటి పాదపాన్ = వృక్షములను. ఉద్వహన్ = పైకి తీసికొనివెళ్ళుచు, విమలే = నిర్మలమైన, అంబరే = ఆకాశమందు. జగామ = వెళ్ళెను.

తా॥ ఆ హనుమంతుడు ఆకాశమున కెగురునప్పటి తొడల వేగమునకు ఆ మహేంద్రపర్వతమునందు పక్షుల గూళ్లు కలిగినటువంటియు, బాగుగ పుష్పించి నట్టియు వృక్షములు ఆకాశమునకు అతని ననుసరించి పోవుచున్నట్లుగా పైకెగురుచుండ హనుమంతుడు వెళ్లుచుండెను.

శ్లో॥ ఊరువేగోద్ధతా వృక్షా ముహూర్తం కపిమన్వయుః ।
ప్రస్థితం దీర్ఘమధ్వానం స్వబన్ధుమివ బాన్ధవాః॥ ౪౭

టీ॥ ఊరువేగోద్ధతాః ఊరు = తొడలయొక్క, వేగ = వేగముచేత. ఉద్ధతాః = కొట్టబడినటువంటి, వృక్షాః = వృక్షములు, ముహూర్తం = ముహూర్తకాలము, కపిం = హనుమంతుని బాంధవాః = బంధువులు, దీర్ఘం = దూరమైన, అధ్వానం = మార్గమునుగూర్చి ప్రస్థితం = ప్రయాణమై వెళ్లుచున్నటువంటి, స్వబంధు మివ = ఆత్మబంధువును వలెనే, అన్వయుః = అనుసరించి వెళ్ళెను.

తా॥ హనుమంతుని ఊరువేగముచే కొట్టబడిన చెట్లు దూరప్రయాణమునకు బయలుదేరిన ప్రియబంధువును సాగనంపుచున్నట్లు (అవనాంతాదుదకాంతాత్ ప్రియబంధు మనువ్రజేత్) వనపర్యంతము గాని ఉదకపర్యంతము గాని పి్రియబంధువును అనుసరించిపంపించవలె నను సూక్తి ననుసరించి సముద్రపర్యంతము అనుసరించి వెళ్ళినవి.

శ్లో॥ త మూరువేగోన్మథితా స్సాలా శ్చాన్యే నగోత్తమాః।
అనుజగ్ము ర్హనూమ న్తం సైన్యా ఇవ మహీపతిమ్॥ ౪౨

టీ॥ ఊరువేగోన్మథితాః-ఊరు = తొడలయొక్క, వేగ = వేగముచేత, ఉన్మథితాః = ఎగురగొట్టబడినటువంటి. నగోత్తమాః-నగ = పర్వతమునందు, ఉత్తమాః = శ్రేష్ఠములైనటువంటి, అన్యే = ఇతరములైన సాలాశ్చ = వృక్షములును, సైన్యాః = సైన్యములు, మహీపతి మివ = రాజునువలెనే, తం = ఆ హనూమన్తం = ఆంజనేయుని అనుజగ్ముః = అనుసరించి వెళ్ళెను.

తా॥ ఆ హనుమంతుని తొడలవేగముచేత ఎగురగొట్టబడిన పర్వతాగ్రమునందలి యితర వృక్షములు, సైన్యములు రాజు ననుసరించి పోవునట్లు ఆ హనుమంతుని వెంబడించెను.




శ్లో॥ సుపుష్పితాగ్రై ర్బహుభిః పాదపై రన్వితః కపిః।
హనుమా న్పర్వతా కారో బభూ వాద్భుతదర్శనః॥

టీ॥ సుపుష్పితాగ్రైః - సుపుష్పిత = యోగ్యముగా పుష్పించిన. అగ్రైః = కొమ్మలుకలిగినటువంటి, బహుభిః = అనేకములైన, పాదపైః = చెట్లచే, అన్వితః = కూడుకొన్నటువంటి. పర్వతాకారః - పర్వత = పర్వతమువంటి ఆకారః = స్వరూపముకలిగినటువంటి హనుమాన్ = ఆంజనేయుడు అద్భుతదర్శనః = ఆశ్చర్యముగా చూడబడుచున్నవాడై, బభూవ = అయెను.

తా॥ బాగా పుష్పించిన చెట్లతో కూడుకొన్నపర్వతమా! అన్నట్లుగా ఆ హనుమంతుడు అత్యాశ్చర్యముగా కనబడుచుండెను.

శ్లో॥ సారవన్తోఽథ యే వృక్షా న్యమజ్జ ల్లవణామ్భసి।
భయా దివ మహేన్ద్రస్య పర్వతా వరుణాలయే॥ ౨౦

టీ॥ అథ = ఆటుతరువాత, యే = ఏ, వృక్షాః = చెట్లు, సారవంతః = బలముకలిగినటువంటివో, తే = ఆచెట్లు,మహేన్ద్రస్య = దేవేంద్రుని యొక్క, భయాత్ = భయమువలన వరుణాలయే = సముద్రమునందు,పర్వతా ఇవ = పర్వతములవలెనే, లవణామ్భసి = లవణసముద్రమునందు. న్యమజ్జత్ = మునిగెను.

తా॥ బలముగా పెరిగినపెద్దచెట్లు దేవేంద్రుని భయముచే సముద్రమున దాగిన పర్వతములు వలెనే ఉప్పుసముద్రమునందు మునిగెను.

శ్లో॥ స నానాకుసుమైః కీర్ణః కపి స్సాఙ్కుర కోరకైః
శుశుభే మేఘసఙ్కాశః ఖద్యోతై రివ పర్వతః॥ ౨౧

టీ॥ నానాకుసుమైః = అనేకపుష్పములచేతను, సాంకురకోరకైః - సాంకుర = అంకురములతోను, కోరకైః = మొగ్గలతోను, కీర్ణః = వ్యాప్తమైనటువంటి, సః = ఆ, కపిః = ఆంజనేయుడు మేఘసంకాశః = మేఘసదృశుడగుచు, ఖద్యోతైః = మిణుగురుపురుగులచే, పర్వత ఇవ = పర్వతమువలె, శుశుభే = ప్రకాశించెను.

తా॥ అనేక అంకురములచేత మొగ్గలచేత, నానావిధములైన పుష్పముల చేత, కప్పబడి మేఘసదృశుడైన ఆంజనేయుడు రాత్రియందు మిణుగురుపురుగులచే వ్యాప్తమైన పర్వతమువలె ప్రకాశించెను.

శ్లో॥ విముక్తా స్తస్య వేగేనముక్త్వా పుష్పాణి తే ద్రుమాః
అవశీర్యన్త సలిలే నివృత్తా స్సుహృదో యథా॥ ౫౨

టీ॥ తస్య = ఆ హనుమంతునియొక్క. వేగేన = వేగముచేత, విముక్తాః = విడిచిపెట్టబడిన. తే = ఆ ద్రుమాః = చెట్లు, పుష్పాణి = పుష్పములను, ముక్త్వా = విడిచి. సలిలే = ఉదకమందు, నివృత్తాః = మళ్లినటువంటి, సుహృదోయథా = స్నేహితులవలెనే, అవశీర్యన్త = పడినవి.

తా॥ ఆంజనేయుని వేగముచే విడువబడిన చెట్లయొక్క పుష్పములు సముద్రములో పడుచుండ, దూరదేశమునకు పంపబడు ఆత్మబంధువును ఏటినరకు సాగనంపి, వదలలేక కన్నీళ్ళను విడిచినట్లుగా ఆవృక్షముల పుష్పములు సముద్రములో పడుచుండెను.

శ్లో॥ లఘుత్వే నోపపన్నం త ద్విచిత్రం సాగరేఽ పతత్।
ద్రుమాణాం వివిధం పుష్పం కపి వాయు సమీరితమ్॥ ౫౩

టీ॥ లఘుత్వేన = తేలికచేతను, ఉపపన్నం = కూడినట్టియు, విచిత్రం = రకరకముల రంగులు కలిగినట్టియు కపివాయుసమీరితం-కపి = హనుమంతునియుక్క, వాయు = గాలిచేత, సమీరితం = కొట్టబడిన, తత్ = ఆ, ద్రుమాణాం = చెట్లయొక్క. వివిధం = అనేకవిధములైన. పుష్పం = పుష్పసముదాయము, సాగరే = సముద్రమునందు, అపతత్ = పడెను.

తా॥ ఆ చెట్లయందలి నానావిచిత్రవర్ణములు గల పుష్పములు తేలిక అయిన కారణమున ఆ ఆంజనేయుని గమనవేగమువలన సముద్రమునందంతట పడెను.

శ్లో॥ తారాశత మివాకాశం ప్రబభౌ స మహార్ణవః ।

టీ॥ సః = ఆ, మహార్ణవః = గొప్పసముద్రము, తారాశతం = అనేకనక్షత్రములుగల, ఆకాశ మివ = ఆకాశమువలెనే, ప్రబభౌ = ప్రత్యేకముగా ప్రకాశించెను.

తా॥ ఆంజనేయుని గమనవేగమున కొట్టబడిన ఆ చెట్లయొక్క నానా విచిత్రవర్ణములుగల పుష్పములు సముద్రములో పడి తేలికగా నుండుటచే తేలి కనబడుటవలన ఆ సముద్రము అనేకనక్షత్రములతో కూడిన ఆకాశమువలె బాగుగా ప్రకాశించెను.

శ్లో॥ పుష్పౌఘే నానుబన్ధేన నానావర్ణేన వానరః ౫౪
బభౌ మేఘ ఇవాకాశే విద్యుద్గణ విభూషితః॥

టీ॥ వానరః = వానరుడైన ఆంజనేయుడు, నానావర్ణేన = చాలా కాంతులు గలిగిన, పుష్పౌఘేణ = పుష్పసముదాయముచేత, అనుబద్ధేన = కూడియుండుటచేత, విద్యుద్గణవిభూషితః - విద్యుత్ = మెఱపులయొక్క, గణ = సమూహముచే, విభూషితః = విశేషముగా నలంకరింపబడిన, ఆకాశే = ఆకాశమునందలి, మేఘఇవ = మేఘుడువలెనే, బభౌ = ప్రకాశించెను,

తా॥ హనుమంతుడు అనేకప్రకాశముల పుష్పములచే కప్పబడియుండుట వలన మెఱుపులతో ప్రకాశించు మేఘనివలె ప్రకాశించెను.

శ్లో॥ తస్య వేగసమాధూతైః పుష్పై స్తోయ మదృశ్యత॥ ౫౫
తారాభి రభిరామాభి రుదితాభి రివామ్బరమ్।

టీ॥ తస్య = ఆహనుమంతునియొక్క, వేగసమాధూతైః - వేగ = వేగముచేత. సమాధూతైః = క్రిందపడిన. పుష్పైః = పుష్పములచేత, తోయం = ఉదకము, ఉదితాభిః = ఉదయించిన. తారాభిః = నక్షత్రములచేత, అమ్బరమివ = ఆకాశమువలె అదృశ్యత = కనపడెను.

తా॥ ఆ హనుమంతుని వేగముచే క్రిందపడిన పుష్పములచే సముద్రోదకము సుందరమైన నక్షత్రములతో ప్రకాశించు ఆకాశమువలె కనబడెను.

శ్లో॥ తస్యామ్బర గతౌ బాహూ దదృశాతే ప్రసారితౌ॥ ౫౬
పర్వతాగ్రా ద్వినిష్క్రాన్తౌ పఞ్చాస్యా వివ పన్నగౌ।

టీ॥ తస్య = ఆహనుమంతునియొక్క, అంబరగతౌ = ఆకాశగమనమునందు. ప్రసారితౌ = కదల్చబడుచున్న బాహూ = చేతులు, పర్వతాగ్రాత్ — పర్వత = పర్వతముయొక్క. అగ్రాత్ = పైనుండి. వినిష్క్రాన్తౌ = బయలుదేరిన, పంచాస్యౌ = అయిదుముఖములుగల, పన్నగావివ = సర్పములవలెనే, దదృశాతే = చూడబడుచుండెను.

తా॥ అహనుమంతుడు చేతులను ఊపుచు ఆకాశమార్గమున వెళ్లుచుండ పర్వతమునుండి లేచిన అయిదు శిరస్సులు గల సర్పములవలె అతని హస్తముల వ్రేళ్లు కనబడుచుండెను.

శ్లో॥ పిబ న్నివ బభౌ చాపి సోర్మిజాలం మహార్ణవమ్ ॥ ౫౭
పిపాసు రివ చాకాశం దదృశే స మహాకపిః।

టీ॥ సః = ఆ, మహాకపిః = గొప్పవానరుడైన హనుమంతుడు, మహార్ణవం = మహాసముద్రమును, సోర్మిజాలం చాపి = తరంగసమూహముతోకూడుకొనిన దైనప్పటికిని, పిబన్నివ = త్రాగుచున్నవాడువలెనే బభౌ = ప్రకాశించెను, ఆకాశం చ = ఆకాశమును, పిపాసురివ = త్రాగుచున్నవాడు వలెనే, దదృశే = కనబడుచుండెను.

తా॥ ఆ హనుమంతుడు మహాతరంగములచే కూడుకొన్నదైనను సముద్రమును త్రాగుచున్నాడా? అనునట్లుగా నీటికి దగ్గరగా పోవుచున్నపుడును

ఆకాశమార్గమున వెళ్లచప్పుడు ఆకాశమును త్రాగుచున్నాడా? అనియు అన్నట్లును కనబడుచుండెను. ఇందువలన తీవ్రప్రయత్నము గోచరమగుచున్నది.

శ్లో॥ తస్య విద్యుత్ప్రభాకారే వాయుమార్గానుసారిణః॥ ౩౭
నయనే విప్రకాశేతే పర్వతస్థా వివానలౌ।

టీ॥ వాయుమార్గానుసారిణః - వాయుమార్గ = ఆకాశమార్గమును, అనుసారిణః = అనుసరించివెళ్లుచున్నటువంటి, తస్య = ఆహనుమంతుని యొక్క, విద్యుత్ప్రభాకారే - విద్యుత్ప్రభా = మెఱుపులకాంతుల, ఆకారే = స్వరూపములు గలిగిన, నయనే = నేత్రములు, పర్వతస్థౌ = పర్వతమందున్న. అనలౌ ఇవ = అగ్నిహోత్రములువలెనే, విప్రకాశేతే = విశేషముగా కనబడుచుండెను.

తా॥ ఆకాశమార్గమున పోవుచున్న ఆ హనుమంతునియొక్క నేత్రములు మెఱుపుల కాంతులు గలవై పర్వత మందలి అగ్నిహోత్రముల వలె విశేషముగా ప్రకాశించెను.

శ్లో॥ పిఙ్గే పిఙ్గాక్ష ముఖ్యస్య బృహతీ పరిమణ్డలే॥ ౩౮
చక్షుషీ సమ్ప్రకాశేతే చన్ద్రసూర్యా వివోదితౌ।

టీ॥ పిఙ్గాక్షముఖ్యస్య = వానరముఖ్యుడైన హనుమంతునియొక్క, పిఙ్గే = గోరోచనవర్ణము గలవియు, బృహతీ = గొప్పవైనవియు, పరిమణ్డలే = గుండ్రములైన, చక్షుషీ = నేత్రములు, ఉదితౌ = ఉదయించిన, చన్ద్రసూర్యావివ = చంద్రసూర్యులవలె, సమ్ప్రకాశేతే = ప్రకాశించుచుండెను,

తా॥ వానరశ్రేష్ఠుడైన ఆ హనుమంతునియొక్క గుండ్రముగా పెద్దవైన నేత్రములు గోరోచనవర్ణము గలిగి ఉదయించిన చంద్రసూర్యుల వలె ప్రకాశించుచుండెను.

శ్లో॥ ముఖం నాసికయా తస్య తామ్రయా తామ్ర మాబభౌ॥ ౬౦
సన్ధ్యయా సమభిస్పృష్టం యథా త త్సూర్యమణ్డలమ్।

టీ॥ తస్య = ఆ హనుమంతునియొక్క, తామ్రయా = ఎఱ్ఱనైనటువంటి, నాసికయా = ముక్కుచేత, తామ్రం = ఎఱ్ఱనైన, ముఖం = ముఖము, సన్ధ్యయా = సంధ్యాకాలముచేత, సమభిస్పృష్టం = అంతటను వ్యాప్తమైన, సూర్యమణ్డలం యథా = సూర్యమండలమువలెనే, తత్ = ఆ ముఖము, ఆబభౌ = అంతటా ప్రకాశించెను.

తా॥ ఆ హనుమంతునియొక్క ఎఱ్ఱనైన ముక్కు కాంతిచే ఎఱ్ఱబడిన ముఖము సంధ్యాకాలపు యెఱుపుచే అంతట నిండిన సూర్యమండలము వలె నెఱ్ఱగా ప్రకాశించుచుండెను.

శ్లో॥ లాఙ్గూలం చ సమావిద్ధం ప్లవమానస్య శోభతే॥ ౬౧
అమ్బరే వాయుపుత్రస్య శక్రధ్వజ ఇవోచ్ఛ్రితః।

టీ॥ ప్లవమానస్య = దాటుచున్నటువంటి, వాయుపుత్రస్య = వాయుపుత్రుడైన ఆంజనేయునియొక్క, సమావిద్ధం = పైకెత్తబడియున్న, లాఙ్గూలం = తోక, అమ్బరే = ఆకాశమునందు, ఉచ్ఛ్రితః = పైన వ్యాపించియున్న, శక్రధ్వజ ఇవ = ఇంద్రధనుస్సువలె, శోభతే = ప్రకాశించుచుండెను.

తా॥ సముద్రమును దాటుచున్న ఆంజనేయుని పైకెత్తబడియున్న తోక ఆకాశమునందు వ్యాపించియుండు యింద్రధనుస్సువలె ప్రకాశించుచుండెను.

శ్లో॥ లాఙ్గూల చక్రేణ మహాన్ శుక్ల దంష్ట్రో ఽనిలాత్మజః॥ ౬౨
వ్యరోచత మహాప్రాజ్ఞః పరివేషీవ భాస్కరః।

టీ॥ శుక్లదంష్ట్రః = తెల్లని దంతములు కలిగినటు వంటియు, మహా ప్రాజ్ఞః = గొప్ప ప్రజ్ఞకలిగినటువంటియు. మహాన్ = గొప్పవాడైన అనిలాత్మజః = వాయుపుత్రుడైన ఆంజనేయుడు. లాఙ్గూలచక్రేణ = చక్రమువలె గుండ్రముగా చుట్టబడిన తోకతో, పరివేషీ = చుట్టును గాలిగుడిగల, భాస్కర ఇవ = సూర్యుడు వలె, వ్యరోచత = విశేష ముగా ప్రకాశించుచుండెను.

తా॥ తెల్లని దంతములు కలిగిన, గొప్ప ప్రజ్ఞకలిగిన గొప్పవాడైన ఆంజ నేయుడు చక్రముగా చుట్టబడిన తనతోకతో చుట్టు మండలముగా గూడుకట్టిన సూర్యునివలె విశేషముగా ప్రకాశించుచుండెను.

శ్లో॥ స్ఫిగ్దేశే నాభితామ్రేణ రరాజ స మహాకపిః॥ ౫౩
మహతా దారితే నేవ గిరి గ్గైరికధాతునా।

టీ॥ సః = ఆ, మహాకపిః = గొప్పవానరుడైన హనుమంతుడు, అభి తామ్రేణ = బాగుగా ఎఱ్ఱనైన. స్ఫిగ్దేశేన = వాలమూలప్రదేశముచేత, మహతా = గొప్పదైన, దారితేన = పగిలిన, గైరికధాతునా = గైరికా దిధాతువులచే, గిరిరివ = పర్వతమువలె, రరాజ = ప్రకాశించెను.

తా॥ ఆ హనుమంతుడు బాగుగా ఎఱ్ఱనైన వాలమూలప్రదేశముచేత బాగుగా పగిలిన గైరికాదిధాతువులచే గొప్పపర్వతమువలె ప్రకాశించెను.

శ్లో॥ తస్య వానరసింహస్య ప్లవమానస్య సాగరమ్॥ ౮౪
కక్షాన్తరగతో వాయు ర్జీమూత ఇవ గర్జతి।

టీ॥ సాగరం = సముద్రమును, ప్లవమానస్య = దాటుచున్న, తస్య = ఆ వానరసింహస్య = హనుమంతునియొక్క, కక్షాన్తరగతః-కక్ష = బాహు మూలములయొక్క, అంతర = మధ్యనుండి, గతః = పైకివచ్చుచున్న, వాయుః = గాలి, జీమూతఇవ = మేఘునివలె, గర్జతి = గర్జించుచుండెను.

తా॥ సముద్రమును దాటుచున్న ఆ హనుమంతునియొక్క బాహుమూలములనుండి వచ్చుచున్న గాలిచప్పుడు మేఘుడు గర్జించుచున్నట్లుగానుండెను.

శ్లో॥ ఖే యథా నిపత స్త్యుల్కా హ్యుత్తరాన్తా ద్వినిస్సృతా॥ ౮౫
దృశ్యతే సానుబన్ధా చ తథా స కపికుఞ్జరః।

టీ॥ ఖే = ఆకాశమునందు, నిపతన్ = పోవుచున్న, సః = ఆ, కపికుఞ్జరః = హనుమంతుడు, ఉత్తరాన్తాత్ = ఉత్తరదిక్కుకొననుండి, సానుబన్ధాచ = తోకతోకూడి, వినిస్సృతా = బయలుదేరిన, ఉల్కాయథా = తోకచుక్కవలెనే, తథా = అప్రకారముగా. దృశ్యతే = చూడబడుచున్నాడు.

తా॥ ఆకాశమార్గమున ఉత్తరదిక్కుకొననుండి, దక్షిణదిక్కునకు వెళ్లుచున్న హనుమంతుడు ఉత్తరదిక్కునుండి రావణానర్థసూచకమైన తోకచుక్కవలె కనబడుచుండెను.

శ్లో॥ పత త్పతఙ్గసఙ్కాశో వ్యాయతశ్శుశుభే కపిః ౮౬
ప్రవృద్ధ ఇవ మాతఙ్గః కక్ష్యయా బధ్యమానయా।

టీ॥ పతత్పతఙ్గసఙ్కాశః—పతత్ = నడచుచున్నటువంటి, పతంగ = సూర్యునితో, సఙ్కాశః = సమానుడైనటువంటి, వ్యాయతః = వ్యాపించినటువంటి, కపిః = హనుమంతుడు, బధ్యమానయా = నడుముకుకట్టబడిన, కక్ష్యయా = త్రాడుఅనగా గజమధ్యబంధనముచేత. ప్రవృద్ధః = వృద్ధిపొందిన, మాతఙ్గ ఇవ = ఏనుగువలె. శుశుభే = శోభించెను.

తా॥ నడచుచున్న సూర్యునితో సమానుడై పొడవైన తోకతోనున్న హనుమంతుడు నడుముకుత్రాడుకట్టబడిన పెద్ద ఏనుగువలె ప్రకాశించెను.

శ్లో॥ ఉపరిష్టా చ్ఛరీరేణ ఛాయయా చావగాఢయా॥ ౬౭
సాగరే మారుతావిష్టా నౌ రివాసీ త్తదా కపిః।

టీ॥ ఉపరిష్టాత్ = పైగమనమువలన. శరీరేణ చ = శరీరముచేతను. అవగాఢయా = వ్యాపించుచున్న, ఛాయయా చ = నీడచేతను, తదా = అప్పుడు. కపిః = వానరుడైన హనుమంతుడు, సాగరే = సముద్రమునందు, మారుతావిష్టా–మారుత = వాయువుచేత. ఆవిష్టా = ఆకర్షింపబడినటువంటి. నౌరివ = ఓడవలె, ఆసీత్ = అయెను.

తా॥ హనుమంతుడు సముద్రమును దాటుచు వెళ్లుటలో నాతని శరీరము నీటిపైనను నీటియందు నీడగను ఉండి, గాలిచే నడుపబడుచున్న తెరచాపగల ఓడవలె నుండెను.

శ్లో॥ యం యం దేశం సముద్రస్య జగామ స మహాకపిః॥ ౬౮
స స తస్యోరువేగేన సోన్మాద ఇవ లక్ష్యతే।

టీ॥ సః = ఆ, మహాకపిః = ఆంజనేయుడు, సముద్రస్య = సముద్రముయొక్క, యంయం = ఏఏ. దేశం = ప్రదేశమునుగూర్చి, జగామ = వెళ్లుచుండెనో, సఃసః = ఆయాప్రదేశము, తస్య = ఆహనుమంతునియొక్క, ఊరువేగేన = తొడలయొక్కవేగముచేత, సోన్మాదఇవ = పిచ్చితోకూడుకొన్నదానివలె, లక్ష్యతే = చూడబడుచున్నది.

తా॥ ఆ హనుమంతునియొక్క ఊరువేగముచేత అతడు దాటుచున్న ప్రదేశమంతయు పిచ్చెక్కిన దానివలె (గిరుర్రినతిరుగుట, జలోద్గమము అరుపుమొదలగు లక్షణములతో పిచ్చెక్కినట్లు) కనబడుచుండెను, సముద్రము ఉప్పొంగుటచేత కలిగిన నురుగు అపస్మారరోగికి కలిగెడు చొంగవలె కనబడుచుండెను.

శ్లో॥ సాగరస్యోర్మిజాలానా మురసాశైలవర్ష్మణామ్॥ ౬౯
అభిఘ్నం స్తు మహావేగః పుప్లువే స మహాకపిః।

టీ॥ మహావేగః = గొప్పవేగముకలిగిన సః = ఆ. మహాకపిః = ఆంజనేయుడు. సాగరస్య = సముద్రినియొక్క. శైలవర్ష్మణాం = రాళ్ళను వర్షించుచున్న ఊర్మిజాలానాం = తరంగసమూహములకు ఉరసా = వక్షస్థలముచేత. అభిఘ్నంస్తు = తాకుచున్నవాడగుచు. పుప్లువే = దాటుచుండెను.

తా॥ మహావేగముగా పోవుచున్న హనుమంతుడు సముద్రముయొక్క తరంగజాలములను రొమ్ముచే జిమ్ముకొనుచు దాటుచుండెను.

శ్లో॥ కపివాత శ్చ బలవాన్ మేఘవాత శ్చ నిస్సృతః ౭౦
సాగరం భీమనిర్ఘోషం కమ్పయామాసతు ర్భృశమ్।

టీ॥ కపివాతశ్చ = ఆంజనేయునిగమనవాయువును. మేఘవాతశ్చ = మేఘునియొక్క వాయువును. నిస్సృతః = కలసిబయలుదేరినవై. బలవాన్ = బలముకలదై. భీమనిర్ఘోషం- భీమ = భయంకరమైన నిర్ఘోషం = ధ్వనికలిగిన,సాగరం = సముద్రమును, భృశం = అత్యంతము. కంపయామాసతుః = కంపింపజేసినవి.

తా॥ ఆంజనేయుని గమనవేగ వాయువును, మేఘగమనవాయువును కలిసి సముద్రము భయంకరమైన ఘోషకలదైనప్పటికిని ఆసమయమున మరింతకలత పెట్టెను.

శ్లో॥ వికర్షన్నూర్మిజాలాని బృహన్తి లవణామ్భసి॥ ౭౧
పుప్లువే కపిశార్దూలో వికిర న్నివ రోదసీ।

టీ॥ కపిశార్దూలః = కపిశ్రేష్ఠుడైన ఆంజనేయుడు, లవణామ్భసి = లవణసముద్రమునందు, బృహన్తి = గొప్పవైన, ఊర్మిజాలాని = తరంగసమూహములను, వికర్షన్ = విశేషముగా ఆకర్షించుచున్నవాడగుచు, రోదసీ = భూమ్యాకాశములహద్దులను, వికిర న్నివ = విభజించుచున్నవాడువలె, పుప్లువే = దాటుచుండెను.

తా॥ వానరశ్రేష్ఠుడగు ఆంజనేయుడు గొప్పవైన తరంగజాలములను తాకుచు, వెళ్ళుచు, తరంగములను అణచి,సముద్రాకాశములకుహద్దులు, విభజించుచున్నట్లుగా దాటుచుండెను.

శ్లో॥ మేరు మన్దర సఙ్కాశా నుద్ధతాన్ స మహార్ణవే॥ ౭౨
అతిక్రామ న్మహావేగ స్తరఙ్గా న్గణయ న్నివ ।

టీ॥ మహావేగః = గొప్పవేగముగల, సః = ఆహనుమంతుడు, మహార్ణవే = గొప్ప సముద్రమునందు, మేరుమన్దరసఙ్కాశాన్ = మేరుమన్దర పర్వతములతో, సఙ్కాశాన్ = సమానములైనటువంటియు, ఉద్ధతాన్ = ఉత్కటములైనటువంటి, తరంగాన్ = తరంగములను, అతిక్రామన్ = దాటుచున్నవాడగుచు, గణయన్నివ = లెక్కించుచున్నవాని వలెనే యుండెను.

తా॥ ఆ పరాక్రమవంతుడైన హనుమంతుడు మేరు మందర పర్వతములతో సమానముగా లేచుచున్న తరంగములను లెక్కించుచున్న వాని వలె దాటివెళ్లుచుండెను.

శ్లో॥ తస్య వేగసముద్ధూతం జలం స జలదం తదా॥ ౭౩
అమ్బరస్థం విబభ్రాజ శారదాభ్రమి వాఽతతమ్।

టీ॥ తస్య = ఆ హనుమంతునియొక్క, వేగసముద్ధూతం - వేగ = వేగమువలన. సముద్ధూతం = ఎగురగొట్టబడి. ఆతతం = అంతట వ్యాప్తమైన జలం = సముద్రోదకము, తదా = అప్పుడు, సజలదం = మేఘములతోకూడినదై, అమ్బరస్థం = ఆకాశమునందున్నటువంటి. ఆతతం = వ్యాప్తమైయున్న. శారదాభ్రమివ = శరత్కాలమేఘము వలెనే, విబభ్రాజ = విశేషముగాప్రకాశించెను.

తా॥ ఆంజనేయుని గమనవేగమున పైకిలేవగొట్టబడి మేఘమండలము నంటుచున్న సముద్రోదకము తెల్లగా అంతట వ్యాపించి, ఆకాశము నందున్న స్వచ్ఛమైన శరత్కాల మేఘమువలె ప్రకాశించుచుండెను.

శ్లో॥ తిమి నక్ర ఝషాః కూర్మా దృశ్యన్తే వివృతా స్తదా॥ ౭౪
వస్త్రాపకర్షణేనేవ శరీరాణి శరీరిణామ్॥

టీ॥ తిమి నక్ర ఝషాః-తిమి = తిమింగలములు, నక్ర = మొసళ్ళు, ఝషాః = చేపలు, కూర్మాః = తాబేళ్లు, తదా = అప్పుడు, వివృతాః = ఆచ్ఛాదనలేనివై దృశ్యన్తే = చూడబడుచున్నవి. శరీరిణాం = శరీరధారులను, వస్త్రాపకర్షేణ-వస్త్ర = వస్త్రములయొక్క, అపకర్షేణ = తొలగించుటచేత, శరీరాణి + ఇవ = శరీరావయవములు వలె, దృశ్యన్తే = కనబడుచున్నవి.

తా॥ హనుమంతుని గమనవేగముచే నీరు పాయలుగా లేచుటవల్ల సముద్రమునందలి పెద్దవైన తిమింగిలములాది జలచరములు, మొసళ్లు, తాబేళ్లు, చేపలు, స్పష్టముగా మానవులనుండి వస్త్రములు వేరుపడుట వలన అవయవములు కనుపించునట్లు కనబడుచుండెను.

శ్లో॥ ప్లవమానం సమీక్ష్యాథ భుజఙ్గా స్సాగరాలయాః॥ ౭౫
వ్యోమ్ని తం కపిశార్దూలం సుపర్ణ ఇతి మేనిరే॥

టీ॥ అథ = అటుతరువాత, సాగరాలయాః = సముద్రములోనున్న, భుజఙ్గాః = సర్పములు. వ్యోమ్ని = ఆకాశమునందు, ప్లవమానం = దాటుచున్న, తం = ఆ, కపిశార్దూలం = అంజనేయుని, సమీక్ష్య = చూచి సుపర్ణ ఇతి = గరుత్మంతుడని, మేనిరే = = తలంచినవి

తా॥ ఆకాశమునందతివేగముగ పోవుచున్న ఆ అంజనేయుని జూచి సముద్రమునందున్న సర్పములు గరుత్మంతుడే యని తలచి భయపడినవి.

శ్లో॥ దశ యోజన విస్తీర్ణా త్రింశ ద్యోజన మాయతా॥ ౭౭
ఛాయా వానరసింహస్య జలే చారుతరా ఽభవత్।

టీ॥ వానరసింహస్య = వానరసింహుడైన హనుమంతునియొక్క. ఛాయా = నీడ. జలే = నీటియందు. దశయోజనవిస్తీర్ణా = పదిఆమడలవెడల్పును, త్రింశద్యోజనం = ముప్పదిఆమడలు. ఆయతా = పొడవును కలదియై. చారుతరా = సుందరమై. అభవత్ = ఆయెను.

తా॥ ఆ వానరసింహునియొక్క నీడ సముద్రజలమందు పదియోజనముల వెడల్పు ముప్పదియోజనముల పొడవును గలదై బహుసుందరముగా కనబడుచుండెను.

శ్లో॥ శ్వేతాభ్ర ఘన రాజీవ వాయుపుత్రానుగామినీ॥ ౭౮
తస్య సా శుశుభే ఛాయా వితతా లవణాంభసి।

టీ॥ తస్య = ఆహనుమంతునియొక్క, సా = ఆ, ఛాయా = నీడ, శ్వేతాభ్రఘనరాజీవ-శ్వేత = స్వచ్ఛమైన, అభ్రఘన = దట్టమైన మేఘములయొక్క. రాజీవ = పంక్తివలెనే, వాయుపుత్రానుగామినీ-వాయుపుత్ర = ఆంజనేయుని, అనుగామినీ = అనుసరించి వెళ్లుచున్నదై లవణాంభసి = ఉప్పుసముద్రమునందు, వితతా = వ్యాప్తమై శుశుభే = ప్రకాశించెను.

తా॥ సముద్రముపై వెళ్లుచున్న ఆంజనేయుని శరీరపునీడ సముద్రమునందు వ్యాపించి అతనిననుసరించి పోవుచు, స్వచ్ఛముగ దట్టముగా వ్యాపించిన మేఘమాలికవలె ప్రకాశించెను.

శ్లో॥ శుశుభే స మహాతేజా మహాకాయో మహాకపిః॥ ౭౯
వాయుమార్గే నిరాలమ్బే పక్షవా నివ పర్వతః।

టీ॥ మహాతేజాః = గొప్పతేజస్సు గలిగినటువంటి మహాకాయః = గొప్ప శరీరముగల సః = ఆ, మహాకపిః = ఆంజనేయుడు, నిరాలంబే = ఆధారములేని. వాయుమార్గే = ఆకాశమార్గమందుపక్షవాన్ = రెక్కలుగలిగిన, పర్వత ఇవ = పర్వతమువలె. శుశుభే = ప్రకాశించెను

తా॥ గొప్పశరీరము, తేజస్సు గల ఆ ఆంజనేయుడు నిరాధారమైన అకాశ మార్గమున రెక్కలు గల పర్వతమువలె. ప్రకాశించెను.

శ్లో॥ యేనా సౌ యాతి బలవాన్ వేగేన కపికుఞ్జరః॥ ౭౯
తేన మార్గేణ సహసా ద్రోణీకృత ఇవార్ణవః।

టీ॥ బలవాన్ = బలవంతుడైన,, అసౌ = ఈ, కపికుఞ్జరః = అంజనేయుడు, యేన = ఏ, వేగేన = వేగముతో, యాతి = వెళ్లుచుండెనో, తేన = అ, మార్గేణ = మార్గముచేత, సహసా = వెంటనే, అర్ణవః = సముద్రము, ద్రోణీకృత ఇవ = దోనెవలె కనబడుచుండెను.

తా॥ మహాబలవంతుడైన అంజనేయుడు అతివేగముతో, వెళ్ళుచున్న మార్గమున సముద్రము వెంటనే కుంచమువలె అల్పమైనదిగాకనబడు చుండెను

శ్లో॥ అపాతే పక్షిసఙ్ఘానాం పక్షిరాజ ఇవ వ్రజన్॥ ౮౦
హనుమాన్ మేఘజాలాని ప్రకర్షన్ మారుతో యథా।

టీ॥ హనుమాన్ = ఆంజనేయుడు. పక్షిసఙ్ఘానాం = పక్షిసంఘముల యొక్క, అపాతే = మార్గమందు. వ్రజన్ = వెళ్లుచున్న. పక్షిరాజ ఇవ = గరుత్మంతునివలె, మేఘజాలాని = మేఘసమూహములను మారుతో యథా = వాయువువలెనే, ప్రకర్షన్ = చెదరగొట్టుచుండెను.

తా॥ శీఘ్రగామి యగు ఆంజనేయుడు పక్షిజాలముల మార్గమున (ఆకాశము) వెళ్లుచున్న గరుత్మంతునివలెను, మేఘసమూహములను చెదరగొట్టు వాయువువలెను ఉండెను.

శ్లో॥ పాణ్డు రారుణ వర్ణాని నీల మాఞ్జిష్ఠ కాని చ॥ ౭౧
కపినాఽకృష్యమాణాని మహాభ్రాణి చకాశిరే।

టీ॥ కపినా = ఆంజనేయునిచేత, ఆకృష్యమాణాని = ఆకర్షింపబడిన, మహాభ్రాణి = గొప్పవైనమేఘములు, పాణ్డురారుణవర్ణాని-పాణ్డుర = తెలుపు. అరుణ = ఎరుపు, వర్ణాని = కాంతులుగలవిగాను, నీలమాఞ్జిష్ఠ కాని చ-నీల = నలుపు, మాంజిష్ఠకానిచ = పసుపుప్రకాశములు గలవియై. చకాశిరే = ప్రకాశించెను.

తా॥ ఆంజనేయునిచే ఆకర్షింపబడిన మేఘములు తెలుపు, ఎఱుపు, నలుపు, పసుపు, కాంతులు గలవిగ ప్రకాశించెను.

శ్లో॥ ప్రవిశ న్నభ్రజాలాని నిష్పతం శ్చ పునః పునః॥ ౭౨
ప్రచ్ఛన్న శ్చ ప్రకాశ శ్చ చన్ద్రమా ఇవ లక్ష్యతే।

టీ॥ అభ్రజాలాని = మేఘసమూహములందు, ప్రవిశన్ = ప్రవేశించుచున్నవాడగుచు, పునఃపునః = తిరిగితిరిగి, నిష్పతం శ్చ = బయటపడుచున్నవా డగుచు, ప్రచ్ఛన్న శ్చ = కప్పబడి కనబడని వాడును, ప్రకాశశ్చ = కనబడుచున్నవాడునై చన్ద్రమా ఇవ = చంద్రునివలెనే, లక్ష్యతే = చూడబడుచున్నాడు.

తా॥ మేఘముల చాటున పడుచు బయటపడుచున్న ఆంజనేయుడు, చంద్రునివలె ఒకసారి కనఁబడుచు ఒకసారి మఱుగుపడుచు గమించుచుండెను,

శ్లో॥ ప్లవమానం తు తం దృష్ట్వా ప్లవంగం త్వరితం తదా॥ ౭౩
వవర్షుః పుష్పవర్షాణి దేవ గన్ధర్వ దానవాః।

టీ॥ తదా = అప్పుడు, త్వరితం = తొందరగా, ప్లవమానం = దాటుచున్న తం = ఆ, ప్లవంగం = హనుమంతునినే, దృష్ట్వా = చూచి, దేవగన్ధర్వదానవాః-దేవ = దేవతలు, గన్ధర్వ = గంధర్వులు, దానవాః = రాక్షసులు, పుష్పవర్షాణి = పూలవర్షములను వవర్షుః = వర్షించిరి.

తా॥ మహావేగముతో తొందరగా సముద్రమునుదాటుచున్న ఆ ఆంజనేయుని చూచి దేవ గంధర్వ దానవాదు లందరు ఆశ్చర్యపడుచు పుష్పవర్షమును కురిపించిరి.

శ్లో॥ తతాప న హి తం సూర్యః ప్లవన్తం వానరోత్తమమ్॥ ౮౪

టీ॥ సూర్యః = సూర్యుడు, హితం = హితుడైనటువంటి ప్లవంతం = దాటుచున్నటువంటి, వానరోత్తమం = వానరశ్రేష్ఠుడైన ఆంజనేయుని న తతాప = తపింపజేయడాయెను.

తా॥ సూర్యుడు మధ్యాహ్నకాలమున వేడిగలవాడయ్యును హితుడైన ఆంజనేయుని తపింపజేయడాయెను.

శ్లో॥ సిషేవే చ తదా వాయూ రామకార్యార్థ సిద్ధయే।
ఋషయ స్తుష్టువు శ్చైనం ప్లవమానం విహాయసా॥ ౮౫
జగుశ్చ దేవగన్ధర్వాః ప్రశంసన్తో మహౌజసమ్।

టీ॥ తదా = అప్పుడు, వాయూ = వాయువులు, రామకార్యార్థసిద్ధయే- రామ = శ్రీరామచంద్రునియొక్క, కార్యార్థసిద్ధయే = కార్యప్రయోజన సిద్ధికొఱకు, సిషేవే = చల్లగావీచుచుండెను. విహాయసా = ఆకాశమున ప్లవమానం = దాటుచున్న, ఏనం = ఈ ఆంజనేయుని. ఋషయశ్చ = ఋషీశ్వరులును, తుష్టువుః = సంతోషించిరి. చ = మరియు, దేవగన్ధర్వాః = దేవతలు గంధర్వులు, మహౌజసం = మహాతేజశ్శాలియగు హనుమంతుని, ప్రశంసన్తః = స్తుతించుచున్నవారై, జగుః = వెళ్లిరి.

తా॥ శ్రీరామ కార్యార్థమై ఆకాశమార్గమున వెళ్ళుచున్న మహాతేజశ్శాలియగు ఆంజనేయుని జూచి వాయువు చల్లగ మందమందముగా వీచెను. ఋషీశ్వరులు చాలా సంతోషించిరి, నిర్వంచనముగా సంపూర్ణవిశ్వాసముతో భగవత్కైంకర్యము చేయువారికి సర్వదేవతలు సహాకరింతురని సూచితము,

శ్లో॥ నాగాశ్చ తుష్టువు ర్యక్ష రక్షాంసి విబుధాః ఖగాః॥ ౮౬
పేక్ష్య సర్వే కపివరం సహసా విగతక్లమమ్।

టీ॥ సహసా = వేగముగా, విగతక్లమం = శ్రమలేకుండా వెళ్ళుచున్న. కపివరం = ఆంజనేయుని, ప్రేక్ష్య = చూచి, సర్వే = సమస్తములైన నాగాః = నాగులు, యక్షాః = యక్షులు, రక్షాంసి = రాక్షసులు, విబుధాః = దేవతలు, ఖగాశ్చ = ఖేచరులును, తుష్టువుః = సంతోషించిరి.

తా॥ ఆకాశమునందు వేగముగా ఏవిధమగుశ్రమ లేకుండా వెళ్లుచున్న ఆంజనేయుని జూచి నాగులు, యక్షులు, రాక్షసులు, దేవతలు, ఖేచరులు మొదలగువారందరు సంతోషించిరి.

* సముద్రుడు హనుమంతునకు తోడ్పడ యోచించుట *

శ్లో॥ తస్మిన్ ప్లవగ శార్దూలే ప్లవమానే హనూమతి॥ ౮౭
ఇక్ష్వాకు కుల మానార్థీ చిన్తయా మాస సాగరః।

టీ॥ ప్లవమానే = దాటుచున్న, తస్మిన్ = ఆ, ప్లవగశార్దూలే = వానర శ్రేష్ఠుడైన, హనూమతి = ఆంజనేయుని విషయములో, ఇక్ష్వాకుకుల మానార్థీ - ఇక్ష్వాకుకుల = ఇక్ష్వాకువంశముయొక్క, మానార్థీ = గౌరవమునుకోరుచున్న, సాగరః = సముద్రుడు చింతయామాస = (ఇట్లు) ఆలోచించెను.

తా॥ వానరశ్రేష్ఠుడైన, హనుమంతుడు సముద్రమును దాటుచుండగా, సముద్రుడు ఇక్ష్వాకు కులగౌరవమును కోరుచున్నవాడై యిట్లు ఆలోచించెను.

శ్లో॥ సాహాయ్యం వానరేంద్రస్య యది నాహంహనూమతః॥ ౮౮
కరిష్యామి భవిష్యామి సర్వవాచ్యో వివక్షతామ్।

టీ॥ అహం = నేను, వానరేంద్రస్య = వానరశ్రేష్ఠుడైన, హనుమతః = ఆంజనేయునకు, సాహాయ్యం = సహాయమును, న కరిష్యామి

యది = చేయకపోయినట్లయితే వివక్షతాం = లోకులలో. సర్వ
వాచ్యః = నిందితుడనై. భవిష్యామి = కాగలను

తా॥ ఇక్ష్వాకువంశీయుడైన శ్రీరామునియొక్క కార్యార్థమై వెళ్ళుచున్న
ఈ ఆంజనేయునకు నేను సహాకారము చేయనిచో లోకులలో నన్ని
విధముల నిందితుడను కాగలనని సముద్రుడు తలంచెను.

శ్లో॥ అహ మిక్ష్వాకునాథేన సగరేణ వివర్ధితః॥ ౮౯
ఇక్ష్వాకు సచివ శ్చాయం నావసీదితు మర్హతి॥

టీ॥ అహం = నేను. ఇక్ష్వాకునాథేన = ఇక్ష్వాకువంశప్రభువైన, సగ
రేణ = సగరచక్రవర్తి చేత. వివర్ధితః = వృద్ధిపొందించబడినవాడను.
అయం = ఈహనుమంతుడు. ఇక్ష్వాకుసచివః—ఇక్ష్వాకు = ఇక్ష్వావం
శీయుడైనశ్రీరామచంద్రునికి. సచివః = మంత్రి. అవసీదితుం =
తటస్థముగా నుండుటకు. నార్హతి = తగడు

తా॥ నేను ఇక్ష్వాకు ప్రభువైన సగరచక్రవర్తిచే వృద్ధిపొందించబడిన
వాడను గాన ఇక్ష్వాకుకులప్రభువైన శ్రీరామచంద్రమూర్తికి మంత్రి
అయిన ఈ ఆంజనేయునకు నేను సహాయముచేయుట ఉచితము, తట
స్థముగా నుండతగదు.

శ్లో॥ తథా మయా విధాతవ్యం విశ్రమేత యథా కపిః॥ ౯౦
శేషంచ మయి విశ్రాన్త స్సుఖే·నాతి పతిష్యతి।

టీ॥ యథా = ఏప్రకారముగా. కపిః = వానరుడైన హనుమంతుడు.
విశ్రమేత = విశ్రాంతిపొందగలడో, తథా = ఆప్రకారము, మయా =
నాచేత విధాతవ్యం = చేయవలసియున్నది. మయి = నాయందు
సుఖేన = సుఖముతో, విశ్రాన్తః = విశ్రమించినవాడై, శేషం =
మిగిలినమార్గమును. అతిపతిష్యతి = అతిక్రమించగలడు.

తా॥ ఆంజనేయుడు సుఖముగా నాయందు విశ్రమించి వెళ్లినట్లు నేను చేసినచో మిగిలియున్న మార్గమును సుఖముగా అతిక్రమించ గల డని తలంచెను.

* సముద్రుడు మైనాకునితో సంభాషించుట *

శ్లో॥ ఇతి కృత్వా మతిం సాధ్వీం సముద్రశ్ఛన్న మమ్భసి॥ ౯౧
హిరణ్యనాభం మైనాక మువాచ గిరిస త్తమమ్।

టీ॥ ఇతి = ఈప్రకారము, సాధ్వీం = యోగ్యమైన, మతిం = బుద్ధిని, కృత్వా = చేసి, సముద్రః = సముద్రుడు, అంభసి = ఉదకమునందు, ఛన్నం = దాగియున్నటువంటియు, హిరణ్యనాభం = బంగారపుశిఖరములు గలిగినట్టియు, గిరిసత్తమం = పర్వతశ్రేష్ఠమైన, మైనాకం = మైనాకునిగూర్చి, ఉవాచ = పలికెను.

తా॥ ఈప్రకారము సముద్రుడు బాగుగా ఆలోచించినవాడై, తన జలమునందు దాగియున్న మైనాకు నుద్దేశించి ఇట్లుపలికెను.

శ్లో॥ త్వ మిహా సురసఙ్ఘానాం పాతాళతల వాసినామ్॥ ౯౨
దేవరాజ్ఞా గిరిశ్రేష్ఠ పరిఘస్సం నివేశితః।
త్వమేషాం జాతవీర్యాణాం పున రే వోత్పతిష్యతామ్॥ ౯౩
పాతాళ స్యాప్రమేయస్య ద్వార మావృత్య తిష్ఠసి।
తిర్య గూర్ధ్వ మధశ్చైవ శక్తి స్తే శైలవర్ధితుమ్॥ ౯౪
తస్మాత్ త్వం చోదయామి త్వా ముత్తిష్ఠ గిరిసత్తమ।

టీ॥ గిరిశ్రేష్ఠ = మైనాక, త్వం = నీవు, ఇహ = ఇచ్చట, పాతాళతలవాసినాం = పాతాళస్థల వాసులైన, అసురసంఘానాం = రాక్షససమూహాములకు, దేవరాజ్ఞా = దేవేంద్రునిచేత, పరిఘః = ఇనుపగెడవుగా, సంనివేశితః = బాగుగాఏర్పరచబడితివి–జాతవీర్యాణాం = పరాక్రమవంతులైనటువంటియు పునరేవ = తిరిగి, ఉత్పతిష్యతాం = పైకిరాగలిగినటువంటి, ఏషాం = ఈరాక్షసులకు, త్వం = నీవు, అప్రమేయస్య = అమి

తమైన, పాతాళస్య = పాతాళలోకము యొక్క, ద్వారం = ద్వారముఖ ము ను, ఆవృత్య = ఆవరించి, తిష్ఠసి = ఉన్నావు-శైల = మైనాకా! తే = నీకు, తిర్యక్ = అడ్డముగను, ఊర్ధ్వం = పైకి, అధః + చైవ = క్రిందకును, వర్ధితుం = వృద్ధిపొందుటకు, శక్తిః = శక్తియున్నది. తస్మాత్ = అకారణమువలన, గిరిసత్తమ = పర్వతశ్రేష్ఠా! త్వాం = నిన్ను, సంచోదయామి = ప్రేరెపించుచున్నాను. ఉత్తిష్ఠ = పైకిలెమ్ము.

తా॥ ఓ మైనాకా! నీవిచ్చట పాతాళలోకవాసులైన రాక్షసులకు దేవేంద్రునిచే ఇనుపగడియగా నియమింపబడినాడవు. మైనాక! మహాపరాక్రమవంతులై పాతాళలోకమునుండి పైకి రాగల రాక్షసులకు పాతాళలోక ద్వారమున అడ్డుగా నీవు నిలచియున్నావు, అడ్డముగను, పైకిని క్రిందికిని పెరుగుటకు శక్తిగలిగియున్నావు, కాన పైకిలేవవలసినదిగా ప్రేరేపించుచున్నాను.

శ్లో॥ స ఏష కపిశార్దూల స్త్వా ముపర్యే ఒతివీర్యవాన్॥ ౯౨
హనూమా న్రామకార్యార్థం భీమకర్మా ఖ మాప్లుతః।

టీ॥ కపిశార్దూలః = వానరశ్రేష్ఠుడును, వీర్యవాన్ = పరాక్రమవంతుడు నైన, సః = ఆ, ఏషః = ఈ, హనూమాన్ = హనుమంతుడు, రామకార్యార్థం = శ్రీరామునిపనినిమిత్తం, భీమకర్మా = భయంకర కర్మ గలవాడై, ఖం = ఆకాశమునుగూర్చి, ఆప్లుతః = వెళ్ళుచున్నాడు.

తా॥ మైనాక! మహాపరాక్రమశాలి యగు హనుమంతుడు శ్రీరామచంద్రుని కార్యసాఫల్యముకొఱకై భయంకర కర్మల నాచరించుచు ఆకాశమున వెళ్ళుచున్నాడు, నీవు పైకి లేచిరమ్ము.

శ్లో॥ అస్య సాహ్యం మయా కార్య మిక్ష్వాకుకులవర్తినః॥ ౯౩
మమ హీక్ష్వాకవః పూజ్యాః పరం పూజ్యతమా స్తవ।

కురు సాచివ్య మస్మాకం ననః కార్య మతిక్రమేత్॥ ౯౭
కర్తవ్య మకృతం కార్యం సతాం మన్యు ముదీరయేత్।
సలిలా దూర్ధ్వ ముత్తిష్ఠ తిష్ఠ త్వేష కపి స్త్వయి॥ ౯౮
అస్మాక మతిథి శ్చైవ పూజ్యశ్చ ప్లవతాం వరః।
చామీకర మహానాభ దేవగన్ధర్వ సేవిత॥ ౯౯
హనుమాం స్త్వయి విశ్రాన్త స్తత శ్శేషం గమిష్యతి।

టీ॥ ఇక్ష్వాకుకులవర్తినః = ఇక్ష్వాకుకులీనుడైన శ్రీరామకార్యార్థ మేగుచున్న అస్య = ఈహనుమంతునికి, మయా = నాచేత, సాహ్యం = సహాయము, కార్యం = చేయదగినది. ఇక్ష్వాకవః = ఇక్ష్వాకులు, మమ = నాకు, పూజ్యాః = పూజనీయులు, తవ = నీకు. పరం హి = అతిఎక్కువగా, పూజ్యతమాః = పూజ్యాతిపూజ్యులు, అస్మాకం = నాకు, సాచివ్యం = సహకారమును, కురు = చేయుము. నః = మనయొక్క. కార్యం = కర్తవ్యమును, నాతిక్రమేత్ = అతిక్రమించరాదు, కర్తవ్యం = చేయవలసియున్న కార్యం = పని, అకృతం = చేయబడనిదైనసతాం = సత్పురుషులకు, మన్యుః = క్రోధము, ఉదీరయేత్ = కలుగును, సలిలాత్ = ఉదకమునుండి, ఊర్ధ్వం = పైకి, ఉత్తిష్ఠ = లెమ్ము ఏషః = ఈ, కపిః = ఆంజనేయుడు, త్వయి = నీయందు. తిష్ఠతు = విశ్రమించుగాక, ప్లవతాంవరః = కపిశ్రేష్ఠుడైన అంజనేయుడు. అస్మాకం = మనకు, అతిథిశ్చైవ = అతిథివలెనే, పూజ్యః = పూజనీయుడు- చామీకరమహానాభ = బంగారపుశిఖరములుగల మైనాక। దేవగన్ధర్వసేవిత-దేవ = దేవతలచేత, గంధర్వ = గంధర్వులచేత, సేవిత = సేవించబడువాడా। హనుమాన్ = ఆంజనేయుడు, త్వయి = నీయందు, విశ్రాంతః = విశ్రమించినవాడై, తతః = తరువాత, శేషం = మిగిలిన మార్గమునుగూర్చి గమిష్యతి = వెళ్ళగలడు.

తా॥ ఇక్ష్వాకువంశీయులైన శ్రీరామచంద్రుని కార్యార్థమై వెళ్లుచున్న ఈ హనుమంతునకు నేను సహాయము చేయవలసియున్నది. ఇక్ష్వాకువం

శీయుఁ డైన సగరచక్రవర్తి చే నేను వృద్ధిపొందితిని. కనుక ఆవంశీయునకు మహాత్కార్యమును చేయుచున్న అంజనేయునకు నేను సాహాయ్యము చేయవలెను. పూజ్యులైన ఇక్ష్వాకువంశీయులు నాకన్న నీకే ఎక్కువ పూజనీయులు. నాకు స్నేహితుఁడ వగుటవలన నీవే ఈపనిని నిర్వహించవలెను. మన కర్తవ్యమును మనము నిర్వహింపనిచో సత్పురుషులకు కోపకారణమగును. కాన చేయక తప్పదు. హనుమంతుఁడు మనకు అతిథియు పూజ్యుఁడును గనుక నీవు నీళ్లలో నుండి పైకిలేచి అయన కెదురేగి శ్రమతీరునట్లు నీశిరమున ధరింపుము. తనకు భగవత్కార్యము చేయు అసక్తి యుండియు, చేయలేనివాఁడు చేయగలవానిని ప్రేరేపించివానిచే అకార్యముచేయించవలయును. అతిథినిమరేవిధముగా నుపచరింపలేనివాఁడు. మంచిమాటలచేతను, కూర్చుండుట కాసనమిచ్చుటచేతను, దాహమునకు మంచినీళ్ళ నిచ్చుటచేత నైనను ఆదరింపవలయునని పూజ్యు లైన పెద్దల భావముగ నున్నది.

శ్లో॥ కాకుత్స్థ స్యానృశంస్యం చ మైథిల్యాశ్చ నివాసనమ్॥ ౧౦౦
శ్రమంచ ప్లవగేన్ద్రస్య సమీక్ష్యోత్థాతు మర్హసి।

టీ॥ కాకుత్స్థస్య = శ్రీరామచంద్రునియొక్క, ఆనృశంస్యం చ = కృతజ్ఞతయు, మైథిల్యాః = సీతాదేవియొక్క, నివాసనం చ = స్థానముకానిచోట నుండుటయును, ప్లవగేంద్రస్య = కపిశ్రేష్ఠుడైన హనుమంతునియొక్క, శ్రమంచ = కష్టమును, సమీక్ష్య = చూచి, ఉత్థాతుం = పైకి వచ్చుటకొఱకు, అర్హసి = తగుచున్నావు.

తా॥ శ్రీరామచంద్రుని యొక్క పవిత్రతను, సీతాదేవియొక్క పరప్రదేశ (రాక్షసస్థాన) నివాసమును అంజనేయుని ఈప్రయాణ జనిత శ్రమను చూచి నీవు పైకి లేచిరమ్ము.

* మైనాకుడు ఆంజనేయుని కెదురుగా వచ్చుట *

శ్లో॥ హిరణ్యనాభో మైనాకో నిశమ్య లవణామ్భసః। ౧౦౧
ఉత్పపాత జలాత్తూర్ణం మహాద్రుమ లతాయుతః॥

టీ॥ హిరణ్యనాభః = బంగారుశిఖరములుగల, మైనాకః = మైనాకుడు, నిశమ్య = = విని, లవణామ్భసః = సముద్రముయొక్క. జలాత్ = ఉదకమునుండి. తూర్ణం = శీఘ్రముగా, మహాద్రుమలతాయుతః— మహాద్రుమ = గొప్పవైన చెట్లతోను, లతా = తీగెలతోను, యుతః = కూడియున్నవాడై. ఉత్పపాత = పైకిలేచెను.

తా॥ బంగారపు శిఖరములతో నొప్పు ఆ మైనాకుడు సముద్రునియొక్క హితము అజ్ఞాపూర్వకము నైనమాటను విన్నవాడై తక్షణము పెద్ద పెద్ద చెట్లు తీగెలతోకూడి సముద్రజలమునుండి పైకి లేచివచ్చెను.

శ్లో॥ స సాగరజలం భిత్వా బభూ వాభ్యుత్థిత స్తదా॥ ౧౦౨
యథా జలధరం భిత్వా దీప్తరశ్మి ర్దివాకరః।

టీ॥ తదా = అప్పుడు, సః = ఆమైనాకుడు, జలధరం = మేఘుని. భిత్వా = భేదించికొని, దీప్తరశ్మిః—దీప్త = ప్రకాశవంతములైన, రశ్మిః = కిరణములుగల. దివాకరో యథా = సూర్యుడువలె, సాగరజలం = సముద్రపునీటిని, భిత్వా = భేదించికొని. అభ్యుత్థితః = పైకిలేచినవాడై బభూవ = ఆయెను.

తా॥ అప్పుడా మైనాకుడు మేఘములచాటునుండి వెలివడి ప్రకాశవంతము లైన కిరణములతో కూడియున్న సూర్యునివలె, సముద్రోదకము భేదించికొని పైకిలేచెను.

శ్లో॥ స మహాత్మా ముహూర్తేన పర్వత స్సలిలావృతః॥ ౧౦౩
దర్శయామాస శృంగాణి సాగరేణ నియోజితః।

శాత కుమ్భమయై శ్శృఙ్గై స్స కిన్నర మహోరగై ః॥ ౧౦౪
ఆదిత్యోదయ సఙ్కాశై రాలిఖద్భి రివామ్బరమ్।

టీ॥ సాగరేణ = సముద్రునిచేత. నియోజితః = నియోగింపబడినవాడగుచు, సః = ఆ మహాత్మా = మహానుభావుడైన, పర్వతః = మైనాకపర్వతము. ముహూర్తేన = ముహూర్తకాలము, సలిలావృతః = ఉదకముతోకూడినవాడై, శృంగాణి = శిఖరములను, దర్శయామాస = కనబరచెను, శాతకుమ్భమయైః = బంగారువికారములైనవియు. సకిన్నరమహోరగైః —సకిన్నర = కిన్నరులతోను, మహోరగైః = గొప్పసర్పములతోను కూడియున్నదియు. ఆదిత్యోదయసఙ్కాశైః— ఆదిత్యోదయ = సూర్యోదయముతో, సఙ్కాశైః = సమానములై యున్నవియు, అంబరం = ఆకాశమును, ఆలిఖద్భి రివ = నాకుచున్న విధమె నున్నటువంటియు.

తా॥ సముద్రునిచే నియమింపబడిన ఆ మైనాకుడు క్షణకాలము ఉదకముతో కూడిన వాడై. బంగారుమయములైనవియు, గొప్పసర్పములతో కూడియున్నవియు, ఆకాశమునుతాకుచున్నవా? అన్నట్లున్న ఎత్తైన శృంగములతో పైకివచ్చి కనబడెను,

శ్లో॥ తప్త జామ్బూనదై శ్శృఙ్గైః పర్వతస్య సముత్థితైః॥ ౧౦౫
ఆకాశం శస్త్రసఙ్కాశ మభవ త్కాఞ్చనప్రభమ్।

టీ॥ తప్తజాంబూనదైః—తప్త = పుటముబెట్టబడిన, జాంబూనదైః = బంగారుమయము లైనట్టియు, సముత్థితైః = బాగుగాపైకిలేచిన. పర్వతస్య = మైనాకపర్వతముయొక్క, శృంగైః = శిఖరములచేత, శస్త్రసంకాశం = శస్త్రమువలె నీలమైన, ఆకాశం = ఆకాశము, కాంచనప్రభం = బంగారపుకాంతి కలదియై, అభవతు = ఆయెను,

తా॥ మైనాకుని బంగారు శిఖరకాంతులచే నల్లనైన ఆకాశముకూడ బంగారు కాంతులతో ప్రకాశించెను.

శ్లో॥ జాతరూపమయై శ్శృఙ్గై ర్భ్రాజమానై స్స్వయంప్రభైః ౧౦౬
ఆదిత్య శత సఙ్కాశ స్సో౽ భవ ద్గిరిస త్తమః।

టీ॥ జాతరూపమయైః = బంగారు మయములైన టువంటియు. స్వయంప్రభైః = స్వతస్సిద్ధమైన కాంతులుగలిగినటువంటియు. భ్రాజమానైః = ప్రకాశించుచున్నటువంటి. శృఙ్గైః = శిఖరములతో, సః = ఆ. గిరిసత్తమః = యోగ్యమైనమైనాకపర్వతము. ఆదిత్యశతసంకాశః—ఆదిత్యశత = నూర్గురుసూర్యులతో. సంకాశః = సమానమైనదై, అభవత్ = ఆయెను.

తా॥ స్వర్ణమయములు. స్వతస్సిద్ధమైన కాంతులుగలిగి, బాగుగా ప్రకాశించుచున్న శిఖరములతో నొప్పుచున్న ఆ మైనాకపర్వతము నూరుగురు సూర్యులకాంతితో ప్రకాశించుచుండెను.

శ్లో॥ త ముత్థిత మసంగేన హనుమా నగ్రతః స్థితం॥ ౧౦౭
మధ్యే లవణతోయస్య విఘ్నో౽య మితి నిశ్చితః।

టీ॥ అసంగేన = సంబంధములేకయే, ఉత్థితం = లేచినటువంటియు. అగ్రతః = ఎదుట, స్థితం = ఉన్నటువంటి. తం = ఆపర్వతమును. హనుమాన్ = హనుమంతుడు లవణతోయస్య = లవణసముద్రము యొక్క. మధ్యే = మధ్యయందు, అయం = ఇది. విఘ్నః = విఘ్నము. ఇతి = ఈలాగున నిశ్చితః = నిశ్చయించినవాడయ్యెను.

తా॥ సముద్ర మధ్యలోనుండి పైకి లేచి ఏసంబంధములేకయే తనముందు నిల్చియున్న పర్వతరాజమును జూచి హనుమంతుడు సముద్రమధ్యలో నిది ఒక విఘ్నముగా తలంచెను.

శ్లో॥ సత ముచ్ఛ్రిత మత్యర్థం మహావేగో మహాకపిః॥ ౧౦౮
ఉరసా పాతయామాస జీమూత మివ మారుతః।

టీ॥ మహావేగః = గొప్పవేగము, కలిగినటువంటి, సః = ఆ, మహాకపిః = ఆంజనేయుడు, అత్యర్థం = మిక్కిలి, ఉచ్ఛ్రితం = పైకి వ్యాపించియున్న, తం = ఆమైనాకుని. ఉరసా = వక్షస్థలముచేత, మారుతః = వాయువు, జీమూత మివ = మేఘునివలెనే, పాతయామాస = పడద్రోసెను.

తా॥ మహావేగముతో వెళ్ళుచున్న ఆ అంజనేయుడు సముద్రములోనుండి పైకి లేచి తనముందు ఎత్తుగా నిలిచిన మైనాకుని తనవక్షస్థలముతో మేఘమును వాయువు చెదరగొట్టునట్లు పడద్రోసెను.

శ్లో॥ స తదా పాతిత స్తేన కపినా పర్వతోత్తమః। ౧౦౯
బుద్ధ్వా తస్య కపే ర్వేగం జహర్ష చ ననంద చ।

టీ॥ పర్వతోత్తమః = పర్వతశ్రేష్ఠుడైన, సః = ఆమైనాకుడు, తేన = ఆ కపినా = ఆంజనేయునిచేత, పాతితః = పడద్రోయబడినవాడై, తస్య = ఆ, కపేః = అంజనేయునియొక్క, వేగం = వేగమును, బుద్ధ్వా = తెలిసికొని, జహర్ష చ = పులకరించెను, ననంద చ = సంతోషించెను.

తా॥ పర్వతశ్రేష్ఠుడగు ఆ మైనాకుడు ఆంజనేయునిచే త్రోయబడినవాడై అతని వేగ బలాదులను చూచి పులకరించిన శరీరము గలవాడై, మిక్కిలి సంతోషించెను,

శ్లో॥ త మాకాశగతం వీర మాకాశే సముపస్థితః॥ ౧౧౦
ప్రీతో హృష్టమనా వాక్య మబ్రవీ త్పర్వతః కపిమ్।
మానుషం ధారయ న్రూప మాత్మన శ్శిఖరేస్థితః॥ ౧౧౧

టీ॥ హృష్టమనాః-హృష్ట = సంతోషించబడిన. మనాః = మనస్సుకలిగినటువంటి. పర్వతః = పర్వతరూపుడైన మైనాకుడు. ఆకాశే = ఆకాశమునందు. సముపస్థితః = ఉన్నటువంటివాడై, ఆకాశగతం = ఆకాశమునందున్నటువంటియు, వీరం = పరాక్రమవంతుడైన, తం = ఆహనుమంతునిగూర్చి, ప్రీతః = మిక్కిలి సంతోషించినవాడై మానుషం = మానవసంబంధమైన. రూపం = ఆకారమును. ధారయన్ = ధరించినవాడై, ఆత్మనః = తనయొక్క శిఖరే = శిఖరమునందు. స్థితః = ఉన్నవాడగుచు. కపిః = ఆంజనేయునిగూర్చి. వాక్యం = వాక్యమును. అబ్రవీత్ = పలికెను.

తా॥ సంతోషించిన మైనాకుడు మానవరూపమును ధరించినవాడై అతిథిగా ఎంచిన హనుమంతుని బలవేగములకు ఆశ్చర్యపడి ఆకాశమునంటు తన శిఖరాగ్రమునం దుండి ఇట్లు పలికెను.

శ్లో॥ దుష్కరం కృతవా న్కర్మ త్వ మిదం వానరోత్తమ।
నిపత్య మమ శృఙ్గేషు విశ్రమస్వ యథాసుఖమ్॥ ౧౧౨

టీ॥ వానరోత్తమ = ఓవానరశ్రేష్ఠ! దుష్కరం = కష్టసాధ్యమైన, ఇదం = ఈ, కర్మ = కార్యమును, కృతవాన్ = చేయుచున్న, త్వం = నీవు, మమ = నాయొక్క, శృంగేషు = శిఖరములయందు, నిపత్య = దిగి, యథాసుఖం = స్వేచ్ఛగా, విశ్రమస్వ = విశ్రమింపుము.

తా॥ ఓ ఆంజనేయ! మహాకష్టసాధ్యమైన కార్యమును చేయుచున్న నీవు నా శిఖరములందు దిగి స్వేచ్ఛగా కొంత విశ్రమింపుము.

శ్లో॥ రాఘవస్య కులే జాతై రుదధిః పరివర్ధితః
స త్వాం రామహితే యుక్తం ప్రత్యర్చయతి సాగరః॥ ౧౧౩

టీ॥ రాఘవస్య = శ్రీరామచంద్రుని యొక్క. కులే = వంశమందు. జాతైః = పుట్టినవారిచేత. ఉదధిః = సముద్రుడు, పరివర్ధితః = వృద్ధిపొందించ బడినవాడు, సః = ఆ, సాగరః = సముద్రుడు, రామహితే-రామ = శ్రీరాముని యొక్క. హితే = హితమందు, యుక్తం = కూడియున్న, త్వాం = నిన్ను, ప్రత్యర్చయతి = తిరిగిపూజింపదలచియున్నాడు.

తా॥ ఆంజనేయ! ఈసముద్రుడు పూర్వము శ్రీరాముని వంశీయులచే వృద్ధిపొందించబడియున్నాడు. అందువలన శ్రీరామకార్యార్థమై వెళ్లు చున్న నిన్ను పూజింప తలచుచున్నాడు,

శ్లో॥ కృతే చ ప్రతికర్తవ్య మేష ధర్మ స్సనాతనః
సోయం తత్ప్రతికార్యార్థీ త్వత్త స్సమ్మాన మర్హతి॥ ౧౧౪

టీ॥ కృతే చ = చేయబడిన ఉపకారమునందు, ప్రతికర్తవ్యం = తిరిగి ఉపకారముచేయుట, ఏషః = ఇది, సనాతనః = సనాతనమైన, ధర్మః = ధర్మము సః = ఆ, అయం = ఈసముద్రుడు, తత్ప్రతికార్యార్థీ- తత్ = తన ఆ అభివృద్ధికి, ప్రతికార్యార్థీ = ప్రత్యుపకారము చేయదలంచిన వాడగుచు త్వత్తః = నీవలన, సమ్మానం = సన్మానమునుగూర్చి అర్హతి = తగుచున్నాడు

తా॥ ఆంజనేయ! ఉపకారముచేసినవారికి ప్రత్యుపకార మొనర్చుట లోక మున పూర్వాచార ధర్మమై యున్నది, కనుక సముద్రుడు తాను పొందిన ఉపకారమునకు ప్రత్యుపకారముగా శ్రీరాముని కార్యార్థము పోవుచున్న నిన్ను గౌరవించి, నీవలన గౌరవముమ పొంద కాంక్షించు చున్నాడు,

శ్లో॥ త్వన్నిమిత్త మనేనాహం బహుమానా త్ప్రచోదితః
తిష్ఠత్వం కపిశార్దూల మయి విశ్రమ్య గమ్యతామ్॥ ౧౧౫
యోజనానాం శతం చాపి కపి రేష సమాప్లుతః।
తవ సానుషు విశ్రాన్త శ్శేషం ప్రక్రమతా మితి॥ ౧౧౬

టీ॥ కపిశార్దూల = ఓఆంజనేయ! అహం = నేను, త్వన్నిమిత్తం = నీనిమిత్తమై, అనేన = ఈసముద్రునిచేత, బహుమానాత్ = గౌరవమువలన ప్రచోదితః = ప్రేరేపించబడితిని, త్వం = నీవు, మయి = నాయందు తిష్ఠ = కూర్చుండుము. విశ్రమ్య = విశ్రమించి. గమతాం = వెళ్ళెదవుగాక, ఏషః = ఈ. కపిః = ఆంజనేయుడు, యోజనానాం శతం = నూరుఆమడలను. సమాప్లుతోఽపి = దాటగలవాడైనప్పటికి, తవ = నీయొక్క. సానుషు = చరియలయందు. విశ్రాంతః = విశ్రమించినవాడై. శేషం = మిగిలినమార్గమును, పరిక్రమతాం = పరియాణించుగాక. ఇతి = ఈలాగున. అహం = నేను. ప్రచోదితః = ప్రేరేపించబడితిని,

తా॥ ఆంజనేయ! నిన్నుగౌరవింపదలచి సముద్రుడు అనేకవిధముల నన్ను ప్రేరేపించి పంపించుటవలన వచ్చితిని. నీవు నా సానువులయందు కొంచెము విశ్రమించి అయాసము తగ్గించుకొని వెళ్ళవచ్చును. నీవు నూరామడ దూరమునైన సవలీలగా దాటగలవు. అయినను నీవు శ్రీరామచంద్రుని కార్యార్థము వెళ్లుచున్నావు. ఆయన వంశీయులచే వృద్ధిపొందిన సముద్రుడు నిన్ను సర్వవిధ సన్మానములకు అర్హునిగా తలంచి, అందుకొఱకు నన్ను ప్రేరేపించి పంపించినాడు,

శ్లో॥ త దిదం గన్ధవ త్స్వాదు కన్ద మూల ఫలం బహు।
తదాస్వాద్య హరిశ్రేష్ఠ విశ్రాన్తో ఽనుగమిష్యసి॥ ౧౧౭

టీ॥ తత్ = ఆకారణమువలన, హరిశ్రేష్ఠ = ఓఆంజనేయ! ఇదం = ఈ, గంధవత్ = పరిమళయుక్తమైనటువంటియు, స్వాదు = రుచికరమైనటువంటియు, బహు = అనేకములైన, కందమూలఫలం = కందమూలఫలమును, ఆస్వాద్య = భుజించి, విశ్రాన్తః = విశ్రమించినవాడవై అనుగమిష్యసి = వెళ్ళగలవు,

తా॥ ఆంజనేయ। నా శిఖరములయందు కొంత విశ్రాంతి తీసికొని, పరిమళభరితములు, మంచి రుచ్యము లైన కందమూలఫలాదులను భుజించి కొరత మార్గము ననుసరించి పోవుదువుగాక.

శ్లో॥ అస్మాక మపి సమ్బన్ధః కపిముఖ్య త్వయాఽస్తి వై।
ప్రఖ్యాత స్త్రిషు లోకేషు మహాగుణ పరిగ్రహః॥ ౧౧౮

టీ॥ కపిముఖ్య = ఓహనుమంత! త్వయా = నీతో, అస్మాక మపి = నాకును, సంబంధః = సంబంధము. అస్తివై = కలదుకదా: మహాగుణపరిగ్రహః- మహాగుణ = సత్పురుషులయొక్క, పరిగ్రహః = హితము. త్రిషు = మూడు. లోకేషు = లోకములయందు. ప్రఖ్యాతః = ప్రసిద్ధమైనది.

తా॥ ఓవానరశ్రేష్ఠ! ఇక్ష్వాకువంశీయుడైన, శ్రీరామచంద్రుని బంటుగను. సముద్ర ప్రేరిత మిత్రత్వమును గాక నీతో నాకు మరియొక బంధుత్వము కూడ కలదు, ఏ మన పూర్వము పర్వతములు రెక్కలుగలిగి లోక కంటకములై తిరుగాడు సమయమున దేవేంద్రుడు లోకకళ్యాణాకాంక్షియై వాటి రెక్కలను నరుకునప్పుడు నీతండ్రియగు వాయుదేవుని అనుగ్రహముచే నేను ఈసముద్రమున సురక్షితముగా దాచబడితిని. అదియుగాక అతిథిని పూజించుట లోకసమ్మతము. అందున నీవంటి సర్వగుణసంపన్నుని అతిథిగా పూజించుట నా అదృష్టము. ఈ పై కారణములచే నీవు నాయందు ఘటికార్ధము విశ్రమించి నా యొనర్చు అతిథిసత్కారములు గ్రహించి నన్ను ధన్యు నొనర్చు మని మైనాకుడు ప్రార్థించెను.

శ్లో వేగవన్తః ప్లవన్తో యే ప్లవగా మారుతాత్మజ।
తేషాం ముఖ్యతమం మన్యే త్వా మహం కపికుఞ్జర॥ ౧౧౯

టీ॥ మారుతాత్మజ = ఓవాయుపుత్ర! వేగవంతః = వేగముకలిగినటువంటి ప్లవంతః = దాటుచున్నటువంటి. యే = యే. ప్లవగాః = వానరులు,

కలరో, తేషాం = వారిలో కపికుఞ్జర = ఓవానరశ్రేష్ఠ! త్వాం = నిన్ను ముఖ్యతమం = ముఖ్యమైనవానినిగా. అహం = నేను. మన్యే = తలచుచున్నాను.

తా॥ ఓ వాయుపుత్ర! వేగవంతులు, దాటుటకు సమర్థత గల వానరోత్తము లందరిలో నీవు ముఖ్యతముడ వని (ద్వయో రేకః అన్యతరః, బహూ ష్వేకః అన్యతమః = ఇద్దరిలోముఖ్యుడైనవాడు అన్యతరుడు. అనేకులలో ముఖ్యుడు అన్యతముడు) మైనాకుడు తర తమ భేదమును వివరించెను.

శ్లో॥ అతిథిః కిల పూజార్హః ప్రాకృతోఽపి విజానతా।
ధర్మం జిజ్ఞాసమానేన కింపున స్త్వాదృశో మహాన్॥ ౧౨౦

టీ॥ ధర్మం = ధర్మమును, జిజ్ఞాసమానేన = తెలియబడినవానిచేత. అతిథిః = అతిథి ప్రాకృతోఽపి = నీచుడైనప్పటికిని. పూజార్హః = పూజింపతగినవాడుగ, విజానతాకిల = తెలియబడుచున్నాడుగదా! మహాన్ = గొప్పవాడైన త్వాదృశః = నీవంటివాడు కింపునః = ఇంక చెప్పవలసిన దేమి?

తా॥ ధర్మాత్ములు తమయింటికి వచ్చినఅతిథి నీచుడైనను వానిని పూజిం తురుగదా! అటువంటప్పుడు మహానుభావుడ వైన నీవంటి అతిథిని పూజించుట మా అవశ్య కర్తవ్యముగా తలంతును.

శ్లో॥ త్వం హి దేవ వరిష్ఠస్య మారుతస్య మహాత్మనః।
పుత్ర స్తస్యైవ వేగేన సదృశః కపికుఞ్జర॥ ౧౨౧
పూజితే త్వయి ధర్మజ్ఞ పూజాం ప్రాప్నోతి మారుతః।
తస్మాత్ త్వం పూజనీయో మే శృణు చాప్యత్ర కారణమ్ ౧౨౨

టీ॥ కపికుఞ్జర = ఓవానరశ్రేష్ఠ! దేవవరిష్ఠస్య — దేవ = దేవతలలో, వరిష్ఠస్య = శ్రేష్ఠుడైనటువంటియు, మహాత్మనః = మహానుభావుడైన, మారుతస్య = వాయుదేవునికి త్వం = నీవు, పుత్రఃహి = పుత్రుడవుగదా

తస్యైవ = అతనిదయిన. వేగేన = వేగముతో. సదృశః = సమానమైనవాడవు. ధర్మజ్ఞ = సమస్తధర్మములు తెలిసిన ఆంజనేయ! త్వయి = నీవు, పూజితేసతి = పూజింపబడినవాడవై యుండగా. మారుతః = వాయుదేవుడు. పూజాం = పూజను, ప్రాప్నోతి = పొందుచున్నాడు. తస్మాత్ = ఆకారణమువలన, త్వం = నీవు, మే = నాకు. పూజనీయః = పూజింపతగినవాడవు. అత్రాపిచ = ఇచ్చటకూడ, కారణం = నేను పూజింపవలసినకారణమును, శృణు = వినుము.

తా॥ ఆంజనేయ! దేవతలలో నుత్తము డైన, మహానుభావుడగు వాయుదేవుని కుమారుడవు గనుక నీవు తండ్రితోసమానవేగము గలవాడవు. సమస్తధర్మ తత్త్వవేది వగు ఓ ఆంజనేయ! నిన్ను పూజించిన ఆపూజ మీతండ్రిగారగు ఆ వాయుదేవునికి కూడ అర్పితమగును. "ఆత్మావై పుత్రనామాసి" అనుశ్రుతిప్రమాణముచేత తండ్రికి కుమారునకు భేదము లేదు గనుక నీకొనర్చిన పూజ మీతండ్రి వాయుదేవున కొనర్చినట్లే యని నాయభిప్రాయము. కనుక నీవు నాకు పూజనీయుడవు, అదియుంగాక మరియొక విషయమును వినుము.

శ్లో॥ పూర్వం కృతయుగే తాత పర్వతాః పక్షిణోఽభవన్।
తేఽభిజగ్ముర్దిశ స్సర్వా గరుడానిలవేగినః॥ ౧౨౩
తత స్తేషు ప్రయాతేషు దేవసఙ్ఘా స్సహర్షిభిః।
భూతాని చ భయం జగ్ము స్తేషాం పతన శఙ్కయా॥ ౧౨౪

టీ॥ తాత = ఆంజనేయ. పూర్వం = పూర్వకాలమున. కృతయుగే = కృతయుగమునందు, పర్వతాః = పర్వతములు. పక్షిణః = రెక్కలుగలవి, అభవన్ = ఆయెను, గరుడానిల వేగినః—గరుడ = గరుత్మంతుని యొక్క, అనిల = వాయువుతోసమానమైన, వేగినః = వేగముగల తే = ఆ, పర్వతాః = పర్వతములు, సర్వాః = సమస్తమైన, దిశః = దిక్కులనుగూర్చి, అభిజగ్ముః = తిరుగుచుండెడివి, తతః = ఆకారణ

ముఃవలన తేషు = ఆపర్వతములు, సహర్షిభిః = సంతోషములతో, ప్రయాతేషుసత్సు = ప్రయాణములుచేయుచుండ, దేవసంఘాః = దేవతాసమూహములు, భూతాని చ = సర్వభూతములును తేషాం = ఆపర్వతములయొక్క, పతనశంకయా — పతన = క్రిందికిపడుననే శంకయా = అనుమానముచేత, భయం = భయమును, జగ్ముః = పొందుచుండిరి.

తా॥ పూజనీయుడ వగు హనుమంత! పూర్వము కృతయుగమున పర్వతములు రెక్కలు గలగియుండి, గరుత్మంతునివలె సర్వదిక్కులకు వేగముగా తిరుగుచుండుట వలన ఆ పర్వతములు తమపై పడుననే భయానుమానములతో దేవతలు ఋషులు సమస్తభూతములు ఆందోళనపడుచుండిరి.

శ్లో॥ తతః క్రుద్ధ స్సహస్రాక్షః పర్వతానాం శతక్రతుః।
పక్షాన్ చిచ్ఛేద వజ్రేణ తత్ర తత్ర సహస్రశః ॥ ౧౨౫
సమా ముపాగతః క్రుద్ధో వజ్ర ముద్యమ్య దేవరాట్।
తతో౽హం సహసా క్షిప్త శ్శ్వసనేన మహాత్మనా॥ ౧౨౬

టీ॥ తతః = అటుతరువాత క్రుద్ధః = కోపగించినటువంటి, సహస్రాక్షః = వేయినేత్రములుగల, శతక్రతుః = దేవేంద్రుడు, పర్వతానాం = పర్వతములయొక్క, పక్షాన్ = రెక్కలను, వజ్రేణ = వజ్రాయుధముచేత, తత్ర తత్ర = అక్కడి కక్కడే, సహస్రశః = వేయివిధములుగా, చిచ్ఛేద = ఖండించెను, తతః = తరువాత, సః = ఆ, దేవరాట్ = దేవేంద్రుడు, క్రుద్ధః = కోపముగలవాడై, మాం = నన్ను, ఉపాగతః = పొందినవా డగుచునుండగా, అహం = నేను, సహసా = వేగముగా, మహాత్మనా = మహానుభావుడైన, శ్వసనేన = వాయుదేవునిచేత, క్షిప్తః = విసరబడితిని.

తా॥ తరువాత దేవేంద్రుడు మహాకోపముగలవాడై పర్వతములయొక్క రెక్కలను అక్కడ కక్కడే వేయిముక్కలుగా నరికివేసెను. తదుపరి వజ్రాయుధమును ధరించి మహాక్రోధముతో నాదగ్గరకు వచ్చి నా రెక్కలను నరుకబోవుచుండ మహానుభావుడైన నీతండ్రి వాయుదేవుని సంపూర్ణసహకారము వలన ఈసముద్రమున త్రోయబడితిని.

శ్లో॥ అస్మి న్లవణతోయే చ ప్రక్షిప్తః ప్లవగోత్తమ।
గుప్తపక్ష సమగ్రశ్చ తవ పిత్రాఽభిరక్షితః ౧౨౭
తతోఽహం మానయామి త్వాం మాన్యోహి మమ మారుతః।
త్వయా మే హ్యేష సమ్బన్ధః కపిముఖ్య మహాగుణః ౧౨౮

టీ॥ ప్లవగోత్తమ = వానరశ్రేష్ఠ! ఆంజనేయ! అస్మిన్ = ఈ, లవణ తోయే = ఉప్పునీటియందు, ప్రక్షిప్తశ్చ = దాచబడినవాడనై. గుప్తపక్ష సమగ్ర శ్చ–గుప్త = రక్షింపబడిన, పక్షసమగ్రశ్చ = సమగ్రమైన రెక్కలుగలవాడనై. తవ = నీయొక్క, పిత్రా = తండ్రియగు వాయు దేవునిచేత. అభిరక్షితః = కాపాడబడితిని. కపిముఖ్య = ఓఆంజనేయ హి = ఏకారణమున, మమ = నాకు, మారుతః = వాయుదేవుడు, మాన్యః = గౌరవింపతగినవాడో. తతః = ఆదేకారణము వలన. అహం = నేను, త్వాం = నిన్ను, మానయామి = గౌరవించుచున్నాను. త్వయా = నీతో. మే = నాకు. ఏషః = ఈ. సమ్బన్ధః = బాంధవ్యము. మహాగుణో హి = గొప్పగుణము కలదియే కదా!

తా॥ ఆంజనేయ! నీ తండ్రియగు వాయుదేవునిచే త్రోయబడి ఈ సముద్రజలమునందు దాగి నా సమగ్రమైన రెక్కలను కాపాడుకొనగల్గి తిని, అందుచేత వాయుదేవుడు నాకు గౌరవనీయుడు, పూజనీయుడు, "ఆత్మావై పుత్ర నామాసి" అను శ్రుతిచే నీవు నాకు గౌరవనీయుడవు, పూజార్హుడవుగదా! నీతో నా యీ సంబంధము మహాగుణయుక్త మైనదికూడ అయియున్నది.

శ్లో॥ అస్మి న్నేవం గతే కార్యే సాగరస్య మమైవచ।
పీ్రితిం ప్రీతమనాః కర్తుం త్వ మర్హాసి మహాకపే॥ ౧౨౯

టీ॥ మహాకపే = వానరశ్రేష్ఠ! ఏవం = ఈప్రకారముగా. అస్మిన్ = ఈ, కార్యే = కార్యము, గతేసతి = గడచినదగుచునుండగా, సాగరస్య = సముద్రునికి, మమైవ చ = నాకును, త్వం = నీవు, ప్రీతమనాః = సంతోషించబడిన మనస్సుగలవాడవై ప్రీతిం = సంతోషమును. కర్తుం = చేయుటకుగాను, అర్హసి = తగుచున్నావు.

తా॥ ఆంజనేయ! నా కోరికప్రకారము నాచే చేయబడు పూజపొంది సంతసించిన వాడవైనచో నాకును సముద్రునకును అపారమైన సంతోషమును కలిగించినవాడ వయ్యెదవు, కనుక నా పూజ నంగీకరించి నీవు సంతోషిత స్వాంతుడవై మాఉభయులను సంతోషపెట్టవలసినదిగా కోరుచున్నాను.

శ్లో॥ శ్రమం మోక్షయ పూజాం చ గృహాణ కపిసత్తమ।
పీ్రితిం చ బహుమన్యస్వ పీ్రితోఽస్మి తవ దర్శనాత్॥ ౧౩౦

టీ॥ కపిసత్తమ = ఓహనుమంత! పూజాం = పూజను. గృహాణ = స్వీకరించుము, శ్రమం చ = శ్రమనుకూడ, మోక్షయ = పోగొట్టుకొనుము, బహు = అధికమైన ప్రీతిం చ = ప్రేమనుకూడ, మన్యస్వ = తలంచుము, తవ = నీయొక్క. దర్శనాత్ = దర్శనమువలన, పీ్రితః = సంతోషించబడినవాడనై, అస్మి = అయితిని,

తా॥ ఆంజనేయ! నా పూజను గ్రహించి నా సానువులయందు నీ ఆయాసమును పోగొట్టుకొనుము. నా అధికమైన ప్రేమనుగుర్తింపుము, నీదర్శనము వలన నేను సంతోషించిన వాడ నయ్యెదను.

శ్లో॥ ఏవముక్తః కపిశ్రేష్ఠ స్తం నగోత్తమ మబ్రవీత్।
ప్రీతోఽస్మి కృత మాతిథ్యం మన్యు రేషోఽపనీయతామ్॥ ౧౩౧

శ్లో॥ త్వరతే కార్యకాలో మే అహ శ్చాప్యతివ ర్తతే।
ప్రతిజ్ఞా చ మయా ద త్తా నస్థాతవ్య మిహా న్తరే॥ ౧౩౨

టీ॥ ఏవం = ఈప్రకారము, కపిశ్రేష్ఠః = హనుమంతుడు, ఉక్తః = చెప్పబడినవాడగుచు, తం = ఆ, నగో త్తమం = పర్వతశ్రేష్ఠుడైన మైనాకుని గూర్చి, అబ్రవీత్ = పలికెను, కృతం = చేయబడిన, ఆతిథ్యం = అతిధిగౌరవమును గురించి, ప్రీతః = సంతోషించినవాడను, అస్మి = అయితిని, ఏషః = ఈ, మన్యుః = క్రోధము, అపనీయతాం = పోగొట్టబడుగాక, మే = నాకు, కార్యకాలః = కార్యసమయము, త్వరతే = త్వొందరపెట్టుచున్నది, అహశ్చాపి = పగలుకూడ, అతివ ర్తతే = గడచిపోవుచున్నది, ఇహ = ఇచ్చటనుండి, అ న్తరే = మధ్యయందు, న స్థాతవ్యం = ఆగకుండుటకొఱకు, ప్రతిజ్ఞా చ = ప్రతిజ్ఞయును, మయా = నాచేత, ద త్తా = ఈయబడినది.

తా॥ ఈ ప్రకారము మైనాకుడు పలుకగా హనుమంతు డిట్లు పలికెను. ఓ మైనాక! నీవు చేయు సత్కారము లంగీకరించిన వాడనే అయితిని, అన్నరసముకంటె ఆదరణ రసము మహోత్కృష్ట మైనది. కాన మీ మంచిమాటలచేతనే సపర్యల నంగీకరించిన ఫలము కలిగినది. చాల సంతసించితిని. నేను నిలువకూడదు. కార్యము కాలము నన్ను తొందర పెట్టుచున్నవి. చేయవలసినకార్యము భారమైనది. ప్రొద్దు? క్రుంకబోవుచున్నది. ఇచ్చటవిశ్రమించితినేని కార్యము చేయుటకు ప్రొద్దుచాలదు. అదియునుంగాక నేను త్రోవలో నిల్వనని వానరులతో ప్రతిజ్ఞ చేసితిని. కావున పోయెదను. ఆగలేదనికోపము చేయకుము.

శ్లో॥ ఇత్యుక్త్వా పాణినా శైల మాలభ్య హరిపుఙ్గవః।
జగా మాకాశ మావిశ్య వీర్యవాన్ ప్రహస న్నివ॥ ౧౩౩

స పర్వత సముద్రాభ్యాం బహుమానా దవేక్షితః।
పూజిత శ్చోపపన్నాభి రాశీర్భి రనిలాత్మజః॥ ౧౩౫

అథోర్ధ్వం దూర ముత్ప్లుత్య హిత్వా శైల మహార్ణవౌ॥
పితుః పన్థాన మాస్థాయ జగామ విమలేఽమ్బరే ౧౩౬

భూయ శ్చోర్ధ్వగతిం ప్రాప్య గిరిం త మవలోకయన్।
వాయుసూను ర్నిరాలమ్బే జగామ విమలేఽమ్బరే॥ ౧౩౭

టీ॥ ఇతి = ఈప్రకారముగా, వీర్యవాన్ = పరాక్రమవంతుడైన, హరిపుఙ్గవః = ఆంజనేయుడు, ఉక్త్వా = చెప్పి, పాణినా = హస్తముతో, శైలం = మైనాకపర్వతమును, ఆలభ్య = స్పృశించి, ప్రహసన్నివ = సంతోషించినవానివలెనే, ఆకాశం = ఆకాశమునుగూర్చి, ఆవిశ్య = ప్రవేశించి, జగామ = వెళ్ళెను, అనిలాత్మజః = వాయుపుత్రుడైన, సః = ఆహనుమంతుడు, పర్వత సముద్రాభ్యాం = మైనాక, సముద్రులచే, బహుమానాత్ = గౌరవమువలన, అపేక్షితః = చూడబడుచున్నవా డగుచు, ఉపపన్నాభిః = కూడికొన్నటువంటి, ఆశీర్భిః = ఆశీర్వచనములచేత, పూజితశ్చ = పూజింపబడినవాడును అయి, అథ = అనంతరము, ఊర్ధ్వం = పైన, దూరం = దూరమును, ఉత్ప్లుత్య = పైకెగసి, శైల మహార్ణవౌ = మైనాక, సముద్రులను, హిత్వా = విడిచి, విమలే = స్వచ్ఛమైన, అమ్బరే = ఆకాశమునందు పితుః = తండ్రియగు వాయుదేవుని యొక్క, పంథానం = మార్గమును, ఆస్థాయ = పొంది, జగామ = వెళ్ళెను, వాయుసూనుః = ఆంజనేయుడు, భూయశ్చ = తిరిగి, ఊర్ధ్వగతిం = ఊర్ధ్వగమనమును, ప్రాప్య = పొంది, తం = ఆ, గిరిం = మైనాకపర్వతమును, అవలోకయన్ = చూచుచున్నవాడై, నిరాలమ్బే = నిరాధారమైనటువంటి, విమలే = స్వచ్ఛమైన, అమ్బరే = ఆకాశమునందు, జగామ = వెళ్ళెను.

తా॥ హనుమంతుడు మైనాకునితో కోపింపవలదని కోరి మైనాకుని మనసా చేతితో దువ్వుచు, పైకిఎగసెను. ఇందువలన పవిత్రప్రేమ కలవారు అతిథ్యాద్యవసరములు కోరినచో ఎట్టి కార్యభారాదులు ప్రతిజ్ఞాదులు తొందరలున్ననూ అన్నియు ఆప్తులకు చెప్పి వారిని ఒప్పించి సంతోషపరచి వారి ఆశీర్వాదముల గైకొనియే సాగుదురు అని సూచితము- హనుమంతుడు మైనాక సముద్రులచే పూజింపబడినవాడై వారి ఆశీర్వాదములను పొంది, వారియొద్ద సెలవు తీసికొని పైకెగసి వారిని చూచుచు, ఆకాశమున వాయుమార్గములో పోవుచుండెను.

శ్లో॥ తద్ద్వితీయం హనుమతో దృష్ట్వా కర్మ సుదుష్కరమ్।
ప్రశశంసు స్సురా స్సర్వే సిద్ధా శ్చ పరమర్షయః॥ ౧౩౭

టీ॥ హనుమతః = ఆంజనేయునియొక్క, సుదుష్కరం = చేయశక్యము గానటువంటి, ద్వితీయం = రెండవదయిన. తత్ = ఆ, కర్మ = కార్యమును, దృష్ట్వా = చూచి, సర్వే = సమస్తమైన, సురాః = దేవతలు సిద్ధాశ్చ = సిద్ధులును, పరమర్షయః = మిక్కిలిసంతోషించినవారలై, ప్రశశంసుః = స్తుతించిరి.

తా॥ హనుమంతుడు మొదట సముద్రలంఘన మనే కార్యభారములో నున్నను రెండవకార్యముగ ఆప్తమిత్రుల అతిథ్యాదిపూజలతో విశ్రమించుట కవకాశము నీయక తాను నిశ్చితార్థమునకు ప్రతిజ్ఞాదులకు భంగము వాటిల్లని దృఢనిశ్చయముతోనే ఆప్తులను నిరశించని అవసరచర్య గైకొన్న మహాధీర ధీశాలితాదులకు అబ్బురపడి దేవతలు సిద్ధులు హనుమంతుని స్తుతించిరి.

శ్లో॥ దేవతా శ్చాభవ న్హృష్టా స్తత్రస్థా స్తస్య కర్మణా।
కాఞ్చనస్య సునాభస్య సహస్రాక్ష శ్చ వాసవః॥ ౧౩౮
ఉవాచ వచనం ధీమాన్ పరితోషా త్సగద్గదమ్।
సునాభం పర్వతశ్రేష్ఠం స్వయ మేవ శచీపతిః॥ ౧౩౯

టీ॥ కాఞ్చనస్య = బంగారుస్వరూపుడైన తస్య = ఆ, సునాభస్య = మైనాకునియొక్క, కర్మణా = కార్యముచేత, తత్రస్థాః = అక్కడనున్నటువంటి, దేవతాశ్చ = దేవతలును, సహస్రాక్షః = వేయికన్నులుగల, వాసవశ్చ = దేవేంద్రుడును, హృష్టాః = సంతోషించినవారుగా, అభవన్ = అయెను, ధీమాన్ = బుద్ధిమంతుడగు, శచీపతిః = దేవేంద్రుడు, పరితోషాత్ = సంతోషమువలన, స్వయమేవ = స్వయముగానే, సగద్గదం = గద్గదస్వరముతో కూడినటువంటి, పర్వతశ్రేష్ఠం = పర్వతశ్రేష్ఠుడైన, సునాభం = మైనాకునిగూర్చి, వచనం = వాక్యమును ఉవాచ = పలికెను.

తా॥ మైనాకుడు ఆంజనేయున కొనర్చిన అదరణపూర్వక మైన ఆతిథ్యాదులకు దేవేంద్రాది దేవత లందరు మిగుల సంతసించిరి, బుద్ధిమంతుడగు దేవేంద్రుడు సంతోషముతోను గద్గదస్వరముతోను కూడియున్న మైనాకుని జూచి యిట్లు పలికెను.

శ్లో॥ హిరణ్యనాభ, శైలేంద్ర! పరితుష్టోఽస్మి తే భృశమ్।
అభయం తే ప్రయచ్ఛామి తిష్ఠ సౌమ్య యథా సుఖమ్॥ ౧౪౦
సాహ్యం కృతం తే సుమహ ద్విక్రాన్తస్య హనూమతః।
క్రమతో యోజనశతం నిర్భయస్య భయే సతి ౧౪౧
రామస్యైష హి దూత్యేన యాతి దాశరథే ర్హరిః।
సత్క్రియాం కుర్వతా తస్య తోషితోస్మి దృఢంత్వయా॥ ౧౪౨

టీ॥ శైలేన్ద్ర = పర్వతములకుప్రభువైన, హిరణ్యనాభ = మైనాక! తే = నీకు, భృశం = ఎక్కువగా, పరితుష్టః = సంతోషించినవాడనై, అస్మి = అయితిని, సౌమ్య = సౌమ్యుడ! తే = నీకు, అభయం = అభయమును, ప్రయచ్ఛామి = ఇచ్చుచున్నాను–యథాసుఖం = స్వేచ్ఛగా, తిష్ఠ = ఉండుము. యోజనశతం = నూరామడదూరమును, భయే సతి = భయము గొల్పుచుండగా, క్రమతః = దాటుటవలన, నిర్భయస్య = భయరహి

తుడైనటువంటియు, విక్రాన్తస్య = దాటుచున్నటువంటి. హనూమతః = ఆంజనేయునికి, తే = నీయొక్క, సుమహాన్ = గొప్పదైన సాహ్యాం = సాహాయ్యము, కృతం = చేయబడినది. హి = ఏకారణము వలన. దాశరథేః = దశరథపుత్రుడైన, రామస్య = శ్రీరామచంద్రునికి, దూత్యేన = దూతగా అగుటచేత, ఏషః = ఈ, హరిః = హనుమంతుడు, యాతి = వెళ్లుచున్నాడో, తస్య = అహనుమంతునికి, సత్క్రియాం = సత్కారమును, కుర్వతా = చేసినటువంటి, త్వయా = నీచేత, దృఢం = నిశ్చయముగా, తోషితః = సంతోషించినవాడను, అస్మి = అయితిని.

తా॥ మైనాక! నూరామడ సముద్రము దాటుటకే భయముగొల్పుచుండగా రామదూతగా వెళ్లుచున్న ఈ ఆంజనేయునికి నీ విచ్చిన అతిధ్యాది పూజలకు నాకు సంతోషము కలిగినది. కావున నీ కేవిధమైన భయము లేదు. సుఖముగా నుండుము.

శ్లో॥ తతః ప్రహర్ష మగమ ద్విపులం పర్వతోత్తమః।
దేవతానాం పతిం దృష్ట్వా పరితుష్టం శతక్రతుమ్॥ ౧౪౩

టీ॥ తతః = అటుతరువాత. పర్వతోత్తమః = పర్వతశ్రేష్ఠుడైన మైనాకుడు విపులం = విస్తారముగా, పరితుష్టం = సంతోషించిన. దేవతానాం = దేవతలకు, పతిం = ప్రభువైన, శతక్రతుం = దేవేంద్రుని, దృష్ట్వా = చూచి, ప్రహర్షం = మిక్కిలి సంతోషమును, అగమత్ = పొందెను.

తా॥ తరువాత మైనాకుడు తాను రామదూత హనుమంతునికి నెరపిన సత్కారాదులకు మిక్కిలి సంతోషించి, తన కభయ మిచ్చిన దేవేంద్రుని జూచి మిగుల సంతసించెను,

శ్లో॥ సవై దత్తవర శ్శైలో బభూ వావస్థిత స్తదా।
హనూమాం శ్చ ముహూర్తేన వ్యతిచక్రామ సాగరమ్॥ ౧౪౪

టీ॥ తదా = అప్పుడు, దత్తవరః = ఈయబడిన వరములుగల, సః = అ, శైలః = మైనాకపర్వతము, అవస్థితోపై బభూవ = ఉన్నవాడ యెను, హనూమాంశ్చ = హనుమంతుడును, ముహూర్తేన = ముహూర్తకాలముచేత, సాగరం = సముద్రమును, వ్యతిచక్రామ = దాటెను.

తా॥ మైనాకుడు దేవేంద్రునిచే భయములేని వరములను పొందినవాడై అచ్చటనే ఉండిపోయెను. ఆంజనేయుడు ముహూర్తకాలములో అస్థానమును దాటి సముద్రమును దాటుచుండెను.

* సురస హనుమంతునికి అడ్డుతగులుట *

శ్లో॥ తతో దేవా స్సగన్ధర్వా స్సిద్ధాశ్చ పరమర్షయః।
అబ్రువన్ సూర్యసఙ్కాశాం సురసాం నాగమాతరమ్॥ ౧౪౫
అయం వాతాత్మజ శ్శ్రీమాన్ ప్లవతే సాగరోపరి।
హనుమా న్నామ తస్య త్వం ముహూర్తం విఘ్నమాచర॥ ౧౪౬
రాక్షసం రూప మాస్థాయ సుఘోరం పర్వతోపమమ్।
దంష్ట్రా కరాళం పిఙ్గాక్షం వక్త్రం కృత్వా నభస్సమమ్॥ ౧౪౭
బలమిచ్ఛామహే జ్ఞాతుం భూయ శ్చాస్య పరాక్రమమ్।
త్వాం విజేష్య త్యుపాయేన విషాదం వా గమిష్యతి॥ ౧౪౮

టీ॥ తతః = అతరువాత, దేవాః = దేవతలు, సగన్ధర్వాః = గంధర్వులతోకూడిన, సిద్ధాశ్చ = సిద్ధులును, పరమర్షయః = ఋషీశ్వరులును, సూర్యసఙ్కాశాం = సూర్యునితోసమానమైన, సురసాం = సురస అనుపేరుగల, నాగమాతరం = నాగమాతను గూర్చి, అబ్రువన్ = పలికిరి. శ్రీమాన్ = శోభాయుక్తుడు, వాతాత్మజః = వాయుకుమారుడున్నైన, అయం = ఈ, హనుమాన్ = హనుమంతుడు, సాగరోపరి = సముద్రముపై భాగమందు, ప్లవతే = దాటుచున్నాడు. తస్య = అతనికి.

త్వం = నీవు. ముహూర్తం = ముహూర్తమాత్రము. విఘ్నం = విఘ్నమును, ఆచర = చేయుము. సుఘోరం = మహాఘోరమైనటువంటి పర్వతోపమం = పర్వతసమానమైన, దంష్ట్రాకరాళం = తీక్ష్ణమైన కోరలుగల. రాక్షసం = రాక్షససంబంధమైన, రూపం = ఆకారమును, ఆస్థాయ = పొంది. నభస్సమం = ఆకాశముతోసమానమైన, పింగాక్షం = పచ్చనికన్నులుగల, వక్త్రం = ముఖమును, కృత్వా = చేసి, అస్య = ఈహనుమంతునియొక్క. పరాక్రమం = పరాక్రమమును. భూయశ్చ = తిరిగియు, జ్ఞాతుం = తెలిసికొనుటకొఱకు, ఇచ్ఛామహే = కోరుచున్నాము. త్వాం = నిన్ను, ఉపాయేన = ఉపాయముతో, విజేష్యతి వా = జయించగలడో, విషాదం = విచారమును, గమిష్యతి వా = పొందగల్గునో

తా॥ ఆంజనేయుడు ఆ స్థానమును వదలి మహావేగముగా సముద్రమును దాటుచుండ, దేవతలు, గంధర్వులు, సిద్ధులు, మహర్షులు, అందరు సూర్యసమాన గమనముగల నాగమాత సురసను చూచి హనుమంతుడు సముద్రుని పై భాగమున దాటుచున్నాడు, అతనికి నీవు ముహూర్తకాలము విఘ్నము కలుగజేయుము. అతని బలమును పరీక్షింపవలయును అందువలన ఆకాశముతో సమానమైన పెద్దనోరు, తీక్ష్ణమైన దంతములు, పచ్చనికళ్లతో, రాక్షసాకారము దాల్చిన నిన్ను జయించగల్గునో విచారించునో పరీక్షింపవలె నని సురసనుకోరిరి,

శ్లో॥ ఏవముక్తా తు సా దేవీ దైవతై రభిసత్కృతా।
సముద్రమధ్యే సురసా బిభ్రత్ రాక్షసం వపుః॥ ౧౪౯

వికృతం చ విరూపం చ సర్వస్య చ భయావహమ్।
ప్లవమానం హనూమన్త మావృత్యేద మువాచ॥ ౧౫౦

మమ భక్షః ప్రదిష్ట స్త్వ మీశ్వరై ర్వానరర్షభ।
అహం త్వాం భక్షయిష్యామి ప్రవిశేదం మమాననమ్॥ ౧౫౧

టీ॥ ఏవం = ఈప్రకారముగా, ఉక్తాతు = చెప్పబడినదై, సా = ఆ, దేవీ = నాగమాత, దైవతైః = దేవతలచేత, అభిసత్కృతా = అభ్యర్థనచేయబడినదై, సముద్రమధ్యే = సముద్రమధ్యమందు, సురసా = సురస, రాక్షసం = రాక్షససంబంధమైన, వపుః = శరీరమును, బిభ్రతీ = ధరించినదగుచు, వికృతం = వికారమైనదియు, విరూపంచ = వికృతరూపము గలదియు, సర్వస్య = అందరికి, భయావహం = భయంకరమైన స్థితిని, ఆస్థాయ = పొంది, ప్లవమానం = దాటుచున్న, హనూమంతం = అంజనేయునిగురించి, ఇదం = దీనిని, ఉవాచ = పలికెను—వానరర్షభ = వానరశ్రేష్ఠ! త్వం = నీవు, ఈశ్వరైః = దేవతలచేత, మమ = నాకు, భక్షః = ఆహారముగా, ప్రదిష్టః = చూపబడితివి, అహం = నేను, త్వాం = నిన్ను, భక్షయిష్యామి = భక్షించగలను, మమ = నాయొక్క, ఇదం = ఈ, ఆననం = ముఖమును, ప్రవిశ = ప్రవేశించుము.

తా॥ ఈప్రకారము సర్వదేవతలచేత ప్రార్థించబడిన సురస సముద్రమధ్యమున రాక్షసరూపమును ధరించి హనుమంతునికి ఎదురై భయంకరముగా నోరు తెరచి హనుమంతునిగూర్చి దేవతలచే నీవు నాకు ఆహారముగా చూపబడితివి. కాన నానోటియందు ప్రవేశింపు మని చెప్పెను.

శ్లో॥ ఏవ ముక్త స్సురసయా ప్రాఞ్జలి ర్వానరర్షభః।
ప్రహృష్టవదన శ్శ్రీమా నిదం వచన మబ్రవీత్॥ ౧౫౨
రామో దాశరథి ర్నామ ప్రవిష్టో దణ్డకావనమ్।
లక్ష్మణేన సహభ్రాత్రా వైదేహ్యా చాపి భార్యయా॥ ౧౫౩
అన్యకార్య విషక్తస్య బద్ధవైరస్య రాక్షసైః।
తస్య సీతా హృతా భార్యా రావణేన యశస్వినీ॥ ౧౫౪
తస్యాస్సకాశం దూతోఽహం గమిష్యే రామశాసనాత్।
కర్తు మర్హసి రామస్య సాహ్యం విషయవాసిని॥ ౧౫౫

అథవా మైథిలీం దృష్ట్వా రామం చాక్లిష్టకారిణమ్।
ఆగమిష్యామి తే వక్త్రం సత్యం ప్రతిశృణోమి తే॥ ౧౫౬

టీ॥ ఏవం = ఈప్రకారము, సురసయా = సురస చేత, ఉక్తః = చెప్పబడినవాడై, వానరర్షభః = హనుమంతుడు, ప్రాఞ్జలిః = దోసిలిఒగ్గినవాడై, ప్రహృష్టవదనః = సంతోషించినముఖముగలవాడై, శ్రీమాన్ = శోభాయుక్తుడైన ఆంజనేయుడు, ఇదం = ఈ, వచనం = వాక్యమును, అబ్రవీత్ = పలికెను. దాశరథిః = దశరథపుత్రుడు, రామోనామ = రాముడనేవాడు, భ్రాత్రా = సోదరుడైన, లక్ష్మణేనసహ = లక్ష్మణునితోడను, భార్యయా = భార్యయైన, వైదేహ్యా చాపి = సీతతోడను, దండకావనం = దండకారణ్యమును, ప్రవిష్టః = ప్రవేశించినవాడయ్యెను. అన్యకార్యవిషక్తస్య = ఇతరకార్యముల యందు తగులుకొని యున్నటువంటియు, రాక్షసైః = రాక్షసులతో, బద్ధవైరస్య = కూర్చబడినవిరోధముగలిగిన, తస్య = ఆశ్రీరామునియొక్క, యశస్వినీ = కీర్తివంతురాలైన, భార్య = భార్యయగు, సీతా = సీత, రావణేన = రావణునిచే, హృతా = అపహరించబడినది. విషయవాసిని = రామరాజ్యవాసినీ! అహం = నేను, తస్య = ఆశ్రీరామునియొక్క, దూతః = బంటును, రామశాసనాత్ = రామునియొక్కఆజ్ఞవలన, తస్యాః = ఆసీతాదేవియొక్క, సకాశం = సమీపమునుగూర్చి, గమిష్యే = వెళ్ళుదును, సాహ్యం = సహాయమును, కర్తుం = చేయుటకు, అర్హసి = తగుదువు, అథవా = ఇట్లుగానిచో, మైథిలీం = సీతను, అక్లిష్టకారిణం = కష్టకారణముకాని, రామంచ = శ్రీరాముని, దృష్ట్వా = చూచి, తే = నీయొక్క, వక్త్రం = ముఖమును, ఆగమిష్యామి = పొందిగలను, తే = నీకు, సత్యం = యథార్థమును, ప్రతిశృణోమి = వినిపించుచున్నాను.

తా॥ ఈ ప్రకారము సురసచేత చెప్పబడిన ఆ హనుమంతుడు సంతోషించినవాడై అంజలి యొగ్గి నమస్కరించి, సురసతో నిట్లు చెప్పెను. దశరధపుత్రు డగు శ్రీరాముడు తమ్ముడగు లక్ష్మణుని తోడను. భార్యయగు సీతతోను కలసి దండకారణ్యములో పర్ణశాల నిర్మించుకొని యుండ రావణసోదరియగు శూర్పనఖ ఆసుందరాకారులను జూచి మోహించగా వారు దానిని నిరసించుటకు సీతాసౌందర్యమే కారణమని శూర్పనఖ తలచెను. అప్పుడు శూర్పనఖ తన విరోధము నెరవేరుటకు అన్నయగు రావణునికి సీతాసౌందర్యమును వివరించెను. అందుకు రావణుడు మారీచుని మాయామృగముగా పంపించెను. రాముని అన్యకార్యాసక్తు నొనర్చి రావణుడు సీతను అపహరించి తీసికొనివచ్చి లంకలో నుంచెను. పతివ్రతయగు సీతనిమిత్తము కష్టపడుచున్న శ్రీరాముని కార్యార్థము నేను దూతగా రామాజ్ఞతో లంకకు పోవుచున్నాను, రామరాజ్యనివాసినివి గనుక నీవుకూడ ప్రభువుకు సహాయము చేయవలెను, కాదందువా ! సీతనుచూచి ఆమెయొక్క యోగక్షేమములు రామునకు తెలిపినపిమ్మట నేను తిరిగి వచ్చి నీకు ఆహారమగుదును. ఇది ముమ్మాటికి సత్యముగా నమ్మము.

శ్లో॥ ఏవ ముక్తా హనుమతా సురసా కామరూపిణీ ।
అబ్రవీ న్నాతి వర్తేత కశ్చి దేష వరో మమ॥ ౧౫౭

టీ॥ ఏవం = ఈప్రకారముగా, హనుమతా = ఆంజనేయునిచేత, కామరూపిణీ = కోరినరూపముధరించగల, సురసా = సురస, ఉక్తా = చెప్పబడినదై, మమ = నాకు, కశ్చిత్ = ఏదీ, నాతివర్తేత = అతిక్రమించి వెళ్ళరాదు. ఏషః = ఇది, వరః = వరము అని, అబ్రవీత్ = పలికెను.

తా॥ హనుమంతునిచే ఈప్రకారముగా చెప్పబడిన సురస, నానుంచి ఏదీ ముందుకు దాటి వెళ్ళుటకు వీలులేదు. ఇది నాకు వరము అని చెప్పెను.

శ్లో॥ తం ప్రయాన్తం సముద్వీక్ష్య సురసా వాక్య మబ్రవీత్।
బలం జిజ్ఞాస మానా వై నాగమాతా హనూమతః॥ ౧
ప్రవిశ్య వదనం మేఽద్య గన్తవ్యం వానరోత్తమ।
వర ఏష పురాదత్తో మమ ధాత్రేతి సత్వరా॥ ౨
వ్యాదాయ వక్త్రం విపులం స్థితా సా మారుతేః పురః।

టీ॥ నాగమాతా = నాగమాతయగు. సురసా = సురస, హనూమతః = ఆంజనేయునియొక్క, బలం = బలమును, జిజ్ఞాసమానావై = తెలిసికొన నిచ్ఛగలదియై, ప్రయాన్తం = ప్రయాణించుచున్న తం = ఆ హనుమంతుని. సముద్వీక్ష్య = చూచి. వాక్యం = వాక్యమును, అబ్రవీత్ = పలికెను, వానరోత్తమ = ఆంజనేయ! అద్య = ఇప్పుడు, మే = నాయొక్క, వదనం = ముఖమును, ప్రవిశ్య = ప్రవేశించి. గన్తవ్యం = వెళ్ళతగియున్నది, ఏషః = ఈ. వరః = వరము, పురా = పూర్వము, మమ = నాకు, ధాత్రా = బ్రహ్మచేత, దత్తః = ఇవ్వబడినది. ఇతి = ఇట్లు, సత్వరా = తొందరగలదై, విపులం = పెద్దదైన, వక్త్రం = నోటిని, వ్యాదాయ = తెరచి. మారుతేః = ఆంజనేయునియొక్క. పురః = ముందర సా = ఆసురస, స్థితా = ఉండెను,

తా॥ నాగమాతయగు సురస ఆంజనేయునిబలము తెలిసికొన నిచ్ఛగలదై ప్రయాణము చేయుచున్న ఆంజనేయునిగూర్చి యిట్లు పలికెను, ఆంజనేయ! ఇప్పుడే నానోటియందు పడవలెను, ఈవరము పూర్వమున బ్రహ్మ నాకిచ్చెను. అనిసురస పెద్దనోరు తెరచి హనుమంతున కడ్డముగ నిలబడెను.

శ్లో॥ ఏవ ముక్తస్సురసయా క్రుద్ధో వానరపుఙ్గవః॥ ౩
అబ్రవీ త్కురువై వక్త్రం యేన మాం విషహిష్యసే।
ఇత్యుక్త్వా సురసాం క్రుద్ధో దశయోజన మాయతః॥ ౪
దశయోజన విస్తారో బభూవ హనుమాం స్తదా।

టీ॥ ఏవం = ఈప్రకారము, సురసయా = సురసచేత. ఉక్తః = చెప్పబడిన, వానరపుఙ్గవః = హనుమంతుడు, కుద్ధః = కోపముగలవాడై, యేన = దేనితో, మాం = నన్ను. విషహిష్యసే = మ్రింగగలవో, వక్త్రం = నోరును. కురుష్వ = చేయుము. ఇతి = ఇట్లు. ఉక్త్వా = పలికి, సురసాం = సురసనుగూర్చి, క్రుద్ధః = కోపముగలవాడై. దశయోజనం = పదిఆమడలు, ఆయతః = వెడల్పుగలవాడై, అబ్రవీత్ = పలికెను. తదా = అప్పుడు. హనుమాన్ = హనుమంతుడు, దశయోజనవిస్తారః = పది ఆమడలు పెరిగినవాడై, బభూవ = ఆయెను.

తా॥ ఈవిధముగా సురసచేత చెప్పబడిన హనుమంతుడు. మహాక్రోధముతో నన్ను ఏవిధముగా మ్రింగగలవో, మ్రింగుము అని పలికి పది ఆమడలపొడవు పదిఆమడలవెడల్పు గల శరీరమును పెంచెను.

శ్లో॥ తం దృష్ట్వా మేఘసఙ్కాశం దశయోజన మాయతమ్॥ ౫
చకార సురసా చాప్యం వింశద్యోజన మాయతమ్।
హనుమాం స్తు తతః క్రుద్ధ స్త్రింశద్యోజన మాయతః॥ ౬
చకార సురసా వక్త్రం చత్వారింశ త్తథో చ్ఛ్రితమ్।
బభూవ హనుమా న్వీరః పఞ్చాశ ద్యోజనోచ్ఛ్రితః॥ ౭
చకార సురసా వక్త్రం షష్టియోజన మాయతమ్।
తథైవ హనుమాన్వీర స్సప్తతే యోజ నోచ్ఛ్రితః॥ ౮
చకార సురసా వక్త్ర మశీతి యోజనాయతమ్।
హనుమా నచలప్రఖ్యో నవతీ యోజనోచ్ఛ్రితః॥ ౯
చకార సురసా వక్త్రం శతయోజన మాయతమ్।

టీ॥ దశయోజనం = పది ఆమడలు. ఆయతం = పెరిగినటువంటియు, మేఘసఙ్కాశం = మేఘునితో సమానమైనట్టియు, తం = ఆహనుమంతుని, దృష్ట్వా = చూచి, సురసా చ = సురసయు వింశత్ యోజనం = ఇరువది ఆమడలు, ఆయతం = పొడవైన. ఆస్యం = నోరును,

చకార = చేసెను, తతః = అటుతరువాత, హనూమాంస్తు = హనుమంతుడును, క్రుద్ధః = కోపముగలవాడై, త్రింశద్యోజనం = ముప్పది ఆమడల, ఆయతం = పొడవును, సురసా = సురస, చత్వారింశత్ = నలభై ఆమడ, తథా = ఆప్రకారము, ఉచ్ఛ్రితం = తెరవబడిన, వక్త్రం = నోరును, చకార = చేసెను, వీరః = వీరుడైన, హనుమాన్ = హనుమంతుడు, పఞ్చాశద్యోజనోచ్ఛ్రితః = ఏబది ఆమడల పొడవు పెరిగినవాడై, బభూవ = ఆయెను, సురసా = సురస, షష్టి యోజనం = అరవై ఆమడలు, ఆయతం = పొడవైన, వక్త్రం = ముఖమును, చకార = చేసెను, తథైవ = ఆప్రకారముగానే, వీరః = వీరుడైన, హనుమాన్ = హనుమంతుడు, సప్తతీ యోజనోచ్ఛ్రితః = డెబ్బది ఆమడలు పెరిగినవాడయ్యెను. సురసా = సురస, అశీతీయోజనాయతం = ఎనుబది ఆమడల పొడవైన, వక్త్రం = నోరును, చకార = చేసెను, అచలప్రఖ్యః = పర్వతసమానుడైన, హనుమాన్ = ఆంజనేయుడు, నవతీ యోజనోచ్ఛ్రితః = తొంబది ఆమడల పొడవుగలవాడై, అయ్యెను, సురసా = సురస, శతయోజనమాయతం = నూరుయోజనముల పొడవైన, వక్త్రం = నోరును, చకార = చేసెను.

తా॥ మహాక్రోధముతో పదిఆమడల పొడ వెదిగిన ఆంజనేయుని జూచి సురస ఇరువది ఆమడల నోరు తెరచెను. సురసను జూచి ఆంజనేయుడు ముప్పది ఆమడలు పొడవు పెరిగెను. సురస నలభైఆమడల పొడవు నోరు తెరువగా ఆంజనేయుడు యేబది ఆమడల శరీరమును పెంచెను, సురస అరవై ఆమడల నోరు పెంచగా హనుమంతుడు డెబ్బది అమడల శరీరమును పెంచెను. సురసయు ఎనుబది యోజనముల నోరు పెంచగా ఆంజనేయుడు తొంబది ఆమడల పొడవు గల శరీరమును పెంచెను. సురస నూరు యోజనముల నోరు తెరచెను.

* హనుమంతుని శరీరము తొంబది ఆమడల నిడివి గలదై యుండిన లంకాపురీవాసులకు తెలియకపోదు. తెలిసిన తాను వెళ్ళేపనికి భంగము కలు

గును. సాయంసమయము తాను లంకాప్రవేశము గావించెద నను చెప్ప బోవు మాటకు కూడ భంగము గనుక "తంప్రయాన్తం" అనునది మొదలు "శతయోజనమాయతం" అనుదానివరకు గల శ్లోకములు ప్రక్షిప్తము లనియు. వాల్మీకి రచితములు కావనియు తెలియవలెను.

హనుమంతుడు సురస నోట జొచ్చి బయల్వెడలుట

శ్లో॥ త ద్దృష్ట్వా వ్యాదితం త్వాస్యం వాయుపుత్ర స్స బుద్ధిమాన్।
(దీర్ఘజిహ్వాం సురసయా సుఘోరం నరకోపమమ్)
సుసజ్షి ప్యాత్మనః కాయం బభూ వాఙ్గుష్ఠమాత్రకః॥ ౧౫౭
సోఽభిప త్యాశు తద్వక్త్రం నిష్పత్య చ మహాజవః।
అన్తరిక్షే స్థిత శ్శ్రీమా నిదం వచన మబ్రవీత్॥ ౧౫౮

టీ॥ సుబుద్ధిమాన్ = బుద్ధిమంతుడైన, వాయుపుత్రః = అంజనేయుడు, దీర్ఘ జిహ్వాం = పొడవైన నాలుక కలిగినటువంటియు. సుఘోరం = మిక్కిలి ఘోరమైనటువంటియు, నరకోపమం = నరకముతో సమాన మైనటువంటి, సురసాయాః = సురసయొక్క. తం = ఆ, వ్యాదితం = తెరువబడిన, ఆస్యం = ముఖమును, దృష్ట్వా = చూచి, శ్రీమాన్ = శోభాయుక్తుడైన, మహాజవః = గొప్ప వేగముగల, సః = ఆహనుమంతుడు, ఆత్మనః = తనయొక్క, కాయం = శరీరమును, అంగుష్ఠ మాత్రకః = చిటికినవ్రేలంతటిదిగా, సుసంక్షిప్య = బాగుగా కురుచచేసి తద్వక్త్రం = ఆసురసయొక్క నోటిలో, అభిపత్ = పడెను. ఆశు = వెంటనే, నిష్పత్య చ = బైటకువచ్చి, అన్తరిక్షే = ఆకాశమందు. స్థితః = ఉన్నవాడై, ఇదం = ఈ, వచనం = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా॥ మహాపరాక్రమవంతుడు వేగవంతుడునైన హనుమంతుడు మహా క్రూరము, ఘోరము, నరక సదృశమునై, నూరామడ పొడవున తెర వబడియున్న ఆసురసయొక్క నోరును చూచి, వెంటనే తన పెద్దదగు

శరీరమును సిద్ధ శక్తియుతుం డగుటచే అంగుష్ఠమాత్రముగా తగ్గించి ఆ సురసయొక్క నోటిలో ప్రవేశించి. వెన్వెంటనే బయల్వడి ఆకాశమున కెగసి సురసతో ఈ ప్రకారముగా పలికెను.

* దాక్షాయణి = దక్షునికూతురా ! హనుమంతు డిట్లు సంబోధించుటచేత, ఆమె దక్షుని కుమార్తె యని భావించవలసి యున్నది ఈ కారణముననే హనుమంతుడు ఆమెను రాక్షసి యని భావించక గౌరవించెను. ఇది వాల్మీకి విశిష్టశైలి యని పెద్దలభావము.

శ్లో॥ ప్రవిష్టోఽస్మి హి తే వక్త్రం దాక్షాయణి నమోఽస్తుతే।
గమిష్యే యత్ర వైదేహీ సత్యా శ్చాసీ ద్వర స్తవ॥ ౧౬౦
తం దృష్ట్వా వదనా న్ముక్తం చన్ద్రం రాహుముఖా దివ।
అబ్రవీ త్సురసా దేవీ స్వేన రూపేణ వానరమ్। ౧౬౧
అర్థ సిద్ధ్యై హరిశ్రేష్ఠ గచ్ఛ సౌమ్య యథా సుఖమ్।
సమానయస్వ వైదేహీం రాఘవేణ మహాత్మనా॥ ౧౬౨

టీ॥ దాక్షాయణి = దక్షునికుమార్తె వగు నాగమాతా। తే = నీకు, నమః = నమస్కారము. అస్తు = అగుగాక, తే = నీయొక్క, వక్త్రం = నోరును. ప్రవిష్టః = ప్రవేశించినవాడనై, అస్మి = అయితిని, తవ = నీయొక్క, వరః చ = వరమును, సత్యః = సత్యమైనదిగా ఆసీత్ = ఆయెను, యత్ర = ఎక్కడ, వైదేహీ = సీత, ఆసీత్ = ఉండెనో, తత్ర = అక్కడకు, గమిష్యామి = వెళ్లగలను, (యత్తదోః నిత్యసంబంధత్వాత్ తత్ర ప్రయోగో భవతి). వదనాత్ = ముఖమునుండి, ముక్తం = విడుపబడిన, తం = ఆహనుమంతుని రాహుముఖాత్ = రాహువుయొక్క నోటినుండి, ముక్తం = విడువబడిన, చన్ద్రమివ = చంద్రునివలె, దృష్ట్వా = చూచి, సురసాదేవీ = నాగమాత యగు సురస స్వేనరూపేణ = స్వకీయాకారముతో, అబ్రవీత్ = పలికెను. హరిశ్రేష్ఠ = వానరశ్రేష్ఠ ! అర్థసిద్ధ్యై = ప్రయోజనసిద్ధికొరకు, యథాసుఖం =

స్వేచ్ఛగా, గచ్ఛ = వెళ్లుము, సౌమ్య = ఓసౌమ్యుడ! మహాత్మనా = మహానుభావుడైన, రాఘవేణ = శ్రీరామునితో, వైదేహీం = సీతను, సమానయస్వ = కలుపుము.

తా॥ ఓ దక్షప్రజాపతికుమార్తె యగు నాగమాతా! నీకు నా నమస్కారము. నీ వరము సత్యమగునట్లు నీనోటియందు పడి బయల్వెడలితిని. ఇప్పుడు సీత యున్నచోటికి వెళ్లుదు ననెను. తన నోటినుండి బయట పడిన హనుమంతుని రాహువు ముఖమునుండి విడివడిన చంద్రునివలె చూచి తన నిజరూపము ధరించి "ఓ వానరశ్రేష్ఠ! నీ కార్యసిద్ధికొఱకు స్వేచ్ఛగా వెళ్లి, మహానుభావుడైన శ్రీరామచంద్రునితో సీతాదేవిని సమావేశపరచుము. పోయిరమ్ము" అని నాగమాత పలికెను.

శ్లో॥ తత్తృతీయం హనుమతో దృష్ట్వా కర్మ సుదుష్కరమ్।
సాధు సాధ్వితి భూతాని ప్రశశంసు స్తదా హరిమ్॥ ౧౬౩

టీ॥ హనుమతః = హనుమంతునియొక్క, సుదుష్కరం = చేయశక్యము గాని, తృతీయం = సురసావక్త్ర నిష్క్రమణరూపమైన మూడవది యగు, తత్ = ఆ, కర్మ = పనిని, దృష్ట్వా = చూచి, తదా = అప్పుడు, భూతాని = భూతములు, హరిం = హనుమంతుని, సాధుసాధ్వితి = బాగుబాగు అని, ప్రశశంసుః = పొగడిరి.

తా॥ సురసాదేవి నోటినుండి నిష్క్రమణరూపమైన హనుమంతుని మూడవదైన అనితరసాధ్యమగు పనిని జూచి సర్వభూతములు భళిభళీ యని పొగడిరి.

శ్లో॥ స సాగర మనాధృష్య మభ్యేత్య వరుణాలయమ్।
జగా మాకాశ మావిశ్య వేగేన గరుడోపమః॥ ౧౬౪

టీ॥ సః = ఆ హనుమంతుడు, అనాధృష్యం = దాటశక్యముగాని, వరుణాలయం = ఉదకములకుస్థానమైన, సాగరం = సముద్రమును, అభ్యేత్య =

అతిక్రమించి. వేగేన = వేగముతో, ఆకాశం = ఆకాశమును, ఆవిశ్య = ప్రవేశించి, గరుడోపమః = గరుత్మంతునితో సమానుడై, జగామ = వెళ్లెను.

తా॥ ఆ హనుమంతుడు దాటశక్యముగాని ఆ సముద్రమునకు పైకెగసి మహావేగముతో ఆకసమున గరుత్మంతునివలె పోవుచుండెను.

శ్లో॥ సేవితే వారిధారాభిః పతగైశ్చ నిషేవితే।
చరితే కైశికాచార్యైరైరావతనిషేవితే॥ ౧౬౫
సింహకుఞ్జర శార్దూల పతగోరగ వాహనైః।
విమానైస్సంపతద్భిశ్చ విమలైస్సమలఙ్కృతే॥ ౧౬౬
వజ్రాశని సమాఘాతైః పావకైరుపశోభితే।
కృతపుణ్యైర్మహాభాగైస్స్వర్గజిద్భిరలఙ్కృతే॥ ౧౬౭
వహతా హవ్యమత్యర్థం సేవితే చిత్రభానునా।
గ్రహ నక్షత్ర చన్ద్రార్క తారాగణ విభూషితే॥ ౧౬౮
మహర్షిగణ గన్ధర్వ నాగ యక్ష సమాకులే।
వివిక్తే విమలే విశ్వే విశ్వావసు నిషేవితే॥ ౧౬౯
దేవరాజ గజాక్రాన్తే చన్ద్రసూర్య పథే శివే।
వితానే జీవలోకస్య వితతే బ్రహ్మనిర్మితే॥ ౧౭౦
బహుశస్సేవితే వీరైర్విద్యాధర గణైర్వరైః।
జగామ వాయుమార్గే తు గరుత్మానివ మారుతిః॥ ౧౭౧

టీ॥ వారిధారాభిః = మేఘములచేత, సేవితే = సేవించబడుచున్నదియు, పతగైశ్చ = పక్షులచేతను, సేవితే = సేవించబడుచున్నదియు, కైశికాచార్యైః = విద్యాధరాదులచే, చరితే = నడపబడుచున్నదియు, ఐరావతనిషేవితే = ఐరావతగజముచేత సేవించబడుచున్నదియు.

సింహకుఞ్జర శార్దూల పతగోరగ వాహనైః-సింహ = సింహములు, కుఞ్జర = ఏనుగులు, శార్దూల = పులులు, పతగ = పక్షులు, ఉరగ = సర్పములు. వాహనైః = వాహనములచేతను. విమానైః = విమానముల చేతను, విమలైః = నిర్మలములైన, సంపతద్భిః = సంచరించువారలచే. సమలంకృతే = అలంకరించబడినదియు, వజ్రాశనిసమాఘాతైః - వజ్ర = వజ్రాయుధము. అశని = పిడుగుల, సమాఘాతైః = సంఘర్షణలచేతనైన. పావకైః = అగ్నులచే. ఉపశోభితే = ప్రకాశింపబడుచున్నదియు, అత్యర్థం = మిక్కిలి. హవ్యం = హోమపదార్థమును. వహతా = వహించుచున్న, చిత్రభానునా = చిత్రములైన కిరణములుగల సూర్యునిచేత. సేవితే = సేవింపబడుచున్నదియు. గ్రహ నక్షత్ర చన్ద్రార్క తారాగణ విభూషితే - గ్రహ = గ్రహములు. నక్షత్ర = నక్షత్రములు. చన్ద్ర = చంద్రుడు, అర్క = సూర్యుడు. తారాగణ = నక్షత్రసమూహములచే, విభూషితే = అలంకరింపబడినదియు, మహర్షిగణ గన్ధర్వ నాగ యక్ష సమాకులే - మహర్షిగణ = ఋషీశ్వరులసమూహము, గన్ధర్వ = గంధర్వులు, నాగ = నాగులు, యక్ష = యక్షులతో సమాకులే = వ్యాప్తమైనదియు, వివిక్తే = ఏకాంతమైనదియు, విమలే = స్వచ్ఛమైన, విశ్వే = సమస్తముగలదియు, విశ్వావసునిషేవితే = విశ్వావసులచే సేవించబడుచున్నదియు, దేవరాజగజాక్రాంతే = ఐరావతగజముచే ఆక్రమించబడినదియు, చన్ద్ర సూర్య పథే = సూర్యచంద్రులకు మార్గమైనదియు, శివే = శుభప్రదమైనదియు, జీవలోకస్య = జీవులకు, వితానే = మార్గమైనదియు, వితతే = వ్యాప్తమైనదియు, బ్రహ్మనిర్మితే = బ్రహ్మచే నిర్మింపబడినదియు, బహుశః = అనేకవిధములుగా, వరైః = శ్రేష్ఠులైన, వీరైః = పరాక్రమవంతుల చేతను, విద్యాధరగణైః = విద్యాధరులసమూహముచే, సేవితే = సేవింపబడుచున్నదియునగు. వాయుమార్గే = ఆకాశమార్గమందు. మారుతిః = వాయుపుత్రుడైన హనుమంతుడు, గరుత్మానివ = గరుత్మంతునివలె, జగామ = వెళ్ళెను.

తా॥ హనుమంతుడు దేవ యక్ష కిన్నర గంధర్వాదులచే స్తుతింపబడుచు, మేఘములు, పక్షులు, తుంబురాదులు, ఐరావతములచే సేవించబడుచు, సింహములు, ఏనుగులు, పులులు, పక్షులు, సర్పములు, వాహనములుగా కలవారు, విమానములచే తిరుగువారిచేత అలంకరింపబడినదియు, వజ్రాయుధాది ఆయుధసంఘర్షణచే పుట్టిన నిప్పురవ్వలచేతను, స్వర్గగాములచేతను, యజ్ఞహవ్యములు తీసికొని వెళ్లువారిచేతను గ్రహనక్షత్ర సూర్యచంద్రాదులతోడను అలంకరించబడినదియు, ఋషి గంధర్వ యక్ష నాగులతో కూడియున్నదియు, విశ్వావసు సేవితమై స్వర్గగాములగు జీవులకు దారియగు ఆకాశమార్గమున గరుత్మంతునివలె వెళ్ళెను.

శ్లో॥ ప్రదృశ్యమాన స్సర్వత్ర హనుమాన్ మారుతాత్మజః।
భేజే ఽమ్బరం నిరాలమ్బం లమ్బపక్ష ఇవాద్రిరాట్॥ ౧౮౨

టీ॥ మారుతాత్మజః = పవననందనుడగు. హనుమాన్ = ఆంజనేయుడు, సర్వత్ర = అంతట, నిరాలంబం = నిరాధారమైన అంబరం = ఆకాశమును. ప్రదృశ్యమానః = చూచుచున్నవాడగుచు, లంబపక్షః = వ్రేలాడు రెక్కలుగల, అద్రిరాడివ = పర్వతరాజువలె. భేజే = పొందెను.

తా॥ ఆంజనేయుడు వ్రేలాడు రెక్కలు గల పర్వతమా యన్నట్లు నిరాధారమైన ఆకాశమును చూచుచు వెళ్ళుచుండెను.

ఆంజనేయుడు సింహికను వధించుట

శ్లో॥ ప్లవమానం తు తం దృష్ట్వా సింహికా నామ రాక్షసీ।
మనసా చింతయామాస ప్రవృద్ధా కామరూపిణీ॥ ౧౮౩

టీ॥ సింహికానామ = సింహికయను పేరుగల. రాక్షసీ = రాక్షసి. ప్లవమానం = దాటుచున్న. తం = ఆహనుమంతుని. దృష్ట్వా = చూచి.

కామరూపిణీ = కోరినరూపముగలదై. ప్రవృద్ధా = వృద్ధిపొందినదై. చింతయామాస = ఆలోచించెను.

తా॥ ఆకాశమార్గమున వెళ్లుచున్న ఆంజనేయుని జూచి సింహిక యను రాక్షసి పెద్దశరీరమును పెంచి మనస్సున నిట్లు ఆలోచించెను.

శ్లో॥ అద్య దీర్ఘస్య కాలస్య భవిష్యా మ్యహ మాశితా।
ఇదం హి మే మహ త్స_త్త్వం చిరస్యవశ మాగతమ్॥ ౧౭౫
ఇతి సఞ్చి_న్త్య మనసా ఛాయా మస్య సమాక్షిపత్।

టీ॥ అద్య = ఇప్పుడు, దీర్ఘస్య = ఎక్కువైన, కాలస్య = కాలమునకు. అహం = నేను, అశితా = ఆహారముగలదానవై, భవిష్యామి = అగుచున్నాను, హి = ఏకారణమున. మే = నాకు, ఇదం = ఈ. మహత్ = గొప్పదైన, స_త్త్వం = మృగము. చిరస్య = చిరకాలమునకు, వశం = వశమై, ఆగతం = వచ్చినది. ఇతి = అని, మనసా = మనస్సుచేత. సఞ్చి_న్త్య = ఆలోచించి అస్య = ఈఆంజనేయుని యొక్క, ఛాయాం = నీడను, సమాక్షిపత్ = పట్టుకొనెను.

తా॥ చాలారోజులకు నాకు ఆహారము దొరికినది. ఏదో గొప్ప మృగము యిప్పటికి నాకు వశమైనది. అని సింహిక మనస్సున తలంచి ఆంజనేయుని నీడను పట్టుకొనెను.

శ్లో॥ ఛాయాయాం గృహ్యమాణాయాం చి_న్తయామాస వానరః॥౧౭౬
సమాక్షిప్తోఽస్మి సహసా పఙ్గూకృత పరాక్రమః
ప్రతిలోమేన వాతేన మహా నౌ రివ సాగరే॥ ౧౭౭

టీ॥ ఛాయాయాం = నీడ, గృహ్యమాణాయాంసతి = పట్టుకొనబడినదై యుండ, వానరః = హనుమంతుడు, చి_న్తయామాస = ఆలోచించెను, సమాక్షి_ప్తః = పట్టుకొనబడినవాడై, సహసా = వెంటనే, పఙ్గూకృత

పరాక్రమః = కుంటుపడినపరాక్రమము గలవాడై, సాగరే = సముద్రమునందు, ప్రతిలోమేన = ప్రతికూలమైన, వాతేన = వాయువుచేత, మహా నౌ రివ = ఓడవలె. అస్మి = అయితిని.

తా॥ సింహిక తన నీడను పట్టుకొనిన వెంటనే హనుమంతుడు కుంటుపడిన పరాక్రమము గలవాడై, బలము కోల్పోయి ప్రతికూల వాయువుచే సముద్రమధ్యయందలి ఓడవలె నైతి నని విచారించెను.

శ్లో॥ తిర్య గూర్ధ్వ మధ శ్చైవ వీక్షమాణ స్తతః కపిః।
దదర్శ సుమహ త్సత్త్వ ముత్థితం లవణాంభసి॥ ౧౭౭
తద్దృష్ట్వా చింతయామాస మారుతి ర్వికృతాననమ్।
కపిరాజేన కథితం సత్త్వ మద్భుత దర్శనమ్॥ ౧౭౮
ఛాయాగ్రాహి మహావీర్యం త దిదం నాత్రసంశయః।

టీ॥ తతః = అటుతరువాత, కపిః = హనుమంతుడు. తిర్యక్ = అడ్డముగను, ఊర్ధ్వం = పైకి. అధశ్చైవ = క్రిందికిని. వీక్షమాణః = చూచుచున్నవాడై. లవణాంభసి = సముద్రమందు, ఉత్థితం = పుట్టినటువంటి, సుమహత్ = గొప్పదైన, సత్త్వం = జంతువును, దదర్శ = చూచెను. మారుతిః = హనుమంతుడు. వికృతాననం = వికారమగు ముఖముగలిగిన, తత్ = ఆజంతువును, దృష్ట్వా = చూచి, కపిరాజేన = సుగ్రీవునిచే, కథితం = చెప్పబడినదియు, అద్భుతదర్శనం = ఆశ్చర్యముగా కనబడుచున్న, తత్ = ఆ. సత్త్వం = జంతువు. మహావీర్యం = గొప్పపరాక్రమముగల, ఇదం = ఈ. ఛాయాగ్రాహి = ఛాయాగ్రాహి. అత్ర = ఈవిషయమున, నసంశయః = సంశయములేదు.

తా॥ తరువాత ఆంజనేయుడు అన్నివైపులను పరిశీలించినవాడై, సముద్రమునందు వికారమైన ముఖము గలిగి, గొప్పబలముగల ఛాయాగ్రాహి మృగమును జూచి ఇదివరలో సుగ్రీవుడు చెప్పిన ఛాయాగ్రాహి ఇదియే అయి యుండవచ్చును. సందేహములేదు అని తలంచెను.

శ్లో॥ స తాం బుద్ధ్వార్థత త్త్వేన సింహికాం మతిమాన్ కపిః॥ ౧౭౯
వ్యవర్ధత మహాకాయః ప్రావృషీవ వలాహకః।

టీ॥ మతిమాన్ = బుద్ధిమంతుడైన. కపిః = ఆంజనేయుడు. తాం = దానిని. సింహికాం = సింహికగా. అర్థత త్త్వేన = యథార్థముచేత. బుద్ధ్వా = తెలిసికొని. ప్రావృషీ = వర్షాకాలమందు. వలాహక ఇవ = మేఘుడువలె. సః = ఆహనుమంతుడు. మహాకాయః = గొప్పశరీరము కలవాడై. వ్యవర్ధత = వృద్ధిపొందెను.

తా॥ బుద్ధిమంతు డగు హనుమంతుడు దానిని సింహికగా తెలిసికొని వాన కాలమందు మేఘుని వలె శరీరమును పెంచెను.

శ్లో॥ తస్య సా కాయ ముద్వీక్ష్య వర్ధమానం మహాకపేః॥ ౧౮౦
వక్త్రం ప్రసారయామాస పాతాళా న్తర సన్నిభమ్॥
ఘనరాజీవ గర్జ న్తీ వానరం సమభిద్రవత్॥ ౧౮౧

టీ॥ తస్య = ఆ. మహాకపేః = హనుమంతునియొక్క. వర్ధమానం = పెరిగిన. కాయం = శరీరమును. సా = ఆసింహిక ఉద్వీక్ష్య = చూచి ఘనరాజీవ = మేఘపంక్తివలె. గర్జ న్తీ = గర్జించుచు. పాతాళా న్తర సన్నిభం = పాతాళద్వారముతో సమానమైన. వక్త్రం = నోరును. ప్రసారయామాస = తెఱచెను. వానరం = హనుమంతునిగూర్చి. సమభిద్రవత్ = దుమికెను.

తా॥ ఆంజనేయుని పెరుగుచున్న శరీరమును చూచి మేఘగర్జారావమును చేయుచు, పాతాళబిల సదృశమైన నోరుతెఱచి, సింహిక హనుమంతుని పై దుమికెను.

శ్లో॥ స దదర్శ తత స్తస్యా వివృతం సుమహ న్ముఖమ్।
కాయమాత్రం చ మేధావీ మర్మాణి చ మహాకపిః॥ ౧౮౨

శ్లో॥ స తస్యా వివృతే వక్త్రే వజ్ర సంహననః కపిః।
సజ్ఞిప్య ముహు రాత్మానం నిష్పపాత మహాబలః॥ ౧౮౩

టీ॥ తతః = ఆటుతరువాత. సః = ఆహనుమంతుడు, సుమహత్ = గొప్ప దైన. వివృతం = తెరువబడిన. ముఖం = నోరును. దదర్శ = చూచెను, మేధావీ = బుద్ధిమంతుడైన. మహాకపిః = హనుమంతుడు. కాయమాత్రం చ = శరీరమును, మర్మాణి చ = అవయవములను దదర్శ = చూచెను, మహాబలః = గొప్పబలముగలవాడును, వజ్రసంహననః = వజ్రమువలె, దృఢకాయుడునైన. సః = ఆ, కపిః = ఆంజనేయుడు, వివృతే = తెరువబడిన. తస్యాః = ఆ సింహిక యొక్క వక్త్రే = నోటియందు, ఆత్మానం = తనను ముహుః = తిరిగి, సంక్షిప్య = క్లుప్తపరచుకొని, నిష్పపాత = పడెను.

తా॥ ఆంజనేయుడు పెద్ద పాతాళ బిలమువలె నున్న నోరు తెరచి యున్న సింహికయొక్క శరీర అవయవములను చూచి. మహాబలశాలి, వజ్రకాయుడు నైన హనుమంతుడుసూక్ష్మ శరీరుడై సింహిక నోట చొరబడెను

శ్లో॥ ఆస్యే తస్యా నిమజ్జన్తం దదృశు స్సిద్ధచారణాః।
గ్రస్యమానం యథా చన్ద్రం పూర్ణం పర్వణి రాహుణా॥ ౧౮౪

టీ॥ సిద్ధచారణాః = సిద్ధులు చారణులు, తస్యాః = ఆసింహికయొక్క ఆస్యే = నోటియందు, నిమజ్జన్తం = పడిన ఆంజనేయుని. పర్వణి = పర్వమునందు. రాహుణా = రాహువుచే. గ్రస్యమానం = మ్రింగబడిన పూర్ణంచన్ద్రంయథా = నిండుచంద్రునివలెనే, దదృశుః = చూచిరి,

తా॥ ఆ సింహిక నోటియందున్న ఆంజనేయుని సిద్ధచారణాదులు పూర్ణిమా పర్వమునందు రాహుగ్రస్థమైన పూర్ణచంద్రునివలెనే చూచిరి.

శ్లో॥ తత స్తస్యా నఖై స్తీక్ష్ణై ర్మర్మా ణ్యుత్కృత్య వానరః।
ఉత్పపా తాథ వేగేన మన స్సమ్పాత విక్రమః॥ ౧౮౫

టీ॥ తతః = అనంతరము, వానరః = హనుమంతుడు, తస్యాః = ఆ, సింహికయొక్క, మర్మాణి = అవయవమర్మములను, తీక్ష్ణైః = తీవ్రములైన, నఖైః = గోళ్ళచేత ఉత్కృత్య = చీల్చి, అథ = అటు తరువాత, వేగేన = వేగముతో, ఉత్పపాత = పై కెగిరిపడెను.

తా॥ తరువాత ఆంజనేయుడు ఆ సింహికయొక్క అవయవ మర్మములను తన వాడియైన గోళ్ళతో చీల్చి పిమ్మట వెంటనే మనోగమన వేగముతో దాని నోటినుండి బయల్వెడలెను.

శ్లో॥ తాం తు దృష్ట్వా చ ధృత్యా చ దాక్షిణ్యేన నిపాత్య చ।
స కపిప్రవరో వేగా ద్వవృధే పున రాత్మవాన్॥ ౧౮౬
హృతహృత్సా హనుమతా పపాత విధురాఽమ్భసి।

టీ॥ సః = ఆ, కపిప్రవరః = హనుమంతుడు, తాం = ఆసింహికను, దృష్ట్వా చ = సూక్ష్మదృష్టిచేతను, తు = మరియు, ధృత్యా చ = ధైర్యముచేతను, దాక్షిణ్యేనచ = సమర్థతచేతను, నిపాత్య = సంహరించి పునః = తిరిగి, వేగాత్ = వేగముగా, ఆత్మవాన్ = స్వస్వరూపుడై, వవృధే = వృద్ధిపొందెను, సా = ఆసింహిక, హనుమతా = హనుమంతునిచేత, హృతహృత్ = చంపబడినదై, విధురా = ఆర్తురాలై, అమ్భసి = ఉదకమునందు, పపాత = పడెను.

తా॥ హనుమంతుడు సింహికను, సూక్ష్మదృష్టి, ధైర్యము, సామర్థ్యముల నుపయోగించి సంహరించి తిరిగి మహావేగముతో తన నిజరూపమును పొందెను. సింహిక ఆంజనేయునిచే చంపబడి సముద్రపునీటియందు పడి పోయెను.

శ్లో॥ తాం హతాం వానరే ణాశు పతితాం వీక్ష్య సింహికామ్॥ ౧౮౭
భూతా న్యాకాశచారీణి త మూచుః ప్లవగోత్తమమ్।

టీ॥ వానరేణ = హనుమంతునిచేత, హతాం = సంహరించబడినదై, ఆశు = శీఘ్రముగా, పతితాం = పడినటువంటి, తాం = ఆ, సింహికాం = సింహికను, వీక్ష్య = చూచి, ఆకాశచారీణి = ఆకాశసంచారములగు, భూతాని = సర్వభూతములు, ప్లవగోత్తమం = వానరశ్రేష్ఠుడైన, తం = ఆహనుమంతునిగూర్చి, ఊచుః = పలికిరి.

తా॥ హనుమంతునిచే చంపబడి నీటియందు పడిన సింహికను చూచిన ఆకాశమున సంచరించు సమస్తభూతములు అత్యాశ్చర్యముతో హనుమంతుని గూర్చి యిట్లు పలికెను.

శ్లో॥ భీమ మద్య కృతం కర్మ మహ త్సత్త్వం త్వయాహతమ్॥ ౧౮౦
సాధయార్థ మభిప్రేత మరిష్టం ప్లవతాంవర।

టీ॥ ప్లవతాంవర = కపిశ్రేష్ఠ! అద్య = ఇప్పుడు, త్వయా = నీచేత మహత్సత్త్వం = గొప్పదైన సింహిక యను జంతువు, హతం = చంపబడినది, భీమం = భయంకరమైన, కర్మ = కార్యము, కృతం = చేయబడినది, అరిష్టం = శుభం, అభిప్రేతం = పొందబడినది, అర్థం = ప్రయోజనమును, సాధయ = సాధించుము,

తా॥ కపిశ్రేష్ఠ! చేయశక్యముగాని భయంకరమైన కార్యము నొనర్చి ఈ గొప్పదగు సింహిక యను రాక్షసమృగమును సంహరించినావు. ఇప్పుడు నీకు శుభము గలుగును. నీకార్యసిద్ధిని సాధించుము.

శ్లో॥ యస్య త్వేతాని చత్వారి వానరేన్ద్ర యథా తవ॥ ౧౮౧
ధృతి ర్దృష్టి ర్మతి ర్దాక్ష్యం స్వకర్మసు న సీదతి।

టీ॥ వానరేన్ద్ర = వానరశ్రేష్ఠ! తవ యథా = నీకువలె, యస్య = ఎవనికి ధృతిః = ధైర్యము. దృష్టిః = సూక్ష్మదృష్టి. మతిః = బుద్ధి. దాక్ష్యం = సమర్థత్వము, ఏతాని = ఈ. చత్వారి = నాలుగు (ఉండునో) తస్య = అతనికి, స్వకర్మసు = స్వకీయకార్యములందు, న సీదతి = నాశనముండదు.

తా॥ ఆంజనేయ! నీకువలె ధైర్యము. సూక్ష్మదృష్టి అవగాహనబుద్ధి. సమర్థత్వము. యీ నాలుగు గుణములు ఎవనియందుండునో అతనికి ఎట్టి కార్యభంగములుండవు. సింహికకు ఈ నాల్గు గుణములు ఉన్నను దుష్టలక్ష్యము ఉండుటవలన లోకకళ్యాణకాంక్ష గల హనుమంతుని చే చంపబడినది.

* హనుమంతుడు లంకాతీరమును జూచుట *

శ్లో॥ సతైస్సంభావితః పూజ్యః ప్రతిపన్న ప్రయోజనః॥ ౧౯౦
జగామాకాశ మావిశ్య పన్నగాశనవత్కపిః।

టీ॥ సః = ఆ హనుమంతుడు, తైః = ఆ ఆకాశసంచారులచేత. సంభావితః = గౌరవించబడినవాడును, ప్రతిపన్నప్రయోజనః = పొందబడిన ప్రయోజనమును కలవాడై. పూజ్యః = పూజ్యుడయ్యెను. కపిః = హనుమంతుడు, పన్నగాశనవత్ = గరుత్మంతునివలెనే. ఆకాశం = ఆకాశమును. ఆవిశ్య = ప్రవేశించి. జగామ = వెళ్ళెను.

తా॥ ఆ హనుమంతుడు, సింహికావధరూప కార్యసాధకుడై సిద్ధచారణులచే పూజింపబడి ఆకసమున గరుత్మంతునివలె వెళ్ళెను.

శ్లో॥ ప్రాప్తభూయిష్ఠ పారస్తు సర్వతః ప్రతిలోకయన్॥ ౧౯౧
యోజనానాం శతస్యాన్తే వనరాజిం దదర్శసః।

టీ॥ సః = అహనుమంతుడు, సర్వతః = అంతట, ప్రతిలోకయన్ = చూచుచున్నవాడగుచు, ప్రాప్తభూయిష్ఠపారస్తు - ప్రాప్త = పొందబడిన, భూయిష్ఠ = విస్తారమైన, పారస్తు = అంతముగలవాడగుచును యోజనానాం = ఆమడలయొక్క, శతస్య = నూరుయొక్క, అన్తే = అంతమందు, వనరాజిం = అరణ్యసమూహమును. దదర్శ = చూచెను

తా॥ హనుమంతుడు అన్నిదిక్కులకు చూపులు సారించుచు నూరామడల సముద్రమును దాటి తీరమున నున్న అరణ్యసమూహమును చూచెను.

శ్లో॥ దదర్శ చ పతన్నేవ వివిధద్రుమ భూషితమ్॥ ౧౬-౨
ద్వీపం శాఖామృగశ్రేష్ఠో మలయోపవనాని చ।

టీ॥ శాఖామృగశ్రేష్ఠః = వానరశ్రేష్ఠుడైన హనుమంతుడు. పతన్నేవ = భూమిపై దిగుచున్నవాడగుచు, వివిధద్రుమభూషితం — వివిధ = అనేకములైన, ద్రుమ = వృక్షములచే, భూషితం = అలంకరించబడిన ద్వీపం = లంకాద్వీపమును. మలయోపవనానిచ-మలయ = మలయపర్వతముయొక్క, ఉపవనానిచ = ఉద్యానవనములను, దదర్శ = చూచెను

తా॥ హనుమంతుడు శతయోజన పరిమిత సముద్రమును దాటి క్రిందికి దిగుచు, సమీపము నందలి లంకాద్వీపమును మలయపర్వత ఉపవనములను చూచెను.

శ్లో॥ సాగరం సాగరానూపం సాగరానూపజాన్ ద్రుమాన్ ౧౬-౩
సాగరస్య చ పత్నీనాం ముఖాన్యపి విలోకయన్।
స మహామేఘ సఙ్కాశం సమీక్ష్యాత్మాన మాత్మవాన్॥ ౧౬-౪
నిరుద్ధ స్తమి వాకాశం చకార మతిమా న్మతిమ్।

టీ॥ సః = ఆహనుమంతుడు, సాగరం = సముద్రమును, సాగరానూపం = సముద్రతీరప్రాంతమును, సాగరానూపజాన్ = సముద్రతీరజలప్రదేశమునందు మొలచిన, ద్రుమాన్ = వృక్షములను, సాగరస్య = సముద్రునియొక్క, పత్నీనాం = భార్యలయొక్క, ముఖాన్యపిచ = ముఖములను, విలోకయన్ = చూచుచున్నవాడగుచు, ఆత్మవాన్ = ఆత్మస్వరూపుడైన, సః = ఆఆంజనేయుడు, మేఘసఙ్కాశం = మేఘునితో సమానమైన, ఆత్మానం = తనను, సమీక్ష్య = చూచుకొని, మతిమాన్ = బుద్ధిగలవాడై, ఆకాశం = ఆకాశమును, నిరుద్ధస్తమివ = అరికట్టుచున్నదానిని వలె, మతిం = బుద్ధిని, చకార = చేసెను.

తా॥ ఆ హనుమంతుడు లంకాద్వీపసమీపమున క్రిందకు దిగుచు, ఒక పర్యాయము సముద్రమును, సముద్రతీర ప్రదేశమును, తీరజలప్రదేశము లందు పెరిగిన వృక్షములను, సముద్రుని భార్యలగు నదీమతల్లుల ముఖముల (నదీముఖప్రదేశముల) ను, లంకాద్వీపమును, మేఘసంకాశ మైన తన శరీరమును చూచి, ఈ శరీరస్థితి లంకాప్రవేశమునకు విరుద్ధ మని తలంచెను.

శ్లో॥ కాయవృద్ధిం ప్రవేగం చ మమ దృష్ట్వైవ రాక్షసాః। ౧౯౫
మయి కౌతూహలం కుర్యు రితి మేనే మహాకపిః।
తత శ్శరీరం సఙ్క్షిప్య తన్మహీధర సన్నిభమ్॥ ౧౯౬
పునః ప్రకృతి మాపేదే వీతమోహ ఇ వాత్మవాన్।

టీ॥ మహాకపిః = ఆంజనేయుడు, ఇతి = ఈప్రకారము, మేనే = తలచెను, మమ = నాయొక్క, కాయవృద్ధిం = పెరిగిన పెద్దశరీరమును, ప్రవేగంచ = పెద్దవేగమును, రాక్షసాః = రాక్షసులు, దృష్ట్వైవ = చూచియే, మయి = నాయందు, కౌతూహలం = కుతూహలమును, కుర్యుః = చేయుదురు, తతః = తరువాత, మహీధరసన్నిభం = పర్వతముతోసమానమైన, తత్ = ఆ, శరీరం = శరీరమును, సంక్షిప్య = సంచితపరచి, వీతమోహః = మోహములేనటువంటి, ఆత్మవాన్ ఇవ = ఆత్మజ్ఞానివలె, ప్రకృతిం = నిజాకారమును, పునః = తిరిగి, ఆపేదే = పొందెను.

తా॥ ఆంజనేయుడు తన పెద్ద రూపమును, పెద్దవేగమును, రాక్షసులు చూచిన వెంటనే గుర్తించెదరని తలంచి, పర్వత సదృశమైన తన శరీరమును క్లుప్తముగా చేసికొని మోహరహితుడైన ఆత్మజ్ఞానివలె నిజ రూపమును పొందెను.

శ్లో॥ తద్రూప మతి సఙ్క్షిప్య హనుమాన్ ప్రకృతౌ స్థితః॥ ౧౯౭
త్రీన్ క్రమానివ విక్రమ్య బలి వీర్యహరో హరిః।

టీ॥ హనుమాన్ = ఆంజనేయుడు, ప్రకృతౌ = ప్రకృతి (నిజస్థితి) యందు స్థితః = ఉన్నవాడై. తద్రూపం = ఆస్వరూపమును. అతిసంక్షిప్య = బాగుగా సంకుచితపరచి. త్రీన్‌క్రమాన్ = మూడువిధములుగను, విక్రమ్య = విక్రమించి, బలివీర్యహరః = బలిచక్రవర్తి బలమును హరించిన, హరి రివ = విష్ణువవలె, స్థితః = ఉండెను.

తా॥ త్రివిక్రమ రూపుడగు విష్ణువు మూడువిధములు (వామన, విశ్వరూప సహజ) రూపములుధరించి బలిచక్రవర్తి యొక్క బలమును హరించినట్లు ఆంజనేయుడు తనభీమకాయమును బాగుగా సంకుచితపరచి ప్రకృతస్థితు డయ్యెను.

శ్లో॥ స చారు నానావిధరూపధారీ పరం సమాసాద్య సముద్రతీరమ్॥౧౫౦
పరై రశక్యం ప్రతిపన్నరూప స్సమీక్షితాత్మా సమవేక్షితార్థః॥

టీ॥ సః = ఆహనుమంతుడు, చారునానారూపధారీ-చారు = సుందరమైన. నానావిధ = అనేకవిధములైన. రూపధారీ = ఆకారములను ధరించువాడై. పరం = ఆవలిదైన, సముద్రతీరం = సముద్రపుటొడ్డును, సమాసాద్య = పొంది, ప్రతిపన్నరూపః = స్వభావసిద్ధమైన రూపముగలవాడగుచు, సమీక్షితాత్మా = సమీక్షిత అంతరాత్మ గలవాడై సమవేక్షితార్థః = నిరూపితకార్యముకలవాడై, పరైః = శత్రువులచేత అశక్యః = శక్యముకానివాడుగ అయ్యెను.

తా॥ హనుమంతుడు నానావిధరూపములను ధరించువాడై సముద్రతీరమును పొంది. శత్రువులకు చూడ వీలుగాని రూపమును పొందెను.

శ్లో॥ తత స్స లమ్బస్య గిరే సమృద్ధే విచిత్రకూటే నిపపాత కూటే॥ ౧౫౧
సకేతకోద్దాలక నారికేరే మహాద్రికూట ప్రతిమో మహాత్మా॥

టీ॥ తతః = అటుతరువాత, సకేతకోద్దాలకనారికేరే = మొగలి, విరిగి, కొబ్బరి చెట్లతోకూడినదియు, విచిత్రకూటే = విచిత్రములైనశిఖరములు గలదియు, సమృద్ధే = సమృద్ధమైనదియునగు లంబస్యగిరేః = సువేలా

పర్వతముయొక్క, కూటే = శిఖరమునందు, మహాద్రికూటప్రతిమః = గొప్పపర్వతశిఖరముతో సమానమైనవాడును, మహాత్మా = గొప్పవాడునగు, సః = ఆఆంజనేయుడు. నిపపాత = దిగెను.

తా॥ చిత్రాతిచిత్రములైన శిఖరములు గలిగి నానావిధములగుచెట్లతోను కూడియున్న ఆ సువేలాపర్వత శిఖరముమీద పర్వతశిఖర సదృశుడగు ఆ హనుమంతుడు దిగెను.

శ్లో॥ తత స్తు సంప్రాప్య సముద్రతీరమ్।
సమీక్ష్య లఙ్కాం గిరివర్య మూర్ధ్ని।
కపి స్తు తస్మి న్నిపపాత పర్వతే
విధూయ రూపం వ్యథయన్ మృగ ద్విజాన్॥ ౨౦౦

శ్లో॥ స సాగరం దానవ పన్నగాయుతం
బలేన విక్రమ్య మహోర్మి మాలినమ్।
నిపత్య తీరే చ మహోదధే స్తదా
దదర్శ లఙ్కా మమరావతీ మివ॥ ౨౦౧

టీ॥ తతః = అటుతరువాత, కపిః = ఆంజనేయుడు, సముద్రతీరం = సముద్రపు ఒడ్డును, సంప్రాప్య = పొంది గిరివర్యమూర్ధ్ని = సువేలాపర్వతముయొక్క శిరస్సునందు. లఙ్కాం తు = లంకను, సమీక్ష్య = చూచి, తస్మిన్ = ఆ, పర్వతే = పర్వతమునందు, రూపం = శరీరమును, విధూయ = విదలించి, మృగద్విజాన్ = మృగములను పక్షులను, వ్యథయన్ = బాధపెట్టుచున్నవాడై, నిపపాత = దిగెను.

తా॥ తరువాత ఆంజనేయుడు సముద్రతీరమును చేరి, సువేలాపర్వతముయొక్క శిఖరమున శరీరమును విదలించి ఆపర్వతమునందలి మృగములను పక్షులను భయపెట్టుచు, అమరావతివలె ప్రకాశించుచున్న లంకను చూచెను.

శ్రీమద్వాల్మీకి రామాయణాంతర్గత సుందరకాణ్డే
ప్రథమ స్సర్గ స్సమాప్తః॥

# ద్వితీయ స్సర్గః॥

## * హనుమంతుడు లంకాపురి వెలుపలి ఉద్యానవనంబుల విహరించుట *

శ్లో॥ స సాగర మనా ధృష్య మతిక్రమ్య మహాబలః।
త్రికూటశిఖరే లఙ్కాం స్థితాం స్వస్థో దదర్శహ॥ ౧

టీ॥ మహాబలః = గొప్పబలవంతుడైన. సః = ఆహనుమంతుడు, అనాధృష్యం = ఇతరులచే దాటశక్యముగాని. సాగరం = సముద్రిమును, అతిక్రమ్య = దాటి, త్రికూటశిఖరే = త్రికూటపర్వత శిఖరమందు. స్థితాం = ఉన్న, లంకాం = లంకను, స్వస్థః = స్థిమితముగా కూర్చున్నవాడై; దదర్శహ = చూచెను.

తా॥ మహాబలశాలి యగు ఆంజనేయుడు దుస్సాధ్య మైన సముద్రిమును దాటి త్రికూటపర్వత శిఖరమున స్వస్థుడై కూర్చుండి లంకాపట్టణమును చూచెను.

శ్లో॥ తతః పాదప ముక్తేన పుష్పవర్షేణ వీర్యవాన్।
అభివృష్ట స్థ్సిత స్తత్రి బభౌ పుష్పమయో యథా॥ ౨

టీ॥ తతః = అటుతరువాత, వీర్యవాన్ = పరాక్రమవంతుడైన అంజనేయుడు, పాదపముక్తేన = చెట్లనుండి విడువబడిన, పుష్పవర్షేణ = పుష్పముల వర్షముతో, అభివృష్టః = కప్పబడినవాడై, తత్రి = అక్కడ, పుష్పమయోయథా = పుష్పమయుని వలెనే, స్థితః = ఉన్నవాడై, బభౌ = ప్రకాశించెను.

తా॥ పరాక్రిమశాలి యగు హనుమంతుడు పర్వతముపై వర్షమువలె పడుచున్న చెట్లపుష్పములతో కప్పబడి పుష్పమయ మగు వానరాకారముతో ప్రకాశించెను.

శ్లో॥ యోజనానాం శతం శ్రీమాం స్తీర్త్వా ప్యుత్తమ విక్రమః।
అనిశ్వసన్ కపిస్తత్ర న గ్లాని మధిగచ్ఛతి॥ ౩

టీ॥ ఉత్తమవిక్రమః = ఉత్కృష్టమైన పరాక్రమము గలవాడును, శ్రీమాన్ = శోభాయుక్తుడునైన, కపిః = ఆంజనేయుడు, యోజనానాం శతం = నూరామడదూరము. తీర్త్వాపి = దాటికూడ, అనిశ్వసన్ = నిట్టూర్పులేనివాడై, తత్ర = అక్కడ. గ్లానిం = కష్టమును. నాధిగచ్ఛతి = పొందుటలేదు.

తా॥ గొప్పపరాక్రమవంతుడైన ఆంజనేయుడు నూరామడ వెడల్పుగల సముద్రమును దాటి యుండియు వేడినిట్టూర్పులు విడచుటగాని శ్రమతో కళావిహీనత గాని పొందడాయెను.

శ్లో॥ శతా న్యహం యోజనానాం క్రమేయం సుబహూ న్యపి।
కిం పున స్సాగర స్యాన్తం సఙ్ఖ్యాతం శతయోజనమ్॥ ౪

టీ॥ అహం = నేను, సుబహూన్ = చాలాయెక్కువమైన, యోజనానాం—శతాన్యపి = వందలకొలది ఆమడలనైన, క్రమేయం = దాటుదును, సాగరస్య = సముద్రునియొక్క అంతం = చివరను శతయోజనం = నూరామడ. సంఖ్యాతం = చెప్పబడుట, కింపునః = ఏమిచెప్పేది।

తా॥ అంజనేయుడు సముద్రమును దాటి ఎన్ని ఆమడల దూరమునైన అవలీలగా దాటగల నాకు నూరామడ సముద్రము దాటుట ఒకలెక్కా! అని తలంచుచుండెను.

శ్లో॥ స తు వీర్యవతాం శ్రేష్ఠః ప్లవతా మపి చోత్తమః।
జగామ వేగవా న్లఙ్కాం లఙ్ఘయిత్వా మహోదధిమ్॥ ౫

టీ॥ వీర్యవతాం = పరాక్రమవంతులలో. శ్రేష్ఠః = శ్రేష్ఠుడును, ప్లవతాంతు = వానరులలో, ఉత్తమశ్చ = ఉత్తముడునైన, సః = అఆంజనేయుడు,

వేగవాన్ = వేగముకలవాడై. మహోదధిం = సముద్రమును. లంఘయిత్వా = దాటి, లంకాం = లంకాపురినిగూర్చి, జగామ = వెళ్ళెను.

తా॥ మహా పరాక్రమవంతుడైన ఆంజనేయుడు సముద్రమును దాటి లంకకు వెళ్ళెను.

శ్లో॥ శాద్వలాని చ నీలాని గన్ధవన్తి వనాని చ।
గణ్డవన్తి చ మధ్యేన జగామ నగవన్తి చ॥ ౬
శైలాంశ్చ తరుసఞ్ఛన్నాన్ వనరాజీశ్చ పుష్పితాః।
అభిచక్రామ తేజస్వీ హనుమాన్ ప్లవగర్షభః॥ ౭
స తస్మిన్నచలే తిష్ఠన్ వనాన్యుపవనాని చ।
స నగాగ్రే చ తాం లఙ్కాం దదర్శ పవనాత్మజః॥ ౮

టీ॥ నీలాని = నల్లనైన, శాద్వలాని = పచ్చికబయళ్ళను, గన్ధవన్తి = పరిమళములుగలిగినట్టియు, మధ్యేన = మధ్యభాగమున, గణ్డవన్తి చ = బండలుగలిగిన, నగవన్తి = పర్వతములుగలిగిన, వనాని చ = అరణ్యములగూర్చియు, జగామ = వెళ్ళెను - తేజస్వీ = మహాతేజశ్శాలియైన, ప్లవగర్షభః = వానరశ్రేష్ఠుడైన, హనుమాన్ = ఆంజనేయుడు, తరుసఞ్ఛన్నాన్ = వృక్షములతో కప్పబడిన, శైలాంశ్చ = పర్వతములను, పుష్పితాః = పుష్పించిన, వనరాజీశ్చ = అరణ్యసమూహములను గూర్చి, అభిచక్రామ = అనుసరించి వెళ్లుచుండెను. పవనాత్మజః = వాయుకుమారుడైన, సః = ఆహనుమంతుడు, తస్మిన్ = ఆ, అచలే = పర్వతమందు, తిష్ఠన్ = ఉన్నవాడై, వనాని = అరణ్యములను, ఉపవనాని చ = ఉద్యానవనములను, దదర్శ = చూచెను, సః = ఆహనుమంతుడు, నగాగ్రే = పర్వతశిఖరమునందు, తిష్ఠన్ = ఉన్నవాడై, లఙ్కాం = లంకను, దదర్శ = చూచెను

తా॥ మహాతేజస్వి యగు హనుమంతుడు, నల్లని పచ్చిక బయళ్లను. పరిమళించుచున్నట్టియు పెద్దపెద్ద బాడలుగల పర్వతములు గల అరణ్యములను, దట్టమైన వృక్షములచే కూడియున్న పర్వతములను, బాగుగా పుష్పించిన అరణ్యముల గూర్చి అనుసరించి వెళ్లుచు ఆ పర్వతశిఖరమునం దున్న వాడై లంకను చూచెను.

శ్లో॥ సరళాన్ కర్ణికారాం శ్చ ఖర్జూరాం శ్చ సుపుష్పితాన్।
ప్రియాళాన్ ముచుళిన్దాం శ్చ కుటజాన్ కేతకా నపి॥ ౯
ప్రియఙ్గూన్ గన్ధపూర్ణాం శ్చ నీపా న్సప్తచ్ఛదాం స్తథా।
అసనాన్ కోవిదారాం శ్చ కరవీరాం శ్చ పుష్పితాన్॥ ౧౦
పుష్పభార నిబద్ధాం శ్చ తథా ముకులితా నపి।
పాదపాన్ విహగాకీర్ణాన్ పవనాధూత మస్తకాన్॥ ౧౧
హంస కారండ వాకీర్ణా వాపీః పద్మోత్పలాయుతాః।
ఆక్రీడాన్ వివిధా న్రమ్యాన్ వివిధాం శ్చ జలాశయాన్॥ ౧౨
సన్తతాన్ వివిధై ర్వృక్షై స్సర్వర్తు ఫలపుష్పితైః।
ఉద్యానాని చ రమ్యాణి దదర్శ కపికుఞ్జరః॥ ౧౩

టీ॥ సరళాన్ = తెల్లతెగడ చెట్లను. కర్ణికారాన్ = కొండగోగులను. సుపుష్పితాన్ = యోగ్యముగా పుష్పించిన, ఖర్జూరాం శ్చ = ఖర్జూరపు చెట్లను, ప్రియాళాన్ = మోరటిచెట్లను. ముచుళిన్దాన్ = నిమ్మచెట్లను, కుటజాన్ = గోరింట్లను, కేతకానపి = మొగలిపొదలను. గంధపూర్ణాన్ = పరిమళయుక్తమైన, ప్రియంగూన్ = పిప్పలచెట్లను. నీపాన్ = కడిమిచెట్లను, తథా = ఆప్రకారముగా. సప్తచ్ఛదాన్ = ఏడాకులఅరటిచెట్లను, అసనాన్ = వేగిసచెట్లను, కోవిదారాంశ్చ = కాంచనవృక్షములను, పుష్పితాన్ = పుష్పించిన, కరవీరాంశ్చ = గన్నేరుచెట్లను. పుష్పభారనిబద్ధాం శ్చ = పుష్పభారముచే వంగినట్టియు, తథా = ఆప్రకారముగా, ముకుళితానపి = ముసికొనియున్న వైనను, పవనాధూతమస్తకాన్ = వాయువుచేత కదల్చబడుచున్నతలలుగలవియు, విహగాకీర్ణాన్ = పక్షులతో

వ్యాప్తమైన, పాదపాన్ = చెట్లను, హంసకారండవాకీర్ణా = హంసలు, బెగ్గురుపక్షులతో వ్యాప్తమైనటువంటి, పద్మోత్పలాయుతాః = పద్మములు నల్లకలువలచే కూడియున్న, వాపీః = దిగుడుబావులు, ఆక్రీడాన్ = క్రీడించతగినటువంటియు, వివిధాన్ = అనేకములైనటువంటి, రమ్యాని చ = సుందరములైనటువంటి, జలాశయాన్ = చెరువులను, కపికుఞ్జరః = హనుమంతుడు, సర్వర్తు ఫల పుష్పితైః = సర్వఋతువులయందు ఫలపుష్పములుకలిగిన, వివిధైః = అనేకములైన, వృక్షైః = వృక్షములచేత, సంతతాన్ = కలిగియున్నటువంటి, రమ్యాణి = సుందరములైనటువంటి, ఉద్యానాని చ = ఉద్యానవనములను, దదర్శ = చూచెను.

తా॥ ఆహనుమంతుడు అకొండయందు బాగా పుష్పించినవియు, ఫలించినవియు, చిత్రాతిచిత్రములైన నానావిధములైన సరళ కర్ణికాది వృక్షములను వాటిపై వివిధములైన పక్షుల ధ్వనులతోను కమలోత్పలాది పుష్ప సముచ్చయంబులతోను కూడియున్న నడబావులు, జలాశయముల తోను సొంపువంపులుగా వివిధస్థితుల నుండు విహారస్థలాలతోను ఉన్న ఉద్యానవనములయొక్క సొగసును చూచెను.

* హనుమంతుడు లంకను చూచుట *

శ్లో॥ సమాసాద్య చ లక్ష్మీవాన్ లఙ్కాం రావణపాలితామ్।
పరిఘాభి స్సపద్మాభి స్సోత్పలాభి రలఙ్కృతామ్॥ ౧౪
సీతాపహరణార్థేన రావణేన సురక్షితామ్।
సమన్తా ద్విచరద్భి శ్చ రాక్షసై రుగ్ర ధన్విభిః॥ ౧౫
కాఞ్చనే నావృతాం రమ్యాం ప్రాకారేణ మహాపురీమ్।
గృహైశ్చ గ్రహసఙ్కాశై శ్శారదా మ్బుద సన్నిభైః॥ ౧౬
పాణ్డురాభిః ప్రతోళీభి రుచ్చాభి రభిసంవృతామ్।
అట్టాలక శతాకీర్ణాం పతాక ధ్వజమాలినీమ్॥ ౧౭
తోరణైః కాఞ్చనై ర్దివ్యై ర్లతాపఙ్క్తివిచిత్రితైః।
దదర్శ లఙ్కాం హనుమాన్ దివి దేవపురీ మివ॥ ౧౮

టీ॥ లక్ష్మీవాన్ = శోభాయుక్తుడైన, హనుమాన్ = ఆంజనేయుడు. స పద్మాభిః = పద్మములతో కూడియున్నదియు, సోత్పలాభిః = నల్లకలువలచే కూడియున్నదియు, పరిఘాభిః = అగడ్తలతో, అలంకృతాం = అలంకరింపబడి యున్నటువంటియు. సీతాపహరణార్థేన = సీతను తెచ్చుటకు కారణమైన, రావణేన = రావణునిచేత. సురక్షితాం = రక్షింపబడుచున్నదియు. సమన్తాత్ = అంతట, విచరద్భిః = సంచరించుచున్నట్టియు, ఉగ్రధన్విభిః = తీక్ష్ణధనుస్సులుగల. రాక్షసైశ్చ = రాక్షసులచేతను, సురక్షితాం = సుయోగ్యముగా కాపాడబడుచున్నదియు గ్రహసంకాశైః = గ్రహములతో సమానములైనట్టియు, శారదాంబుద సన్నిభైః = శరత్కాలమేఘములతోసమానములైన, గృహైశ్చ = గృహములతోను, కాంచనేన = బంగారువికారమైన, ప్రాకారేణ = ప్రాకారముల చేత, ఆవృతాం = కూడియున్నటువంటియు, రమ్యాం = సుందరమైనటు వంటియు. మహాపురీం = గొప్పపురమైనటువంటియు, పాణ్డురాభిః = తెల్లనైన. ఉచ్చాభిః = ఉన్నతములైన, ప్రతోళీభిః = వీధులతో, అభిసంవృతాం = అంతటకూడియున్నటు వంటియు. అట్టాలకశతాకీర్ణాం = వందలకొలది కోటబురుజులచేత, ఆకీర్ణాం = వ్యాప్తమైయున్నవంటియు పతాకధ్వజమాలినీం = పతాకములు జెండాలుమాలలుగా కట్టియున్నట్టియు, కాంచనైః = బంగారువికారములైనట్టియు, దివ్యైః = దేవతా సంబంధములైన, లతాపఙ్క్తివిచిత్రైః = విచిత్రములైన లతాపంక్తులుగలిగినట్టియు తోరణైః = బహిద్వారములచేత దివి = స్వర్గమందు దేవపురీమివ = అమరావతీ పురమువలె. నున్నటువంటియు, రావణపాలితాం = రావణునిచే పరిపాలింపబడుచున్న, లంకాం = లంకాపురిని సమాసాద్య = పొంది, దదర్శ = చూచెను.

తా॥ ఆంజనేయుడు రావణపరిపాలితమైన లంకను సమీపించి సీతాపహరణ కారణముగా సర్వస్థితుల భయాదులచే తగు కట్టుదిట్టములు చేసి తనవైభవప్రాభవాదులు చూపిన సీత మోహించునసే ఆశతో లంక

యందలి ఉద్యానవనములు మేడలు ఫలపుష్పాది సమస్త వస్తువులను చూచువారల దృష్టికి పూర్వముకంటె అతిమనోహరముగను అత్యాశ్చర్యకరముగను కనబడునట్లు సింగారించిన ఆ లంకాపట్టణము చుట్టు ఉన్న అగడ్తలు వాటి నీటియం దుండు పద్మములు కలువలు మొదలగు పూలసొంపులు రక్షణకొఱకు అంతట నిండియున్న మహావీరులగు రాక్షసులును వారుధరించు భయంకర ధనుస్సులును బంగారుకోటల అందను ఒక్కొక్కచోట నవగ్రహములవలె వక్రించి ఒకదానికొకటి ఎదురగునట్లు కట్టిన శరత్కాల మేఘ ధవళంబులైన ఉన్నత గృహంబులును విశాలములైన వీధులకు రెండువైపుల నున్న ఏడంతస్థుల తెల్లని మిద్దెల సొగసులును పొడవున ఫిరంగులు మొదలగు యుద్ధావసరవస్తువుల నుంచుకొని యుద్ధము చేయుటకు ఎత్తుగా మంచెలవలె నుండు కోటబురుజుల పనితనము మత్స్య మకర లతాకారములైన రేఖలుగల పతాకంబుల వరుసలు సింహద్వారమందు శిల్పులు చెక్కిన లతా పారావత శుక శునక మృగాకార ప్రతిమల చోద్యమును అత్యాశ్చర్యముగను అత్యుత్సాహముగను చూచి అమరావతిని మించిన వైభవము గల దీలంక యని తలచెను.

శ్లో॥ గిరిమూర్ధ్ని స్థితాం లఙ్కాం పాణ్డురై ర్భవనై శ్శుభైః।
దదర్శ స కపిశ్రేష్ఠః పుర మాకాశగం యథా॥ ౧౫

టీ॥ కపిశ్రేష్ఠః = వానరశ్రేష్ఠుడైన. సః = ఆహనుమంతుడు, పాణ్డురైః = తెల్లనైన. శుభైః = మంగళప్రదములైన, భవనైః = భవనముల చేత. గిరిమూర్ధ్ని = పర్వతశిఖరమునందు, స్థితాం = ఉన్న. లంకాం = లంకను, ఆకాశగం = ఆకాశమునుపొందియున్న. పురం యథా = పురమునువలె, దదర్శ = చూచెను.

తా॥ వానరశ్రేష్ఠుడైన హనుమంతుడు తెల్లనైన భవనములతో పర్వతశిఖరమున ఆకాశమునంటుచున్న పురమువలె నున్న ఆలంకాపురినిచూచెను.

శ్లో॥ పాలితాం రాక్షసేన్ద్రేణ నిర్మితాం విశ్వకర్మణా।
ప్లవమానా మి వాకాశే దదర్శ హనుమాన్ పురీమ్॥ ౨౦

టీ॥ హనుమాన్ = ఆంజనేయుడు. రాక్షసేన్ద్రేణ = రావణునిచే. పాలితాం = పరిపాలింపబడునదియు, విశ్వకర్మణా = విశ్వకర్మచేత. నిర్మితాం = నిర్మాణముచేయబడినదియు, అకాశే = ఆకాశమునందు. ప్లవమానా మివ స్థితాం = ఊగుచున్నట్లుగా నున్న, పురీం = లంకా పట్టణమును. దదర్శ = చూచెను.

తా॥ ఆంజనేయుడు విశ్వకర్మచేత సుందరముగా నిర్మింపబడి రాక్షసప్రభు వైన రావణునిచే పరిపాలింపబడుచు ఆకాశము నంటియున్న లంకా పట్టణమును చూచెను.

శ్లో॥ వప్ర ప్రాకార జఘనాం విపులామ్బు నవామ్బరామ్।
శతఘ్నీం శూల కేశాన్తా మట్టాల కావతంసకామ్॥ ౨౧
మనసేవ కృతాం లఙ్కాం నిర్మితాం విశ్వకర్మణా।
ద్వార ముత్తర మాసాద్య చిన్తయామాస వానరః॥ ౨౨

టీ॥ వప్రప్రాకారజఘనాం = కోట ప్రహరీగోడ లనెడి కటిప్రదేశము కలిగినటువంటియు, విపులామ్బు నవామ్బరాం—విపులాంబు = అగడ్త లనెడి, నవ = నూతనమైన, అంబరాం = వస్త్రములు కలిగినట్టియు, శతఘ్నిశూల కేశాన్తాం — శతఘ్ని = ఫిరంగులు, శూల = శూలములు, కేశాన్తాం = వెంట్రుకలకొనలుగా గలిగినటువంటియు, అట్టాల కావతంసకాం—అట్టాలక = కోటబురుజులనెడి, అవతంసకాం = శిరోభూషణములు కలిగి, విశ్వకర్మణా = విశ్వకర్మచేత, మనసేవకృతాం = మనసారా, నిర్మితాం = నిర్మించబడిన, లఙ్కాం = లంకను. ఉత్తరం = ఉత్తరపుదైన, ద్వారం = ద్వారమును, ఆసాద్య = పొంది. వానరః = హనుమంతుడు, చింతయామాస = ఆలోచించెను.

తా॥ మహనీయుడైన విశ్వకర్మచేత మహాఘనముగా కోటప్రాకారము లను కటిప్రదేశముగాను,అగడ్తలను నూతనవస్త్రములుగాను ఫిరంగులు శూలములు వెంట్రుకలకొనలుగాను, కోటబురుజులే అలంకారములు గాను కలిగినస్త్రీవలె నిర్మింపబడిన లంకాపట్టణముయొక్క ఉత్తరపు ద్వారమును చేరి హనుమంతుడు డాలోచించ నారంభించెను.

శ్లో॥ కైలాస శిఖరప్రఖ్యా మాలిఖన్తీ మి వామ్బరమ్।
డీయమానా మి వాకాశ ముచ్ఛ్రితై ర్భవనోత్తమైః॥ ౨౩
సమ్పూర్ణాం రాక్షసై ర్ఘోరై ర్నాగై ర్భోగవతీ మివ।
అచిన్త్యాం సుకృతాం స్పష్టాం కుబేరాధ్యుషితాం పురా॥ ౨౪
దంష్ట్రిభి ర్బహుభి శ్శూరై శ్శూల పట్టిస పాణిభిః।
రక్షితాం రాక్షసై ర్ఘోరై ర్గుహా మాశీవిషై రివ॥ ౨౫
తస్యా శ్చ మహతీం గుప్తిం సాగరం చ నిరీక్ష్య సః।
రావణం చ రిపుం ఘోరం చింతయామాస వానరః ౨౬

టీ॥ కైలాసశిఖరప్రఖ్యాం - కైలాసశిఖర = కైలాసపర్వతశిఖరముగా, ప్రఖ్యాం = చెప్పబడేటటు వంటియు, అమ్బరం = ఆకాశమును, అలిఖన్తీ మివ స్థితాం = నాకుచున్నదానివలె నున్నటు వంటియు, ఉచ్ఛ్రితైః = ఉన్నతములైన, భవనోత్తమైః = శ్రేష్ఠములైన భవనములచే, డీయమానా మివస్థితాం = తాకుచున్నదానివలె, నున్నదియు, ఘోరైః = దుష్టులైన, రాక్షసైః = రాక్షసులచేత, సమ్పూర్ణాం = అంతటనిండియున్నదియు. నాగైః = సర్పములచేత, భోగవతీమివ స్థితాం = భోగవతీనగరమువలె నున్నదియు, పురా = పూర్వమందు కుబేరాధ్యుషితాం-కుబేర = కుబేరునిచేత, అధ్యుషితాం = అధిష్ఠింపబడినదియు, అచిన్త్యాం = ఊహించ వీలుకానిదియు, సుకృతాం = యోగ్యముగా నిర్మింపబడినదియు, స్పష్టాం = స్పష్టమైనదియు, బహుభిః = అనేకములైన, దంష్ట్రిభిః = కోరలుకలిగినటువంటియు, శూలపట్టిస పాణిభిః - శూలపట్టిస = శూలములు పట్టసము లను ఆయుధములు

పాణిభిః = హస్తములయందు కలిగిన, శూరైః = శూరులైన, రాక్షసైః = రాక్షసులచేత, గుహాం = పుట్టను. ఆశీవిషైరివ = సర్పములచేతనువలెనే, రక్షితాం = రక్షింపబడుచున్నదియు, తస్యాః = ఆలంకాపురియొక్క, మహతీం = గొప్పదైన, గుప్తిం = రహస్యమును, సాగరం చ = సముద్రమును, నిరీక్ష్య = చూచి, సః = ఆ, వానరః = ఆంజనేయుడు, ఘోరం = క్రూరుడైన, రిపుం = శత్రువునైన, రావణం = రావణుని గూర్చి, చింతయామాస = ఆలోచించెను.

తా॥ ఆ హనుమంతుడు కైలాసపర్వత శిఖరమువలె ఉన్నత మయినటువంటియు, పూర్వకాలమున కుబేరునికి నిలయమైనదియు ఎత్తైనభవనములతో ఆకాశము నంటుచున్నదియు విషసర్పములచే పాతాళము రక్షింపబడుచున్నట్లు క్రూరరాక్షసులచే కాపాడబడుచున్నట్టియు, అలంకాపట్టణ రక్షణరహస్యస్థితిని చుట్టునున్న సముద్రమును చూచి, మహాక్రూరుడు శత్రువు నైన రావణునిగూర్చి హనుమంతుడు ఆలోచించెను.

* ఆంజనేయుడు లంకాపట్టణమును చూచి ఆశ్చర్యపడుట *

శ్లో॥ ఆగత్యాపీహ హరయో భవిష్యన్తి నిరర్థకాః।
నహి యుద్ధేన వై లఙ్కా శక్యా జేతుం సురైరపి॥ ౨౭

టీ॥ ఇహ = ఇచ్చటకు, హరయః = వానరులు, ఆగత్యాపి = వచ్చియున్న, నిరర్థకాః వై = కార్యసాధకులు కానివారు గనే, భవిష్యన్తి = కాగలరు, హి = ఏకారణమువలన, లఙ్కా = లంకాపట్టణము యుద్ధేన = యుద్ధముచేత. జేతుం = జయించేటందుకు, సురైరపి = దేవతలచేతకూడ, నశక్యా = శక్యమైనది కాదు.

తా॥ వానరులేవిధముగానైనా ఈలంకలో ప్రవేశించినప్పటికి కార్యసిద్ధులు కాలేరు. యుద్ధములో లంకాపట్టణమును జయించుట దేవతలకు కూడ శక్యముకాదు.

శ్లో॥ ఇమాం తు విషమాం దుర్గాం లఙ్కాం రావణపాలితామ్।
ప్రాప్యాపి స మహాబాహుః కిం కరిష్యతి రాఘవః॥ ౨౮

టీ॥ ఇమాం = ఈ, విషమాం = విషమస్థితియందున్నటువంటియు, తు = ఇంతేకాకుండా, దుర్గాం = ప్రవేశింపశక్యముగానిదియు, రావణపాలితాం = రావణునిచేపరిపాలింపబడుచున్న, లంకాం = లంకాపట్టణమును మహాబాహుః = ఆజానుబాహుండైన, సః = ఆ, రాఘవః = శ్రీరాముడు, ప్రాప్యాపి = వచ్చియు, కింకరిష్యతి = ఏమిచేయగలడు?

తా॥ నిమ్నోన్నతములుగా నుండి ఎవరికిని జయింప శక్యముగానటువంటి వీరుడైన రావణునిచే పాలింపబడుచున్న ఈ లంకాపట్టణమును ఆజాను బాహుడైన శ్రీరాముడు వచ్చినను ఏమిచేయగలడు?

శ్లో॥ అవకాశో నసాన్త్వస్య రాక్షసే ష్వభిగమ్యతే।
న దానస్య న భేదస్య నైవ యుద్ధస్య దృశ్యతే॥ ౨౯

టీ॥ రాక్షసేషు = రాక్షసులయందు, సాన్త్వస్య = సామోపాయమునకు, అవకాశః = అవకాశము నాభిగమ్యతే = పొందబడదు, దానస్య = దానోపాయమునకు, న = లేదు భేదస్య = భేదోపాయమునకు, న = లేదు, యుద్ధస్య = యుద్ధమునకు, నైవదృశ్యతే = కనబడుటయేలేదు.

తా॥ ఈ దుర్మార్గు లగు రాక్షసులయెడ సామోపాయమునకు అవకాశము లేదు. విశేషధనము కలవారగుటం జేసి దానోపాయమును సరిపడదు. మిక్కిలి బల దర్పితు లగుటంజేసి మిత్రభేదోపాయమును కుదురదు. మంచి బుద్ధిచాతుర్యము పరాక్రమము కలవా రగుటంజేసి యుద్ధోపాయముకూడ ఉపయోగపడదు.

శ్లో॥ చతుర్ణామేవ హి గతి ర్వానరాణాం మహాత్మనామ్।
వాలిపుత్రస్య నీలస్య మమ రాజ్ఞ శ్చ ధీమతః॥ ౩౦

టీ॥ వాలిపుత్రస్య = వాలికుమారుడైన అంగదునకు, నీలస్య = నీలునకు, ధీమతః = బుద్ధిమంతుడైన, రాజ్ఞశ్చ = వానరప్రభువైన సుగ్రీవునకును. మమ = నాకు. మహాత్మనాం = మహాత్ములైన, వానరాణాం = వానరులలో, చతుర్ణామేవ = నలుగురకు మాత్రమే, గతిః = గమనము అగును.

తా॥ గొప్పవారైన వానరులలో నీల. అంగద. సుగ్రీవులకును నాకును మాత్రమే ఈ సముద్రమును దాటి ఇచ్చటకు వచ్చు శక్తి కలదు.

* ఆంజనేయుడు లంకలో జొచ్చు నుపాయ మాలోచించుట *

శ్లో॥ యావ జ్జానామి వైదేహీం యది జీవతి వా న వా।
తత్రైవ చిన్తయిష్యామి దృష్ట్వా తాం జనకాత్మజామ్॥ ౩౮
తత స్స చిన్తయామాస ముహూర్తం కపికుఞ్జరః।
గిరిశృఙ్గే స్థిత స్తస్మిన్ రామ స్యాభ్యుదయే రతః॥ ౩౭

టీ॥ యావత్ = ఎంతవరకు, వైదేహీం = సీతను. జీవతి వా = బ్రతికియుండెనా? న వా = లేకుండెనా? జానామ్యది = తెలిసికొన్నట్లాయెనా? తావతు = అంతవరకు, తాం = ఆ, జనకాత్మజాం = జనకపుత్రికయగు సీతను, దృష్ట్వా = చూచి, తత్రైవ = అచ్చటనే, చిన్తయిష్యామి = ఆలోచించగలను. తతః = అనంతరము, కపికుఞ్జరః = వానరశ్రేష్ఠుడైన సః = ఆఆంజనేయుడు, తస్మిన్ = ఆ. గిరిశృఙ్గే = పర్వతశిఖరమందు, స్థితః = ఉన్నవాడగుచు, రామస్య = శ్రీరామునియొక్క. అభ్యుదయే = అభివృద్ధివిషయమై. రతః = ఆసక్తిగలవాడై, ముహూర్తం = ముహూర్తకాలము, చిన్తయామాస = ఆలోచించెను.

తా॥ సీత బ్రతికియున్నదో లేదో చూచినతరువాత అచ్చటనే ఇదంతా ఆలోచించుట మంచి దని తలచి ఆంజనేయుడు పర్వతశిఖరమునందు కూర్చుండి శ్రీరాముని అభివృద్ధియే ప్రత్యేకలక్ష్యముగ గలవాడై ముహూర్తకాల మాలోచించెను.

శ్లో॥ అనేన రూపేణ మయా నశక్యా రక్షసాం పురీ।
ప్రవేష్టుం రాక్షసై ర్గుప్తా క్రూరై ర్బలసమన్వితైః॥ ౩౩
ఉగ్రౌజసో మహావీర్యా బలవంత శ్చ రాక్షసాః।
వఞ్చనీయా మయా సర్వే జానకీం పరిమార్గతా॥ ౩౪

టీ॥ బలసమన్వితైః = బలముతో కూడియున్నటువంటియు, క్రూరైః = క్రూరులైనటువంటి, రాక్షసైః = రాక్షసులచేత, గుప్తా = రక్షించబడుచున్న, రక్షసాంపురీ = లంకాపట్టణము, అనేన = ఈ, రూపేణ = ఆకారముకలిగిన, మయా = నాచేత, ప్రవేష్టుం = ప్రవేశించుకొరకు, నశక్యా = శక్యముకాదు. ఉగ్రౌజసః = భయంకరతేజస్సులు గలవారును మహావీర్యాః = గొప్పపరాక్రమము కలిగినవారును బలవంత శ్చ = బలవంతులు నగు, రాక్షసాః = రాక్షసులు, సర్వే = అందరు, జానకీం = సీతను, పరిమార్గతా = వెదుకుచున్న, మయా = నాచేత, వంచనీయాః = వచింపబడతగినవారు.

తా॥ మహాబలసంపన్నులు క్రూరులు నగు రాక్షసులచే రక్షింపబడుచున్న లంకాపట్టణమును ఈ ఆకారముచేత ప్రవేశింపవీలుకాదు. మహాభయంకరులు పరాక్రమవంతులు నగు నీ రాక్షసులను ఏదోవిధముగా సీతాన్వేషణ నిమిత్తమై వంచన జేయవలయును.

శ్లో॥ లక్ష్యా లక్ష్యేణ రూపేణ రాత్రౌ లఙ్కాపురీ మయా।
ప్రవేష్టుం ప్రాప్తకాలం మే కృత్యం సాధయితుం మహత్॥ ౩౫

టీ। లక్ష్యా లక్ష్యేణ = కనబడీ కనబడని, రూపేణ = ఆకారముగలిగిన, మయా = నాచేత, రాత్రౌ = రాత్రికాలమందు, లంకాపురీ = లంకాపట్టణము, ప్రవేష్టుం = ప్రవేశించుకొరకు, మే = నాయొక్క, మహత్ = గొప్పదైన, కృత్యం = కార్యమును. సాధయితుం = ఫలింపజేసికొను నిమిత్తం, ప్రాప్తకాలం = తగినకాలమగును.

తా॥ కనబడీ కనబడని సూక్ష్మరూపముతో సీతాన్వేషణయను మహత్తర కార్యసాధన నిమిత్తం రాత్రిసమయమున లంకాప్రవేశమునకు తగిన కాలము అని ఆంజనేయుడు తలచెను.

శ్లో॥ తాం పురీం తాదృశీం దృష్ట్వా దురాధర్షాం సురాసురైః।
హనుమాం శ్చిన్తయామాస వినిశ్వస్య ముహు ర్ముహుః॥ ౩౬
కేనోపాయేన పశ్యేయం మైథిలీం జనకాత్మజామ్।
అదృష్టో రాక్షసేన్ద్రేణ రావణేన దురాత్మనా॥ ౩౭
నవినశ్యే త్కథం కార్యం రామస్య విదితాత్మనః।
ఏకా మేక శ్చ పశ్యేయం రహితే జనకాత్మజామ్॥ ౩౮
భూతా శ్చార్థా విపద్యన్తే దేశకాలవిరోధితాః।
విక్లబం దూత మాసాద్య తమ స్సూర్యోదయే యథా॥ ౩౯
అర్థా నర్థాన్తరే బుద్ధి ర్నిశ్చి తాపి నశోభతే।
ఘాతయన్తి హి కార్యాణి దూతాః పణ్డితమానినః॥ ౪౦
నవినశ్యే త్కథం కార్యం వైక్లబ్యం న కథంభవేత్।
లఙ్ఘనం చ సముద్రస్య కథం ను న వృథాభవేత్॥ ౪౧
మయి దృష్టే తు రక్షోభీ రామస్య విదితాత్మనః।
భవే ద్వ్యర్థ మిదం కార్యం రావణానర్థ మిచ్ఛతః॥ ౪౨
నహి శక్యం క్వచిత్ స్థాతు మవిజ్ఞాతేన రాక్షసైః।
అపి రాక్షస రూపేణ కిము తాన్యేన కేనచిత్॥ ౪౩
వాయు రప్యత్ర నజ్ఞాత శ్చరే దితి మతి ర్మమ।
నహ్య స్త్యవిదితం కించి ద్రాక్షసానాం బలీయసామ్॥ ౪౪
ఇహాహం యది తిష్ఠామి స్వేన రూపేణ సంవృతః।
వినాశ మపి యాస్యామి భర్తు రర్థశ్చ హీయతే॥ ౪౫
త దహం స్వేన రూపేణ రజన్యాం హ్రస్వతాం గతః।
లఙ్కా మధిపతిష్యామి రాఘవ స్యార్థసిద్ధయే॥ ౪౬
రావణస్య పురీం రాత్రౌ ప్రవిశ్య సుదురాసదామ్।
విచిన్వన్ భవనం సర్వం ద్రక్ష్యామి జనకాత్మజామ్॥ ౪౭

టీ॥ హనుమాన్ = ఆంజనేయుడు. సురాసురైః = దేవాసురులచేత దురాధర్షాం = పొందశక్యముకానటువంటి, తాదృశీం = అటువంటి. తాం = ఆ, పురీం = లంకాపట్టణమును, దృష్ట్వా = చూచి. ముహుర్ముహుః = మాటిమాటికి, వినిశ్వస్య = నిట్టూర్చుచు.చిన్తయామాస = ఆలోచించెను, దురాత్మనా = దుష్టుడైనట్టియు, రాక్షసేంద్రేణ = రాక్షసప్రభువైన, రావణేన = రావణునిచేత. అదృష్టః = చూడబడనివాడనై కేన = ఏ. ఉపాయేన = ఉపాయముతో, జనకాత్మజాం = జనకపుత్రిక యగు, మైథిలీం = సీతను, పశ్యేయం = చూడగలుగుదును, విదితాత్మనః = భావితాత్ముడైన, రామస్య = శ్రీరామునియొక్క, కార్యం = కార్యము,కథం = ఎట్లు.నవినశ్యేత్ = చెడకుండయుండునో,రహితే = ఏకాంతమందు,ఏకాం = ఒక్కరితయగు, జనకాత్మజాం = జనకపుత్రిక సీతను, ఏకశ్చ = ఒక్కడనే,పశ్యేయం = చూచెదను. భూతాః = నిశ్చితములైన,అర్థా = ప్రయోజనములు. విక్లబం = అవివేకియైన. దూతం = దూతను ఆసాద్య = పొంది, దేశకాలవిరోధితాః - దేశ = దేశమునకు, కాల = కాలమునకు, విరోధితాః = వ్యతిరేకములైనవై. సూర్యోదయే = సూర్యోదయమునందు. తమో యథా = చీకటివలెనే. విపద్యన్తే = నశింపబడుచుండును. పండితమానినః = పండితులమని తలచు. దూతాః = దూతలు, కార్యాణి = కార్యములను, ఘాతయంతి = చెడగొట్టుచున్నారు. బుద్ధిః = బుద్ధి. అర్థాన్ = ప్రయోజనములను. అర్థాన్తరే = ఇతరప్రయోజనమునందు. నిశ్చితాపి = నిశ్చయించబడినదైన నశోభతేహి = ప్రకాశించదుగదా।రావణానర్థం-రావణ = రావణునకు,అనర్థం = కష్టమును, ఇచ్ఛతః = కోరుచున్న, విదితాత్మనః = మహాజ్ఞానియైన, రామస్య = శ్రీరామునియొక్క, ఇదం = ఈ, కార్యం = సీతాన్వేషణ కార్యము, రక్షోభిః = రాక్షసులచేత, మయి = నేను. దృష్టేసతి = చూడబడినవాడనైనచో, వ్యర్థం = వృథాయై. భవేత్ = అగును. రాక్షసైః = రాక్షసులచేత, అవిజ్ఞాతేన = తెలియబడకయుండు, రాక్షసరూపేణాపి = రాక్షసరూపముతోనైనా, క్వచిత్ = ఎక్కడ, స్థాతుం =

ఉండుటకు. నశక్యంహి = శక్యముకాదుగదా, అన్యేన = ఇతరమైన, కేనచిత్ = దేనిచేతను, కిముత = చెప్పేదేముండును, అత్ర = ఇక్కడ, వాయు రపి = వాయువుకూడ, జ్ఞాతః = తెలియబడినదై (స్వతంత్రముగా) న చరేత్ = సంచరించదు, ఇతి = అని, మమ = నాయొక్క, మతిః = ఉద్దేశము, బలీయసాం = బలవంతులైన, రాక్షసానాం = రాక్షసులకు,అవిదితం = తెలియబడనిది.కించిదపి = కొంచెమును,నాస్తిహి = లేదుగదా? అహం = నేను, ఇహ = ఇక్కడ, స్వేన రూపేణ = స్వకీయాకారముచేత, సంవృతః = కూడియున్నవాడనై, తిష్ఠామ్యది = ఉన్నట్లయినచో, వినాశం = నాశనమును, ఉపయాస్యామి = పొందగలుగుదును. చ = మరియు, భర్తుః = ప్రభువైన సుగ్రీవునియొక్క, అర్థః = కార్యము, హీయతే = చెడును, తత్ = అందువలన, అహం = నేను, స్వేనరూపేణ = స్వకీయాకారముతో, రజన్యాం = రాత్రియందు, హ్రస్వతాం = సూక్ష్మత్వమును, గతః = పొందినవాడనగుచు, రాఘవస్య = శ్రీరామునియొక్క, అర్థసిద్ధయే = కార్యసిద్ధికొరకు, లఙ్కాం = లంకను, అధిపతిష్యామి = ప్రవేశించుదును, రాత్రౌ = రాత్రియందు, సుదురాసదాం = చొరశక్యముగాని, రావణస్య = రావణునియొక్క. పురీం = పట్టణమును. ప్రవిశ్య = ప్రవేశించి, సర్వం = సమస్తమైన, భవనం = భవనమును, విచిన్వన్ = వెదకువాడనగుచు, జనకాత్మజాం = సీతను. ద్రక్ష్యామి = చూచెదను.

తా॥ సురాసురులకు కూడ ప్రవేశింప శక్యముగాని లంకాపట్టణమును హనుమంతుడు చూచి, మిక్కిలికష్టసాధ్యమని తోచగా మాటిమాటికి నిట్టూర్పుచు, దుర్మార్గుడైన రావణునికి రాక్షసులకు తెలియకుండ ఏఉపాయమున లంకలో ప్రవేశింతును? అవివేకములో పడకుండ నేనెట్లు ప్రవర్తింపవలయును? బుద్ధిమంతులచే నిర్ణయించబడిన కార్యములైనను అవివేకియైన దూతవలన దేశ కాలములకు విరోధములై చెడుచుండును. అందువలననే "దూతంచైవ ప్రకుర్వీత, సర్వశాస్త్ర

విశారదమ్। ఇంగితాకార చేష్టజ్ఞం, శుచిం దక్షం కులోద్గతమ్" అను శాస్త్రప్రకారముగా ఐహికాముష్మిక శాస్త్రముల దెలిసినవానిని, ఇతరుల మనస్సు నెఱుగు మాటల నేర్పు స్వభావము అకార చేష్టల నెరుంగు వానిని పరిశుద్ధుని సమర్థత గలవానిని, సద్వంశ సంభూతుని దూతగా పంపవలెను. "అనురక్తః శుచి ర్దక్షః స్మృతిమాన్ దేశకాలవిత్। వపుష్మాన్ వీతభీ ర్వాగ్మీ దూతో రాజ్ఞః ప్రశస్యతే" "అందరియం దనురాగము కలవాడు ధన స్త్రీ విషయములతో పరిశుద్ధుడు. అన్నివిష యములందు నేర్పరితనము మిక్కుటమగు జ్ఞాపకశక్తిగలవాడు దేశ కాలతారతమ్యముల దెలిసినవాడు దేహసౌష్ఠవముగలవాడు భయరహితుడు మంచి మాటనేర్పు గలవాడు మాత్రమే రాజునకు దూతగా నుండుటకు అర్హుడు." అను ఈనియమముల ననుసరించి ఒంటరిగా నుండు సీత నెట్లు చూడగలుగుదును? ఈ ప్రభుకార్యము నెట్లు సాధించగలుగుదును? నేను ధైర్యాదిగుణములు గల వాడ నని ఎట్టి కార్యమునైన సాధించ గలనను ధృఢవిశ్వాసముతోనే దూతనుగా నన్నిచ్చటకు బంపిన శ్రీరా మునకు కార్యసిద్ధిని పొందించవలయును. ఇచ్చట నేను రాక్షసులతో పట్టుబడిన అతిప్రయాసచే సముద్రము దాటిన కష్టము అటు రామ కార్యము చెడిపోవును కనుక సీతాన్వేషణకై యిప్పుడు నేను ఏ రాక్షస రూపమును గాని మరెవ్విధమైన రూపమును గాని ధరించి లంకాప్రవే శముజేయ దలచినను మాయావులగు రాక్షసులు తప్పక తెలిసికొందురు. వాయువుకూడ నిచ్చట స్వతంత్రముగ వీచజాలకున్నది. ఈ లంకయం దీరాక్షసులరు తెలియబడని దేమియు లేదు. ఈ రూపమున నుందునా? నన్ను బాధపెట్టుదురు. సుగ్రీవుని ప్రయోజనము చెడును. కావున సూక్ష్మరూపమున రాత్రికాలమందులంకను ప్రవేశించి ప్రతియింటిని వెదకి చూచి, సీతను చూడగల నని హనుమంతుడు నిర్ణయము చేసికొనెను.

శ్లో॥ ఇతి సఞ్చిన్త్య హనుమాన్ సూర్యస్యాస్తమయం కపిః।
అచకాఙ్క్షే తదా వీరో వైదేహ్యా దర్శనోత్సుకః॥ ౪౮
సూర్యే చాస్తంగతే రాత్రౌ దేహం సఙ్క్షిప్య మారుతిః।
వృషదంశకమాత్రస్సన్ బభూవాద్భుత దర్శనః॥ ౪౯

టీ॥ ఇతి = ఈప్రకారముగా, కపిః = వానరుడైన, హనుమాన్ = హనుమంతుడు:సంచింత్య = ఆలోచించి సూర్యస్య = సూర్యునియొక్క-అస్తమయం = అస్తమించుటను, తదా = అప్పుడు, వీరః = వీరుడైన హనుమంతుడు, వైదేహ్యాః = సీతయొక్క. దర్శనోత్సుకః = దర్శనమునందు, ఉత్సాహముగలవాడై, అచకాఙ్క్షే = కోరుచుండెను, సూర్యే = సూర్యుడు, అస్తంగతే, సతి = అస్తమించగా. రాత్రౌ = రాత్రియందు, మారుతిః = ఆంజనేయుడు. దేహం = శరీరమును. సంక్షిప్య = క్లుప్తపరచి, వృషదంశక మాత్రస్సన్ = పిల్లి అంత మాత్రమైన వాడగుచు, అద్భుత దర్శనః = చూచుటకు, ఆశ్చర్యముగా నున్నవాడై, బభూవ = అయెను.

తా॥ ఈ ప్రకారముగా ఆలోచించి మహా పరాక్రమశాలి యగు హనుమంతుడు సీతను చూడవలె ననెడి కోరికతో సూర్యాస్తమయము కాగానే రాత్రియందు తన నిశ్చయప్రకారము పిల్లి అంత సూక్ష్మశరీరుడై చూచుట కాశ్చర్యము గలుగునట్లు కనబడెను.

* హనుమంతుడు లంకలో ప్రవేశించుట *

శ్లో॥ ప్రదోషకాలే హనుమాం స్తూర్ణ ముత్ప్లుత్య వీర్యవాన్।
ప్రవివేశ పురీం రమ్యాం సువిభక్త మహాపథామ్॥ ౫౦

టీ॥ ప్రదోషకాలే = ప్రదోషకాలమందు, వీర్యవాన్ = పరాక్రమవంతుడైన, హనుమాన్ = ఆంజనేయుడు, తూర్ణం = శీఘ్రము గా. ఉత్ప్లుత్య = పైకెగసి, సువిభక్తమహాపథాం – సువిభక్త = బాగుగా విభజింపబడిన. మహాపథాం = గొప్ప మార్గములు గలిగిన,

రమ్యాం = సుందరమైన, పురీం = లంకాపట్టణమును, ప్రవివేశ = ప్రవేశించెను.

తా॥ మహాపరాక్రమవంతుడైన అంజనేయుడు సూర్యుడు అస్తమించిన తరువాత ప్రదోషకాలమందు పై కెగిరి మిక్కిలి విశాలములైన వీధులతో కూడియున్న లంకాపట్టణమును ప్రవేశించెను.

అవతారిక:— ప్రదోషకాలము "త్రిముహూర్తం ప్రదోషస్య భానావస్తంగతే సతి" సూర్యాస్తమయానంతరము మూడుముహూర్తముల కాలము వరకు ప్రదోషకాలముగా చెప్పుదురు. "ప్రదోషో స్తమయా దూర్ధ్వం ఘటికాద్వయ మిష్యతే" ఇది గౌడమతము, సూర్యాస్తమయముకంటె ముందు రెండుఘడియల కాలము ప్రదోష మనియు గలదు. ప్రదోషకాలమున చేయకూడనిపనులు "భోజనం మైథునం యాన, మభ్యంగం హరిదర్శనమ్ అన్యాని శుభకార్యాణి ప్రదోషే నైవకారయేత్॥" భోజనము, మైథునము, ప్రయాణము, అభ్యంగస్నానము, హరిదర్శనము మొదలగునవియు నితరశుభకార్యములను ప్రదోషకాలమున చేయరాదు. అయిన హనుమంతు డెట్టులీకార్యమును చేయబూనెను? "అర్చకాన్ పరివారాంశ్చ వైష్ణవాన్ జ్ఞానినో యతీన్ దాసీ దాసాదికాంశ్చైవ, ప్రదోషో న తు బాధతే" అర్చకులను, పరిచారకులను, వైష్ణవులను, జ్ఞానులను, సన్యాసులను దాసదాసీలను ప్రదోషము బాధింపదను అపవాద ముండుటచే హనుమంతుడు జ్ఞాని, వైష్ణవుడు, రామభక్తుడు అగుటవలన స్వామికార్య నిర్వహణమందు ప్రదోషబాధ ఆయనకు లేదు.

శ్లో॥ ప్రాసాదమాలా వితతాం స్తమ్భైః కాఞ్చన రాజతైః।
శాతకుమ్భమయై ర్జాలై ర్గన్ధర్వ నగరోపమామ్॥ ౫౧
సప్తభౌ మాష్టభౌమైశ్చ సందదర్శ మహాపురీమ్।
తలైః స్ఫాటిక సఙ్కీర్ణైః కార్తస్వర విభూషితైః॥ ౫౨

టీ॥ కాంచనరాజతైః-కాంచన = బంగారుమయములు, రాజతైః = వెండిమయము లైన, స్తంభైః = స్తంభములచేతను. శాతకుమ్భమయైః = బంగారు వికారములైన, జాలైః = కిటికీలచేతను, ప్రాసాదమాలావితతాం - ప్రాసాదమాలా = మేడలపంక్తులచేత. వితతాం = వ్యాప్తమైనదియు, గన్ధర్వనగరోపమాం = గంధర్వనగరముతో సమానమైనదియు, సప్తభౌమాష్టభౌమైః = ఏడుఅంతస్థులు యెనిమిది అంతస్థులు గల మేడలచేతను, స్ఫాటిక సఙ్కీర్ణైః = స్ఫటికపురాళ్ళచే వ్యాప్తమైనదియు, కార్తస్వర = బంగారముచే, విభూషితైః = అలంకరింపబడిన, తలైః = ప్రదేశములచేత, మహాపురీం = గొప్పదిగానున్న లంకాపట్టణమును సందదర్శ = చూచెను.

తా॥ మహా పరాక్రమవంతుడైన హనుమంతుడు బంగారపు వెండి స్తంభములు బంగారపు కిటికీలు కలిగి ఏడు యెనిమిది అంతస్థులు గల మేడలవరుసలచేతను స్ఫటికపురాళ్లు పరచబడి బంగారపువస్తువులచే అలంకరించబడి గంధర్వపట్టణముతో సమానమైనలంకాపట్టణమును చూచెను. గంధర్వనగర మనగా "అనేకరత్నాకృతి ఖే విరాజితే। పురం పతాకాధ్వజ తోరణాన్వితమ్। యదా తదా హస్తి మనుష్యవాజినామ్। పిబత్య స్రు గ్భూరి రణే వసుంధరా" ఎప్పుడు ఆకాశమందు మేఘములు రత్నమయములైన గోపురములు మేడలు వలె కనబడునో దానినే గంధర్వనగర మని పెద్దలు చెప్పుదురు. అట్లు కనబడినప్పుడు భూమిపై రక్తము ప్రసరించు ననియు చెప్పుదురు

శ్లో॥ వైడూర్య మణి చిత్రైశ్చ ముక్తాజాల విభూషితైః।
తలై శ్శుశుభి రేతాని భవనా న్యత్ర రక్షసామ్॥ ౫౩
కాఞ్చనాని చ చిత్రాణి తోరణాని చ రక్షసామ్।
లఙ్కా ముద్యోతయా మాసు స్సర్వత స్సమలఙ్కృతామ్ ౫౪

టీ॥ అత్ర = ఇచ్చట, రక్షసాం = రాక్షసులయొక్క, తాని = ఆ, భవనాని = భవనములు, వైడూర్యమణిచిత్రైః = చిత్రములైనవైడూర్య

మాణిక్యములచేతను. ముక్తాజాలవిభూషితైః-ముక్తాజాల = ముత్యముల సమూహములచేత, విభూషితైః = అలంకరింపబడిన, తలైః = ప్రదేశములచేత, శుశుభిరే = శోభించుచుండెను. రక్షసాం = రాక్షసుల యొక్క, కాంచనాని = బంగారుమయములైన చిత్రాణిచ = చిత్రములును, తోరణానిచ = తోరణములును(బహిఃద్వారములును)సర్వతః = అంతట, సమలంకృతాం = అలంకరింపబడిన లంకాం = లంకాపట్టణమును, ఉద్యోతయామాసుః = ఎక్కువగా ప్రకాశింపచేయుచుండెను.

తా॥ లంకాపట్టణమందలి రాక్షసులయొక్క భవనములు చిత్రములైన వైడూర్యాది మాణిక్యముల చేతను, ముత్యాల పంక్తులచేతను ప్రకాశించు రాక్షసుల యొక్క బంగారు చిత్రములు, బహిర్ద్వారములచేతను అలంకరింపబడి లంకాపట్టణము ఎక్కువగా ప్రకాశించుచుండెను.

శ్లో॥ అచిన్త్యా మద్భుతాకారాం దృష్ట్వాలఙ్కాం మహాకపిః।
అశీ ద్విషణ్ణో హృష్ట శ్చ వైదేహ్యా దర్శనోత్సుకః॥ ౨౫
సపాణ్డురో ద్విద్ధ విమాన మాలినీమ్
మహార్హ జామ్బూనద జాలతోరణామ్।
యశస్వినీం రావణ బాహుపాలితామ్
క్షపాచరై ర్భీమబలై స్సమావృతామ్॥ ౨౬

టీ॥ మహాకపిః = హనుమంతుడు. అద్భుతాకారాం = అద్భుత ఆకారముగల, లంకాం = లంకను, దృష్ట్వా = చూచి విషణ్ణః = విచారముగల, వాడుగను, వైదేహ్యాః = సీతయొక్క. దర్శనోత్సుకః - దర్శన = చూచుటయందు, ఉత్సుకః = వేడుకగలవాడై, హృష్టః చ = సంతోషించినవాడుగను, అసీత్ = అయెను, సః = ఆ హనుమంతుడు. పాండురోద్విద్ధవిమానమాలినీం - పాండుర = తెల్లనైన, ఉద్విద్ధ = ఉన్నతములుగా కట్టబడిన, విమానమాలినీం = విమానాకారములుగా ఉన్నటువంటి, మహార్హజాంబూనదజాలతోరణాం-మహార్హ = గొప్ప

విలువగల జాంబూనద = బంగారువికారమైన, జాలతోరణాం = ద్వారతోరణములు కలిగినటువంటియు, యశస్వినీం = కీర్తికలిగినటువంటియు, రావణబాహుపాలితాం – రావణ = రావణునియొక్క, బాహుపాలితాం = భుజబలముచే పరిపాలింపబడుచున్నటువంటియు, భీమబలైః = భయంకర పరాక్రమములుగల, క్షపాచరైః = రాక్షసులచేత, సమావృతాం = కూడియున్నట్టియు. (లంకాందృష్ట్వా అనుదానితో అన్వయము.)

తా॥ వానరోత్తముడైన ఆ హనుమంతుడు తెల్లనిరంగులతో విమానములవలె కట్టబడిన భవనములతోను, బంగారుమయమైన బహిర్ద్వారములతోను కీర్తిని పొందినదియు రావణునిచే పరిపాలింపబడుచున్నదియు భయంకర రాక్షసులతో వ్యాప్తమై అద్భుతాకారముగల ఆ లంకాపట్టణమును జూచి తొలుత విచారపడినవాడయ్యు పిదప సీతాన్వేషణాసక్తితో సంతసించినవాడయ్యెను.

శ్లో॥ చన్ద్రోఽపి సాచివ్యమివాస్య కుర్వం స్తారాగణైర్మధ్యగతో విరాజన్
జ్యోత్స్నావితానేన వితత్యలోక ముత్తిష్ఠతేనైక సహస్రరశ్మిః॥ ౫౭

టీ॥ అస్య = ఈఆంజనేయునికి, చంద్రోపి = చంద్రుడును, సాచివ్యం = సహాయమును, కుర్వన్నివ = చేయుచున్నవాడువలెనే, తారాగణైః = నక్షత్రములసమూహములచే, మధ్యగతః = మధ్యనున్నవాడై, విరాజన్ = ప్రకాశించుచు, జ్యోత్స్నావితానేన = వెన్నెలసమూహముతో, లోకం = లోకమును, వితత్య = కప్పి, నైక సహస్ర రశ్మిః = అనేకవేల కిరణములు గలిగియున్నవాడై, ఉత్తిష్ఠతే = ఉదయించెను.

తా॥ చంద్రుడు ఇంతకు ముందు సహాయమొనర్చిన సాగర, మైనాక, సూర్యులవలె ఆంజనేయునకు సహాయమొనర్ప దలచి తారాగణమధ్యం

గతుడై సహస్రానేకములైన చల్లని కిరణములతో ఉదయించెను. విషణ్ణ హృదయుడైన ఆంజనేయుని మనఃఖేద మునుపశమించునట్లు చల్లని కిరణములతో నుదయించెను.

శ్లో॥ శఙ్ఖప్రభం క్షీర మృణాల వర్ణ ముద్గచ్ఛమానంవ్యవభాసమానమ్।
దదర్శ చన్ద్రం స హరిప్రవీరః పోప్లూయమానం సరసీవ హంసం॥

౫౮

టీ॥ సః = ఆ, హరిప్రవీరః = హనుమంతుడు, శఙ్ఖప్రభం = శంఖము వంటి కాంతిగలిగినట్టియు, క్షీరమృణాలవర్ణం - క్షీర = పాలు, మృణాల = తామరతూడువంటి, వర్ణం = రంగు కలిగినట్టియు, ఉద్గచ్ఛమానం = పైకినడచుచున్నటువంటియు, వ్యవభాసమానం = ఆకాశమునప్రకాశించుచున్న, చంద్రం = చంద్రుని, సరసి = సరస్సునందు పోప్లూయమానం = ఈదుచున్న. హంస మివ = హంసనువలె దదర్శ = చూచెను.

తా॥ ఆ హనుమంతుడు శంఖము, పాలు, తామరతూడు వంటిరంగు కలిగి, ఆకాశమున ప్రకాశించుచు, పైపైకి ఎగబ్రాకుచున్న చంద్రుని సరస్సున నీదుచున్న హంసను వలె చూచెను.

ద్వితీయస్సర్గః సమాప్తః

# తృతీయ స్సర్గః

శ్లో॥ స లమ్బ శిఖరే లమ్బే లమ్బ తోయద సన్నిభే।
సత్త్వ మాస్థాయ మేథావీ హనుమా న్మారుతాత్మజః॥ ౧
నిశి లఙ్కాం మహాసత్త్వో వివేశ కపికుఞ్జరః।
రమ్య కానన తోయాఢ్యాం పురీం రావణపాలితామ్॥ ౨

టీ॥ లమ్బ తోయదసన్నిభే-లంబ = వ్రేలాడుచున్న, తోయద = మేఘముతో, సన్నిభే = సమానమైన, లమ్బే = పొడవైన, లమ్బశిఖరే = లంబపర్వత (త్రికూటపర్వత) శిఖరమునందు, మేథావీ = బుద్ధిశాలియు మారుతాత్మజః = వాయుపుత్రుడు నైన, హనుమాన్ = ఆంజనేయుడు సత్త్వం = బలమును, ఆస్థాయ = పొంది, రమ్యకాననతోయాఢ్యం— రమ్య = సుందరమునైన, కానన = అరణ్యములు, తోయ = ఉదకములతో, ఆఢ్యాం = కూడియున్నటువంటియు, రావణపాలితాం = రావణునిచే పరిపాలింపబడుచున్న, లఙ్కాంపురీం = లంకాపట్టణమును, నిశి = రాత్రియందు, మహాసత్త్వః = గొప్పబలముగల, కపికుఞ్జరః = కపిశ్రేష్ఠుడు, వివేశ = ప్రవేశించెను.

తా॥ మహామేధావి యగు హనుమంతుడు మేఘములతో వ్యాప్తమై పొడవైన శిఖరములు గల లంబపర్వత (త్రికూటపర్వత) శిఖరముపై మనోహరమైన వనములు తటాకములతో నొప్పుచున్న లంకాపట్టణమును బలమును పుంజుకొని ధైర్యశాలియై రాత్రియందు ప్రవేశించెను.

శ్లో॥ శారదామ్బుధర ప్రఖ్యై ర్భవనై రుపశోభితామ్।
సాగరోపమ నిర్ఘోషాం సాగరానిల సేవితామ్॥ ౩
సుపుష్ట బలసఙ్ఘుష్టాం యథైవ విటపావతీమ్।
చారు తోరణనిర్యూహాం పాణ్డుర ద్వారతోరణామ్॥ ౪
భుజగాచరితాం గుప్తాం శుభాం భోగవతీ మివ।
తాం స విద్యుద్ఘనాకీర్ణాం జ్యోతిర్మార్గ నిషేవితామ్॥ ౫

మన్ద మారుత సంచారాం యథేన్ద్ర స్యామరావతీమ్।
శాతకుమ్భేన మహతా ప్రాకారేణాభి సంవృతామ్॥ ౬
కిఙ్కిణీజాల ఘోషాభిః పతాకాభి రలఙ్కృతామ్।
ఆసాద్య సహసా హృష్టః ప్రాకార మభిపేదివాన్॥ ౭
విస్మయావిష్ట హృదయః పురీ మాలోక్య సర్వతః।

టీ॥ శారదామ్బుధరప్రఖ్యైః—శారదామ్బుధర = శరత్కాల మేఘమువలె, ప్రఖ్యైః = చెప్పదగినటువంటి, భవనైః = భవనముల చేత, ఉపశోభితాం = ప్రకాశింపచేయబడుచున్నట్టియు, సాగరోపమనిర్ఘోషాం—సాగరోపమ = సముద్రునితో సమానమైన, నిర్ఘోషాం = ధ్వనులుకలిగినట్టియు, సాగరానిలసేవితాం—సాగర = సముద్రునియొక్క, అనిల = వాయువుచేత, సేవితాం = సేవించబడుచున్నదియు, సుపుష్ట బల సఙ్ఘుష్టాం—సుపుష్ట = పూర్ణమైన, బల = బలముచేత, సఙ్ఘుష్టాం = సంపుటితమైయున్నదియు విటపావతీం యథాస్థితాం = అలకాపట్టణమువలె, నున్నదియు, చారు తోరణనిర్యూహాం—చారు = సుందరములైన, తోరణ = బహిర్ద్వారములందు, నిర్యూహాం = బంధింపబడిన, ఏనుగులుగలదియు, పాణ్డురద్వార తోరణాం—పాణ్డుర = తెల్లనైన, ద్వార = ద్వారములయందు, తోరణాం = తోరణములు కలిగినట్టియు, భుజగాచరితం—భుజగ = సర్పములచేత, అచరితాం = అంతట సంచరించబడుచున్న. శుభాం = శుభప్రదమైన, భోగవతీ మివ స్థితాం = భోగవతీనగరమువలె నున్నదియు, గుప్తాం = రక్షింపబడుచున్నట్టియు, విద్యుద్ఘనాకీర్ణాం—విద్యుద్ఘన = మేఘముల మెఱపులచే, ఆకీర్ణాం = వ్యాప్తమైనదియు, జ్యోతిర్మార్గనిషేవితాం — జ్యోతిర్మార్గ = దీపపుమార్గములచే, నిషేవితాం = కూడియున్నదియు, మందమారుతసంచారాం —మందమారుత = మందమారుతముచే, సంచారాం = సంచరింపబడుచున్నదియు, ఇంద్రస్య = దేవేంద్రునియొక్క, అమరావతీ మివ స్థితాం = అమరావతి వలె నున్నదియు, మహతా = గొప్పదైన, శాతకుమ్భేన =

బంగారు నిర్మితమైన. ప్రాకారేణ = ప్రాకారముతో, అభిసంవృతాం = కూడియున్నదియు. కిఙ్కిణీజాలఘోషాభిః-కిఙ్కిణీజాల = చిరుగజ్జెల సమూహము యొక్క,, ఘోషాభిః = ధ్వనులచేతను, పతాకాభిః = జెండాలచేతను, అలంకృతాం = అలంకరింపచేయబడినదియు నగు పురీం = లంకాపట్టణమును, ఆసాద్య = పొంది, హృష్టః = సంతోషించినవాడగుచు, సహసా = వెంటనే, ప్రాకారం = ప్రాకారమును, అభిపేదివాన్ = పొందినవాడగుచు. విస్మయావిష్టహృదయః-విస్మయ = ఆశ్చర్యముతో, ఆవిష్ట = కూడియున్న, హృదయః = మనస్సుకలవాడై సర్వతః = అంతట, పురీం = లంకాపట్టణమును. ఆలోక్య = చూచి, ప్రాకారం = ప్రాకారమును. అభిపేదివాన్ = అధిష్ఠించెను.

తా॥ శరత్కాలమేఘమువలె తెల్లగను ఎత్తుగను ఉన్న భవనములతో శోభాయమానముగా నున్నటువంటియు, సముద్రధ్వనివలెనే పురజనుల కలకలధ్వని కలిగినటువంటియు. సముద్రపు నీటిగాలిచే మందముగా విసరబడుచున్నట్టియు, అలకాపట్టణమువలె సుందరముగా నున్నటువంటియు, సర్పములతో నిండిన భోగవతీనగరము వలె క్రూరరాక్షసులచే నిండి యున్నటువంటియు, దీపపు వసనలతో ప్రకాశించుచున్న మంచి మార్గములు కలిగినటువంటియు, విలువైన బంగారు ప్రాకారాదులచే అమరావతివలె నున్నటువంటియు, సుందరీమణుల చిరుగజ్జెల సవ్వడులతో ఆనందదాయముగా నున్నటువంటియు. లంకాపట్టణమును చూచి ప్రాకారము నధిష్ఠించెను.

శ్లో॥ జాంబూనదమయై ర్ద్వారై ర్వైడూర్యకృత వేదికైః॥ ౮
వజ్ర స్ఫటిక ముక్తాభి ర్మణీ కుట్టిమ భూషితైః।
తప్తహాటక నిర్యూహై రాజ తామల పాణ్డురైః॥ ౯
వైడూర్య కృత సోపానైః స్ఫాటికాన్తర పాంసుభిః।
చారుసఞ్జ వనోపేతైః ఖ మివోత్పతితైః శ్శుభైః॥ ౧౦

క్రౌఞ్చబర్హిణసఙ్ఘుష్టైరాజహంసనిషేవితైః।
తూర్యాభరణనిర్ఘోషైస్సర్వతః ప్రతినాదితామ్॥ ౧౧
వస్వోకసారాప్రతిమాం తాం వీక్ష్య నగరీం తతః।
ఖమివోత్పతితుం కామాం జహర్ష హనుమాన్ కపిః॥ ౧౨

టీ॥ జాంబూనదమయైః = బంగారు వికారములైన, ద్వారైః = ద్వారముల చేతను, వైడూర్యకృతవేదికైః — వైడూర్య = వైడూర్యమాణిక్యముల చేత, కృత = చేయబడిన, వేదికైః = అరుగులచేతను, వజ్రస్ఫటికముక్తాభిః — వజ్ర = వజ్రములు, స్ఫటిక = స్ఫటికములు, ముక్తాభిః = ముత్యములచేతను, మణికుట్టిమభూషితైః — మణికుట్టిమ = మాణిక్యస్థానములుగా, భూషితైః = అలంకరించబడినటువంటి, తప్తహాటకనిర్యూహైః — తప్తహాటక = పుటముబెట్టినబంగారమువంటి, నిర్యూహైః = వాకిళ్లచేతను, రాజతామలపాండురైః — రాజతామల = స్వచ్ఛమైనవెండివలె, పాండురైః = తెల్లనైనటువంటియు, వైడూర్యకృతసోపానైః — వైడూర్య = వైడూర్యమాణిక్యములచేత, కృత = చేయబడినటువంటి, సోపానైః = మెట్లచేతను, స్ఫాటికాన్తరపాంసుభిః — స్ఫాటికాన్తర = స్ఫటికములమధ్యయందుగల, పాంసుభిః = పరాగములచేతను, చారుసఞ్జవనోపేతైః — చారు = సుందరమైన, సఞ్జవన = చతుశ్శాలలతో, ఉపేతైః = కూడియున్నటువంటియు, శుభైః = శుభములచేత, ఖం = ఆకాశమునుగూర్చి, ఉత్పతితైః = ఎగురుచున్నటువంటి, క్రౌఞ్చబర్హిణసఙ్ఘుష్టైః — క్రౌఞ్చ = చక్రవాకములచేత, బర్హిణ = నెమళ్లచేత, సఙ్ఘుష్టైః = కూర్చబడినటువంటి, రాజహంసనిషేవితైః — రాజహంస = రాజహంసలచే, నిషేవితైః = సేవించబడుచున్నట్టి తూర్యాభరణనిర్ఘోషైః — తూర్య = మంగళవాయిద్యముల యొక్క ఆభరణ = ఆభరణములయొక్క, నిర్ఘోషైః = ధ్వనులచేత,

సర్వతః = అంతటను, ప్రతినాదితాం = మారు మ్రోగుచున్నట్టియు. వస్వౌకసారా ప్రతిమాం-వస్వౌకసారా = ఇంద్రపట్టణముతో, ప్రతిమాం = సమానమైనటువంటి, కామాం = కామించునటువంటి, తాం = ఆ, నగరీం = పట్టణమును, వీక్ష్య = చూచి, తతః = అతరువాత, కపిః = వానరుడైన, హనుమాన్ = హనుమంతుడు, ఖం = ఆకాశమును గూర్చి, జహర్ష = మిగుల సంతోషించెను.

తా॥ ఆ లంకాపట్టణము బంగారువికారములైన ద్వారములచేతను, వైడూర్యమాణిక్యాదులచే కట్టబడిన అరుగులచేతను, వజ్రములు స్ఫటికములు, ముత్యములు, మాణిక్యములచే నలంకరింపబడిన స్థానముల చేతను, బంగారు వాకిళ్లతోను, స్వచ్ఛమైన వెండివలె తెల్లని వైడూర్యమణులచే చేయబడిన మెట్లుతోను, సుందరోద్యానవనములచేతను, చకోరము, నెమలి, రాజహంసలతోను, అకాశమున కెగయుచున్నట్లుగాను, శుభప్రదములైన మంగళవాయిద్యముల నృత్తగీతాది శోభనముల మారుమ్రోగుచు, అమరావతివలె నున్న ఆ లంకాపట్టణముయొక్క సౌందర్యాదులు చూచి అంజనేయుడు చాల సంతసించెను.

* హనుమంతుడు ప్రాకారమును చేరి ఆలోచించుట *

శ్లో॥ తాం సమీక్ష్య పురీం రమ్యాం రాక్షసాధిపతే శ్శుభామ్।
అనుత్తమా మృద్ధియుతాం చిన్తయామాస వీర్యవాన్॥ ౧౩
నేయ మన్యేన నగరీ శక్యా ధర్షయితుం బలాత్।
రక్షితా రావణబలై రుద్యతాయుధ ధారిభిః॥ ౧౪
కుము దాఙ్గదయో ర్వాపి సుషేణస్య మహాకపేః।
ప్రసిద్ధేయం భవేద్భూమి ర్మైన్దద్వివిదయో రపి॥ ౧౫
వివస్వత స్తనూజస్య హరే శ్చ కుశపర్వణః।
ఋక్షస్య కేతుమాలస్య మమ చైవ గతి ర్భవేత్॥ ౧౬

టీ॥ వీర్యవాన్ = పరాక్రమవంతుడైన అంజనేయుడు, రాక్షసాధిపతేః = రావణునియొక్క, రమ్యాం = సుందరమైనదియు, శుభాం = శుభప్రదమైన. తాం = ఆ. పురీం = లంకాపట్టణమును. సమీక్ష్య = చూచి. అనుత్తమాం = మిక్కిలిశ్రేష్ఠమైనది, బుద్ధియుతాం = అభివృద్ధిచెందియుండుటను గూర్చి, చింతయామాస = ఆలోచించెను—ఉద్యతాయుధధారిభిః = ఎక్కుపెట్టబడిన ఆయుధములను ధరించిన. రావణబలైః = రావణసైన్యములచేత. రక్షితా = రక్షింపబడుచున్న. ఇయం = ఈ, లంకా = లంకాపట్టణము, అన్యేన = ఇతరునిచేత. బలాత్ = బలాత్కారముగా. ధర్షయితుం = జయించేటందుకొరకు. నశక్యా = శక్యమైనదికాదు—కుముదాఙ్గదయోః = కుముదుడు అంగదులకు, వా = మరియు మహాకపేః = వానరశ్రేష్ఠుడగు, సుషేణస్య = సుషేణునికి. అపిచ = మరియు, మైన్దద్వివిదయోః = మైన్దుడుద్వివిదులకును, వివస్వతః = సూర్యునియొక్క. తనూజస్య = కుమారుడైన సుగ్రీవునకును, కుశపర్వణః = కుశపర్వుడనే, హరేశ్చ = వానరునకును, ఋక్షస్య = ఋక్షరాజుజాంబవంతునికి, కేతుమాలస్య = కేతుమాలికి, మమచైవ = నాకును, గతిః = గమనము, భవేత్ = అగును.

తా॥ సర్వసంపదలతో తులదూగుచు, సర్వకళల నుట్టిపడుచు, మహాబలులు, క్రూరులు, సదా యుద్ధసన్నద్ధులై ఆయుధములు ధరించియున్న రాక్షసులతో రక్షింపబడుచున్న, లంకాపట్టణమును చూచి హనుమంతుడు ఆలోచించెను. ఇది ఎవరికిని జయింపశక్యముగాని పురము. ఈ లంకవరకు రాగలిగిన వారు వానరులలో కుముదుడు, అంగదుడు, మైన్దుడు, ద్వివిదుడు, సుగ్రీవుడు, కుశపర్వుడు, మరియు నేను, ఋక్షరాజు జాంబవంతుడు మాత్రమే.

శ్లో॥ సమీక్ష్య తు మహాబాహూ రాఘవస్య పరాక్రమమ్।
లక్ష్మణస్య చ విక్రాన్త మభవ త్ప్రీతిమాన్ కపిః॥ ౧౨

టీ॥ కపిః = ఆంజనేయుడు, రాఘవస్య = శ్రీరామునియొక్క, మహా బాహూ = ఆజానుబాహువులను, పరాక్రమం = పరాక్రమమును, చ = మరియు, లక్ష్మణస్య = లక్ష్మణునియొక్క, విక్రాంతం = పౌరుష మును, సమీక్ష్య = సమీక్షించి, ప్రీతిమాన్ = సంతోషించినవాడై, అభవత్ = ఆయెను.

తా॥ తరువాత ఆంజనేయుడు మహాసుభావులైన రామలక్ష్మణుల పరాక్ర మము పౌరుషము తలచుకొని సంతుష్టిని పొందెను.

శ్లో॥ తాం రత్నవసనోపేతాం గోష్ఠాగారావతంసకాం
యంత్రాగారస్తనీ మృద్ధాం ప్రమదా మివ భూషితామ్॥
తాం నష్టతిమిరాం దీప్తై ర్భాస్వరై శ్చ మహాగృహైః।
నగరీం రాక్షసేన్ద్రస్య దదర్శ స మహాకపిః॥ ౧౯

టీ॥ రత్నవసనోపేతాం — రత్న = రత్నములనెడి, వస్త్ర = వస్త్రములతో, ఉపేతాం = కూడియున్నదియు, గోష్ఠాగారావతంసకాం—గోష్ఠాగార = గోశాలలనే, ఆవతంసకాం = ఆభరణములుకలదియు, యంత్రాగార స్తనీం-యంత్రాగార = యంత్రశాలలను, స్తనీం = స్తనములుకలదియు, ఋద్ధాం = సర్వసమృద్ధమైనది, యునగు,ప్రమదా మివ = స్త్రీవలె భూషి తాం = అలంకరించబడిన, తాం = అలంకాపట్టణమును,చ = మరియు, భాస్వరైః = ప్రకాశించు, దీప్తైః = కాంతులుగల, మహాగృహైః = గొప్పవైన, భవనములచేత, నష్టతిమిరాం = పోగొట్టబడినచీకట్లుగల రాక్షసేన్ద్రస్య = రావణునియొక్క, తాం = ఆ,నగరీం = పట్టణమును, దదర్శ = చూచెను.

తా॥ రత్నము లనెడి వస్త్రములను ధరించినటువంటియు, గోశాల లనెడి మంచి అలంకారములతో అలంకరించబడి నటువంటియు, యంత్రశాల లనెడి స్తనములు గలిగినటువంటియు, సర్వసమృద్ధమైన లంకాపట్టణ మును హనుమంతుడు చూచెను.

* ఆంజనేయుడు లంకాధిదేవతను జయించుట *

శ్లో॥ అథ సా హరిశార్దూలం ప్రవిశన్తం మహాబలమ్।
నగరీ స్వేన రూపేణ దదర్శ పవనాత్మజమ్॥ ౨౦
సా తం హరివరం దృష్ట్వా లఙ్కా రావణపాలితా।
స్వయమేవోత్థితా తత్ర వికృతాననదర్శనా॥ ౨౧
శ్లో॥ పురస్తాత్కపివర్యస్య వాయుసూనో రతిష్ఠత।
ముఞ్చమానా మహానాద మబ్రవీత్పవనాత్మజమ్॥ ౨౨

టీ॥ అథ = అటుతరువాత, సా = ఆ, నగరీ = లంకాపట్టణము, స్వేనరూపేణ = స్వకీయాకారముచేత, మహాబలం = గొప్పబలముకలవాడు, హరిశార్దూలం = వానరశ్రేష్ఠుడు నగు. పవనాత్మజం = హనుమంతుని, ప్రవిశన్తం = లంకలోప్రవేశించుచున్నవానినిగా. దదర్శ = చూచెను- రావణపాలితా = రావణునిచే, పాలింపబడుచున్న. సా = ఆ, లంకా = లంక. తం = ఆ, హరివరం = హనుమంతుని. దృష్ట్వా = చూచి, తత్ర = అక్కడ, స్వయం = స్వయముగా, వికృతాననదర్శనా- వికృత = వికారమైన. ఆననదర్శనా = చూడబడుముఖముగలదై, ఉత్థితా = లేచినది-కపివర్యస్య = వానరశ్రేష్ఠుడైన, వాయుసూనోః = వాయుపుత్రుడగు హనుమంతునియొక్క. పురస్తాత్ = ఎదుట, అతిష్ఠత = ఉండెను, పవనాత్మజం = హనుమంతునిగూర్చి, మహానాదం = సింహనాదమును, ముంచమానా = చేసినదై, అబ్రవీత్ = పలికెను.

తా॥ మహాబలవంతుడైన అంజనేయుడు లంకలో ప్రవేశించుచుండ రావణునిచే పరిపాలింపబడుచున్న లంకాధిదేవత తన స్వకీయమగు వికృతాకారమును ధరించినదై హనుమంతుని ఎదుట నిలువబడి పెద్దగ సింహనాదము చేయుచు నిట్లు పలికెను.

శ్లో॥ కస్త్వం కేన చ కార్యేణ ఇహ ప్రాప్తో వనాలయ।
కథయ స్వేహ య త్తత్త్వం యావత్ప్రాణా ధర న్తితే॥ ౨౩
నశక్యం ఖల్వియం లఙ్కా ప్రవేష్టుం వానర త్వయా।
రక్షితా రావణబలై రభిగుప్తా సమ న్తతః॥ ౨౪

టీ॥ వనాలయ = వానరుడ। త్వం = నీవు, కః = ఎవడవు. కేన = ఏ. కార్యేణ = పని చేత, ఇహ = ఇచ్చటకు, ప్రాప్తః = చేరితివి? చ = మరియు. యత్ = దేనినిగురించి. త్వం = నీవు, ఇహ = ఇక్కడకు ప్రాప్తః = చేరితివో, తత్ = దానినిగురించి, యావత్ = ఎంతవరకు, తే = నీయొక్క, ప్రాణాః = ప్రాణములు, ధరంతి = ధరింపబడియుండునో (నిలచియుండునో) కథయస్వ = చెప్పుము. వానర = వానరుడ! రావణబలైః = రావణునిసైన్యములచేత, సమంతతః = అంతట, అభిగుప్తా = మిక్కిలి జాగ్రత్తగా కాపాడబడుచు, రక్షితా = రక్షింపబడుచున్నది. ఇయం = ఈ, లంకా = లంక, త్వయా = నీచేత, ప్రవేష్టుం = ప్రవేశింపబడుటకు, నశక్యాఖలు = శక్యమైనది కాదుగదా!

తా॥ వానర! నీవెవ్వడవు? ఇచ్చటకు వచ్చిన పనియేమి? నీప్రాణ మున్నంతలోనే ఆరహస్యమును చెప్పవలెను. మహాబలవంతు డైన రావణుని సైన్యములచే జాగ్రత్తగా రక్షింపబడుచున్న ఈలంకలో ప్రవేశింప నెవరికిని శక్యముకాదు.

శ్లో॥ అథతా మబ్రవీ ద్వీరో హనుమా నగ్రతః స్థితామ్।
కథయిష్యామి తే తత్త్వం య న్మాం త్వం పరిపృచ్ఛసి॥ ౨౫
శ్లో॥ కా త్వం విరూప నయనా పురద్వారేఽవతిష్ఠసి।
కి మర్థం చాపిమాం రుద్ధ్వా నిర్భర్త్సయసి దారుణా॥ ౨౬

టీ॥ అథ = అనంతరము, వీరః = పరాక్రమవంతుడైన. హనుమాన్ = ఆంజనేయుడు, అగ్రతః = ఎదుటగా, స్థితాం = ఉన్నటువంటి. తాం = ఆలంకాధిదేవతను గూర్చి, అబ్రవీత్ = పలికెను, అయి = ఓసి,

త్వం = నీవు, యత్ = దేనిగురించి, మాం = నన్ను. పరిపృచ్ఛసి = అడుగుచున్నావో, తత్ = ఆ, తత్త్వం = యథార్థమును, తే = నీకు, కథయిష్యామి = చెప్పెదను. విరూపనయనా = వికారనేత్రములు గలదానవై, పురద్వారే = పురద్వారమునందు, అవతిష్ఠసి = ఉంటున్నావు. త్వం = నీవు, కా = ఎవతెవు. అపి చ = మరియు. మాం = నన్ను, రుద్ధ్వా = ఆపుచేసి. కిమర్థం = ఎందునిమిత్తమై, దారుణా = ఘోరమైనదానవై, నిర్భర్త్సయసి = భయపెట్టుచున్నావు?

తా॥ మహాబలశాలియగు హనుమంతుడు తనముందు వికారవదనముతో నిలచియున్న లంకారాక్షసిని చూచి, నాకథ చెప్పెదను కానిముందు నీవెవ్వతవు? పురద్వారమునం దెందు కున్నావు? నన్నింత ఘోరముగా ఎందుకు భయపెట్టుచున్నావో చెప్పుము.

శ్లో॥ హనుమద్వచనం శ్రుత్వా లఙ్కా సా కామరూపిణీ।
ఉవాచ వచనం క్రుద్ధా పరుషం పవనాత్మజమ్॥ ౨౭

టీ॥ కామరూపిణీ = కోరినరూపమును ధరించగల, సా = ఆ, లంకా = లంకారాక్షసి, హనుమద్వచనం = హనుమంతుని వాక్యమును, శ్రుత్వా = విని, క్రుద్ధా = కోపముకలదై, పవనాత్మజం = ఆంజనేయునిగూర్చి, పరుషం = కఠినమైన వచనం = వాక్యమును, ఉవాచ = పలికెను.

తా॥ కామరూపిణి యగు ఆ లంకాధిదేవత ఆంజనేయునియొక్క ధైర్య వాక్యమును విని అధికకోపముతో హనుమంతునితో కఠినముగా నిట్లు పలికెను.

శ్లో॥ అహం రాక్షసరాజస్య రావణస్య మహాత్మనః।
ఆజ్ఞా ప్రతీక్షా దుర్ధర్షా రక్షామి నగరీ మిమామ్॥ ౨౮
నశక్యా మా మవజ్ఞాయ ప్రవేష్టుం నగరీ త్వయా।
అద్య ప్రాణైః పరిత్యక్త స్స్వప్స్యసే నిహతో మయా॥ ౨౯

శ్లో॥ అహం హి నగరీ లఙ్కా స్వయమేవ ప్లవఙ్గమ।
సర్వతః పరిరక్షామి హ్యేత త్తే కథితం మయా॥ ౩౦

టీ॥ అహం = నేను, మహాత్మనః = మహానుభావుడైన, రాక్షసరాజస్య = రాక్షసప్రభువైన, రావణ్యస్య = రావణునియొక్క, ఇమాం = ఈ, నగరీం = పట్టణమును, దుర్ధర్షా = దాటశక్యముకాని, ఆజ్ఞా = ఆజ్ఞను, ప్రతీక్షా = చూచుచున్నదాననై, రక్షామి = కాపాడుచున్నాను. మాం = నన్ను, అవజ్ఞాయ = తిరస్కరించి, త్వయా = నీచేత, నగరీ = లంకా పట్టణము, ప్రవేష్టుం = ప్రవేశించుటకు, నశక్యా = శక్యముకాదు, అద్య = ఇప్పుడు, మయా = నాచేత, నిహతః = కొట్టబడినవాడవై, ప్రాణైః = ప్రాణములతో, పరిత్యక్తః = విడిచిపెట్టబడినవాడవై, స్వప్స్యతే = పెద్దగనిద్రించెదవు. ప్లవంగమ = వానర! అహం = నేను, స్వయమేవ = స్వయముగానే, లంకానగరీ హి = లంకానగరమును, సర్వతః = అంతట, పరిరక్ష్యామి = రక్షించుచున్నాను. ఏతత్ = ఇది, మయా = నాచేత, తే = నీకు, కథితం హి = చెప్పబడినదికదా!

తా॥ ఓవానర! నేను మహానుభావుడు రాక్షసప్రభువు నగు రావణుని ఆజ్ఞ ప్రకారము ఈనగరమును ఎవరికి చొరశక్యముగానట్లు రక్షించుచున్నాను. నాచేత కొట్టబడి ఇప్పుడే నీవు మరణించెదవు. నేను లంకాపట్టణాధిదేవతను, దీనిని నేను రక్షించుచుందును, ఇది నా కథ.

శ్లో॥ లఙ్కాయా వచనం శ్రుత్వా హనుమా న్మారుతాత్మజః।
యత్నవాన్ స హరిశ్రేష్ఠః స్థిత శ్శైల ఇవాపరః॥ ౩౧
సతాం స్త్రీరూప వికృతాం దృష్ట్వా వానరపుఙ్గవః।
అబభాషేఽథ మేధావీ సత్త్వవాన్ ప్లవగర్షభః॥ ౩౨

టీ॥ మారుతాత్మజః = వాయుపుత్రుడైన. హనుమాన్ = హనుమంతుడు, లంకాయాం = లంకయొక్క, వచనం = వాక్యమును, శ్రుత్వా = విని

యత్నవాన్ = ప్రయత్నము గలవాడై. హరిశ్రేష్ఠః = వానరశ్రేష్ఠుడైన, సః = ఆహనుమంతుడు, అపరః = రెండవదైన, శైలఇవ = పర్వతమువలె, స్థితః = ఉండెను— వానరపుంగవః = వానర శ్రేష్ఠుడైన, సః = అహనుమంతుడు, స్త్రీరూపవికృతాం—స్త్రీరూప = స్త్రీరూపముచేత, వికృతాం = వికారము గానున్న. తాం = ఆ లం క ను, దృష్ట్వా = చూచి. అథ = అనంతరము, మేధావీ = బుద్ధిమంతుడు, సత్త్వవాన్ = బలవంతుడు. ప్లవగర్షభః = వానరశ్రేష్ఠుడు నగు హనుమంతుడు. అబభాషే = పలికెను.

తా॥ అతికఠినముగా పల్కిన లంకారాక్షసియొక్క, మాటలను విని హనుమంతు డందులకు తగిన ప్రయత్నముగలవాడై అపర పర్వతమువలె నున్నవాడై వికారస్త్రీరూపములో నున్న లంకతో ఇట్లు పలికెను.

శ్లో॥ ద్రక్ష్యామి నగరీం లఙ్కాం సాట్టప్రాకార తోరణామ్।
ఇత్యర్థ మిహ సంప్రాప్తః పరం కౌతూహలం హి మే॥ ౨౩
వనా న్యుపవనా నీహ లఙ్కాయాః కాననాని చ।
సర్వతో గృహముఖ్యాని ద్రష్టు మాగమనం హి మే॥ ౨౪

టీ॥ సాట్టప్రాకారతోరణాం = ప్రాకా రాట్టాలక తోరణాదులతోకూడియున్న లంకాంనగరీం = లంకాపట్టణమును, ద్రక్ష్యామి = చూడగలను, మే = నాకు, పరం = ఉత్కృష్టమైన.కౌతూహలం = కుతూహలము(అస్తి = కలదు)ఇత్యర్థంహి = ఇందునిమిత్తమే,ఇహ = ఇచ్చటకు,సంప్రాప్తః = చేరినాఁడను, ఇహ = ఇచ్చట. లంకాయాః = లంకయొక్క. వనాని = వనములను, ఉపవనాని = ఉపవనములను, కాననానిచ = అరణ్యములను, సర్వతః = అంతట, గృహముఖ్యాని = ముఖ్యములైన గృహములను, ద్రష్టుం = చూచుటకు, మే = నాయొక్క, అగమనంహి = వచ్చుటనుమా॥

తా॥ ఓలంకాధీశ్వరీ! ఇచ్చటి పెద్దవీధులు ప్రాకార తోరణాదులు పెద్ద పెద్ద వనములు ఉద్యానవనములు భవనములు చూచుటకొఱకే నేను కుతూహలముతో వచ్చితిని.

శ్లో॥ తస్య తద్వచనం శ్రుత్వా లఙ్కా సా కామరూపిణీ।
భూయ ఏవ పునర్వాక్యం బభాషే పరుషాక్షరమ్॥ 34
మా మనిర్జిత్య దుర్బుద్ధే రాక్షసేశ్వర పాలితామ్।
న శక్య మద్యతే ద్రష్టుం పురీయం వానరాధమ॥ 35

టీ॥ కామరూపిణీ = కోరినరూపము ధరించగల,సా = ఆ, లంకా = లంకా రాక్షసి. తస్య = ఆహానుమంతునియొక్క. తత్ = ఆ. వచనం = వాక్యమును. శ్రుత్వా = విని. భూయఏవ = మరల. పరుషాక్షరం = కఠినాక్షరములుగల, వాక్యం = వాక్యమును, పునః = తిరిగి, బభాషే = పలికెను-దుర్బుద్ధే = ఓ చెడుబుద్ధిగలవాడ, రాక్షసేశ్వర పాలితాం - రాక్షసేశ్వర = రావణాసురునిచే పాలితాం = పాలింపబడుచున్న. ఇయం = ఈ, పురీ = లంకాపట్టణము, మాం = నన్ను, అనిర్జిత్య = జయించక వానరాధమ = నీచవానర! అద్య = ఇప్పుడు. తే = నీకు. ద్రష్టుం = చూచుటకు. నశక్యం = శక్యముకాదు.

తా॥ ఓనీచవానర! మహాబలవంతుడైన రావణునిచే పరిపాలింపబడుచున్న ఈ లంకాపురమును ఇప్పుడు నీవు నన్ను జయించక వెళ్లిచూచుటకు శక్యముకాదు అని కఠినముగా పలికెను.

శ్లో॥ తత స్స కపి శార్దూల స్తా ము వాచ నిశాచరీమ్।
దృష్ట్వా పురీ మిమాం భద్రే పున ర్యాస్యే యథాగతమ్॥ 36

టీ॥ తతః = అటుతరువాత సః = ఆ. కపిశార్దూలః = కపిశ్రేష్ఠుడగు హానుమంతుడు. తాం = ఆ. నిశాచరీం = రాక్షసియగు లంకనుగూర్చి. ఉవాచ = పలికెను. భద్రే = శుభప్రదురాలా! ఇమాం = ఈ. పురీం = పట్టణమును, దృష్ట్వా = చూచి. పునః = తిరిగి. యథాగతం = వచ్చిన ప్రకారముగానే. యాస్యే = వెళ్లుదును.

తా॥ ఓ శుభప్రదురాలా! నేను ఈ లంకాపురియందలి చిత్రములైన దృశ్యములను చూచి, తిరిగి వెంటనే వచ్చిన ప్రకారమే వెళ్ళిపోవుదును. కోపింపవలదని కఠినముగను కోపముతోను లంక పలికినను మేధాసంపన్నుడైన హనుమంతుడు మృదువుగనే పలికెను. కార్యసాధకులు సమర్థులైనను సమయాసమయముల నెరింగి యోచించి కాని ఏపనియు చేయరుగదా!

శ్లో॥ తతః కృత్వా మహానాదం సా వై లఙ్కా-భయావహమ్।
తలేన వానరశ్రేష్ఠం తాడయామాస వేగితా॥ ౩౮

టీ॥ తతః = ఆతరువాత. సా = ఆ. లంకా వై = లంకారాక్షసియే, భయావహం = భయంకరమైన, మహానాదం = సింహనాదమును, కృత్వా = చేసి, వేగితా = తొందరపడినదై, తలేన = అరచేతితో, వానరశ్రేష్ఠం = ఆంజనేయుని, తాడయామాస = కొట్టెను.

తా॥ ఆ లంకారాక్షసి అంజనేయుని నమ్రతాపూర్వకమైన ప్రార్థనను త్రోసిపుచ్చి భయంకరముగా గర్జించుచు తన అరచేతితో హనుమంతుని చరచెను.

శ్లో॥ తత స్స కపిశార్దూలో లఙ్కయా తాడితో భృశమ్।
ననాద సుమహానాదం వీర్యవాన్ పవనాత్మజః॥ ౩౯
తత స్సంవర్తయామాస వామహస్తస్య సోఽఙ్గుళీః।
ముష్టినాఽభిజఘా నైనాం హనుమాన్ క్రోధమూర్ఛితః॥ ౪౦
స్త్రీ చేతి మన్యమానేన నాతిక్రోధ స్స్వయం కృతః।

టీ॥ తతః = అటుతరువాత, సః = ఆ, కపిశార్దూలః = కపిశ్రేష్ఠుడైన హనుమంతుడు, భృశం = మిక్కిలి, లంకయా = లంకారాక్షసిచేత, తాడితః = కొట్టబడినవాడై, వీర్యవాన్ = పరాక్రమవంతుడైన, పవనాత్మజః = వాయుపుత్రుడైన హనుమంతుడు, మహానాదం = సింహనా

దమును, ననాద = గర్జించెను — తతః = ఆ అనంతరము సః = ఆహనుమంతుడు, క్రోధమూర్చితః = మంచికోపము వచ్చిన వాడై, వామహస్తస్య = ఎడమచేతియొక్క, అంగుళీః = వ్రేళ్ళను. సంవర్తయామాస = మెలిత్రిప్పెను-ఏనాం = ఈరాక్షసిని, హనుమాన్ = హనుమంతుడు, ముష్టినా = పిడికిలిచేత, అభిజఘాన = పొడిచెను, సా = ఆ లంకారాక్షసి. స్త్రీచేతి = ఆడదని, మన్యమానేన = తలంచినవాడగుట చేత, స్వయం = స్వయముగా, అతిక్రోధః = ఎక్కువకోపము, న కృతః = చేయడాయెను.

తా॥ ఆహనుమంతుడు లంకిణిచేత చరచబడిన తరువాత ఎక్కువకోపముతో పెద్దగా సింహనాదము చేసి, దాని ఎడమచేతి వేళ్ళను మెలిత్రిప్పి ఆడదిగదా యని చంపక పిడికిలితో ఒకపోటు పొడిచి వదలివేసెను.

శ్లో॥ సా తు తేన ప్రహారేణ విహ్వలాఙ్గీ నిశాచరీ।
పపాత సహసా భూమౌ వికృతానన దర్శనా॥ ౪౧

టీ॥ సా = ఆ. నిశాచరీ = రాక్షసి, తేన = ఆ. ప్రహారేణ = దెబ్బచేత. విహ్వలాఙ్గీ = విడిపోయిన అవయవములుకలదై, తు = ఇంతేగాక, సహసా = వెంటనే. వికృతాననదర్శనా-వికృత = వికారము చేయబడిన ఆననదర్శనా = ముఖాకారముగలదై. భూమౌ = భూమియందు పపాత = పడెను.

తా॥ ఆ హనుమంతుడు ఎడమచేతి పిడికిలితో ఒక్కపోటు పొడవగా, ఆ రాక్షసి శిథిలములగు అవయవములు కలదై పెద్దగా నోరు తెరచి భూమిపై పడెను.

* లంకారాక్షసి తనను రక్షింప ఆంజనేయుని వేడుట *

శ్లో॥ తత స్తు హనుమాన్ ప్రాజ్ఞ స్తాం దృష్ట్వా వినిపాతితామ్।
కృపాం చకార తేజస్వీ మన్యమానః స్త్రియం తు తామ్॥ ౪౨

టీ॥ తతః = అటుతరువాత, ప్రాజ్ఞః = బుద్ధిశాలియైన, హనుమాన్ = హనుమంతుడు, వినిపాతితాం = పడియున్న, తాం = ఆలంకారాక్షసిని, దృష్ట్వా తు = చూచి తేజస్వీ = తేజశ్శాలియగు హనుమంతుడు తాం = ఆమెను, స్త్రియం = స్త్రీనిగా, మన్యమానః = తలచినవాడై, కృపాం = దయను, చకార = చేసెను,

తా॥ తరువాత అంజనేయుడు తన పిడికిలిపోటుతో భూమిపై పడియున్న లంకను చూచి మహాజ్ఞాని యగుటచే స్త్రీయని దయతో వదలెను

శ్లో॥ తతోవై భృశ సంవిగ్నా లఙ్కా సా గద్గదాక్షరమ్।
ఉవా చాగర్వితం వాక్యం హనుమన్తం ప్లవఙ్గమమ్॥ ౪౩

టీ॥ తతః = అటుతరువాత, సా = ఆ లఙ్కా = లంకారాక్షసి, భృశసంవిగ్నా వై = అత్యంత వినయముకలదై, ప్లవంగమం = వానరుడైన హనుమంతం = ఆంజనేయునిగూర్చి, గద్గదాక్షరం = వణకుచున్న అక్షరములుగలిగి, అగర్వితం = గర్వములేనట్టి, వాక్యం = వాక్యమును, ఉవాచ = పలికెను,

తా॥ తరువాత లంకారాక్షసి వినయ వివేకాదులతో కూడి హనుమంతుని గూర్చి వణకుచు తడబడు మాటలతో నిట్లు పలికెను.

శ్లో॥ ప్రసీద సుమహాబాహో త్రాయస్వ హరిసత్తమ ।
సమయే సౌమ్య తిష్ఠన్తి సత్త్వవన్తో మహాబలాః॥ ౪౪
అహం తు నగరీ లఙ్కా స్వయమేవ ప్లవంగమ।
నిర్జితాఽహం త్వయావీర విక్రమేణ మహాబల॥ ౪౫

టీ॥ హరిసత్తమ = వానరశ్రేష్ఠ। సుమహాబాహో = గొప్పభుజబలముకలవాడ? ప్రసీద = అనుగ్రహించుము, త్రాయస్వ = రక్షించుము, సౌమ్య = ఓసౌమ్యుడా। మహాబలాః = గొప్పబలముకలిగిన, సత్త్వవంతః = ధైర్యవంతులు. సమయే = అపసరకాలమందు. తిష్ఠన్తి =

శాంతిగా ఉందురు, ప్లవంగమ = ఓవానర! అహం తు = నేను. స్వయమేవ = స్వయముగా. లంకానగరీ = లంకాపట్టణమును, మహాబల = గొప్పబలము కలవాడ! వీర = వీరుడా! త్వయా = నీచేత. విక్రమేణ = పరాక్రమముచేత. నిర్జితా = = జయింపబడితిని.

తా॥ ఓపరాక్రమవంత! హనుమంత! శాంతించుము, రక్షించుము, శాంతవంతులు పరాక్రమవంతులు నైన పురుషులు సమయము వచ్చినప్పుడు స్త్రీలను చంపరాదను మర్యాదను దాటరు. నేను స్వయముగా ఈలంకా పట్టణమున కధిదేవతను, ఇప్పుడు నీచే జయింపబడితిని.

శ్లో॥ ఇదం తు తథ్యం శృణువై బ్రువన్త్యా మే హరీశ్వర।
స్వయంభువా పురా దత్తం వరదానం యథా మమ॥ ४८

టీ॥ హరీశ్వర = వానరనాయక! పురా = పూర్వము, స్వయంభువా = బ్రహ్మచేత, మమ = నాకు, యథా = ఎట్లు, వరదానం = వరదానము, దత్తం = ఈయబడినదో, బ్రువన్త్యాః = చెప్పుచున్న, మే = నాయొక్క, ఇదం = ఈ, తథ్యంతు = నిజమును. శృణువై, = వినుము.

తా॥ వానరశ్రేష్ఠ! పూర్వకాలమందు బ్రహ్మ నాకొక వరము నిచ్చెను. దానిని యథార్థముగా నీకు చెప్పెదను వినుము

శ్లో॥ యదా త్వాం వానరః కశ్చి ద్విక్రమా ద్వశమానయేత్।
తదా త్వయా హి విజ్ఞేయం రక్షసాం భయ మాగతమ్॥ ४౯

టీ॥ యదా = ఎప్పుడు, కశ్చిత్ = ఒకానొక, వానరః = వానరుడు, విక్రమాత్ = పరాక్రమమువలన, త్వాం = నిన్ను, వశం = వశమును, ఆనయేత్ = పొందించునో, తదాహి = అప్పుడే, రక్షసాం = రాక్షసులకు. భయం = భయము. ఆగతం = వచ్చినదిగా, త్వయా = నీచేత. విజ్ఞేయం = తెలిసికొనదగును,

తా॥ ఎప్పుడు ఒకవానరుడు వచ్చి పరాక్రమముతో నిన్ను జయించునో, అప్పుడేరాక్షసులకు భయము ప్రాప్తించునని తెలిసికొమ్ము అని బ్రహ్మపూర్వము నాకు వరమిచినప్పుడు చెప్పియుండెను. ఇది యధార్థము.

శ్లో॥ సహి మే సమయ స్సౌమ్య ప్రాప్తోఽద్య తవ దర్శనాత్।
స్వయంభు విహిత స్సత్యో న తస్యాస్తి వ్యతిక్రమః॥ ౪౮
సీతానిమిత్తం రాజ్ఞ స్తు రావణస్య దురాత్మనః।
రక్షసాం చైవ సర్వేషాం వినాశ స్సముపాగతః॥ ౪౯

టీ॥ సౌమ్య = శాంతుడా। మే = నాకు. సః = ఆ, సమయః = సమయము, అద్యహి = ఇప్పుడే. తవ = నీయొక్క. దర్శనాత్ = దర్శనమువలన, ప్రాప్తః = సంప్రాప్తమైనది. స్వయంభు విహితః = బ్రహ్మచే చెప్పబడినది. సత్యః = యథార్థము. తస్య = అతనివాక్కునకు, వ్యతిక్రమః = వ్యతిరేకము. నాస్తి = లేదు, సీతానిమిత్తం = సీతకారణముగా, రాజ్ఞః = రాజైన, దురాత్మనః = దుర్మార్గుడైన, రావణస్య = రావణునికి సర్వేషాం = సమస్తములైన, రక్షసాంచైవ = రాక్షసులకును, వినాశః = నాశనము, సముపాగతః = సంప్రాప్తమైనది.

తా॥ శాంతిస్వరూపుడ వగు వానరోత్తమ। నీయొక్క దర్శనము నన్ను జయించడము, ఇదే ఆ బ్రహ్మ చెప్పిన సమయ మగును, బ్రహ్మ వాక్కు దాట శక్యముగానిదికదా। సీతకార్యణముగా దుర్మార్గుడైన రావణునకు, సమస్త రాక్షసులకు వినాశకాలము దాపురించినది

శ్లో॥ తత్ప్రవిశ్య హరిశ్రేష్ఠ పురీం రావణపాలితామ్।
విధత్స్వ సర్వకార్యాణి యాని యానీహ వాఞ్ఛసి॥ ౫౦

టీ॥ హరిశ్రేష్ఠ = ఓవానరశ్రేష్ఠ। తత్ = ఆ కారణము వలన, రావణపాలితాం = రావణునిచే పాలింపబడుచున్న. పురీం = లంకాపురమును,

ప్రవిశ్య = ప్రవేశించి, ఇహా = ఇక్కడ, యాని యాని = ఏఏపనులను గూర్చి, వాఞ్ఛసి = కోరుచున్నావో. సర్వకార్యాణి = ఆసమస్తకార్యములను. విధత్స్వ = చేసికొనుము.

తా॥ ఓవానరశ్రేష్ఠ! ఆకారణమున నీవిప్పుడు లంకాపట్టణములో ప్రవేశించి ఏఏకార్యముల జేయదలంచితివో, ఆయా సమస్త కార్యములను నీయిష్ట ప్రకారము చేసికొనుము.

శ్లో॥ ప్రవిశ్య శాపోపహతాం హరీశ్వర
శ్శుభాం పురీం రాక్షసముఖ్య పాలితామ్।
యదృచ్ఛయా త్వం జనకాత్మజాం సతీమ్
విమార్గ సర్వత్ర గతో యథాసుఖమ్॥ ౫౧

టీ॥ హరీశ్వర = ఓవానరశ్రేష్ఠ! శాపోపహతాం–శాప = నందికేశ్వరుని శాపముచేత, ఉపహతాం = కొట్టబడినటువంటియు, రాక్షసముఖ్యపాలితాం-రాక్షసముఖ్య = రాక్షసప్రభువగు రావణునిచే, పాలితాం = పరిపాలింపబడుచున్నట్టియు, శుభాం = శుభప్రదమైన, పురీం = లంకాపురమును. యదృచ్ఛయా = స్వేచ్ఛగా. ప్రవిశ్య = ప్రవేశించి. త్వం = నీవు. సతీం = పతివ్రతయు, జనకాత్మజాం = జనకునిపుత్రికయు నైన సీతను. సర్వత్ర = అంతట, గతః = వెళ్లినవాడవై, విమార్గ = వెదకుము.

తా॥ వానరశ్రేష్ఠ! నందికేశ్వరశాపము వలన సర్వనాశనమునకు సంసిద్ధముగా నుండి రావణునిచే పాలింపబడుచున్న యీ లంకలో ప్రవేశించి అంతట సుఖముగా సంచరించి లోకమాత యగు సీతను నిరాటంకముగా వెదకుము. మీకు శుభం బగుగాక.

తృతీయ స్సర్గః సమాప్తః

## శ్రీమద్వాల్మీకిరామాయణే సున్దరకాణ్డే చతుర్థ స్సర్గః

### * హనుమంతుడు లంకలో విహరించుట *

శ్లో॥ స నిర్జిత్య పురీం శ్రేష్ఠాం లఙ్కాం తాం కామరూపిణీం।
విక్రమేణ మహాతేజా హనుమాన్ కపిసత్తమః॥ ౧
అద్వారేణ మహాబాహుః ప్రాకార మభిపుప్లువే।

టీ॥ మహాతేజా = గొప్పతేజశ్శాలియైనటువంటియు, కపిసత్తమః = వానర శ్రేష్ఠుడైన, సః = ఆ, హనుమాన్ = హనుమంతుడు, విక్రమేణ = పరాక్రమముతో కామరూపిణీం = కోరినరూపమును ధరించునదియు. శ్రేష్ఠాం = శ్రేష్ఠమైనదియు నగు, తాం = ఆ, లంకాపురీం = లంకారాక్షసిని, నిర్జిత్య = జయించి, మహాబాహుః = గొప్పభుజబలముకలిగిన ఆంజనేయుడు, అద్వారేణ = ద్వారములేని ప్రదేశముచేత, ప్రాకారం = ప్రాకారమును, అభిపుప్లువే = లంఘించెను.

తా॥ తేజశ్శాలి, పరాక్రమవంతుడు నైన హనుమంతుడు, కామరూపిణియు జయింప శక్యముగానిదియు నగు లంకారాక్షసిని జయించి, ద్వారము లేని చోటునుండి, ప్రాకారమును దాటి లంకయందు ప్రవేశించెను (శత్రు స్థానమును అద్వారమున ప్రవేశింపవలయు నని రాజనీతి. కనుక హనుమంతుడు అద్వారమున లంకయందు ప్రవేశించెను గాని వెఱచి మాత్రము కాదు, శ్లో॥ గ్రామంవా నగరం వాపి పత్తనం వా పరస్యహి । విశేషా త్సమయే సౌమ్యా నద్వారేణ విశేన్నృప॥ ఇదిప్రమాణము—"అద్వారేణ రిపో ర్గేహం, ద్వారేణ సుహృదో గృహాన్ ప్రవిశంతి నరాధీరా, ద్వారాణ్యేతాని ధర్మతః" (భార.సభా.) శత్రుగృహమును అద్వారమునను, స్నేహితుల బంధువుల గృహములను ద్వారమునను ప్రవేశింపవలె నని ధర్మశాస్త్రము కలదు

శ్లో॥ ప్రవిశ్య నగరీం లఙ్కాం కపిరాజ హితం కరః ౨
చక్రేఽథ పాదం సవ్యం చ శత్రూణాం స తు మూర్ధని॥

టీ॥ అథ = అనంతరము, కపిరాజహితంకరః-కపిరాజ = వానరప్రభువైన సుగ్రీవునకు, హితంకరః = హితమును చేయునటువంటి, సః = ఆ హనుమంతుడు, లంకాంనగరీం = లంకాపట్టణమును, ప్రవిశ్య = ప్రవేశించి, శత్రూణాం = శత్రువులయొక్క, మూర్ధని = శిరస్సునందు, సవ్యం = ఎడమదైన, పాదం = పాదమును, చక్రే = చేసెను (ఉంచెను)

తా॥ ఆంజనేయుడు సుగ్రీవునకు హితముచేయ తలపెట్టినవాడై, శత్రువుల శిరస్సునందు ఎడమపాదము పెట్టినట్లు లంకలో ముందుగా ఎడమపాదము పెట్టిప్రవేశించెను-"ప్రయాణకాలే చ గృహప్రవేశే। వివాహకాలేపి చ దక్షిణాఙ్ఘ్రిః కృత్వాగ్రతః శత్రుపరప్రవేశే వామం విదధ్యాచ్చరణం నృపాలః" అని బృహస్పతి వాక్యప్రమాణము. "ప్రయాణకాలమందు గృహప్రవేశమునందు వివాహకాలమునందు ముందుగా కుడిపాదమును, శత్రు పురప్రవేశములందు ఎడమపాదముమ ఉంచవలె ననినీతి.

శ్లో॥ ప్రవిష్ట స్సత్వసమ్పన్నో నిశాయాం మారుతాత్మజః॥ ౩
స మహాపథ మాస్థాయ ముక్తా పుష్ప విరాజితమ్।
తతస్తు తాం పురీం లఙ్కాం రమ్యా మభియయౌ కపిః॥ ౪

టీ॥ సః = ఆ. సత్వసమ్పన్నః = బలముతోకూడిన. వాతాత్మజః = హనుమంతుడు, నిశాయాం = రాత్రియందు, ప్రవిష్టః = ప్రవేశించినవాడై. ముక్తాపుష్పవిరాజితం-ముక్తా = ముత్యములచేతను. పుష్ప = పుష్పములచేతను, విరాజితం = ప్రకాశించుచున్న, మహాపథం = గొప్పమార్గమును (రాజవీధిని) ఆస్థాయ = పొంది, తతః = అనంతరము,

కపిః = ఆంజనేయుడు. రమ్యాం = సుందరమైన, తాం = ఆ, లంకాం = లంక అనబడెడి. పురీం తు = పట్టణమునే, అభియయౌ = కలయజూచుచు వెళ్ళెను.

తా॥ మహాబలసంపన్నుడైన హనుమంతుడు రాత్రియందు లంకలో ప్రవేశించి ముత్యములు పుష్పములు తోరణములుగా కట్టబడిన పెద్దవీధిని చేరి సుందరమైన ఆ పట్టణము నంతయు కలయజూచుచు వెళ్ళెను.

శ్లో॥ హాసి తోత్కృష్ట నినదై స్తూర్యఘోష పురస్సరైః।
వజ్రాఙ్కుశ నికాశై శ్చ వజ్రజాల విభూషితైః॥ 3
గృహమేఘైః పురీ రమ్యా బభాసే ద్యౌ రి వామ్బుదైః।

టీ॥ హాసితోత్కృష్టనినదైః - హాసిత = నవ్వబడుటచేత. ఉత్కృష్ట = గొప్పవైన. నినదైః = ధ్వనులు కలిగినటువంటియు. తూర్యఘోషపురస్సరైః - తూర్య = మంగళవాయిద్యములయొక్క. ఘోష = ధ్వనులు. పురస్సరైః = ముందుగా నున్నటువంటియు. వజ్రాఙ్కుశనికాశైః—వజ్ర = వజ్రాయుధము. అంకుశ = అంకుశము నకు, నికాశైః = సమానము లైనట్టియు. వజ్రజాలవిభూషితైః—వజ్రజాల = వజ్రసమూహములచేత, విభూషితైః = అలంకరించబడినట్టి. గృహమేఘైః = గృహవిశేషములచేత, రమ్యా = సుందరమైన. పురీ = లంకాపట్టణము, అంబుదైః = మేఘములతో, ద్యౌరివ = ఆకాశమువలె, బభాసే = ప్రకాశించెను.

తా॥ గొప్పవైన హాసధ్వనులచేతను, మంగళవాద్యములచేతను, వజ్రములచే నలంకరించబడిన తెల్లని ఐరావతమువలె నున్న గృహవిశేషములతో ఆ పట్టణము మేఘములతో కూడిన ఆకాశమువలె ప్రకాశించుచుండెను.

శ్లో॥ ప్రజజ్వాల తదా లఙ్కా రక్షోగణ గృహైః శుభైః ౬
సితాభ్ర సదృశై శ్చిత్రైః పద్మ స్వస్తిక సంస్థితైః।
వర్ధమాన గృహైశ్చాపి సర్వత స్సువిభూషితా॥ ౭
తాం చిత్రమాల్యాభరణాం కపిరాజ హితంకరః।
రాఘవార్థం చరన్ శ్రీమాన్ దదర్శ చ ననన్ద చ॥ ౮

టీ॥ తదా = అప్పుడు, శ్రీమాన్ = శోభాయుక్తుడైన ఆంజనేయుడు, శుభైః = శుభప్రదములై. సితాభ్రసదృశైః – సిత = తెల్లనైన, అభ్ర = మేఘములతో. సదృశైః = సమానములైన. చిత్రైః = చిత్రములతోను. పద్మస్వస్తికసంస్థితైః–పద్మ = పద్మము. స్వస్తిక = స్వస్తికములుగా, సంస్థితైః = ఉన్నటువంటియు, వర్ధమాన గృహైశ్చ = వర్ధమాన మనే గృహములచేతనునొప్పు, రక్షోగణ గృహైః = రాక్షససమూహముల గృహముల చేతను, అపి చ = మరియు, సర్వతః = అంతట, సువిభూషితా = బాగుగా అలంకరించబడినదై, లఙ్కా = లంకాపట్టణము, ప్రజజ్వాల = ప్రకాశించెను– చిత్రమాల్యాభరణాం–చిత్ర = చిత్రములైన. మాల్యాభరణాం = మాలికల అలంకారములు గలిగినట్టి, తాం = ఆలంకను, కపిరాజహితంకరః – కపిరాజ = సుగ్రీవునకు. హితంకరః = ఇష్టముచేయువాడై, రాఘవార్థం = శ్రీరాముని నిమిత్తమై, చరన్ = సంచరించుచు, దదర్శ = చూచెను, ననంద చ = ఆనందించెను,

తా॥ ఆంజనేయుడు సుగ్రీవునకు హిత మొనర్ప దలచినవాడై, తెల్లని మేఘములతో సమానములై స్వస్తిక, పద్మ, వర్ధమానములను పేర్లు గలిగి వాస్తుశాస్త్ర శుభలక్షణ సమన్వితముగా నిర్మించబడి చిత్రములైన రాక్షసగృహములతో అలంకరించబడి యున్న లంకాపట్టణమును నలువైపుల చూచి, రామసుగ్రీవుల కార్యమును నెరవేర్చగలననే ధైర్యముతో సంతోషించెను–స్వస్తికమని పద్మమని, వర్ధమానమని, రాజ గృహములపేర్లు, నలుచదరముగా నున్న, రాచనగరికి స్వస్తిక మని

పేరు "చతుశ్శాలా చతుర్ద్వారా సర్వతోభద్ర సంజ్ఞితా। పశ్చిమద్వార రహితా మధ్యావర్తా హయాననా। దక్షిణద్వార రహితా వర్ధమానా ధన ప్రదా॥ ప్రాగ్ద్వార రహితా స్వస్తికాఖ్యా పుత్రధనప్రదా" అను ప్రమాణము ననుసరించి. నాలుగుదిక్కుల ద్వారములు గలిగిన చతుశ్శాలకు సర్వతోభద్రమనియు, పశ్చిమద్వారములేనిది మధ్యమము, దక్షిణద్వారము లేనిది వర్ధమానము, తూర్పుద్వారము లేనిది స్వస్తికము అనియు పేర్లు.

శ్లో॥ భవనా ద్భవనం గచ్ఛన్ దదర్శ పవనాత్మజః।
వివిధాకృతి రూపాణి భవనాని తత స్తతః॥ ౯
శుశ్రావ మధురం గీతం త్రిస్థాన స్వర భూషితమ్।
స్త్రీణాం మదసమృద్ధానాం దివి చాప్సరసా మివ॥ ౧౦
శుశ్రావ కాఞ్చీనినదం నూపురాణాం చ నిస్స్వనమ్।
సోపాన నినదాం శ్చైవ భవనేషు మహాత్మనామ్॥ ౧౧
ఆస్ఫోటిత నినాదాం శ్చ క్ష్వేళితాం శ్చ తత స్తతః।

టీ॥ పవనాత్మజః = ఆంజనేయుడు, భవనాత్ = భవనమునుండి, భవనం = భవనమునుగూర్చి, గచ్ఛన్ = వెళ్లుచున్నవాడై, తత స్తతః = అక్కడక్కడ, వివిధాకృతి రూపాణి—వివిధ = అనేకవిధములైన ఆకృతిరూపాణి = ఆకారసౌందర్యముగల, భవనాని = భవనములను. దదర్శ = చూచెను. త్రిస్థానస్వరభూషితం-త్రిస్థాన = ఉరః కంఠశిరస్సులందైన, స్వర = మంద్ర, మధ్యమ, తార స్వరములచే, భూషితం = అలంకరించిబడినదియు. మధురం = శ్రావ్యమైనదియు నగు. దివి = స్వర్గమందు, అప్సరసా మివ = అప్సరసలవలె, మదసమృద్ధానాం—మదముచే సమృద్ధానాం = నిండియున్న, స్త్రీణాం = స్త్రీలయొక్క, గీతం చ = గానమును, శుశ్రావ = శ్రోత్రపేయముగా వినెను—కాఞ్చీనినాదం = ఒడ్డాణరవమును, నూపురాణాం = కాలిఅందెల యొక్క, నిస్స్వనం చ = ధ్వనిని, మహాత్మనాం = గొప్పవారియొక్క, భవ

నేషు = భవనములయందు, సోపాననినదాంశ్చైవ = మెట్లయొక్క ధ్వనులను. ఆస్ఫోటిత నినాదాం శ్చ = చరచబడుచున్న ధ్వనులను. తత స్తతః = అక్కడక్కడ. క్ష్వేళితాం శ్చ = సింహనాదములను. శుశ్రావ = వినెను.

తా॥ ఆంజనేయుడు ఒకభవనమునుండి మరియొక భవనమునకు వెళ్లుచు అనేకవిధములైన భవనములను చూచుచు, స్వర్గమం దప్సరసలువలె త్రిస్థానముల పలుకు మంద్ర మధ్యమ తారా స్థాయిలతో మధురముగా పాడుచున్న పాటలను, మదించియున్న స్త్రీలు మెట్లు ఎక్కునపుడు ధ్వనించు కాలి అందెల సవ్వడులను. ఒడ్డాణముల చిరుచప్పుడులను. వీరుల భుజాస్ఫాలనములు, సింహనాదములను వినెను.

శ్లో॥ శుశ్రావ జపతాం తత్ర మన్త్రాన్ రక్షోగృహేషువై॥ ౧౨
స్వాధ్యాయ నిరతాం శ్చైవ యాతుధానా న్దదర్శసః।
రావణ స్తవ సంయుక్తాన్ గర్జతో రాక్షసా నపి॥ ౧౩
రాజమార్గం సమావృత్య స్థితం రక్షోబలం మహత్।
దదర్శ మధ్యమే గుల్మే రావణస్య చరాన్ బహూన్॥ ౧౪

టీ॥ రక్షోగృహేషు వై = రాక్షసగృహములందు, జపతాం = జపము చేయువారియొక్క, మంత్రాన్ = మంత్రములను, శుశ్రావ = వినెను-సః = ఆహనుమంతుడు, స్వాధ్యాయనిరతాన్ = వేదపఠనమునం దాసక్తిగల. యాతుధానాన్ = రాక్షసులను, రావణ స్తవ సంయుక్తాన్ = రావణుని స్తుతించడముతో, కూడినవారిని, గర్జతః = సింహనాదములు చేయువారిని, దదర్శ = చూచెను-సః = ఆహనుమంతుడు, రాజమార్గం = రాజమార్గమును, ఆవృత్య = ఆవరించి. స్థితం = ఉన్న. మహత్ = గొప్పదైన. రక్షోబలం = రాక్షస సైన్యమును, రావణస్య = రావణుని యొక్క, మధ్యమే = నగరమధ్య నున్న, గుల్మే = సైన్య సంఘమందు, బహూన్ = అనేకులైన. చరానే = సంచరించెడి చారులను. దదర్శ = చూచెను.

తా॥ ఆంజనేయుడు, రాక్షసగృహములందు జపము చేయువారి మంత్రములను వినెను, వేదాధ్యయనము చేయువారిని, రావణుని స్తుతించువారిని, రాజమార్గమం దంతట నిండియున్న గొప్పదగు రావణ సైన్యమును మధ్య మధ్య రహస్యప్రదేశములలో మారువేషములతో నున్న చారులను చూచెను.

శ్లో. దీక్షితాన్ జటిలాన్ ముణ్డాన్ గోఽజినామ్బర ధారిణః।
దర్భ ముష్టి ప్రహరణా నగ్ని కుణ్డాయుధాం స్తథా॥ ౧౪
కూట ముదర పాణీం శ్చ దణ్డాయుధ ధరానపి।
ఏకాక్షా నేకకర్ణాం శ్చ లమ్బోదర పయోధరాన్॥ ౧౫
కరాళాన్ భుగ్నవక్త్రాం శ్చ వికటాన్ వామనాం స్తథా।
ధన్వినః ఖడ్గిన శ్చైవ శతఘ్నీ ముస లాయుధాన్ ౧౬
పరిఘోత్తమ హస్తాం శ్చ విచిత్ర కవచోజ్జ్వలాన్।
నాతి స్థూలాన్ నాతి కృశాన్ నాతి దీర్ఘాతి హ్రస్వకాన్॥ ౧౭
నాతిగౌరాన్ నాతి కృష్ణాన్ నాతికుబ్జాన్ న వామనాన్।
విరూపాన్ బహురూపాం శ్చ సరూపాం శ్చ సువర్చసః॥ ౧౮
ధ్వజినః పతాకిన శ్చైవ దదర్శ వివిధాయుధాన్।

టీ॥ దీక్షితాన్ = దీక్షయం దున్నవారిని, జటిలాన్ = జటలు ధరించినవారిని, గోఽజినాంబర ధారిణః—గోఽజిన = ఎద్దుచర్మములు, అంబర = వస్త్రములుగా, ధారిణః = ధరించినవారిని, ముణ్డాన్ = బోడితలల వారిని, తథా = ఆప్రకారముగా, దర్భ ముష్టి ప్రహరణాన్—దర్భ ముష్టి = దర్భలుధరించిన పిడికిళ్ళచే, ప్రహరణాన్ = కొట్టుచున్న వారిని, అగ్నికుణ్డాయుధాన్—అగ్నికుండ = అగ్నికుండములే, ఆయుధాన్ = ఆయుధములుగా కలవారిని, కూటముద్గర పాణీన్ = కూటము ముద్గర మనేఆయుధములు హస్తములందు కలవారిని, దండాయుధధరాన్ = దండములే ఆయుధములుగా ధరించినవారిని, ఏకాక్షాన్ = ఒంటికన్నుగలవారిని, ఏకకర్ణాం శ్చ = ఒకేచెవిగలవారిని, లంబోదర

పయోధరాన్ = వ్రేలాడుపొట్టలు, స్తనములు గలవారిని. కేకరాళాన్ = తీక్ష్ణమైన వారిని, భుగ్నవక్త్రాంశ్చ = తెగినముఖములు గలవారిని. వికటాన్ = వికటముగా నున్నవారిని, తథా = ఆ ప్రకారముగా. వామనాన్ = పొట్టివారిని.ధన్వినశ్చ = ధనుర్ధారులను, ఖడ్గినశ్చ = ఖడ్గధారులను. శతఘ్నీముసలాయుధాన్—శతఘ్నీ = ఫిరంగులు, ముసలాయుధాన్ = రోకళ్ళుఆయుధములుంగా కలవారిని, పరిఘోత్తమహస్తాన్ = ఉత్తమ పరిఘాయుధములు కలవారిని. విచిత్ర కవచోజ్జ్వలాన్-విచిత్రకవచ = చిత్రములైన కవచములతో. ఉజ్జ్వలాన్ = ప్రకాశించువారిని, నాతిస్థూలాన్ = మిక్కిలి లావుకానివారిని, నాతికృశాన్ = మిక్కిలి నీరసించనివారిని. నాతిదీర్ఘాన్ = మిక్కిలి పొడవుకానివారిని. నాతిహ్రస్వాన్ = మరీపొట్టికానివారిని. నాతిగౌరాన్ = మిక్కిలి తెలుపుకానివారిని, నాతికృష్ణాన్ = మిక్కిలి నలుపు కానివారిని. నాతికుబ్జాన్ = అతివంకరలు లేనివారిని. నవామనాన్ = కురచకానివారిని, బహురూపాన్ = అనేకరూపములతో నున్నవారిని. సురూపాన్ = యోగ్యమైన రూపములు గలవారిని, సువర్చసః = మంచి వర్చస్సు కలవారిని, ధ్వజినః = ధ్వజములుకలవారిని పతాకినశ్చైవ = జెండాలుకలవారిని, వివిధాయుధాన్ = అనేకఆయుధములను దదర్శ = చూచెను.

తా॥ లంకాపట్టణమునం దాంజనేయుడు మిక్కిలి దీక్షతోనున్న వారిని జటాధారులను. బోడితలల వారిని. వృషభచర్మములు కట్టినవారిని. దర్భలు చేతియందుంచుకొని గ్రుద్దుకొను వారిని. అగ్ని కుండలములు, కూటము, ముద్గరము. దండాయుధముల ధరించి యున్నవారిని, ఒంటికన్ను, ఒంటిచెవి, పెద్దకడుపు, పెద్ద స్తనములు. కలిగి యున్నవారిని, చెక్కినట్లున్న ముఖములతో అతిభయంకరముగాను వికృతముగాను ఉన్నవారిని, అతిపొట్టివారిని. ధ్వజములు, ఖడ్గములు. శతఘ్నులు, రోకళ్ళు, పరిఘలు, విచిత్రకవచములు, ధరించి తిరుగుచున్న వారిని

మిక్కిలి స్థూలముగాక అతిగకృశించిన వారు గాక యున్నవారిని అతి పొడవు, పొట్టి, అతితెలుపు, నలుపు కానివారిని, వంకరలులేక, అతిపొట్టి గాక యున్నవారిని, వికృతరూపులను, బహురూపులను, సుందరరూప ములు సుందర ముఖవర్చస్సులు గలవారిని చూచెను.

"అయః కంటక సంఛన్నా. శతఘ్నీ పరికీర్తితా" ఇతి వైజయంతీ. అనగా నూరు ఇనుపమేకుల నిమిడ్చి చేయబడిన ఆయుధము శతఘ్నీ,దర్భలు చేతియందుంచుకొని సత్కార్య మాచరించిన శత్రువులు నశింతురు.

"యథావజ్రం హరేః పాణౌ తథా విప్రకరే కుశః" ఇంద్రునిచేతి వజ్రి మెట్టిదో బ్రాహ్మణ హస్తమందున్న దర్భ అట్టిది"

శ్లో॥ శక్తి వృక్షాయుధాం శ్చైవ పట్ట సా శని ధారిణః॥ ౨౦
క్షేపణీ పాశ హస్తాం శ్చ దదర్శ స మహాకపిః।
స్రగ్విణ స్త్వనులిప్తాం శ్చ వరాభరణ భూషితాన్॥ ౨౧
నానా వేష సమాయుక్తాన్ యథా స్వైరగతాన్ బహూన్।
తీక్ష్ణ శూలధరాం శ్చైవ వజ్రిణ శ్చ మహాబలాన్॥ ౨౨

టీ॥ సః = ఆ, మహాకపిః = హనుమంతుడు, శక్తివృక్షాయుధాన్-శక్తి = శక్తి,వృక్ష = వృక్షములు, ఆయుధాః = ఆయుధములనుగా ధరించిన వారిని, పట్టసాశనిధారిణః - పట్టస = పట్టసము, అశని = కత్తులను, ధారిణః = ధరించినవారిని, క్షేపణీ పాశ హస్తాం శ్చ-క్షేపణీ = వలలు, పాశ = పాశములను, హస్తాన్ = హస్తములందు కలవారిని. స్రగ్విణః = మాలలుధరించినవారిని. అనులిప్తాం శ్చ = పైగంధము పూతలు గలవారిని, వరాభరణభూషితాన్-వర = శ్రేష్ఠములైన, ఆభ రణ = ఆభరణములచే. భూషితాన్ = అలంకరించుకొబడిన వారిని, నానా వేషసమాయుక్తాన్-నానావేష = అనేకవేషములతో. సమాయుక్తాన్

యథా = కూడియున్న వారివలె-నున్నవారిని. స్వైరగతాన్ = స్వేచ్ఛగా తిరుగుచున్నవారిని, బహూన్ = అనేకములైన, తీక్ష్ణశూల ధరాం శ్చైవ-తీక్ష్ణ = వాడియైన, శూల = శూలములను, ధరాం శ్చైవ = ధరించినవారిని. వజ్రిణః = వజ్రాయుధమువంటి ఆయుధములు కల వారిని, మహాబలాన్ = మహాబలాఢ్యులైనవారిని, దదర్శ = చూచెను.

తా॥ మరియు ఆ లంకాపట్టణము నందు హనుమంతుడు శక్తిబాణములు వృక్షములు పట్టసములు వలలు పాశములు శూలములు మొదలగు ఆయుధములను ధరించిన రాక్షసులను, పుష్పమాలలు ధరించి చందనాది మైపూతలుపూసికొని యున్న రాక్షసులను, వెలలేని గొప్ప అభరణములు ధరించి, విచిత్రవేషములతో స్వేచ్ఛగా తిరుగుచున్న వారిని చూచెను.

శ్లో॥ శత సాహస్ర మవ్యగ్ర మారక్షం మధ్యమం కపిః।
రక్షోధిపతి నిర్దిష్టం దదర్శాన్తః పురాగ్రతః॥ ౨౩

టీ॥ కపిః = ఆంజనేయుడు. అన్తఃపురాగ్రతః-అన్తఃపుర = అన్తఃపురముయొక్క,అగ్రతః = ఎదుట, శతసాహస్రం = నూరువేలమందికలిగినట్టియు,అవ్యగ్రం = తొందరపాటులేని, రక్షోధిపతి నిర్దిష్టం-రక్షోధిపతి = రావణునిచే, నిర్దిష్టం = నిర్దేశింపబడిన, మధ్యమం ఆరక్షం = మూలబలమును. దదర్శ = చూచెను.

తా॥ హనుమంతు డా లంకాపట్టణమునందు రావణాంతఃపురము నెదుట లక్ష్యసంఖ్యలో నున్న మూలబలమును చూచెను

శ్లో॥ స తదా తద్గృహం దృష్ట్వా మహా హాటక తోరణమ్।
రాక్షసేంద్రస్య విఖ్యాత మద్రిమూర్ధ్ని ప్రతిష్ఠితమ్॥ ౨౪
పుణ్డరీ కావతంసాభిః పరిఘాభి రలఙ్కృతమ్।
ప్రాకారావృత మత్యన్తం దదర్శ స మహాకపిః॥ ౨౫

టీ॥ సః = ఆ, మహాకపిః = ఆంజనేయుడు, మహాహాటకతోరణం = బంగారపు తోరణములు కలిగినట్టియు, అద్రిమూర్ధ్ని = పర్వతశిఖరమునందు, ప్రతిష్ఠితం = ప్రతిష్ఠాపనచేయబడి యున్నట్టియు, రాక్షసేన్ద్రస్య = రాక్షసప్రభువైన రావణునియొక్క. విఖ్యాతం = ప్రసిద్ధమైన. తద్గృహం = ఆగృహమును. దృష్ట్వా = చూచి. పుండరీకావతంసాభిః—పుండరీక = తెల్లతామరలు, అవతంసాభిః = అలంకారములుగా కలిగిన, పరిఘాభిః = అగడ్తలచేత, అత్యంతం = ఎక్కువగా, అలంకృతం = అలంకరించబడినటువంటియు, ప్రాకారావృతం = ప్రాకారములచే కూడియున్నదానిని, దదర్శ = చూచెను.

తా॥ హనుమంతుడు గిరిశిఖరమునందు ప్రతిష్ఠింపబడి బంగారపు తోరణములతోను తెల్లతామరలచే నలంకరించబడిన అగడ్తలతోను ప్రాకారములతోను మిక్కిలి ప్రసిద్ధమైన రావణుని గృహమును చూచెను.

శ్లో॥ త్రివిష్టపనిభం దివ్యం దివ్యనాద నినాదితమ్।
వాజి హేషిత సఙ్ఘుష్టం నాదితం భూషణై స్తథా॥ ౨౮
రథై ర్యానై ర్విమానై శ్చ తథా హయ గజై శ్శుభైః।
వారణై శ్చ చతుర్దన్తై శ్శ్వేతాభ్ర నిచ యోపమైః॥ ౨౯
భూషితం రుచిరద్వారం మత్తై శ్చ మృగపక్షిభిః।
రక్షితం సు మహావీర్యై ర్యాతుధానై స్సహస్రశః॥ ౩౦
రాక్షసాధిపతే ర్గుప్త మావివేశ మహాకపిః।

టీ॥ త్రివిష్టపనిభం—త్రివిష్టప = స్వర్గముతో సమానమైనదియు. దివ్యం = దేవతాసంబంధమైనదియు, దివ్యనాద నినాదితం—దివ్య = దివ్యములైన నాద = స్వరములతో, వినాదితం = విశేషముగాధ్వనింపచేయబడుచున్నదియు, వాజిహేషిత సఙ్ఘుష్టం—వాజి = గుఱ్ఱముల యొక్క, హేషిత = సకిలింపులతో, సఙ్ఘుష్టం = కూడియున్నదియు. తథా = అప్రకారముగా, భూషణైః = ఆభరణములచేత, నాదితం = ధ్వనించు

చున్నదియు, రథైః = రథములచేతను, యానైః = పల్లకీలచేతను, విమానైశ్చ = విమానములచేతను. తథా = అప్రకారముగా, హయగజైః-హయ = గుఱ్ఱములచేతను. గజైః = ఏనుగులచేతను. శుభైః = శుభప్రదములైన, చతుర్దన్తైః = నాలుగు దంతములు కలిగిన. వారణైశ్చ = ఏనుగులతోను. శ్వేతాభ్రనిచయోపమైః - శ్వేత = తెల్లని అభ్రి = మేఘములయొక్క, నిచయ = సమూహములతో, ఉపమైః = సమానములైన. వారణైశ్చ = ఏనుగులతోను. భూషితం = అలంకరించబడినదియు, మత్తైః = మదించిన, మృగపక్షిభిః-మృగ మృగములతోను, పక్షిభిః = పక్షులతోను, సహస్రశః = వేలకొలది. సుమహావీర్యైః = మిక్కిలిపరాక్రమముగల, యాతుధానైః = రాక్షసులచేత, రక్షితం = రక్షింపబడినదియు, రాక్షసాధిపతేః = రావణాసురునియొక్క. గుప్తం = రహస్యమైన, రుచిరద్వారం-రుచిర = కాంతిమంతమైన, ద్వారం = అంతఃపురద్వారమును. అవివేశ = ప్రవేశించెను.

తా॥ ఆంజనేయుడు గుఱ్ఱముల సకిలింపులు రెండుదంతములు గలవియు నాలుగు దంతములు గలవియు నగు ఏనుగులఘీంకార ధ్వనులు ఆభరణముల ధ్వనులు, ఇతరములగు దివ్యనాదములతో కూడి యున్నట్టియు రథములు విమానములతోను మదించియున్న మృగ శుక పిక శారికాది పక్షులతోను నిండియున్నట్టియు మహావీరులైన రాక్షస సహస్రసంఖ్యాన్వితులతో అతిజాగరూకతతో రక్షింపబడుచున్నదియు నగు రావణుని అతిసుందరమైన అంతఃపురద్వారముమ చేరెను.

శ్లో॥ స హేమ జామ్బూనద చక్రవాళం మహార్హ ముక్తామణి భూషితాన్తమ్।
పరార్ధ్య కాలాగరు చన్దనాక్తం. స రావణాంతఃపుర మావివేశ ॥ ౨౯

టీ॥ సః = ఆ ఆంజనేయుడు, స హేమ జామ్బూనద చక్రవాళం = బంగారము, రత్నములతో కూడి నిర్మింపబడిన ప్రాకారముగలదియు,

మహార్హ ముక్తామణి భూషితాన్తం-మహార్హ = మిక్కిలివిలువైన. ముక్తామణి = ముత్యముచేత. భూషితాన్తం = లోపల అలంకరింపబడి నదియు, పరార్ధ్య కాలాగరు చన్దనాక్తం-పరార్ధ్య = శ్రేష్ఠమైన, కాలాగరు = కృష్ణాగరుయొక్క, చన్దనాక్తం = గంధముతో కూడినదియు నగు, రావణాంతఃపురం = రావణునియొక్క. అంతఃపురమును ఆవివేశ = ప్రవేశించెను.

తా॥ బంగారము రత్నములతో కలసి నిర్మింపబడిన ప్రాకారములు కలిగి గొప్ప విలువగల ముత్యములు రత్నముల చేత అలంకపబడియున్న అంతర్భాగము కలదియు నల్లని అగరు చెక్కల కమ్మని వాసనలు గలదియు నైన రావణాన్తఃపురమును హనుమంతుడు ప్రవేశించెను.

చతుస్సర్గః సమాప్తః

# శ్రీ మద్వాల్మీకిరామాయణే సున్దరకాణ్డే పంచమ స్సర్గః

## * చంద్రవర్ణనము *

శ్లో॥ తత స్స మధ్యంగత మంశుమన్తం
జ్యోత్స్నా వితానం మహా ముద్వమన్తమ్।
దదర్శ ధీమాన్ దివి భానుమన్తం
గోష్ఠే వృషం మత్తమివ భ్రమన్తమ్॥ ౧

టీ॥ తతః = తరువాత, ధీమాన్ = బుద్ధిమంతుడైన, సః = ఆ హనుమంతుడు, మధ్యం గతం = ఆకాశమధ్యమును పొంది యున్నట్టియు, అంశుమన్తం = కిరణములు కలిగినట్టియు, జ్యోత్స్నా = వెన్నెలచేత, వితానం = వ్యాపించినట్టియు, మహత్ = గొప్పదైనట్టియు, ఉద్యమన్తం = కాంతి కలిగినట్టియు, భానుమన్తం = చంద్రుని, గోష్ఠే = గోశాలయందు, మత్తం = మదించిన, భ్రమన్తమ్ = తిరుగుచున్న, వృష మివ = ఆబోతునువలె, దదర్శ = చూచెను.

తా॥ ఆంజనేయుడు రాత్రిసమయమున లంకాపట్టణము ప్రవేశించి, రాజవీధినిపోవుచు, అచ్చటి సమస్త సౌందర్యముల నవలోకించుచు, సీతాన్వేషణ కార్యక్రమమునకు, అవసరమగు బలోత్సాహ అవగాహనలను పొందుచు, మహోత్సాహుడై రావణాంతఃపురమును ప్రవేశించెను. అప్పటి చంద్రుడు ఆకాశమధ్యమున చేరి వెన్నెలలను ప్రసరింపజేయుచు నక్షత్రముల మధ్యప్రకాశమానుడై, గోశాలయందు మదించి తిరుగుచున్న ఆబోతువలె కనబడెను.

శ్లో॥ లోకస్య పాపాని వినాశయన్తం, మహోదధిం చాపి
స మేధయన్తమ్।
భూతాని సర్వాణి విరాజయన్తం, దదర్శ శీతాంశు మ
థాభియాన్తమ్॥ ౨

టీ॥ అథ = అటుతరువాత, లోకస్య = లోకముయొక్క, పాపాని = పాపములను, వినాశయన్తం = నశింపజేయునట్టియు, అపిచ = మరియు మహోదధిం = సముద్రమును, సమేధయన్తం = ఉప్పొంగజేయుచున్నట్టియు, సర్వాణి = సమస్తములైన, భూతాని = జంతువులను, విరాజయన్తం = ప్రకాశింపజేయుచున్నట్టియు, అభియాన్తం = క్రమక్రమముగాముందుకు నడచుచున్న, శీతాంశుం చంద్రుని, దదర్శ = చూచెను.

తా॥ తరువాత హనుమంతుడు లోకమునందలి సమస్తపాపములను నశింపజేయుచు, సర్వభూతములకు, ఆనందమును కలిగించుచు, సముద్రమున కాహ్లాదమును కలిగించి యుప్పొంగజేయుచు అందరి క్లేశముల నపనయించి ఆహ్లాదకరుడైన చంద్రుని చూచెను.

శ్లో॥ యా భాతి లక్ష్మీ ర్భువి మన్దరస్థా, తథా ప్రదోషేషు చ సాగరస్థా
తథైవ తోయేషు చ పుష్కరస్థా రరాజ సా చారు నిశాకరస్థా॥ ३

టీ॥ యా = ఏ, లక్ష్మీః = లక్ష్మి, భువి = భూమియందు, మందరస్థా = మందరపర్వతమునందున్నదై, భాతి = ప్రకాశించుచున్నదో, తథా = అప్రకారముగనే, చ = మరియు, ప్రదోషేషు = ప్రదోషకాలముల యందు, సాగరస్థా = సముద్రము నందున్నదో, తథైవ = అదేప్రకారము, తోయేషు = జలములయందు, పుష్కరస్థా = కమలములయందున్నదో, సా = ఆ లక్ష్మి, చారు నిశాకరస్థా—చారు = సుందరమైన, నిశాకరస్థా = చంద్రునియందున్నదై, రరాజ = ప్రకాశించుచుండెను.

తా॥ భూమియందు మందరపర్వతము మీదను, ప్రదోషకాలము లందు సముద్రము నందును, జలములలో కమలముల యందును ఏ లక్ష్మి మహోత్కృష్ట భాసమానముగా ప్రకాశించుచుండెనో, ఆ లక్ష్మి సుందరమైన ఆ చంద్రుని యందు తేజోవంతముగా ప్రకాశించుచున్నది.

శ్లో॥ హంసో యథా రాజతపంజరస్థ, స్సింహో యథా మన్దరకన్దరస్థః।
వీరో యథా గర్వితకుఞ్జరస్థ, శ్చంద్రోఽపి బభ్రాజ తథామ్బరస్థః॥ ౪

టీ॥ రాజతపంజరస్థః-రాజత = వెండిదైన, పంజరస్థః = పంజరమందున్న, హంసో యథా = హంసవలెను, మన్దర కన్దరస్థః-మన్దర = మందరపర్వతముయొక్క, కన్దరస్థః = గుహయందున్న, సింహో యథా = సింహమువలెను, గర్వితకుఞ్జరస్థః-గర్విత మదగర్వముతో కూడిన, కుఞ్జరస్థః = ఏనుగుపై నున్న, వీరో యథా = వీరునివలెను, తథా = ఆప్రకారముగ. అమ్బరస్థః = ఆకాశమునందున్న. చన్ద్రోఽపి = చంద్రుడును, బభ్రాజ = ప్రకాశించుచుండెను.

తా॥ వెండి పంజరమందున్న రాజహంసవలె మందరపర్వత గుహయందున్న సింహముపలె మదించిన యేనుగు నెక్కిన వీరునివలె ఆకాశ మధ్యయందున్న చంద్రుడు ప్రకాశించుచుండెను.

శ్లో॥ స్థితః కకుద్మా నివ తీక్ష్ణ శృఙ్గో మహాచల శ్శ్వేత ఇవోచ్చ శృఙ్గః।
హ స్తీవ జామ్బూనద బద్ధశృఙ్గో రరాజ చన్ద్రః పరిపూర్ణ శృఙ్గః॥ ౫

టీ॥ తీక్ష్ణశృంగః = వాడియైన కొమ్ములు గలిగినటువంటియు. కకుద్మానివ = ఆబోతువలె స్థితః = ఉన్నటువంటియు. ఉచ్చశృంగః = ఉన్నతమైన శిఖరములు గలిగిన, శ్వేతః = తెల్లనైన, మహా, చల ఇవ = పెద్దపర్వతమువలె, స్థితః = ఉన్నటువంటియు, జాంబూనద బద్ధశృంగః-జాంబూనద = బంగారముచేత, బద్ధ = కట్టబడిన. శృంగః = దంతములుగల. హస్తీవ = ఏనుగువలె. స్థితః = ఉన్నటువంటి, చంద్రః = చంద్రుడు, పరిపూర్ణశృంగః-పరిపూర్ణ = నిండిన, శృంగః = కళలుగలవాడై, రరాజ = ప్రకాశించెను.

తా॥ షోడశ కళలతో కూడి ఆకాశ మధ్యస్థుడైన చంద్రుడు వాడికొమ్ములు గల ఆబోతువలెను, ఉన్నతశిఖరములు గల తెల్లని పర్వతమువలెను బంగారు పూత పూయబడు దంతములుగల మదపుటేనుగువలెను, ప్రకాశించుచుండెను.

శ్లో॥ వినష్ట శీతామ్బు తుషారపఙ్కో, మహాగ్రహగ్రాహ వినష్టపఙ్కః।
ప్రకాశ లక్ష్మ్యాశ్రయనిర్మలాఙ్కో రరాజచన్ద్రో భగవాన్ శశాఙ్కః॥ ౭

టీ॥ వినష్టశీతామ్బుతుషారపఙ్కః-వినష్ట = పూర్తిగానష్టము చేయబడిన, శీతామ్బు = చల్లనినీటియొక్క, తుషార = మంచుయొక్కయు, పంకః = బురదకలిగినట్టియు, మహాగ్రహగ్రాహవినష్టపంకః — మహాగ్రహ = సూర్యునినుంచి, గ్రాహ = కిరణములగ్రహించుటవలన, వినష్ట = నష్టమైన, పంకః = అంధకారమనే, బురద కలిగినట్టియు, ప్రకాశ లక్ష్మ్యాశ్రయమైన, నిర్మలాంకః — ప్రకాశ = ప్రకాశముగ, లక్ష్మ = చూచుటకు, ఆశ్రయ = ఆశ్రియమైన, నిర్మలాంకః = నిర్మలమైన, చిహ్నము కలిగినట్టియు, భగవాన్ = ప్రభావసంపన్నుడైన శశాంకః = కుందేలుచిహ్నముగాకల, చంద్రః = చంద్రుడు, రరాజ = ప్రకాశించెను.

తా॥ చంద్రుడు స్వయంప్రకాశుడు గాక సూర్యకిరణ సంపర్కమువలన ప్రకాశించుచు అమృతకిరణు డౌటవలన సకల జనాహ్లాదకరముగాను ప్రత్యక్షముగా చూచుట కాశ్రియమైన నిర్మల చిహ్నముతోను, తన తేజః ప్రకాశముతో నీటియొక్క మంచుయొక్క బురదను పోగొట్టుచు శరత్కాల చంద్రుడు కుందేలు చిహ్నము కలవాడై ప్రకాశించెను.

శ్లో॥ శిలాతలం ప్రాప్య యథా మృగేన్ద్రో మహారణం ప్రాప్య యథా గజేన్ద్రః।
రాజ్యం సమాసాద్య యథా నరేన్ద్రః, స్తథా ప్రకాశో విరరాజ చన్ద్రః॥ ౭

టీ॥ మృగేన్ద్రం = మృగరాజైన సింహము. యథా = ఏప్రకారముగ, శిలాతలం = పర్వతప్రదేశమును, ప్రాప్య = పొంది, గజేన్ద్రః = గజరాజైన, మదపుటేనుగు. యథా = ఏవిధముగా, మహారణం = మహారణ్యమును. ప్రాప్య = పొంది, నరేన్ద్రః = రాజు, యథా = ఏప్రకారము రాజ్యం = రాజ్యమును, సమాసాద్య = పొంది, విరరాజ = ప్రకాశించునో, తథా = ఆప్రకారముగ, చంద్రః = పూర్ణ చంద్రుడు ప్రకాశః = ప్రకాశించెను.

తా॥ పర్వతప్రదేశమును చేరి సింహము, అరణ్యప్రాంతమును జేరి గజరాజు, రాజ్యమును సంపాదించి మహారాజు ఎట్లు ప్రకాశించునో అదే ప్రకారము కళాపూర్ణత్వమును పొంది చంద్రుడును ప్రకాశించెను,

శ్లో॥ ప్రకాశచన్ద్రోదయ నష్టదోషః ప్రవృద్ధ రక్షః పిశితాశ దోషః।
రామాభిరామేరిత చిత్తదోషః స్వర్గప్రకాశో భగవాన్ ప్రదోషః॥ ౮

టీ॥ ప్రకాశచన్ద్రోదయనష్టదోషః — ప్రకాశ = ప్రకాశమానమైన. చన్ద్రోదయ = చంద్రోదయముచేత, నష్టదోషః = పోగొట్టబడిన చీకట్లు కలిగినట్టియు, ప్రవృద్ధరక్షఃపిశితాశదోషః - ప్రవృద్ధ = బాగుగా వృద్ధిపొందిన రక్షః = రాక్షసులయొక్క, పిశితాశ = మాంసభక్షణయొక్క, దోషః = దోషముకలిగినట్టియు, రామాభిరామేరితచిత్తదోషః - రామాభిరామా = సుందరమైన స్త్రీలయొక్క, ఈరిత = పోగొట్టబడిన, చిత్తదోషః = మనోదోషముకల, ప్రదోషకాలః = ప్రదోషకాలము. స్వర్గప్రకాశః = స్వర్గకాంతికలదినా, భగవాన్ = ప్రభావసంపన్నుడైన చంద్రుడు, విరరాజ = ప్రకాశించెను.

తా॥ చంద్రోదయముయొక్క ప్రకాశముచే నష్టమైన అంధకార మను దోషము తొలగిపోయెను. రాక్షసులయొక్క, మాంసభక్షణ యను దోషము వృద్ధిపొందెను. సుందరాంగులైన స్త్రీలు, తమభర్తలతో ప్రణయకలహములనే దోషములను విడనాడిరి, అట్టి ప్రదోషకాలము స్వర్గతుల్య శోభాయమానమై విశేషముగా ప్రకాశించెను—ప్రదోషకాలము " త్రయోదశీ యదా రాత్రౌ, యమ స్తత్ర నిశాముఖే। ప్రదోష ఇతి విజ్ఞేయా, జ్ఞానార్థీ మౌన మాచరేత్।" అనువాక్యమునుబట్టి త్రయోదశి తిథితో కూడిన రాత్రియందు మొదటి యామమును ప్రదోషకాలమని చెప్పుదురు. ఈప్రదోషకాల మందు జ్ఞానార్థులం సజ్జనులు మౌన మాచరింపవలెను.

* హనుమంతుడు లంకలో రాక్షస స్త్రీ—పురుషులను జూచుట *

శ్లో॥ తంత్రీస్వనాః కర్ణసుఖాః ప్రవృత్తా, స్స్వపన్తి నార్యః పతిభి స్సువృత్తాః।
నక్తంచరా శ్చాపి తథా ప్రవృత్తా విహర్తు మత్యద్భుత రౌద్రవృత్తాః॥ ౯

టీ॥ తంత్రీస్వనాః-తంత్రీ = వీణాదులయొక్క, స్వనాః = ధ్వనులు, కర్ణసుఖాః = వినసొంపులై, ప్రవృత్తాః = జరుగుచుండెను. సువృత్తాః = సచ్ఛీలముగల నార్యః = స్త్రీలు, పతిభిః = భర్తలతో,స్వపన్తి = నిద్రించుచున్నారు. నక్తంచరాశ్చ = రాక్షసులును, అత్యద్భుత రౌద్రవృత్తాః— అత్యద్భుత = మిక్కిలి ఆశ్చర్యకరమైన, రౌద్రవృత్తాః = భయంకర కార్యములు గలవారై, తథాపి = అట్లే, విహర్తుం = విహరించుకొరకు ప్రవృత్తాః = తిరుగుచున్నారు.

తా॥ ఆ రాత్రిసమయమున వీణానాదములు శ్రవణానందముగా వినబడుచుండెను, సతీమణులైన స్త్రీలు తమ భర్తల గూడి సుఖముగా నిద్రించుచుండిరి, రాక్షసులు భయంకరాకారులై క్రూరకార్యములు జేయుచు విచ్చలవిడిగా తిరుగుచుండిరి.

శ్లో॥ మత్తప్రమత్తాని సమాకులాని రథాశ్వభద్రాసన సఙ్కులాని।
వీరశ్రియా చాపి సమాకులాని, దదర్శ ధీమాన్ స కపిః
కులాని॥ ౧౦

టీ॥ ధీమాన్ = బుద్ధిమంతుడైన. సః = ఆ, కపిః = ఆంజనేయుడు. మత్తప్రమత్తాని—మత్త = మత్తుపదార్థములచేత, ప్రమత్తాని = మదించినవారితో కూడియున్నవియు, సమాకులాని = వ్యాపించియున్నవియు, రథాశ్వభద్రాసనసంకులాని—రథ = రథములు, అశ్వ = గుఱ్ఱములు, భద్ర = శుభప్రదములగు, ఆసన = ఆసనములచేత, సంకులాని = వ్యాప్తమైనవియు, అపిచ = మరియు, వీరశ్రియా = వీరలక్ష్మిచే, సమాకులాని = వ్యాప్తములై యున్నవియునగు, కులాని = గృహములను, దదర్శ = చూచెను.

తా॥ ధనమద పానమద మత్తులై స్పృహ తప్పియున్న వారితో కూడియున్నవియు, రథ, గజాశ్వములతోను భద్రపీఠములతోను క్రిక్కిరిసియున్నవియు, మహావీరులైన వారి వీరలక్ష్మితో కూడియున్నవియునగు రాక్షసగృహములను బుద్ధిమంతుడగు ఆ ఆంజనేయుడు చూచెను.

శ్లో॥ పరస్పరం చాధిక మాక్షిపన్తి భుజాంశ్చ పీనా నధివిక్షిపన్తి।
మత్తప్రలాపా నధివిక్షిపన్తి మత్తాని చాన్యోన్య మధిక్షిపన్తి॥ ౧౧
రక్షాంసి వక్షాంసి చ విక్షిపన్తి, గాత్రాణి కాన్తాసు చ విక్షిపన్తి।
రూపాణిచిత్రాణి చ విక్షిపన్తి, దృఢాని చాపానిచ విక్షిపన్తి ౧౨

టీ॥ పరస్పరం చ = ఒకరినొకరు, అధికం = ఎక్కువగా, ఆక్షిపన్తి = దూషించుకొనుచున్నారు. పీనాన్ = బలసిన, భుజాంశ్చ = భుజములను, అధివిక్షిపన్తి = ఒండొరులపై వేసికొనుచున్నారు. మత్తప్రలాపాన్ = గర్వోక్తులను, అధివిక్షిపన్తి = ఆక్షేపణలను చేసికొనుచున్నారు, అన్యోన్యం = ఒకరి నొకరు, మత్తాని చ = బలాబలములను, అధిక్షిపన్తి = ఆక్షేపించుకొనుచున్నారు, రక్షాంసి = రాక్షసులు, వక్షాంసి = వక్షస్థలములను. విక్షిపన్తి = విరచుకొనుచున్నారు, గాత్రాణి = శరీరము

లను, కాన్తాసు చ = స్త్రీలయందు. విక్షిపన్తి = ఉంచుచున్నారు. చిత్రాణి = చిత్రమైన, రూపాణి చ = వేషములను. విక్షిపన్తి = వేసికొనుచున్నారు. దృఢాని = దృఢమైన. చాపాని = ధనుస్సులను విక్షిపన్తి = ఎక్కుపెట్టుచున్నారు.

తా॥ ఒకరి నొకరు దూషించుకొను వారిని. వక్షస్థలములను చరచుకొను వారిని, మదముచే గర్వోక్తుల నాలపించువారలను, ఒకరిమీద నొకరు విఱుచుక పడుచున్నవారిని, స్త్రీలపై పడెడివారిని, వివిధవేషములను ధరించినవారిని, ధనువుల నెక్కుపెట్టుచున్న వారిని ఆ రాత్రిసమయమున ఆంజనేయుడు చూచెను.

శ్లో॥ దదర్శ కాన్తాశ్చ సమాలభన్త్య, స్తథా పరా స్తత్రి పున
స్స్వపన్త్యః।
సురూప వక్త్రాశ్చ తథా హసన్త్యః క్రుద్ధాః పరా శ్చాపి
వినిశ్శ్వసన్త్యః॥ ౧౩

టీ॥ సమాలభన్త్యః = చందనాదులుధరించిన, కాంతాశ్చ = స్త్రీలను, తథా = అప్రకారముగా. తత్ర = అక్కడ, పునః = తిరిగి స్వపన్త్యః = కునికిపాట్లుపడుచుపరున్న. పరాః = మరికొందరిని, సురూపవక్త్రాశ్చ = అందమైన, ముఖములు గలవారిని, తథా = ఆప్రకారముగా, హసన్త్యః = నవ్వుచున్నవారిని, అపిచ = మరియు, పరాః = మరికొందరు, క్రుద్ధాః = కోపావేశముగలవారై, వినిశ్శ్వసన్త్యః = నిట్టూర్పులు విడుచుచున్నవారిని దదర్శ = చూచెను.

తా॥ చందనాది పైపూతలు పూసికొని యున్నవారిని, అక్కడక్కడ కూర్చుండి కునికిపాట్లు పడుచున్నవారిని, కొంతమందిని అందమైన ముఖములు గలవారిని, నవ్వుచున్నవారిని, క్రోధావేశముతో నిట్టూర్చుచున్న రాక్షసస్త్రీలను హనుమంతుడు చూచెను.

శ్లో॥ మహాగజై శ్చాపి తథా నదద్భి। స్సుపూజితై శ్చాపి తథాసుసద్భిః।
రరాజ వీరై శ్చ వినిశ్శ్వసద్భిః। హ్రదో భుజంగై రివ
నిశ్శ్వసద్భిః॥ ౧౪

టీ॥ తథా = ఆప్రకారముగా, నదద్భిః = ఘీంకారములు చేయుచున్న. మహా గజైః = గొప్పవైన యేనుగులచేతను, ఒపిచ = మరియు. తథా = ఆప్రకారముగా, సుసద్భిః = యోగ్యులచేతను, సుపూజితైశ్చ = యోగ్యముగా పూజింపబడువారిచేతను. వినిశ్శ్వసద్భిః = నిట్టూర్చుచున్న. వీరైశ్చ = వీరులచేతను. నిశ్శ్వసద్భిః = బుసలుకొట్టుచున్న. భుజంగైః = సర్పములచేత. హ్రద ఇవ = మడుగువలె, రరాజ = ప్రకాశించెను.

తా॥ ఘీంకారములు చేయుచున్న పెద్ద పెద్ద యేనుగులతోను. పూజ్యులైన సత్పురుషులతోను వీరోచితసంభాషణలచే నిట్టూర్చుచున్న పరాక్రమవంతులతోను, ఆ లంకాపట్టణము బుసలు కొట్టుచున్న మహాసర్పములతో కలచి వేయబడిన మడుగువలె ఆంజనేయునికి కనిపించెను.

శ్లో॥ బుద్ధిప్రధానాన్ రుచిరాభిధానాన్. సంశ్రద్దధానాన్ జగతః ప్రధానాన్
నానావిధానాన్ రుచిరాభిధానాన్ దదర్శతస్యాంపురియాతుధానాన్ ౧౫

టీ॥ తస్యాం = ఆ పురి = పట్టణమునందు, బుద్ధిప్రధానాన్ = బుద్ధియే ప్రధానముగా కలిగియున్నవారిని, రుచిరాభిధానాన్ = మంచిపేరులు. గలవారిని, సంశ్రద్దధానాన్ = ఆస్తికులైనవారిని, జగతః = జగత్తులో ప్రధానాన్ = ముఖ్యులైనవారిని. నానావిధానాన్ = అనేకవిధములైన వారిని, రుచిరాభిధానాన్-రుచిర = నేర్పుగా, అభిధానాన్ = పలుకుచున్న యాతుధానాన్ = రాక్షసులను. దదర్శ = చూచెను.

తా॥ ఆ పట్టణమునం దాంజనేయుడు బుద్ధి చాతుర్యము కలవారిని నేర్పుగా మాట్లాడువారిని ఆస్తికులను జగత్తులో ప్రధానులైన వారిని, అనేకవిచిత్రములైన పేర్లు గల రాక్షసులను చూచెను.

శ్లో॥ సనన్ద దృష్ట్వా స చ తాన్. సురూపాన్ నానాగుణా నాత్మగుణానురూపాన్।
విద్యోతమానాన్ స తదానురూపాన్. దదర్శ కాంశ్చిచ్చ పునర్విరూపాన్॥ ౧౬

టీ॥ సః = ఆ హనుమంతుడు, సురూపాన్ = యోగ్యమైన రూపములుగలవారిని, నానాగుణాన్ = అనేకగుణములుకల వారిని, ఆత్మగుణానురూపాన్ - ఆత్మగుణ = తమగుణములకు. అనురూపాన్ = తగియున్నవారిని విద్యోతమానాన్ = ప్రసిద్ధులైనవారిని. సతదానురూపాన్ = దానికి, (అప్రసిద్ధికి) అనువైన రూపములతో కూడియున్నవారిని, పునః = తిరిగి, కాంశ్చిత్ = మరికొందరు. తాన్ = ఆ, విరూపాన్ = అందవికారులను, దృష్ట్వా = చూచి, ననన్ద చ = సంతోషించియు. దదర్శ = చూచెను.

తా॥ ఆ లంకాపట్టణమునందు మంచియోగ్యములైన రూపములతో నొప్పుచున్నవారిని. తమ తమ గుణముల కనురూపము లైన నడవడికలు గలవారిని మంచి ప్రసిద్ధి చెందినవారిని, దాని (ప్రసిద్ధి) కనురూపము లైన వేషభాషలు గలవారిని చూచి ఆంజనేయుడు మిక్కిలి సంతసించెను. తిరిగి కొంతమంది వికృత రూపము కలవారిని కూడ చూచెను.

శ్లో॥ తతో వరార్హా స్సువిశుద్ధ భావా, స్తేషాం స్త్రియ స్తత్ర మహానుభావాః।
ప్రియేషు పానేషు చ సక్తభావాః దదర్శ తారా ఇవ సుప్రభావాః॥ ౧౭

టీ॥ తత = అటుతరువాత. వరార్హాః = అత్యంత శ్రేష్ఠమైన అర్హతలు కలిగియున్నట్టియు, సువిశుద్ధభావాః = పరిశుద్ధమైన. అభిప్రాయములు గలిగినట్టియు, మహానుభావాః = మహానుభావు లైనట్టియు. తేషాం = ఆరాక్షసులయొక్క, స్త్రియః = స్త్రీలను. ప్రియేషు = భర్తలయందును.

పానేషు చ = మద్యపానములయందును, సక్తభావాః = ఆసక్తిగల భావములు గలిగియుండి, తారా ఇవ = నక్షత్రములవలె, సుప్రభావాః = మంచి కాంతియుక్తమైన వారిని, దదర్శ = చూచెను.

తా॥ విలువైన నగలు ధరించి యోగ్యముగా నున్నట్టియు పరిశుద్ధ మనస్సుతో పతివ్రతా ప్రభావ సంపన్నలై యున్నట్టియు, భర్తలయందు మద్యమునందు కూడ మిక్కిలి ఆసక్తితో కూడి యున్నటువంటియు, ఆకాశమునందలి తారలవలె గొప్ప ప్రభావ సంపన్నతను పొంది యున్న, ఆ రాక్షసులయొక్క భార్యలను హనుమంతుడు లంకలో చూచెను.

శ్లో॥ శ్రియా జ్వలన్తీ స్త్రపయోపగూఢా, నిశీథకాలే రమణోపగూఢాః।
దదర్శ కాశ్చిత్ప్రమదోపగూఢా యథా విహఙ్గాః
కుసుమోపగూఢాః॥ ౧౭

టీ॥ శ్రియా = తేజస్సుచే, జ్వలన్తీః = ప్రకాశించువారలను, త్రపయా = సిగ్గుచేత. ఉపగూఢాః = ఆవరింపబడియున్న వారిని, నిశీథకాలే = అర్ధరాత్రమందు, రమణోపగూఢాః-రమణ = భర్తలతో, ఉపగూఢాః = కూడియున్నవారిని, ప్రమదోపగూఢాః-ప్రమద = అధికమదముతో, ఉపగూఢాః = కూడియున్నవారిని, కుసుమోపగూఢాః-కుసుమ = పుష్పములందు, ఉపగూఢాః = దాగియున్న, విహఙ్గా యథా (స్థితాః) = పక్షులవలె నున్న, కాశ్చిత్ = కొంతమంది స్త్రీలను, దదర్శ = చూచెను.

తా॥ హనుమంతు డారాత్రి సమయమందు స్ఫురద్రూపములతో నుండి సిగ్గు ఆవరించి యుండుటచే భర్తలను జేర సంశయించు ముగ్ధలను అర్ధరాత్రియందు భర్తలను అధిక మత్తతతో కూడియున్న మధ్యనాయికలను భర్తలను తమ కామ యౌవనములతో నాకర్షించి తృప్తిబొందు ప్రౌఢనాయికలను పుష్పములందు దాగిన పిట్టలవలె భర్తల పరిష్వంగములయం దున్న రాక్షసస్త్రీలను చూచెను.

ముగ్ధా, మధ్యమా, ప్రౌఢా నాయికల లక్షణములు :-

చ. నవ నవ కామయౌవన సనాథము నల్పరతంబు గల్గు న।
య్యువిదయె ముగ్ధ, మధ్య సదృశోదిత యౌవన కామయైరతాం।
త వివశయౌ లతాంగి, సతత ప్రథితోల్బణ కామ యౌవనో
త్సవయు రతాది మోహమును దాల్చు తలోదరి ప్రౌఢదానగున్.
(నరసభూపాలీయం)

శ్లో॥ అన్యాః పున ర్హార్మ్యతలోపవిష్టా. స్తత్ర ప్రియాంకేషు సుఖోప విష్టాః।
భర్తుః ప్రియాధర్మపరా నివిష్టా దదర్శ ధీమాన్ మదనాభివిష్టాః॥
౧౭

టీ॥ తత్ర = ఆ లంకాపట్టణమందు, పునః = తిరిగి. హార్మ్యతలోపవిష్టా— హార్మ్యతల = మేడలపై ప్రదేశములందు, ఉపవిష్టాః = కూర్చుండి యున్నవారిని. అన్యాః = కొందరిని, ప్రియాంకేషు = భర్తల తొడ ప్రదేశములందు, కూర్చుండియున్నవారిని, భర్తుః = భర్తకు ప్రియాః = ఇష్టమైనవారలను, ధర్మపరాః = ధర్మమునందు, ఆసక్తి కలిగినవారిని, నివిష్టాః = కూర్చున్నవారిని, మదనాభివిష్టాః = కామోద్రేకులైనవారిని, ధీమాన్ = బుద్ధిమంతుడైన హనుమంతుడు దదర్శ = చూచెను.

తా॥ లంకాపట్టణమునందు హనుమంతుడు, మేడల పైభాగములందు కూర్చున్న వారిని భర్తల తొడలయందు కూర్చున్న వారిని, భర్తలకు ప్రియమును చేకూర్చువారిని ధర్మపరాయణలైన రాక్షస స్త్రీలను చూచెను.

శ్లో॥ అప్రావృతాః కాఞ్చనరాజి వర్ణాః, కాశ్చిత్పరార్థ్యా స్తపనీయ
వర్ణాః।
పునశ్చ కాశ్చిచ్ఛశలక్ష్మవర్ణాః, కాన్తప్రహీణా రుచిరాఙ్గవర్ణాః ౨౮
తతః ప్రియాన్ప్రాప్య మనోభిరామాః, సుప్రీతియుక్తాః ప్రసమీక్ష్యరామాః
గృహేషు హృష్టాః పరమాభిరామాః, హరిప్రవీర స్స దదర్శ రామాః॥ ౨౯

టీ॥ సః = ఆ, హరిప్రవీరః = వానరశ్రేష్ఠుడైన హనుమంతుడు, అప్రావృతాః = వివస్త్రలై యున్నట్టియు, కాఞ్చనరాజివర్ణాః-కాఞ్చనరాజి = బంగారుకాంతివంటి, వర్ణాః = దేహవర్ణములుగల, కాశ్చిత్ = కొందరిని, పరార్థ్యాః = శ్రేష్ఠమైన, తపనీయవర్ణాః = పుటముబెట్టిన బంగారపు వర్ణము గలవారిని, పునశ్చ = మరియు, శశలక్ష్మవర్ణాః – శశలక్ష్మ = చంద్రునివంటి, వర్ణాః = వర్ణములుగలవారలను, కాశ్చిత్ = కొందరను, కాంతప్రహీనాః = భర్తలులేనివారిని, రుచిరాఙ్గవర్ణాః-రుచిర = కాంతిగల, అంగవర్ణాః = అవయవ వర్ణముగలవారిని తతః = అతరువాత, ప్రియాన్ = భర్తలను, ప్రాప్య = పొంది, మనోభిరామాః = సంతోషించిన మనస్సులు గలవారిని, సుప్రీతియుక్తాః = మంచిప్రేమతో కూడియున్నవారిని, ప్రసమీక్ష్య = ప్రత్యేకతలుగాచూచి, గృహేషు = గృహములయందు, హృష్టాః = సంతోషించుచున్న, పరమాభిరామాః = మిక్కిలిసుందరాంగులైన, రామాః = స్త్రీలను, దదర్శ = చూచెను.

తా॥ మంచి మెరుపుగల స్వర్ణరేఖలవంటి ఆకారములు కలవారిని, పుటముబెట్టినబంగారుచ్ఛాయగలవారిని, విగతభర్తలై పాండుర వర్ణములు పొందినవారిని, చంద్రుని వంటి కాంతిగలవారిని భర్తలపరిష్వంగములో సంతోషముబొందుచున్నవారిని, మంచిసుందరాంగులైన రాక్షసస్త్రీలను, మరికొంతమంది అభిసారికాది జాణలుగా నున్న స్త్రీలను హనుమంతుడు చూచెను.

శ్లో॥ చన్ద్రప్రకాశాశ్చహి వక్త్రమాలాశ్చ వక్రాక్షిపక్ష్మాశ్చ [illegible] మాలాః।
విభూషణానాం చ దదర్శ మాలా శ్శతహ్రదానా మివ [illegible]॥ [illegible]

టీ॥ చన్ద్రప్రకాశాః-హి = చంద్రునివలె ప్రకాశించుచున్న. వక్త్రమాలా శ్చ = ముఖపంక్తులు గలవారిని, వక్రాక్షిపక్ష్మ శ్చ-వక్ర = [illegible] అక్షి = నేత్రములయొక్క. పక్ష్మ శ్చ = రెప్పలు గలవారిని. [illegible] మాలా శ్చ = మంచి నేత్రపంక్తులు గలవారిని. శతహ్రదానా [illegible] స్థితానాం = మెరుపులకాంతులవలె నున్న, విభూషణానాం = [illegible] ములయొక్క, మాలా శ్చ = మాలలవరుసలు గలిగినవారిని, [illegible] మాలాః = సుందరమైన కాంతులు గలవారిని; దదర్శ = చూచెను.

తా॥ చంద్రునివంటి ప్రకాశించు ముఖములు గలవారిని, [illegible] యున్న కనురెప్పలతో అందమైన ముఖములు గలవారిని [illegible] లములై అందముగా నేత్రములు గలవారిని మెరుపుల [illegible] కాంతిగల ఆభరణములను ధరించి మెరుపు తీగెలవంటి [illegible] హనుమంతుడు చూచెను. హనుమంతుడు స్త్రీల ముఖ నేత్రములను చూచుట వీరు దేవ. మనుష్య. రాక్షసస్త్రీలలో ఎవ్వరని పరీక్షించుట కొఱకును ఆభరణ పరీక్ష తాను చూచిన సీతాభరణ స్వరూపము [illegible] రించుటకు మాత్రమే అని భావము.

శ్లో॥ న త్వేవ సీతాం పరమాభిజాతాం, పథిస్థితే రాజకులే ప్రజాతామ్।
లతాం ప్రఫుల్లా మివ సాధుజాతాం దదర్శ తన్వీం
మనసాభిజాతామ్॥ [illegible]

టీ॥ పథిస్థితే = ధర్మపథమందు వర్తించుచున్న. రాజకులే = జనకమహా రాజుయొక్క, కులమునందు, ప్రజాతాం = ప్రభవించినట్టియు. పరమా భిజాతాం = ఉత్కృష్టమైన ఐశ్వర్యమును ప్రభవింపజేయునట్టియు.

ప్రఫుల్లాం = వికసించిన. లతా మివ = లతవలెనే. సాధుజాతాం = యోగ్యముగా పుట్టినట్టియు, మనసాభిజాతాం-మనసా = మనస్సుచేత అభిజాతాం = పుట్టినట్టియు, తన్వీం = కొంచెము కృశించియున్న. సీతాంత్వేవ = సీతను మాత్రము. న దదర్శ = చూడలేదు

తా॥ ఆంజనేయుడు లంకాపట్టణమునందు సీతాన్వేషణకొరకు తిరుగుచు రావణ గృహమునందు కూడ అనేకవిధములైన స్త్రీలను చూచెను. కాని మహో త్కృష్ట మగు అయోనిజగా ఉద్భవించి, జనకమహారాజు సంతానముగా పెంచబడి వికసించిన లతవలె విండుదనముతో నొప్పుచు కొంచెము కృశించియున్న సీతను మాత్రము చూడజాలకపోయెను. భగవంతుడు "సంభవా మ్యాత్మమాయయా" తన సంకల్పము మాత్రముతో తాను జనించునట్లు, లక్ష్మియు తన సంకల్పముతో తాను జనించును. అందుచేతనే లక్ష్మి సీతగా అయోనిజయై జన్మించెను.

శ్లో॥ సనాతనే వర్త్మని, సన్నివిష్టాం, రామేక్షణాన్తాం మదనాభివిష్టామ్।
భర్తుర్మనశ్శ్రీ మదనుప్రవిష్టాంస్త్రీభ్యో వరాభ్యశ్చసదావిశిష్టామ్॥ ౨౪
ఉష్ణార్దితాం సానుసృతాస్రకణ్ఠీం పురా వరార్హోత్తమ నిష్కకణ్ఠీమ్
సుజాతపక్ష్మ మభిరక్తకణ్ఠీం, వనేప్రవృత్తా మివ నీలకణ్ఠీమ్॥ ౨౫
అవ్యక్త రేఖా మివ చన్ద్రరేఖాం, పాంసు ప్రదిగ్ధా మివ హేమ రేఖామ్
క్షతప్రరూఢా మివ బాణరేఖాం, వాయుప్రభిన్నా మివ మేఘ రేఖామ్॥ ౨౬
సీతా మపశ్య న్మనుజేశ్వరస్య, రామస్య పత్నీం వదతాం వరస్య।
బభూవ దుఃఖాభిహత శ్చిరస్య ప్లవఙ్గమో మన్దఇవా చిరస్య॥ ౨౭

టీ॥ సనాతనే = పురాతనమైన, వర్త్మని = మార్గమందు, సన్నివిష్టాం = ఉన్న ట్టియు, రామేక్షణాన్తాం-రామ = శ్రీరామునియందే, ఈక్షణాన్తాం = క్రీగంటిచూపులు గలిగినట్టియు, మదనాభివిష్టాం-మదన = మన్మదబాధతో

అభివిష్టాం = కూడియున్నట్టియు, భర్తుః = భర్తయైన శ్రీరాముని యొక్క, శ్రీమత్ = శోభాయుక్తమైన, మనః = మనస్సును, అను ప్రవిష్టాం = అనుసరించి, ప్రవర్తించునట్టియు, సదా = ఎల్లప్పుడు, వరాభ్యః = శ్రేష్ఠలైన, స్త్రీభ్యః = స్త్రీలకంటె, విశిష్టాం = విశిష్ట యోగ్యతతో కూడియున్నట్టియు, ఉష్ణార్దితాం ఉష్ణ = ఉష్ణము తో, అర్దితాం = పీడింపబడుచున్నట్టియు, సానుస్రుతాస్రకంఠీం సానుసృత = ఎడతెగక ప్రవహించు, అస్రకంఠీం = కన్నీటి దగ్గుత్తిక చెందిన కంఠము గలిగియున్నట్టియు, పురా = పూర్వ మందు, వరార్హోత్తమనిష్కకంఠీం - వర = శ్రేష్ఠమైన, అర్హ = తగిన, ఉత్తమ = ఉత్తమమైన, నిష్కకంఠీం = పతకము మెడయందు కలిగినట్టియు, సుజాతపక్ష్మాం-సుజాత = చక్కనైన పక్ష్మాం = కనురెప్పలు కలిగినట్టియు, అభిరక్తకంఠీం-అభిరక్త = మిక్కిలియెఱ్ఱనైన, కంఠీం = కంఠముకలిగినట్టియు, వనే = అరణ్య మునందు, ప్రవృత్తాం = విహరించుచున్న, నీలకంఠీ మివ స్థితాం = నెమలివలె నున్నటువంటియు, అవ్యక్తరేఖాం-అవ్యక్త = స్పష్టము గాని, రేఖాం = రేఖలుగల, చన్ద్రరేఖా మివ స్థితాం = చంద్రరేఖవలె యున్నటువంటియు, పాంసుప్రదిగ్ధాం-పాంసు = పరాగముచేత, ప్రదిగ్ధాం = కప్పబడిన, హేమరేఖామివ స్థితాం = బంగారురేఖవలె నున్నట్టియు, క్షతప్రరూఢాం = గాయమందు గ్రుచ్చుకొన్న, బాణ రేఖా మివ స్థితాం = బాణరేఖవలె నున్నట్టియు, వాయుప్రభిన్నాం = గాలిచే చెదరగొట్టబడియున్న, మేఘరేఖా మివస్థితాం = మేఘరేఖవలె నున్నట్టియు, మనుజేశ్వరస్య = మనుష్యులకు ప్రభువైన, వదతాం వరస్య = వక్తలలో శ్రేష్ఠుడైన, రామస్య = శ్రీరామునియొక్క, పత్నీం = భార్యయగు, సీతాం = సీతను, ప్లవఙ్గమః = వానరుడైన. హనుమంతుడు, అపశ్యన్ = చూడనివాడగుచు, చిరస్య = చిరకాలము దుఃఖాభిహతః = దుఃఖముచేత, కొట్టబడినవాడై, అచిరస్య = వెంటనే మూఢ ఇవ = మూఢుడువలె, బభూవ = ఆయెను,

తా॥ పతివ్రతాధర్మమునందు స్థిరముగా నున్నదియు, మదనతాపముతో రామునే, సదా మానసికముగాను క్రీగంటిచూపులతో చూచుచున్నదియు శ్రేష్ఠలైన స్త్రీలతోనే కూడియుండునదియు మదనాగ్నిచే కృశించినదియు, కన్నీళ్ళతోతడిసిన అందమైన ఎఱ్ఱని కంఠము గలదియు, వనములో విహరించు నెమలివలె నున్నదియు స్పష్టముగా కనబడని చంద్రరేఖవలెను దుమ్ముచే కప్పబడిన బంగారు రేఖవలె నున్నదియు గాయమందు దిగిన బాణరేఖవలె నున్నదియు, వాయువుచే చెదరగొట్టబడిన మేఘమువలె నున్న శ్రీరాముని భార్యయునగు సీతను మాత్రము చూడలేకపోవుటచే హనుమంతుడు వెంటనే మూఢునివలె దుఃఖితుడయ్యెను.

పంచమస్సర్గః సమాప్తః

---

## శ్రీమద్వాల్మీకిరామాయణే సున్దరకాణ్డే షష్ఠస్సర్గః

### * హనుమంతుడు రావణాలయంబు జూచుట *

శ్లో॥ స నికామం విమానేషు విషణ్ణః కామరూపధృత్।
విచచార పునర్లంకాం లాఘవేన సమన్వితః॥ ౧

టీ॥ కామరూపధృత్ = కోరినరూపమును ధరించగల, సః = ఆహనుమంతుడు, నికామం = అత్యంతము, విమానేషు = విమానముల యందు, ( భవనముల యందు, ) విషణ్ణః = విషాదమును పొందినవాడై పునః = తిరిగి, లాఘవేన = సూక్ష్మరూపముచే, సమన్వితః = కూడినవాడై, లంకాం = లంకను గూర్చి, విచచార = తిరిగెను.

తా॥ ఆహనుమంతుడు రావణుని అంతఃపురము. మరియు సమస్త భవనములయందు కామరూపధారియై సీతను వెదకి ఆమె నెచ్చటను కనుగొనజాలక పోవుటచే మిక్కిలి దుఃఖితుడై తిరిగి సూక్ష్మరూపమును దాల్చి మరల లంకనంతయు కలయ దిరిగెను.

శ్లో॥ ఆససా దాథ లక్ష్మీవాన్ రాక్షసేన్ద్రనివేశనమ్।
ప్రాకారే ణార్కవర్ణేన భాస్వరే ణాభిసంవృతమ్॥ ౧

టీ॥ అథ = అటుతరువాత, లక్ష్మీవాన్ = శోభాయుక్తుడైన, సః = ఆహనుమంతుడు, అర్కవర్ణేన = సూర్యుని వంటి వర్ణముతో, భాస్వరేణ = ప్రకాశమానమైన, ప్రాకారేణ = ప్రాకారముతో, అభిసంవృతం = కూడియున్న, రాక్షసేన్ద్రనివేశనం-రాక్షసేన్ద్ర = రావణునియొక్క, నివేశనం = గృహమును ఆససాద = పొందెను.

తా॥ తరువాత హనుమంతుడు సూర్యసమ వర్ణముతో ప్రకాశించు ప్రాకారముతో నొప్పుచున్న రావణగృహమును నిరుత్సాహపడక సీతాన్వేషణ నిమిత్తమై తిరిగి ప్రవేశించెను.

శ్లో॥ రక్షితం రాక్షసై ర్ఘోరైః స్సింహై రివ మహ ద్వనమ్।
సమీక్షమాణో భవనం చకాశే కపికుఞ్జరః॥ ౨

టీ॥ కపికుఞ్జరః = వానరశ్రేష్ఠుడైన హనుమంతుడు, ఘోరైః = క్రూరులైన, రాక్షసైః = రాక్షసులచేత, సింహైః = సింహములచేత, మహద్వనమివ - మహత్ = గొప్పదైన, వనమివ = అరణ్యమువలె, రక్షితం = రక్షింపబడుచున్న, మహత్ = గొప్పదైన, భవనం = భవనమును, సమీక్షమాణః = చూచుచున్నవాడై, చకాశే = ప్రకాశించెను.

తా॥ భయంకర సింహములతో రక్షింపబడు గొప్పదైన అరణ్యమువలె క్రూరరాక్షసులచే అతిజాగరూకతతో కావలా కాయబడుచున్న రావ

ఖుని దివ్యభవనమును చూచుచున్నవాడై యుండి. ఆ భవనమున స్థాపితములై యున్న రత్న మాణిక్యముల కాంతిచే హనుమంతుడు ప్రకాశించెను

శ్లో॥ రూప్యకోపహితై శ్చిత్రై స్తోరణై ర్హేమభూషితైః।
విచిత్రాభి శ్చ కక్ష్యాభి ర్ద్వారై శ్చ రుచిరై ర్వృతమ్॥ ౪
గజాస్థితై ర్మహామాత్రైః శూరై శ్చ విగతశ్రమైః।
ఉపస్థిత మసంహార్యై ర్హయై స్స్యన్దన యాయిభిః॥ ౫
సింహ వ్యాఘ్ర తనుత్రాణై ర్దాన్త కాఞ్చన రాజతైః।
ఘోషవద్భి ర్విచిత్రైశ్చ సదా విచరితం రథైః॥ ౬
బహురత్న సమాకీర్ణం పరార్ధ్యాసన భాజనమ్।
మహారథ సమావాసం మహారథ మహాసనమ్॥ ౭
దృశ్యై శ్చ పరమోదారై స్తై స్తై శ్చ మృగపక్షిభిః।
వివిధై ర్బహుసాహస్రైః పరిపూర్ణం సమన్తతః॥ ౮
వినీతై రన్తపాలై శ్చ రక్షోభి శ్చ సురక్షితమ్।
ముఖ్యాభి శ్చ పరస్త్రీభిః పరిపూర్ణం సమన్తతః॥ ౯
ముదితప్రమదారత్నం రాక్షసేన్ద్ర నివేశనమ్।
వరాభరణ సంహ్రాదై స్సముద్రస్వన నిస్వనమ్॥ ౧౦
తద్రాజగుణసంపన్నం ముఖ్యై శ్చాగరు చన్దనైః।
మహాజనై స్సమాకీర్ణం సింహై రివ మహద్వనమ్॥ ౧౧
భేరీమృదఙ్గాభి రుతం శఙ్ఖఘోష నినాదితమ్।
నిత్యార్చితం పర్వహుతం పూజితం రాక్షసై స్సదా॥ ౧౨
సముద్ర మివ గంభీరం సముద్ర మివ నిస్స్వనమ్।
మహాత్మనో మహద్వేశ్మ మహారత్నపరిచ్ఛదమ్॥ ౧౩
మహారత్న సమాకీర్ణం దదర్శ స మహాకపిః।

టీ॥ రూప్యకోపహితైః = వెండితో కూడియున్న. చిత్రైః = చిత్రముల తోను. హేమభూషితైః = బంగారముచేత అలంకరించబడిన, తోరణైశ్చ = తోరణములతోను, విచిత్రాభిః = విచిత్రములైన, కక్ష్యాభిః = లోగిళ్ళతోను. రుచిరైః = కాంతికలిగిన, ద్వారైశ్చ = ద్వారములతోను, వృతం = కూడియున్నట్టియు, గజాస్థితైః = ఏనుగులమీద నున్న. మహామాత్రైః = ప్రధానులచేతను. విగతశ్రమైః - విగత = పోగొట్టబడిన. శ్రమైః = శ్రమలుగల, శూరైశ్చ = పరాక్రమవంతులతోను, అసంహార్యైః = సంహరించ వీలుకానట్టి. స్యందన యాయిభిః - స్యందన = రథములతో, యాయిభిః = వెళ్లుచున్న. హయైశ్చ = గుఱ్ఱములతోను, ఉపస్థితం = కూడియున్నట్టియు. సింహవ్యాఘ్రతనుత్రాణైః - సింహ = సింహములయొక్కయు. వ్యాఘ్ర = పులులయొక్కయు, తనుత్రాణైః = చర్మకవచములు ధరించిన వారితోను, దాన్త కాఞ్చన రాజితైః - దాన్త = దంతములు, కాఞ్చన = బంగారము. రాజితైః = వెండితోనిర్మించబడిన, ఘోషవద్భిః = ధ్వనుల తోకూడిన, విచిత్రైః = విచిత్రములైన. రథైః చ = రథములతో, సదా = ఎల్లప్పుడు, విచరితం = సంచరించబడుచున్నట్టియు - బహు రత్న = అనేకరత్నములతో, సమాకీర్ణం = వ్యాప్తమైనట్టియు, పరార్ధ్యాసనభాజనం - పరార్ధ్య = శ్రేష్ఠములైన. ఆసన = ఆసనములు. భాజనం = పాత్రలు కలిగియున్నట్టియు, మహారథసమావాసం - మహారథ = మహారథికులతో, సమావాసం = కూడియున్నట్టియు, మహారథ = గొప్పరథములు, మహాసనం = గొప్ప సింహాసనములు గలిగినట్టియు. పరమోదారైః = మిక్కిలి అందమైన దృశ్యైశ్చ = దృశ్యములచేతను, వివిధైః = అనేకవిధములైన. బహుసాహస్రైః = అనేక వేల సంఖ్యలోనున్న. తైస్తైః = ఆయాయి మృగపక్షిభిః = మృగములచేతను, పక్షులచేతను సమన్తతః = అంతట. పరిపూర్ణం చ = నిండియున్నట్టియు —

వినీతైః = వినమ్రములై, అంతఃపాలైః = అంతఃపురరక్షకులైన, రక్షోభిః = రాక్షసులతో, సురక్షితం చ = యోగ్యముగా కాపాడబడుచున్నట్టియు, ముఖ్యాభిః = ముఖ్యులైన, వరస్త్రీభిః-వర = శ్రేష్ఠులైన, స్త్రీభిః = స్త్రీలతో. సమస్తతః = అంతట, పరిపూర్ణం చ = నిండియున్నట్టియు, ముదితప్రమదారత్నం-ముదిత = సంతోషించిన, ప్రమదారత్నం = శ్రేష్ఠులైన స్త్రీలు కలిగినట్టియు, రాక్షసేన్ద్రనివేశనం = రాక్షసునికి నివాసమైనట్టియు. వరాభరణ సంహ్రాదైః-వర = శ్రేష్ఠములైన ఆభరణ = ఆభరణముల యొక్క. సంహ్రాదైః = ధ్వనులతో. సముద్రస్వన నిస్వనం = గొప్పగా ధ్వనిలేని సముద్ర ధ్వని కలిగినదివలె మన్నట్టియు, ముఖ్యైః = ముఖ్యములైన, అగరుచందనైశ్చ = అగరు, మంచిగంధములతో, రాజగుణ సంపన్నం = రాజలాంఛన యుక్త మైనట్టియు, మహాజనైః = గొప్పగొప్ప ప్రజలతో, సింహైః = సింహములతో, సమాకీర్ణం = వ్యాప్తమైన, మహత్ = గొప్పదైన, వనమివ స్థితం = వనమువలె నున్నట్టియు, భేరీమృదంగాభిరుతం-భేరీ = భేరీలు, మృదంగ = మద్దెలలచే, అభిరుతం = అంతటా ధ్వనింపజేయబడుచున్నట్టియు, శంఖఘోషనినాదితం-శంఖఘోష = శంఖధ్వనులచే, నినాదితం = ధ్వనింపజేయబడుచున్నట్టియు. నిత్యార్చితం = ఎల్లప్పుడు పూజింపబడుచున్నట్టియు, సదా = నిత్యము, రాక్షసైః = రాక్షసుల చేత, పూజితం = పూజింపబడుచున్నట్టియు. పర్వహుతం = పర్వములయందు హోమము చేయబడుచున్నట్టియు. సముద్ర మివ = సముద్రమువలె. గంభీరం = గంభీర మైనట్టియు, సముద్ర మివ = సముద్రమువలె. నిస్వనం = ధ్వనిలేనట్టియు, మహారత్నపరిచ్ఛదం-మహారత్న = గొప్పరత్నములతో పరిచ్ఛదం = కప్పబడియున్నట్టియు, మహారత్నసమాకీర్ణం-మహారత్న = గొప్పరత్నములతో సమాకీర్ణం = వ్యాప్తమైనయున్నట్టియు, మహాత్మనః = మహాత్ముడైన రావణుని యొక్క, తత్ = ఆ, మహత్ = గొప్పదైన, వేశ్మ = గృహమును, సః = ఆ, మహాకపిః = వానరసింహుడైన, హనుమంతుడు, దదర్శ = చూచెను.

తా॥ కపిశ్రేష్ఠుడైన ఆంజనేయుడు లంకాపట్టణ మధ్యయందు వెండితో నిర్మిత మూలైన చిత్రములతోను బంగారపు తోరణములతోను, చిత్రముగా కట్టబడిన ప్రహరీగోడలతోను ప్రకాశమానములైన ద్వారములతోను ఏనుగుల నధిష్ఠించియున్న మహావీరుల ప్రధానులతోను రథములతో విర్భయముగా సాగుచున్న గుఱ్ఱములతోను, సింహ, శార్దూలచర్మముల కిపచములు దంతము వెండిబంగారములచే స్థగితములైన కవచములు ధరించినవారితోను విచిత్ర మంగళవాద్యములతో సదా ఆనందోత్సవముల నొప్పుచున్నదియు, అనేకరత్నఖచితములైన సింహాసనములు భోజనపాత్రలతో కూడియున్నదియు అతిరథ మహారథులతోను అనేకసింహ శార్దూల హయ గజ వాహనులతోను, నానావిధములైన పెంపుడు పక్షులతోను, అంతట నిండియున్నదియు మంచి శిక్షణతో గూడిన అంతఃపుర పాలకులైన రాక్షసులతో రక్షింపబడుచున్నదియు, అందగత్తెలు, నిత్య సంతోషితలగు యవ్వనస్త్రీలతోను, వారుధరించిన ఆభరణధ్వనులతోను పునుగు, జవ్వాది, అగరు చందనము కస్తూరి, అత్తరు, పన్నీరు మొదలగు సుగంధద్రవ్యముల పరిమళముచేతను, భేరీ మృదంగ, శంఖాది ఘోషలతోకూడియున్నదియు, నిత్యార్చనలు పర్వదినములందు ప్రత్యేక హవనములతో పూజింపబడునదియు సముద్రమువలె నిర్ఘోషముగను గంభీరమునునైనదియు. మహారత్నములచే పరచబడి సర్వస్థితుల మహోన్నత మహావైభవాదుల ప్రకాశమైనదియు నగు మహానుభావుడగు రావణునియొక్క నివాసభవనమును చూచెను.

శ్లో. విరాజమానం వపుషా గజాశ్వ రథసఙ్కులమ్॥ ౧౪
లఙ్కాభరణ మిత్యేవ సోఽమన్యత మహాకపిః।
చచార హనుమాం స్తత్ర రావణస్య సమీపతః॥ ౧౫

టీ॥ మహాకపిః = వానరశ్రేష్ఠుడైన. సః = ఆహనుమంతుడు. వపుషా = ఆకారముచేత, లఙ్కాభరణ మిత్యేవ-లంకి = లంకకు, ఆభరణం = అలంకారము ఇత్యేవ = ఈలాగుననే విరాజమానం = ప్రకాశించు

చున్నదిగా, అమన్యత = తలచెను. హనుమాన్ = ఆంజనేయుడు. తత్ర = అక్కడ, రావణస్య = రావణునియొక్క. సమీపతః = సమీపమునసే, చచార = తిరుగుచుండెను.

తా॥ వానరశ్రేష్ఠుడైన ఆంజనేయుడు లంకాపట్టణమున దీనికి మించిన భవనములేదు. ఇది లంకకే ఆభరణప్రాయమైనదని తలచుచు రావణుని యొక్క సమీపమున సీతాన్వేషణకొరకు తిరుగుచుండెను.

* ఆంజనేయుడు రాక్షసగృహములందు సీతను వెదకుట *

శ్లో॥ గృహా ద్గృహం రాక్షసానా ముద్యానాని చ వానరః।
వీక్షమాణోహ్యా సంత్రస్తః ప్రాసాదాం శ్చ చచారసః॥ ౧౬

టీ॥ సః = ఆ. వానరః = వానరుడైన హనుమంతుడు. రాక్షసానాం = రాక్షసులయొక్క, గృహాత్ = గృహమునుండి. గృహం = గృహమును. ఉద్యానాని చ = ఉద్యానవనములను, ప్రాసాదాం శ్చ = మేడలను వీక్షమాణోహి = చూచుకొనుచునే, అసంత్రస్తః = భయములేనివాడై చచార = సంచరించెను.

తా॥ ఆంజనేయుడు రావణుని భవనసమీపమం దుండు సోదరులు, పుత్రులు మంత్రులు మున్నగు ముఖ్యులందరి గృహములను ఒకగృహము నుండి మరియొకగృహమును, మేడలు, మిద్దెలు, ఉద్యానవనములనన్నింటిని చూచుచు నిర్భయముగా తిరుగుచుండెను.

శ్లో॥ అవప్లుత్య మహావేగః ప్రహస్తస్య నివేశనమ్।
తతోఽన్య త్పుప్లువే వేశ్మ మహాపార్శ్వస్య వీర్యవాన్॥ ౧౭

టీ॥ తతః = అటుతరువాత, వీర్యవాన్ = మహాపరాక్రమశాలియగు హనుమంతుడు. వేగవాన్ = వేగముతో కూడికొన్నవాడగుచు. ప్రహస్తస్య = ప్రహస్తునియొక్క. నివేశనం = భవనమును,

అవప్లుత్య = దాటి, అన్యత్ = మరియొకటైన, మహాపార్శ్వస్య = మహాపార్శ్వునియొక్క, వేశ్మ = గృహమును గూర్చి, ... దాటెను.

తా॥ మహాపరాక్రమశాలియగు ఆంజనేయుడు వేగముతో ... ముందు రావణుని మంత్రులగు ప్రహస్తుని మహాపార్శ్వుని భవనములను వెదకుచు ముందుకు పోవుచుండెను.

శ్లో॥ అథ మేఘప్రతీకాశం కుమ్భకర్ణ నివేశనమ్।
విభీషణస్య చ తదా పుప్లువే స మహాకపిః॥ ౧౮

టీ॥ అథ = పిమ్మట, సః = ఆ, మహాకపిః = కపిశ్రేష్ఠుడైన ఆంజనేయుడు, మేఘప్రతీకాశం — మేఘ = మేఘమునితో, ప్రతీకాశం = సమానమైన, కుమ్భకర్ణనివేశనం = కుంభకర్ణునియొక్క గృహమును, విభీషణస్య = విభీషణునియొక్క, నివేశనంచ = గృహమును గూర్చియు, తదా = అప్పుడు, పుప్లువే = దూకెను.

తా॥ పిమ్మట ఆహనుమంతుడు రావణానుజులైన కుంభకర్ణ విభీషణుల యొక్క మేఘసంకాశములైన భవనములపైకి దూకి పోయెను.

శ్లో॥ మహోదరస్య చ గృహం విరూపాక్షస్య చైవహి।
విద్యుజ్జిహ్వస్య భవనం విద్యున్మాలే స్తథైవ చ॥ ౧౯
వజ్రదంష్ట్రస్య చ తథా పుప్లువే స మహాకపిః।

టీ॥ సః = ఆ, మహాకపిః = కపిశ్రేష్ఠుడు, మహోదరస్య = మహోదరుని యొక్క, గృహం = గృహమునుగూర్చియు, విరూపాక్షస్య = విరూపాక్షునియొక్క, గృహంచైవహి = గృహమును గూర్చియును, విద్యుజ్జిహ్వస్య = విద్యుజ్జిహ్వునియొక్క, భవనంచ = భవనమును గూర్చియు, తథైవ = అట్లే, విద్యున్మాలేః = విద్యున్మాలియొక్కయు, తథా = అట్లే, వజ్రదంష్ట్రస్య = వజ్రదంష్ట్రునియొక్క, భవనం = భవనమునుగూర్చియు, పుప్లువే = దుమికెను.

తా॥ ఆహనుమంతుడు వరుసగా మహోదరునియొక్క విరూపాక్షుని యొక్క విద్యుజ్జిహ్వునియొక్క-విద్యున్మాలియొక్క వజ్రదంష్ట్రుని యొక్క భవనములపై దుమికెను.

శ్లో॥ శుకస్య చ మహాతేజా స్సారణస్య చ ధీమతః॥ ౨౦
తథా చేన్ద్రజితో వేశ్మ జగామ హరియూథపః।

టీ॥ మహాతేజాః = గొప్ప తేజస్సుగల, హరియూథపః = వానరశ్రేష్ఠుడగు హనుమంతుడు, శుకస్య చ = శుకునియొక్కయు, ధీమతః = బుద్ధిమంతుడైన, సారణస్యచ = సారణునియొక్కయు, తథా = ఆప్రకారముగా, ఇంద్రజిత శ్చ = ఇంద్రజిత్తుయొక్కయు, వేశ్మ = గృహమును గూర్చి, జగామ = వెళెను.

తా॥ ఆంజనేయుడు రావణుని కతిముఖ్యులైన శుక సారణులయొక్క ఇండ్లకును మరియు రావణకుమారుడైన యింద్రజిత్తు భవనంబునకు పోయి వెదకెను.

శ్లో॥ జమ్బుమాలే స్సుమాలే శ్చ జగామ హరిసత్తమః॥ ౨౧
రశ్మికేతో శ్చ భవనం సూర్యశత్రో స్తథైవ చ।
వజ్రకాయస్య చ తథా పుప్లువే స మహాకపిః॥ ౨౨

టీ॥ సః = ఆ, హరిసత్తమః = వానరశ్రేష్ఠుడగు హనుమంతుడు, జమ్బుమాలేః చ = జంబుమాలియొక్కయు, సుమాలే శ్చ = సుమాలియొక్కయు, తథైవ — అదేవిధముగానే. రశ్మికేతో శ్చ = రశ్మికేతుని యొక్కయు, తథా = ఆవిధముగానే సూర్యశత్రో శ్చ = సూర్యశత్రునియొక్కయు, వజ్రకాయస్య = వజ్రకాయునివంటి భవనం = భవనమునుగూర్చి. మహాకపిః = ఆంజనేయుడు, పుప్లువే = దుమికెను.

తా॥ వానరశ్రేష్ఠుడైన హనుమంతుడు జంబుమాలి, సుమాలి, రశ్మికేతు, సూర్యశత్రువు వజ్రకాయుల యిండ్లను వెదకుచు సాగెను.

శ్లో॥ ధూమ్రాక్షస్య చ సమ్పాతే ర్భవనం మారుతాత్మజః।
విద్యుద్రూపస్య చ భీమస్య ఘనస్య విఘనస్య చ॥ ౨౫
శుకనాసస్య వక్రస్య శఠస్య వికటస్య చ।
బ్రహ్మకర్ణస్య దంష్ట్రస్య రోమశస్య చ రక్షసః॥ ౨౬
యుద్ధోన్మత్తస్య మత్తస్య ధ్వజగ్రీవస్య నాదినః।
విద్యుజ్జిహ్వేన్ద్రజిహ్వానాం తథా హస్తిముఖస్య చ॥ ౨౭
కరాళస్య పిశాచస్య శోణితాక్షస్య చైవహి।
క్రమమాణః క్రమేణైవ హనుమా న్మారుతాత్మజః॥ ౨౮
తేషు తేషు మహార్హేషు భవనేషు మహాయశాః।
తేషా మృద్ధిమతా మృద్ధిం దదర్శ స మహాకపిః॥ ౨౯

టీ॥ మారుతాత్మజః = వాయుపుత్రుఁ డగు ఆంజనేయుఁడు, ధూమ్రాక్షస్య = ధూమ్రాక్షునియొక్కయు. సంపాతేః చ = సంపాతియొక్కయు, విద్యుద్రూపస్య = విద్యుద్రూపుని యొక్కయు, భీమస్య = భీముని యొక్కయు, ఘనస్య = ఘనుని యొక్కయు, విఘనస్య చ = విఘనునియొక్కయు, భవనం = భవనమును, దదర్శ = చూచెను. శుకనాసస్య = శుకనాసునియొక్క, వక్రస్య = వక్రునియొక్క, శఠస్య = శఠునియొక్క, వికటస్య చ = వికటునియొక్కయు, బ్రహ్మకర్ణస్య = బ్రహ్మకర్ణునియొక్క, దంష్ట్రస్య = దంష్ట్రునియొక్క, రోమశస్య = రోమశుఁడనెడి, రక్షసః చ = రాక్షసుని యొక్కయు — యుద్ధోన్మత్తస్య = యుద్ధోన్మత్తుఁ డగు మత్తస్య = మత్తునియొక్క, ధ్వజగ్రీవస్య = ధ్వజగ్రీవునియొక్క, నాదినః = నాదినునియొక్క, విద్యుజ్జిహ్వేంద్రజిహ్వానాం = విద్యుజ్జిహ్వ ఇంద్రజిహ్వుల యొక్క, తథా = అట్లే, హస్తిముఖస్య చ = హస్తిముఖుని యొక్కయు, భవనం = భవనమును, దదర్శ = చూచెను — మారుతాత్మజః = వాయుసూనుఁడైన ఆంజనేయుఁడు, కరాళస్య = కరాళునియొక్క, పిశాచస్య = పిశాచునియొక్క, శోణితాక్షస్య చైవహి = శోణితాక్షుని యొక్కయు, భవ

నం = భవనమును, క్రమేణ = క్రమముగా, క్రమమాణ ఏవ = దాటుచునే, దదర్శ = చూచెను- సః = ఆ, మహాకపిః = గొప్పవానరుడైన ఆంజనేయుడు, మహాయశాః = గొప్పయశస్సుగలవాడై, మహాన్తేషు = గొప్పవారికితగియున్న, తేషు తేషు = ఆ యా, భవనేషు = భవనములయందు, బుద్ధిమతాం = సర్వసంపత్సమృద్ధులైన, తేషాం = ఆ రాక్షసులయొక్క, బుద్ధిం = సర్వసంపత్సమృద్ధిని, దదర్శ = చూచెను.

తా॥ ఆ హనుమంతుడు ధూమ్రాక్షుడు, సంపాతి, విద్యుద్రూపుడు, భీముడు, ఘనుడు, విఘనుడు, శుకనాసుడు, వక్రుడు, శఠుడు, వికటుడు, బ్రహ్మకర్ణుడు, దంష్ట్రుడు, రోమశుడు, యుద్ధోన్మాది మత్తుడు, ధ్వజగ్రీవుడు, నాదినుడు, విద్యుజ్జిహ్వ ఇంద్రజిహ్వులు, హస్తిముఖుడు, కరాళుడు, పిశాచి, శోణితాక్షుడు మొదలుగాగల రాక్షసుల యొక్క రావణ భవన పరిసరములలో వారి వారి అర్హతలకు తగినట్లు అమర్చబడిన సర్వసంపద్విలసితములైన భవనములందు సీతను వెదకుచు ఆ యిండ్లయందలి సర్వ సంపత్సమృద్ధిని గాంచి ఆశ్చర్యపడెను.

* హనుమంతుడు రావణగృహంబు జొచ్చుట *

శ్లో॥ సర్వేషాం సమతిక్రమ్య భవనాని సమన్తతః।
ఆససాద లక్ష్మీవాన్ రాక్షసేన్ద్ర నివేశనమ్॥ ౨౨

టీ॥ అథ = అటుతరువాత, లక్ష్మీవాన్ = శోభాయుక్తుడైన ఆంజనేయుడు, సర్వేషాం = సమస్తరాక్షసులయొక్క, భవనాని = భవనములను, సమంతతః = అంతట, సమితిక్రమ్య = అతిక్రమించి, రాక్షసేన్ద్రనివేశనం-రాక్షసేన్ద్ర = రాక్షసప్రభువైన రావణునియొక్క, నివేశనం = భవనమును, ఆససాద = పొందెను.

తా॥ ఆతరువాత సీతాన్వేషణ మను సత్కార్యాచరణ, ఆత్మ సంతుష్టి, పవిత్ర బాధ్యత, మహోత్సుకతలతో కూడి శోభాయమానుడైన హనుమంతుడు రావణుని భ్రాతృ, పుత్ర, బంధు, మిత్ర, సచివ, చారణ, సైన్యాధ్యక్షాది సమస్తరాక్షసులయొక్క, సర్వసంపద్వైభవములతో తులతూగుచున్న భవనములన్నియు క్రమముగా తిరిగి పరిశీలించుచు రావణభవనమును చేరెను.

శ్లో॥ రావణ స్యోపశాయిన్యో దదర్శ హరిసత్తమః।
విచరన్ హరిశార్దూలో రాక్షసీ ర్వికృతేక్షణాః॥ ౨౯

శ్లో॥ శూల ముద్గర హస్తా శ్చ శక్తి తోమర ధారిణీః।
దదర్శ వివిధా న్గుల్మాం స్తస్య రక్షఃపతే ర్గృహే॥ ౩౦

టీ॥ హరిసత్తమః = వానరశ్రేష్ఠుడైన. హరిశార్దూలః = వానరసింహమైన అంజనేయుడు, విచరన్ = సంచరించుచు. రావణస్య = రావణుని యొక్క ఉపశాయిన్యః = సమీపమునశయనించియున్నట్టి, వికృతేక్షణాః - వికృత = వికారముగానున్న, ఈక్షణాః = చూపులుగలిగిన. రాక్షసీః = రాక్షసస్త్రీలను, దదర్శ = చూచెను. తస్య = ఆ, రక్షఃపతేః = రావణుని యొక్క. గృహే = గృహామునందు, శూల ముద్గర హస్తాః - శూల ముద్గర = శూలములు ముద్గరములు, హస్తాః = హస్తములందు గలిగిన వారిని, శక్తి తోమర ధారిణీః = శక్తి, చిల్లకోల లనే ఆయుధముల ధరించినవారిని. వివిధాన్ = వివిధములైన, గుల్మాన్ = సైన్య విశేషములను, దదర్శ = చూచెను.

తా॥ వానరశ్రేష్ఠుడగు హనుమంతుడు రావణుని సమీపమున నిద్రించు వికృతనేత్రములు గల రాక్షసస్త్రీలను, మరియు శూలము ముద్గరము, శక్తి, తోమర ఆయుధములను ధరించియున్నవారిని, అనేకరహస్య వేసలను రావణుని భవన మందు చూచెను.

శ్లో॥ రాక్షసాంశ్చ మహాకాయాన్ నానా ప్రహరణోద్యతాన్।
రక్తాన్ శ్వేతాన్ సితాంశ్చైవ హరీంశ్చాపి మహాజవాన్॥ ౩౧
కులీనాన్ రూపసమ్పన్నా న్గజా న్పరగజారుజాన్।
నిష్ఠితా న్గజశిక్షాయా మైరావత సమాన్యుధి॥ ౩౨
నిహన్తౄ న్పరసైన్యానాం గృహే తస్మి న్దదర్శ సః।
క్షరత శ్చ యథామేఘాన్ స్రవత శ్చ యథాగిరీన్॥ ౩౩
మేఘ స్తనిత నిర్ఘోషా న్దుర్ధర్షా న్సమరే పరైః॥

టీ॥ మహాకాయాన్ = పెద్దశరీరములు గలిగినట్టియు. నానా ప్రహరణో ద్యతాన్-నానాప్రహరణ = అనేకఆయుధములచే. ఉద్యతాన్ = సంసిద్ధులుగ నున్నట్టియు. రాక్షసాన్ = రాక్షసులను. రక్తాన్ = ఎఱ్ఱనైన; శ్వేతాన్ = తెల్లనైన, అపి = మరియు, మహాజవాన్ = గొప్పవేగము గలిగి. స్థితాన్ = ఉన్నటువంటి. హరీం శ్చ = గుఱ్ఱములను. కులీనాన్ = మంచిజాతి వైనట్టియు, రూపసమ్పన్నాన్ = అందముతో కూడియున్నట్టియు, పరగజారుజాన్-పరగజ = శత్రువులయొక్క యేనుగులను, అరుజాన్ = పీడింపజేయునట్టియు. గజశిక్షాయాం = ఏనుగులశిక్షణయందు, నిష్ఠితాన్ = శిక్షింపబడినట్టియు, యుధి = యుద్ధమునందు, ఐరావతసమాన్-ఐరావత = ఐరావతగజముతో, సమాన్ = సమానమైనట్టియు. పరసైన్యానాం = శత్రుసైన్యములను. నిహంతౄన్ = కొట్టెటువంటియు, క్షరతః = వర్షించుచున్న, మేఘాన్ యథాస్థితాన్ = మేఘములవలె నున్నట్టియు. స్రవతః = స్రవించుచున్న. గిరీన్ యథాస్థితాన్ = పర్వతమువలె నున్నట్టియు. మేఘ స్తనిత నిర్ఘోషాన్-మేఘ = మేఘములయొక్క, స్తనిత = ఉరుములవలె. నిర్ఘోషాన్ = ఘీంకరించుచున్నట్టియు. సమరే = యుద్ధమందు, పరైః = శత్రువులచేత, దుర్ధర్షాన్ = పట్టశక్యముగానట్టి. గజాన్ = ఏనుగులను. సః = ఆహనుమంతుడు, తస్మిన్ = ఆ, గృహే = గృహమునందు. దదర్శ = చూచెను.

తా॥ అంజనేయుడారావణ గృహమందు నానాఆయుధములు ధరించి యుద్ధసన్నద్ధులై యున్న భయంకరాకారులగు రాక్షసులను, తెలుపు, ఎఱుపు వర్ణములతో కూడి అచ్చట కట్టబడియున్న వేగవంతములైన గుఱ్ఱములను, మంచిరూప సౌష్ఠవము గలిగి శత్రువుల యేనుగులను పీడింప శక్తిగలిగి యున్నట్టియు, గజశిక్షణలో మంచి ప్రావీణ్యము పొంది యుద్ధములలో ఐరావతగజము మాడ్కి శత్రుసైన్యముల నుక్కడగించు నేర్పు గలిగినట్టియు, వర్షించు మేఘముల వలె స్రవించు పర్వతముల వలెను మదజలమును స్రవించుచున్న యుత్తమ జాతి యేనుగులను చూచెను.

శ్లో॥ సహస్రం వాహినీ స్తత్ర జామ్బూనద పరిష్కృతాః॥ ౩౪
హేమజాల పరిచ్ఛన్నా స్తరుణాదిత్య సన్నిభాః।
దదర్శ రాక్షసేన్ద్రస్య రావణస్య నివేశనే॥ ౩౫

టీ॥ తత్ర = అక్కడ. రాక్షసేన్ద్రస్య = రాక్షసప్రభువైన. రావణస్య = రావణునియొక్క. నివేశనే = గృహమందు. జామ్బూనదపరిష్కృతాః — జామ్బూనద = బంగారముచేత, పరిష్కృతాః = చేయబడినట్టియు, హేమజాలపరిచ్ఛన్నాః - హేమజాల = బంగారుసమూహములచేత, పరిచ్ఛన్నాః = కప్పబడియున్నట్టియు, తరుణాదిత్యసన్నిభాః — తరుణ = లేత, ఆదిత్య = సూర్యునితో సన్నిభాః = సమానమైన. వాహినీః = సేనలను, దదర్శ = చూచెను.

తా॥ రావణుని ఆ భవనప్రాంగణములో బంగారునగలు, కవచాదులు, ధరించి బాలభానునివలె ప్రకాశించు పదాతిసైన్యములను హనుమంతుడు చూచెను.

శ్లో॥ శిబికా వివిధాకారా స్స కపి ర్మారుతాత్మజః।
లతాగృహాణి చిత్రాణి చిత్రశాలాగృహాణి చ॥ ౩౬

శ్లో॥ క్రీడాగృహాణి చాన్యాని దారు పర్వతకా నపి।
కామస్య గృహకం రమ్యం దివాగృహక మేవ చ॥ ౩౭
దదర్శ రాక్షసేన్ద్రస్య రావణస్య నివేశనే।

టీ॥ సః = ఆ, కపిః = వానరుడైన, మారుతాత్మజః = వాయుపుత్రు డగు ఆంజనేయుడు, వివిధాకారాః = అనేకాకారములుగల, శిబికాః = పల్లకీలను, చిత్రాణి = చిత్రములైన, లతాగృహాణి = లతాగృహములను, చిత్రశాలాగృహాణి చ = చిత్రశాలాగృహములను, అన్యాని = ఇతరములైన, క్రీడాగృహాణి = క్రీడాగృహములను, దారుపర్వతకాన్ అపి—దారు = కఱ్ఱలచే నిర్మింపబడిన, పర్వతకానపి = క్రీడాపర్వతములను, రమ్యం = సుందరమైన, కామస్య గృహకం = మన్మథగృహమును, (కామోద్దీపకమగు గృహము) దివాగృహక మేవచ = పగలు విహరింప దగిన గృహమును, రాక్షసేన్ద్రస్య = రాక్షసప్రభువైన, రావణస్య = రావణునియొక్క, నివేశనే = నివాస భవనమందు, దదర్శ = చూచెను.

తా॥ వాయుపుత్రుడైన హనుమంతుడు రాక్షసప్రభు వైన రావణుని భవనమందు అనేకవిధముల ఆకారములు గల పల్లకీలను, చిత్రాతిచిత్రములైన లతాగృహములను, చిత్రశాలలను క్రీడాగృహములను, దారు నిర్మిత క్రీడాపర్వతములను, సుందరమైన కేళీగృహములను పగటి వినోదవిహారగృహములను చూచెను.

శ్లో॥ స మన్దరగిరిప్రఖ్యం మయూరస్థాన సఙ్కులమ్॥ ౩౮
ధ్వజయష్టిభి రాకీర్ణం దదర్శ భవనోత్తమమ్।
అనేకరత్నసఙ్కీర్ణం నిధిజాలం సమన్తతః॥ ౩౯
ధీరనిష్ఠిత కర్మాన్తం గృహం భూతపతే రివ।

టీ॥ సః = ఆ హనుమంతుడు, మన్దరగిరిప్రఖ్యం - మన్దరగిరి = మన్దర పర్వతముగ, ప్రఖ్యం = చెప్పబడుచున్నట్టియు, మయూరస్థానసఙ్కు-

లమ్ - మయూర = నెమళ్ళయొక్క, స్థాన = ఉండటము చేత, సంకులం = ధ్వనులతోవ్యాప్తమైనట్టియు. ధ్వజయష్టిభిః = జండాకఱ్ఱలతోను, ఆకీర్ణం = వ్యాప్తమైన. భవనోత్తమం = ఉత్తమభవనమును, సమన్తతః = అంతట అనేకరత్నసంకీర్ణం-అనేకరత్న = అనేకరత్నములతో, సంకీర్ణం = కూడియున్నట్టియు. నిధిజాలం = నిధిసమూహములు గలిగియున్నట్టియు. ధీరనిష్ఠితకర్మాంతం-ధీర = ధీరులచే, నిష్ఠిత = నిష్ఠగచేయబడిన, కర్మాంతం = సాంతములైన కర్మలు గలిగిన, భూతపతేః = ఈశ్వరునియొక్క, గృహ మివ = గృహమైన కైలాసమువలె, స్థితం = ఉన్నదానిని. దదర్శ = చూచెను.

తా॥ రావణభవనమునందు పెంపుడు నెమళ్లు ఉండుటకుగాను మండపసర్వతాకారముగ నిర్మించిన భవనములను. జండాకఱ్ఱలతో నంతట వ్యాప్తమై యుండి, అనేకనిధుల కాకరమై ధీరులైన ఋషిగణముతో తపస్సులు, యజ్ఞములు చేయబడెడి కైలాసపర్వతమువలె ప్రకాశించు ఆ రావణభవనమును అంజనేయుడు గాంచెను.

శ్లో॥ అర్చిర్భి శ్చాపి రత్నానాం తేజసా రావణస్య చ॥ ౪౦
విరరా జాథ తద్వేశ్మ రశ్మిమా నివ రశ్మిభిః।
జాంబూనదమయా న్యేవ శయనా న్యాసనాని చ॥ ౪౧
భాజనాని చ ముఖ్యాని దదర్శ హరియూథపః।

టీ॥ అథ = అతరువాత, రత్నానాం = రత్నములయొక్క, అర్చిభిశ్చ = కాంతిజ్వాలలచేతను, అపి = ఇంకను, రావణస్య = రావణునియొక్క తేజసా చ = తేజస్సుచేతను, తత్ = ఆ, వేశ్మ = గృహము, రశ్మిభిః = కిరణములచేత, రశ్మిమా నివ = సూర్యుడువలె, విరరాజ = ప్రకాశించెను. శయనాని = ప్రక్కలును. ఆసనాని చ = సింహాసనములును, ముఖ్యాని = ముఖ్యములైన. భాజనాని చ = పాత్రలును, జాంబూనదమయా న్యేవ = బంగారువికారములైనవేగా, హరియూథపః = కపిసత్తముడు, దదర్శ = చూచెను.

తా॥ ఆ రావణుని భవనము, రత్నకాంతులచేత, మరియు రావణుని తేజస్సు చేతను, ప్రకాశించుచున్న కిరణజాలము చేత, సూర్యునివలె ప్రకాశించెను. పరుండు ప్రక్కలు, ఆసనములు, భోజనపాత్రలు అన్నియు బంగారుమయములైన వాటిని ఆంజనేయుడు చూచెను.

శ్లో॥ మధ్వాసవ కృతక్లేదం మణిభాజనసఙ్కులమ్॥ ౪౨
మనోరమ మసమ్బాధం కుబేరభవనం యథా।
నూపురాణాం చ ఘోషేణ కాఞ్చీనాం నినదేన చ॥ ౪౩
మృదఙ్గతల ఘోషైశ్చ ఘోషవద్భి ర్వినాదితమ్।
ప్రాసాదసఙ్ఘాతయుతం స్త్రీరత్నశత సఙ్కులమ్॥ ౪౪
సువ్యూఢకక్ష్యం హనుమా న్ప్రవివేశ మహాగృహమ్।

టీ॥ హనుమాన్ = హనుమంతుడు, మధ్వాసవ కృతక్లేశం-మధ్వాసవ = తేనె, కల్లుచేత, కృత = చేయబడిన. క్లేదం = తడి (చెమ్మ) కలిగినట్టియు, మణిభాజనసఙ్కులం - మణిభాజన = మాణిక్య పాత్రలచేత, సంకులం = వ్యాప్తమైనట్టియు, మనోరమం = సుందరమైనట్టియు, అసమ్బాధం = సువిశాలమైన, కుబేరభవనంయథా స్థితం = కుబేరుని భవనమువలె. నున్నట్టియు, నూపురాణాం = కాలిఅందెలయొక్క, ఘోషేణ చ = ధ్వనిచేతను, కాఞ్చీనాం = బంగారు మొలనూళ్ళయొక్క, నినదేన చ = చిరుసవ్వడులచేతను. మృదఙ్గతల ఘోషైః-మృదంగ = మద్దెలలయొక్క, తల = ప్రక్కప్రదేశము లందలి. ఘోషైః = ధ్వనులచేతను, ఘోషవద్భిః = వీణలచేతను, వినాదితం = ధ్వనింపచేయబడుచున్నట్టియు - ప్రాసాదసఙ్ఘాతయుతం - ప్రాసాద = మేడలయొక్క, సఙ్ఘాత = రాపిళ్ల చేత, యుతం = కూడియున్నట్టియు, స్త్రీరత్నశతసఙ్కులం—స్త్రీరత్నశత = వందలకొలది స్త్రీరత్నములచేత, సంకులం = వ్యాప్తమై యున్నట్టియు, సువ్యూఢ

కక్ష్యం-సువ్యూఢ = మంచివిశాలములైన, కక్ష్యం = ముంగిళ్లు కలిగినట్టియు, మహాగృహం = గొప్పదైన రావణగృహమును, ప్రవివేశ = ప్రవేశించెను.

తా॥ తేనెచేతను కల్లుచేతను తడిసి చెమ్మగా నున్నటువంటియు, మాణిక్య పాత్రలచే శోభిల్లుచున్నట్టియు, సుందరమై విశాల మగు కుబేరుని భవనమువలె విరాజిల్లుచున్నట్టియు, కాలి అందెలయొక్క ధ్వనుల, బంగారపు మొలనూళ్ళ (కాంచీల) యొక్క చిరుసవ్వడుల చేతను మృదంగవాద్యములయొక్క మనోహర మైన ధ్వనులచేతను, లలిత ములైన వీణానాదముల చేతను ధ్వనింపజేయబడుచున్నదియు, మహో న్నతభవన పంక్తులతోను, వందలకొలది యువతీరత్నములతోను క్రిక్కిరిసియున్నట్టియు, అతివిశాలములైన ముంగిళ్లుకలిగి మహావైభ వముగానున్న ఆరావణగృహమును అంజనేయుడు ప్రవేశించెను-

కాంచీ యన బంగారపుమొలనూలు. ఇది కాంచి అనియు కాంచి అనియు రెండు రూపముల నొప్పుచున్నది. "ఏక యష్టి ర్భవేత్కాంచి మేఖలా త్వష్టయష్టికా, రసనా షోడశసరా, కలాపః పంచవింశకః॥ (త్రికాండశేషం.) ఒంటి సరము మొలనూలు కాంచీ, ఎనిమిది సరములు గలది మేఖల, పదునాఱుసరములు గలది రశన (రసన) యిరువై అయిదు సరములు గలది కలాపము అని చెప్పబడును.

ఇతి షష్ఠ స్సర్గః

# శ్రీమద్వాల్మీకిరామాయణే సున్దరకాణ్డే సప్తమ స్సర్గః

## * హనుమంతుడు నగళ్ళలో సంచరించుట *

శ్లో॥ స వేశ్మజాలం బలవాన్ దదర్శవ్యాసక్త వైడూర్య సువర్ణజాలమ్।
యథామహత్ప్రావృషి మేఘజాలం, విద్యుత్పినద్ధం స విహంగ
జాలమ్॥ ౧

టీ॥ సః = ఆ, బలవాన్ = పరాక్రమశాలియైన ఆంజనేయుడు, వ్యాసక్త వైడూర్యసువర్ణజాలం-వ్యాసక్త = కూర్చబడిన, వైడూర్య = వైడూర్య మాణిక్యములు గల, సువర్ణజాలం = బంగారుకిటికీలు గలిగినట్టి, వేశ్మజాలం = ఇండ్లవరుసను, ప్రావృషి = వర్షాకాలమునందు, విద్యుత్పినద్ధం - విద్యుత్ = మెరుపులతో, పినద్ధం = కూడిన, మేఘజాలంయథాస్థితం = మేఘపంక్తులవలె నున్నట్టియు, సవిహంగజాలం = పక్షిసమూహముతో కూడియున్న, మహత్ = గొప్పదైన, వేశ్మజాలం = ఇండ్లవరుసను, దదర్శ = చూచెను.

తా॥ పరాక్రమశాలి యగు ఆ హనుమంతుడు వైడూర్యాది మణులచే స్థాపితమై బంగారు మయములైన కిటికీలు గలిగి, నానావిధములైన పక్షిసముదాయముతో వర్షాకాలమందు మెరుపులతో గూడి ప్రకాశించు మేఘపంక్తులవలె నున్న ఆరావణునియొక్క భవనముల వరుసను చూచెను.

శ్లో॥ నివేశనానాం వివిధా శ్చ శాలాః ప్రధాన శఙ్ఖాయుధ చాపశాలాః।
మనోహరా శ్చాపి పునర్విశాలాః,దదర్శవేశ్మాదిషుచన్ద్రశాలాః॥ ౨

టీ॥ నివేశనానాం = భవనములలో, వివిధాః = అనేక విధ ములైన, శాలాశ్చ = గృహాంతరశాలలను, ప్రధానశంఖాయుధచాపశాలాశ్చ- ప్రధాన = ముఖ్యములగు, శంఖ = శంఖములయొక్క, ఆయుధ =

ఆయుధములయొక్క, చాప = ధనువులయొక్క, శాలాః = భవంతులను. వేశ్మాదిషు = భవనములయందు, మనోహరాః = సుందరములైన, అపిచ = మరియు. పునఃవి శాలాః = విశాలములైన, సప్రశాలాః = పై అంతస్థుల (అట్టాలికలు) ను, దదర్శ = చూచెను.

తా॥ ఆ హనుమంతుడు అచ్చటి ముఖ్యములైన శంఖములు, ఆయుధములు ధనుస్సులు, బాణములతో నిండియున్న భవనములను, మరియు మేడలపై మనోహరముగను సువిశాలముగను పునర్నిర్మితములైన పై అంతస్థుభవనములను చూచెను.

శ్లో॥ గృహాణినానా వసురాజితాని, దేవాసురైశ్చాపి సుపూజితాని
సర్వైశ్చ దోషైః పరివర్జితాని, కపి ర్దదర్శ స్వబలార్జితాని॥ ౩

టీ॥ కపిః = ఆంజనేయుడు, స్వబలార్జితాని-స్వబల = రావణుడు తనపరాక్రమముతో, అర్జితాని = సంపాదించినట్టియు, సర్వైః = సమస్తమైన, దోషైః = దోషములతో, పరివర్జితాని = శూన్యములైనట్టియు, దేవాసురైశ్చాపి = దేవతలచేత రాక్షసులచేతకూడ, సుపూజితాని = యోగ్యముగా పూజింపబడుచున్నట్టియు, నానా వసురాజితాని-నానా వసు = సర్వసంపదలతో, రాజితాని = ప్రకాశింపజేయబడు, గృహాణి = గృహములను, దదర్శ = చూచెను.

తా॥ రావణుడు తనపరాక్రమముతో పూర్వము కుబేరుని జయించి సంపాదించి, వాస్తుశాస్త్రప్రకారము దోషము లన్నిటిని మయుడనే దానవునిచే తొలగింపజేసెను. (పూర్వము లంక విశ్వకర్మచే నిర్మింపబడి కుబేరునికి యివ్వబడినది. ఆ కుబేరుని జయించి లంకను తాను స్వాధీనపఱచుకొన్నపిదప రావణుడు మయదానవునిచే వాస్తుదోషములను తొలగించెను) అట్టి దోషరహితమై దేవాసురులకు కూడ పూజింపదగియుండి సర్వసంపదలచే తులదూగుచున్న రావణుని భవనములను హనుమంతుడు చూచెను.

శ్లో॥ తాని ప్రయత్నాభిసమాహితాని, మయేన సాక్షాదివ నిర్మితాని।
మహీతలే సర్వగుణోత్తరాణి దదర్శ లఙ్కాధిపతేర్గృహాణి॥ ౮

టీ॥ ప్రయత్నాభిసమాహితాని–ప్రయత్న = ప్రయత్నముచేత, అభిసమాహితాని = కూడికొనియున్నట్టియు, సాక్షాత్ = ప్రత్యక్షముగా. మయేన = మయునిచేత, నిర్మితానివ స్థితాని = నిర్మించబడిన వానివలె నున్నట్టియు. మహీతలే = భూమియందు. సర్వగుణోత్తరాణి– సర్వగుణ = సమస్తగుణములచే, ఉత్తరాణి = ఉత్తమమైనట్టియు. లఙ్కాధిపతేః = రావణునియొక్క. తాని = ఆ. గృహాణి = గృహములను. దదర్శ = చూచెను.

తా॥ అతిప్రయత్నముతో సుందరముగా నిర్మింపబడినట్టి, సాక్షాత్ మయునిచే నిర్మింపబడినవా అనునట్లు వాస్తుశాస్త్రాను సారముగా దోషరహితములుగా నున్నట్టి భూమియందు వీటిని మించి సర్వశుభగుణోపేతమైనవి మరి లేవన్నట్లు ఉన్న రావణుని ముఖ్యగృహములను హనుమంతుడు చూచెను.

* హనుమంతుడు పుష్పకవిమానమును జూచుట *

శ్లో॥ తతో దదర్శోచ్ఛ్రిత మేఘరూపం, మనోహరం కాఞ్చన చారురూపమ్।
రక్షోఽధిపస్యాత్మబలానురూపం, గృహోత్తమం హ్యప్రతిరూపరూపమ్ ౯
మహీతలే స్వర్గ మివ ప్రకీర్ణం, శ్రియా జ్వలన్తం బహురత్నకీర్ణమ్।
నానాతరూణాం కుసుమావకీర్ణం, గిరే రివాగ్రం రజసావకీర్ణమ్ ౧౦

నారీప్రవేకై రివ దీప్యమానం, తటిద్భి రమ్భోదవ
దర్చ్యమానమ్।
హంసప్రవేకై ర్దివి వాహ్యమానం శ్రియాయుతం ఖే సుకృతాం
విమానమ్॥ ౭
యథానగాగ్రం బహుధాతుచిత్రం యథా నభశ్చ గ్రహచన్ద్ర
చిత్రమ్।
దదర్శ యుక్తీకృత మేఘచిత్రం విమానరత్నం బహురత్న
చిత్రమ్॥ ౮

టి॥ తతః = అటుతరువాత, ఉచ్ఛ్రిత మేఘరూపం-ఉచ్ఛ్రిత = ఉన్నతమైన, మేఘరూపం = మేఘస్వరూపముగలిగియున్నట్టియు. మనోహరం = సుందరమైనట్టియు, కాఞ్చనచారు రూపం - కాఞ్చన = బంగారము చేత, చారు = సుందరమైన, రూపం = ఆకారము గలిగినట్టియు, రక్షోఽధిపస్య = రావణునియొక్క. ఆత్మబలానురూపం-ఆత్మబల = స్వకీయ బలమునకు, అనురూపం = తగియున్నట్టియు, అప్రతిరూపరూపం = సాటిలేనిఆకారము కలిగినట్టియు. గృహోత్తమం హి = ఉత్తమగృహముగానే యున్నట్టియు, మహీతలే = భూమియందు, స్వర్గమివ = స్వర్గమువలె, ప్రకీర్ణం = ప్రసిద్ధమైనట్టియు, శ్రియా = లక్ష్మితో. జ్వలన్తం = ప్రకాశించుచున్నట్టియు, బహురత్నకీర్ణం-బహురత్న = అనేకరత్నములతో, కీర్ణం = వ్యాప్తమై యున్నట్టియు, గిరేః = పర్వతముయొక్క, అగ్రమివ స్థితం = శిఖరమువలెనున్నట్టియు, రజసా = పరాగముచేత, అవకీర్ణం = వ్యాప్తమైనట్టియు, నారీప్రవేకైః = శ్రేష్ఠమైనస్త్రీలతో. దీప్యమాన మివ స్థితం = ప్రకాశింపజేయబడు దానివలె యున్నట్టియు, తటిద్భిః = మెరుపులతో, అమ్భోదవత్ = మేఘమువలె,అర్చ్యమానం = పూజింపతగియున్నట్టియు, హంసప్రవేకైః = శ్రేష్ఠమైనహంసలతో, దివి = ఆకాశమందు, వాహ్యమానమివ స్థితం = మోయబడుచున్నట్లున్నదియు, శ్రియా = లక్ష్మితో, యుతం = కూడి

యున్నట్టియు. ఖే = ఆకాశమందు, సుకృతాం = పుణ్యాత్ములకు. విమానమివ స్థితం = విమానమువలె నున్నట్టియు, బహుధాతుచిత్రం- బహు = అనేకములైన. ధాతు = గైరికాదిధాతువులతో, చిత్రం = చిత్రితమై, నగాగ్రంయథా = పర్వతశిఖరమువలెను. గ్రహచన్ద్రచిత్రం- గ్రహ = గ్రహములు. చన్ద్ర = చంద్రునితో, చిత్రం = చిత్రితమై. నభోయథా. చ = ఆకాశమువలెను, యుక్తీకృత రేఖచిత్రం- యుక్తీకృత = సమూహముగా చేయబడిన. మేఘచిత్రం - చిత్రమైన మేఘములు కలిగినట్టియు, బహురత్నచిత్రం-బహు = అనేక. రత్న చిత్రం = రత్నములతో చిత్రమైన, విమానరత్నం = శ్రేష్ఠమైన విమానమును, దదర్శ = చూచెను.

తా॥ ఆంజనేయుడు రావణుని ముఖ్యముల నన్నింటిని చూచి ఆ యిండ్ల మధ్య నున్న కుబేరుని జయించి సంపాదించిన పుష్పక విమానమును చూచెను. ఆ విమాన మెట్లుండె ననగా - ఉన్నతమైన మేఘాకారము తోను. బంగారుమయమై అత్యంత సుందరముగాను, రాక్షసప్రభువైన రావణుని వైభవమునకు తగినట్లుగాను, భూలోకమున స్వర్గతుల్యమై దానికదియేసాటిగాని మరేదియు దానికి సమానమైనది లేనట్లుగాను. అనేకరత్నములతో పొదగబడి జాజ్వల్యమానముగ ప్రకాశించునదిగాను అనేకవిధములైన వృక్షములయొక్క. ఫలపుష్పపరాగములతో కూడి పర్వతశిఖరమువలెను బంగారు శలాకలవంటి యుత్తమస్త్రీలతో మెరపులతో మేఘుడు పూజింపబడుచున్నట్లు ప్రకాశించుచున్నదియు, సర్వు లకు పూజార్హమై యున్నదియు, హంసరాజములతో చిత్రించబడి పుణ్యాత్ములను స్వర్గమునకు తీసికొని వెళ్లుచున్నట్లుగాయున్నదియు. గైరికాది ధాతువులచే తారా, చంద్ర, గ్రహచిత్రములు చిత్రింపబడుటచే ఆకాశమువలెనే ప్రకాశించుచున్నదియు, అనేకవజ్రవైడూర్యాది రత్న ములచే చిత్రవిచిత్రముగా పొదగబడి అపురూపసుందరముగా రూపొం దించబడినదియు నగు పుష్పకవిమానమును జూచెను.

శ్లో॥ మహీకృతా పర్వతరాజి పూర్ణా, శైలాఃకృతా వృక్షవితాన పూర్ణాః
వృక్షాఃకృతాః పుష్పవితానపూర్ణాః పుష్పంకృతం కేసరపత్రపూర్ణమ్॥ ౧౧
కృతాని వేశ్మాని చ పాణ్డురాణి, తథా సుపుష్పా ణ్యపి పుష్కరాణి।
పునశ్చ పద్మాని స కేసరాణి, ధన్యాని చిత్రాణి తథావనాని॥ ౧౨
పుష్పాహ్వాయం నామ విరాజమానం, రత్నప్రభాభి శ్చ వివర్ధమానమ్।
వేశ్మోత్తమానా మపి చోచ్చమానం మహాకపి స్తత్ర మహావిమానమ్॥ ౧౩

టీ॥ పర్వతరాజిపూర్ణా-పర్వత = పర్వతములయొక్క. రాజి = పంక్తులచే. పూర్ణా = నిండినదై, మహీకృతా = భూమివలెనిర్మించబడినది. వృక్షవితానపూర్ణా—వృక్ష = వృక్షములయొక్క, వితాన = సమూహముతో, పూర్ణా = నిండినదై, శైలాః = పర్వతములుగా. కృతా = చేయబడినది. పుష్పవితానపూర్ణా - పుష్ప = పుష్పములయొక్క, వితాన = గుత్తులతో, పూర్ణా = నిండినదై. వృక్షా = వృక్షములుగా, కృతా = చేయబడినది, కేసరపత్రపూర్ణా-కేసర = కింజల్కములు. పత్ర = ఆకులచే, పూర్ణా = నిండినదై. పుష్పం = పుష్పములు గలదిగా. కృతం = చేయబడినది. పాణ్డురాణి = తెల్లనైన. వేశ్మాని చ = గృహములును, కృతాని = చేయబడినవి. తథా = ఆ ప్రకారముగా పుష్కరాణి = పుష్పించిన, సుపుష్పా ణ్యపి = యోగ్యములగు పుష్పములును, పునశ్చ = తిరిగియు, స కేసరాణి = కింజల్కములతోకూడిన, పద్మాని = పద్మములును. ధన్యాని = సుయోగ్యములైన, చిత్రాణి = చిత్రములును. వనాని = వనములును, కృతాని = చేయబడినవి — పుష్పాహ్వాయంనామ = పుష్పక మనెడిపేరుతో, విరాజమానం = ప్రకాశించునదియు, రత్నప్రభాభిశ్చ—రత్న = రత్నములయొక్క, ప్రభాభిశ్చ = కాంతులచేతకూడ. వివర్ధమానం = వృద్ధిపొందింపబడి

నదియు, అపిచ = మరియు, వేశ్మోత్తమానాం = ఉత్తమమైన గృహములమధ్య, ఉచ్ఛమానం = అత్యుత్తమమైనదియు నైన, మహా విమానం = గొప్పదగు విమానమును, తత్ర = అక్కడ, మహాకపిః = గొప్పవానరుడైన, హనుమంతుడు, దదర్శ = చూచెను.

తా॥ చిత్రించిన పర్వతపంక్తులచే భూమివలెను, వృక్షజాలముచే, పర్వతములువలెను, పూలగుత్తులతో, వృక్షములవలెను, కింజల్కపరాగములతో, పద్మములువలెను నున్నది. తెల్లనిగృహములు, సుయోగ్యముగా పుష్పించిన పుష్పములు, పద్మములు, మొగ్గలు, పచ్చని అరణ్యములు, మున్నగు విచిత్రములైన చిత్రములతో అలరారుచున్నదియు, రత్నకాంతులచే పరిపూర్ణమైనదియు, గొప్పభవనముల మధ్య వాటికంటె ఉత్కృష్టత కలిగియున్నదియు నగు పుష్పక మనెడి పేరుతో ప్రఖ్యాతమైన గొప్ప విమానమును హనుమంతుడు చూచెను.

శ్లో॥ కృతాశ్చ వైడూర్యమయా విహఙ్గాః, రూప్యప్రవాళై శ్చ తథా విహఙ్గాః।
చిత్రాశ్చ నానా వసుభి ర్భుజఙ్గాః, జాత్యానురూపా స్తురగా శ్శుభాఙ్గాః॥ ౧౨
ప్రవాళ జామ్బూనద పుష్పపక్షాః సలీల మావర్జిత జిహ్మపక్షాః।
కామస్య సాక్షా దివ భాన్తి పక్షాః, కృతా విహఙ్గా స్సుముఖా స్సుపక్షాః॥ ౧౩
నియుజ్యమానా స్తు గజా స్సుహస్తా స్సకేసరా శ్చోత్పల పత్రహస్తాః।
బభూవ దేవీ చ కృతా సుహస్తా లక్ష్మీ స్తథాపద్మిని పద్మహస్తా॥ ౧౪

॥ వైడూర్యమయాః = వైడూర్య మాణిక్య విరచితములైన, విహఙ్గాశ్చ = పక్షులును, తథా = ఆప్రకారముగా, రూప్యప్రవాళైః = వెండి, పగడములచేత, విహఙ్గాః చ = పక్షులును, కృతాః = చేయబడినవి,

నానావసుభిః = అనేక విధము లైన లోహములతో. చిత్రాః = చిత్రి ములైన, భుజఙ్గాః చ = సర్పములును, జాత్యానురూపాః = జాతికిఅను రూపములై, శుభాంగాః = సులక్షణయుక్తావయవములుగల. తురంగా శ్చ = గుఱ్ఱములును, కృతాః = చేయబడినవి. ప్రవాళ జామ్బూనద పుష్పపక్షాః—ప్రవాళ = పగడములు, జామ్బూనద = బంగారుమయము లైన, పుష్పపక్షాః = పూరేకులును, సలీలం = విలాసముగా. అవర్జిత జిహ్మపక్షాః - అవర్జిత = పూర్తిగా గాక కొంచెము చాచబడిన, జిహ్మ పక్షాః = వంకర రెక్కలు గలవియు. సాక్షాత్ = సాక్షత్తుగా, కామస్య = మన్మథునియొక్క, పక్షా ఇవ భ్రాన్తి = పక్షమువహించినట్లు (కామోద్దీపకములైనట్లు) యున్న. సుపక్షాః = మంచిరెక్కలు గలిగి, సుముఖాః = మంచి ముఖములుగల. విహంగాః = పక్షులు. కృతాః = చేయబడినవి - గజాః = ఏనుగులు. సకేసరాః = కింజల్కములతో, కూడిన, ఉత్పలపత్రహస్తాః—ఉత్పల = నల్లకలువలయొక్క. పత్రి హస్తాః = పత్రములు తొండమున ధరించిన. సుహస్తాః = యోగ్యమైన. తొండములు గలవై, నియుజ్యమానాః = కూర్పబడినవి — తథా = ఆవిధముగనే. దేవీ చ = దేవియు. సుహస్తా = అభయప్రదమైన. మంచిహస్తము కలదిగా, కృతా = చేయబడెను. లక్ష్మీః = లక్ష్మీదేవి. పద్మహస్తా = పద్మములు హస్తముల కలదై, పద్మిని = పద్మినిగా, బభూవ = ఆయెను.

తా॥ వజ్ర వైడూర్యాది మణులతోను వెండి, బంగారము, పగడములతోను పక్షులు చిత్రించబడెను. నానావిధధాతువులతో చక్కనైన సర్పములచిత్ర ములు చిత్రించబడియుండెను. సులక్షణయుక్తములై మంచి అవయవ సౌకుమార్యము గల జాతి గుఱ్ఱములు చిత్రితమైయుండెను. పగడములు బంగారముతో పుష్పరేఖలుగా చిత్రించినట్టియు, విలాసముగా సగము వరకు విప్పిన వంకర రెక్కలతో కామోద్దీపకముగా చిత్రించిన పక్షి జాలముతో కూడియుండెను. ఏనుగులు కలువపూలను తొండములతో

ధరించియున్న విధమును, శ్రీమహాలక్ష్మి వరాభయపద్మముల హస్తమున ధరించి పద్మిని (పద్మస్థితా) గా చిత్రీకరింపబడి యుండెను.

శ్లో॥ ఇతీవ తద్గృహ మభిగమ్య శోభనం, సవిస్మయో నగ మివ చారుశోభనమ్।

పునశ్చ తత్పరమసుగన్ధి సున్దరం, హిమాత్యయే నగ మివ చారుకన్దరమ్॥ ౧౫

టీ॥ చారుశోభనం-చారు = సుందరమైన, శోభనం = శోభస్కరముకలిగి, నగమివ = పర్వతమువలె, శోభనం = శోభాయమానమై, పునశ్చ = మరియు, పరమసుగన్ధి సుందరం-పరమ = ఉత్కృష్టమైన సుగన్ధి = పరిమళముచేత, సుందరం = అందమైనట్టి, హిమాత్యయే = వసంత కాలమునందు, చారుకన్దరం- చారు = సుందరమైన, కన్దరం = గుహలుకలిగిన, నగమివ స్థితం = పర్వతమువలె నున్నట్టి, తద్గృహం = ఆరావణ గృహమును, అభిగమ్య = అంతట తిరిగి, సవిస్మయః = ఆశ్చర్యముతో కూడినవా డయ్యెను.

తా॥ హనుమంతుడు సుందరశోభ గలిగి వసంతకాలమునందు అందమైన కందరములతో నుత్కృష్ట పరిమళముతో శోభిల్లు పర్వతమువలె నొప్పుచున్న ఆ రావణగృహ మంతయు తిరిగి మిక్కిలి ఆశ్చర్య పడెను.

శ్లో॥ తతస్స తాం కపి రభిపత్యపూజితాం। చరన్ పురీం దశముఖ బాహుపాలితామ్।

అదృశ్యతాం జనకసుతాం సుపూజితాం సుదుఃఖితః పతిగుణ వేగ నిర్జితామ్॥ ౧౬

టీ॥ తతః = అటుతరువాత, సః = ఆ, కపిః = ఆంజనేయుడు, తాం = ఆ, దశముఖబాహుపాలితాం-దశముఖ = రావణునియొక్క, బాహు = భుజ

బలముతో, పాలితాం = పాలించబడుచున్న. పూజితాం = పూజింపబడు యున్న. పురీం = పట్టణమును, అభిపత్య = పొంది. చరన్ = తిరిగిన వాడై, పతిగుణవేగనిర్జితాం-పతి = భర్తయొక్క. గుణవేగ = గుణో త్కర్షచే, నిర్జితాం = వశీకృతయైనట్టి, సుపూజితాం = మిక్కిలిపూజింప దగినట్టి, జనకసుతాం = జనకునికుమార్తె అయిన సీతను, అదృ శ్యతాం = కనబడకపోవుటనుగూర్చి, సుదుఃఖితః = మిక్కిలి విచారము గలవా డయ్యెను.

తా॥ ఆంజనేయుడు లంకయందంతట సీతాన్వేషణ నిమిత్తమై తిరిగి తిరిగి భర్త శ్రీరాముని గుణగణములనే సదా స్మరించు పూజ్యురాలైన జనకజ నెచ్చటను గానక బహుదుఃఖితు డయ్యెను.

శ్లో॥ తత స్తదా బహువిధ భావితాత్మనః కృతాత్మనో జనకసుతాం సువర్త్మనః।
అపశ్యతోఽభవదతిదుఃఖితం మనః స్సుచక్షుషః ప్రవిచరతో మహాత్మనః॥ ౧౭

టీ॥ తతః = అటుతరువాత, తదా = అప్పుడు, బహువిధభావితాత్మనః- బహువిధ = అనేకవిధముల, భావితాత్మనః = తర్కించుకొన్న మనస్సుగలిగినట్టి, కృతాత్మనః = కృతప్రయత్నము గలిగినట్టి, సువర్త్మనః = సన్మార్గవర్తనుడును, సుచక్షుషః = యోగ్యమైన త్రికాలజ్ఞాన దృష్టి కలిగియున్న, మహాత్మనః = మహానుభావుడైన ఆంజనేయునికి, ప్రవిచరతోఽపి = విశేషముగ తిరిగినవాడైనప్పటికి జనకసుతాం = జానకిని, అపశ్యతః = చూడజాలకపోయినవాని యొక్క, మనః = మనస్సు, అతిదుఃఖితః = మిక్కిలిదుఃఖము గలదై, అభవత్ = అయెను.

తా॥ తరువాత అనేకవిధములవితర్కించు విజ్ఞానియు, నిశితబుద్ధికలిగినట్టి, నీతిమార్గవిదుడైనట్టి, త్రికాలజ్ఞానవేది మహానుభావుడు నైన ఆంజనేయుని మనస్సు అంతట కలయ తిరిగి చూచినను సీతను గానకపోవుటవలన మిక్కిలి బాధపడెను.

ఇతి సప్తమ స్సర్గః

---

## శ్రీమద్వాల్మీకిరామయణే సున్దరకాణ్డే అష్టమ స్సర్గః

### * పుష్పక విమాన వర్ణనము *

శ్లో॥ స తస్యమధ్యే భవనస్య సంస్థితం। మహాద్విమానం మణి వజ్రచిత్రితమ్।
ప్రతప్త జామ్బూనద జాల కృత్రిమం దదర్శవీరః పవనాత్మజః కపిః॥ ౧

టీ॥ వీరః = వీరుడైన. పవనాత్మజః = వాయుపుత్రుడైన, సః = ఆ, కపిః = ఆంజనేయుడు, తస్య = ఆ రావణునియొక్క, భవనస్య = గృహముయొక్క, మధ్యే = మధ్యయందు, సంస్థితం = ఉన్నట్టియు, మణివజ్రచిత్రితం–మణి = మాణిక్యములచేత, వజ్ర = వజ్రములచేత, చిత్రితం = చిత్రింపబడినట్టియు, ప్రతప్తజామ్బూనద జాలకృత్రిమం –ప్రతప్త = పుటము బెట్టబడిన, జామ్బూనద = బంగారువికారము లైన, జాలకృత్రిమం = కృత్రిమకిటికీలుగలిగిన, మహత్ = గొప్పదైన. విమానం = విమానమును, దదర్శ = చూచెను.

తా॥ వాయుకుమారుడగు వీరాంజనేయుడు రావణ భవనాంతరమందు, వజ్రవైడూర్యాది మాణిక్యములతో చిత్రితమై, కృత్రిమముగా నమర్చిన మేలిమి బంగారుకిటికీలు కలిగి సుందరముగా నున్న గొప్ప విమానమును జూచెను.

శ్లో॥ తదప్రమేయాప్రతికార కృత్రిమం, కృతం స్వయం సాధ్వితి విశ్వకర్మణా।
దివంగతం వాయుపథప్రతిష్ఠితం। వ్యరాజ తాదిత్యపథస్య లక్ష్మవత్॥ ౨

టీ॥ అప్రమేయా ప్రతికారకృత్రిమం-అప్రమేయ = సాటిలేని, అప్రతికార కృత్రిమం = సాపత్యనిర్మాణములేనిదియు. విశ్వకర్మణా = విశ్వకర్మ చేత. స్వయం = స్వయముగా. సాధు-ఇతి = యోగ్యమైనదని, కృతం = చేయబడినట్టియు. దివంగతం = ఆకాశమునంటియున్నట్టియు. వాయుపథప్రతిష్ఠితం-వాయుపథ = వాయుమార్గమున. ప్రతిష్ఠితం- = ప్రతిష్ఠింపబడినట్టియు, ఆదిత్యపథస్య = సూర్యమార్గమునకు. లక్ష్మవత్ = చిహ్నమువలెనున్న. తత్ = ఆ విమానము వ్యరాజత = ప్రకాశించుచుండెను.

తా॥ దేవశిల్పి విశ్వకర్మచే సాటిలేని నిర్మాణము చేయబడి, చూచువారలచే "అహా ఎంత అద్భుతనిర్మాణము" అని శ్లాఘింపబడుచు, ఆకాశమునంటుచు, వాయుమార్గమున ప్రతిష్ఠింపబడి, సూర్యమార్గమునకు చిహ్నమువలె నున్న ఆ విమానము ప్రకాశించుచుండెను.

శ్లో॥ న తత్ర కించి న్నకృతం ప్రయత్నతో. న తత్ర కించి న్న మహార్హరత్నవత్।
నతే విశేషాని యతా సురేష్వపి న తత్ర కించి న్న మహావిశేషవత్॥ ౩

టీ॥ తత్ర = అక్కడ. ప్రయత్నతః = ప్రయత్నమువలన సకృతం = చేయబడనిది— కించిత్ = కొంచెము న = లేదు. తత్ర = అక్కడ మహార్హరత్నవత్—మహార్హ = మంచివిలువగల. రత్నవత్ = రత్నమువలె. న = కానిది. కించిత్ = కొంచెము న = లేదు తే = ఆ. విశేషాః = విశేషములు. సురేష్వపి = దేవతలయందుకూడ. న నియతాః = నియమింపబడియుండలేదు. తత్ర = అక్కడ. మహావిశేషవత్ = గొప్పవిశేషముకలదివలె. న = లేనిది. కించిత్ = కొంచెము న = లేదు.

తా॥ అందలి ప్రతిపని బహుప్రయత్నముతో చేసినదే, అందలి రత్నములన్నియు విలువకట్టలేనివే, అచ్చటి నియమ విశేషములు దేవతలలో కూడ నియమింపబడి యుండలేదు. అచ్చట గొప్పవిశేషముతో కూడియుండని విశేష మేమియు లేకుండెను.

శ్లో॥ తపస్సమాధాన పరాక్రమార్జితం। మనస్సమాధాన విచార చారిణమ్।
అనేకసంస్థాన విశేషనిర్మితం. తత స్తత స్తుల్యవిశేష దర్శనమ్॥ ౭
మనస్సమాధాయ తు శీఘ్రగామినం, దురావరం మారుతతుల్య గామినమ్।
మహాత్మనాం పుణ్యకృతాం మహర్ధినాం, యశస్వినా మగ్ర్యముదా మివాలయమ్॥ ౨౫
విశేష మాలమ్బ్య విశేషసంస్థితం, విచిత్రకూటం బహుకూటమణ్డితమ్।
మనోభిరామం శరదిందు నిర్మలం. విచిత్రకూటం శిఖరం గిరే ర్యథా॥ ౬
వహన్తి యం కుణ్డలశోభి తాననాః మహాశనా వ్యోమచరా నిశాచరాః।
వివృత్త విధ్వస్త విశాల లోచనాః, మహాజవా భూతగణా స్సహస్రశః॥ ౭

టీ॥ తపస్సమాధాన పరాక్రమార్జితం-తపః = తపస్సుయొక్క, సమాధాన = నిష్ఠచేతను, పరాక్రమ = పరాక్రమముచేతను, ఆర్జితం = సంపాదింపబడినట్టియు, మనస్సమాధాన విచారచారిణం-మనః = మనస్సుయొక్క, సమాధాన = నిశ్చలతచేత, విచార = ఆలోచించినట్లు, చారిణం = వెళ్లునట్టియు, అనేకసంస్థానవిశేషనిర్మితం-అనేక = అనేకములైన, సంస్థానవిశేష = విమానగోపురములచే, నిర్మితం = నిర్మింపబడినదియు. తత స్తతః = అక్కడక్కడ. తుల్యవిశేషదర్శనం-తుల్యవిశేష = రమణీయమైన, దర్శనం = దర్శనముగలదియు— మనః = మనస్సున, సమాధాయత్ = నిశ్చయించుకొన్నయెడల, శీఘ్రగామినం = వేగముగ వెళ్లునదియు, దురావరం = దుర్నిరోధము పొందశక్యముగానిదియు, మారుతతుల్యగామినం-మారుత = వాయువునకు, తుల్య = సమానమైన, గామినం = గమనముగలిగినదియు, మహాత్మనాం = మహానుభావులకు, పురాకృతాం = పుణ్యములుచేసికొన్నవారికి, మహర్ధినాం = కీర్తికాములకు, అగ్ర్యముదాం = దేవేంద్రాదిదేవతలకు, ఆలయమివ = స్థానమైన స్వర్గమువలె నున్నదియు— విశేషం = ఆధిక్యమునకు ఆలంబ్య = ఆధారపడి, విశేషసంస్థితం— విశేష = విశేషముగా, సంస్థితం = ఉన్నటువంటిదియు, విచిత్రకూటం = చిత్రములైన శిఖరములు గలిగినదియు, బహుకూటమణ్డితం-బహుకూట = అనేకశిఖరములతో, మణ్డితం = అలంకరింపబడినదియు, మనోభిరామం = సుందరమైనట్టిదియు, శరదిందునిర్మలం-శరత్ = శరత్కాలమందు, ఇందు = చంద్రునివలె, నిర్మలం = నిర్మలముగానున్నదియు, గిరేః = పర్వతముయొక్క, శిఖరంయథా = శిఖరమువలె. విచిత్రకూటం-విచిత్ర = అనేకచిత్రములైన, కూటం = శిఖరముగలదియు, కుణ్డలశోభితాననాః-కుణ్డల = కుండలములతో, శోభిత = ప్రకాశించుచున్న, ఆననాః = ముఖములు కలిగినట్టియు, వ్యోమచరాః = ఆకాశసంచారులైనట్టియు, నిశాచరాః = రాత్రించరులైనటియు. మహాశనాః = అధికాహారమును భుజించునట్టియు. విష్పక్త

విధ్వస్త విశాలలోచనాః-వివృత్త = గుండ్రముగను. విధ్వస్త = నాశనముచేయబడిన. విశాల = పెద్దదైన. లోచనాః = నేత్రములు గలిగినట్టియు. మహాజవాః = మహావేగము గల. సహస్రశః = వేలకొలది. భూతగణాః = భూతగణములు. వహన్తి = మోయుచున్నవి.

తా॥ తపోనిష్ఠతోను పరాక్రమముతోను సంపాదించబడినదియు, మనసా తలంచిన మాత్రమున వెళ్లునదియు, అనేక గోపురములవంటి శిఖరములతో నిర్మించబడినదియు, చూడతగిన విశేష శిల్పములతో కూడినదియు, ఇతరుల కెవ్వరికి పొందశక్యముగానిదియు, వాయువేగ, మనోవేగముల పయనించునదియు, మహాత్ములకు, పుణ్యాత్ములకు, కీర్తిమంతులకు స్థానమైన స్వర్గమువలె నున్నదియు, అనేక విశేషములచే విశిష్టముగా నున్నదియు, విచిత్రమైన శిఖరములతో, శరత్కాల చంద్రునివలె మిక్కిలి నిర్మలమైనదియు, అత్యంత సుందరమైనదియు నగు ఆ విమానమును కుండలముల కాంతులచే ప్రకాశించు ముఖములు గలిగి ఆకాశచారులు, నిశాచరులు పొడవబడిన నేత్రములతో గుండ్రని ముఖములు గలిగి, మహాభక్షకులైన రాక్షసులు భూతగణములు మోయుచుండిరి.

శ్లో॥ వసంత పుష్పోత్కర చారుదర్శనం, వసన్తమాసాదపి
కాన్తదర్శనమ్।
సపుష్పకం తత్ర విమాన ముత్తమం, దదర్శ త ద్వానర
వీరసత్తమః॥ ౮

టీ॥ వసన్తపుష్పోత్కరచారుదర్శనం-వసన్త = వసన్తకాలమందు, పుష్పోత్కర = పుష్పసమూహము చేత, చారు = సుందరమైన, దర్శనం = దర్శనముకలగినటువంటియు, వసన్తమాసాదపి = వసంతఋతువుకంటె కూడ, కాన్తదర్శనం-కాంత = సుందరమైన. దర్శనం = దర్శనముకలిగినట్టియు, ఉత్తమం = ఉత్తమమైన, తత్ = ఆ, పుష్పకం

విమానం = పుష్పకవిమానమును, తత్ర = ఆరావణ భవనమునందు, సః = ఆ, వానరసత్తమః = వానరులలో పరాక్రమశాలియైన హనుమంతుడు, దదర్శ = చూచెను.

తా॥ వసంతఋతువులో పూలగుత్తులవలె సుందరమై, వసంతమాసమునందువలె చూడ ముచ్చటైన ఆ ఉత్తమమైన పుష్పకవిమానమును హనుమంతుడు రావణభవనమునందు గాంచెను.

ఇతి అష్టమః సర్గః

---

# శ్రీమద్వాల్మీకిరామాయణే సున్దరకాణ్డే నవమస్సర్గః

శ్లో॥ తస్యాలయవరిష్ఠస్య మధ్యే విపుల మాయతమ్।
దదర్శ భవనశ్రేష్ఠం హనుమా న్మారుతాత్మజః॥ ౧

టీ॥ మారుతాత్మజః = వాయుకుమారుడైన, హనుమాన్ = హనుమంతుడు, తస్య = ఆ రావణునియొక్క, ఆలయవరిష్ఠస్య = శ్రేష్ఠభవనముగ నున్న విమానముయొక్క, మధ్యే = మధ్యయందు, విపులం = విస్తారమైన, ఆయతం = పొడవైన, భవనశ్రేష్ఠం = శ్రేష్ఠమైన భవనమును దదర్శ = చూచెను.

తా॥ ఆంజనేయుడు గొప్పభవనమువలె నున్న ఆ విమానమధ్యలో వెడల్పు పొడవు గలిగి గృహమువలె నున్న దానిని చూచెను.

శ్లో॥ అర్ధయోజనవిస్తీర్ణ మాయతం యోజనం హి తత్।
భవనం రాక్షసేన్ద్రస్య బహు ప్రాసాదసఙ్కులమ్॥ ౨

టీ॥ అర్థయోజన విస్తీర్ణం-అర్ధయోజన = నాలుగుమైళ్లు, విస్తీర్ణం = వెడల్పును, తత్‌హి = అదే, యోజనం = ఎనిమిదిమైళ్లు. ఆయతం = పొడవును, బహు ప్రాసాదసఙ్కులం - బహు = అనేకములైన. ప్రాసాద = మేడలతో, సంకులం = కూడియున్న. రాక్షసేన్ద్రస్య = రావణునియొక్క. భవనం = భవనమును, దదర్శ = చూచెను.

తా॥ హనుమంతుడు నాలుగుమైళ్ల వెడల్పును యెనిమిదిమైళ్ల పొడవు గలిగి అనేక రమ్యహర్మ్యములతో కూడి సుందరముగా నున్న ఆరావణుని దివ్యభవనమును చూచెను.

శ్లో॥ మార్గమాణ స్తు వైదేహీం సీతా మాయతలోచనామ్।
సర్వతః పరిచక్రాను హనుమా నరిసూదనః॥ ౩

టీ॥ అరిసూదనః = శత్రుమర్దనుడైన హనుమాన్ = హనుమంతుడు, ఆయతలోచనాం-ఆయత = విశాలములైన, లోచనాం = నేత్రములుగల, వైదేహీం = విదేహరాజపుత్రిక యగు. సీతాం = సీతాదేవివి, మార్గమాణః = వెదకుచున్నవా డగుచు, సర్వత శ్చ = అంతటను, పరిచక్రామ = తిరుగుచుండెను.

తా॥ శత్రుమర్దను డగు హనుమంతుడు జనకపుత్రి యగు సీతను వెదకుచు రాజభవన, పరిసరభవనముల మరల వెదకసాగెను.

శ్లో॥ ఉత్తమం రాక్షసావాసం, హనుమా నవలోకయన్।
ఆససాదాథ లక్ష్మీవాన్ రాక్షసేన్ద్రనివేశనమ్॥ ౪
చతుర్విషాణై ర్ద్విరదై స్త్రివిషాణై స్తథైవ చ।
పరిక్షిప్త మసమ్బాధం రక్ష్యమాణ ముదాయుధైః॥ ౫
రాక్షసీభి శ్చ పత్నీభీ రావణస్య నివేశనమ్।
ఆహృతాభి శ్చ విక్రమ్య రాజకన్యాభి రావృతమ్॥ ౬

రావణునిభార్యలతోను, ఇతరరాజుల జయించి బలాత్కారముగ తీసికొని రాబడిన రాకుమార్తెలతోను నిండియున్నట్టియు, తిమి తిమింగలములు మొసళ్లు మొదలగు క్రూరజలచరములతో సంకీర్ణమై పెనుగాలికి కదలుచున్న మహాసముద్రము వలె నున్న రావణుని భవనమును ప్రవేశించెను.

శ్లో॥ యాహి వైశ్రవణే లక్ష్మీ ర్యాచేన్ద్రే హరివాహనే।
సా రావణగృహే సర్వా నిత్యమే వానపాయినీ॥ ౮
యా చ రాజ్ఞః కుబేరస్య యమస్య వరుణస్య చ।
తాదృశీ తద్విశిష్టా వా ఋద్ధీ రక్షోగృహే ష్విహ॥ ౯

టీ॥ వైశ్రవణే = కుబేరునియందు, హరివాహనే = హరివాహనుని యందు ఇంద్రే చ = ఇంద్రునియందును. యా = ఏ, లక్ష్మీః హి = లక్ష్మిగలదో. సా = ఆలక్ష్మి. సర్వా = అంతయు. రావణగృహే = రావణుని గృహమందు, నిత్యం = ఎల్లప్పుడు, అనపాయినీఏవ = అపాయములేనిదై యుండెను. చ = ఇంతేకాకుండా. రాజ్ఞః = రాజైన, కుబేరస్య = కుబేరునియొక్క, యమస్య = యమునియొక్క, వరుణస్య చ = వరుణునియొక్కయు. యా = ఏ. ఋద్ధీ = లక్ష్మియో. తాదృశీ = అట్టి, ఋద్ధీ = లక్ష్మి, తద్విశిష్టావా = వారలకంటె ఎక్కువగ, ఇహ = ఇక్కడ రక్షోగృహేషు = రాక్షసగృహముల యందు, స్థితా = ఉండెను.

తా॥ కుబేరుడు, ఇంద్రుడు, వరణుడు, మొదలైన అష్టదిక్పాలురయొక్క, గృహములందు గల లక్ష్మి యిచ్చట సమస్త రాక్షసగృహము లందును అంతకు మిన్నయగు సంపూర్ణలక్ష్మి యీరావణుని గృహమునందును కలదని ఆంజనేయుడు తలచెను.

శ్లో॥ తస్య హర్మ్యస్య మధ్యస్థం వేశ్మ చాన్యత్సు నిర్మితమ్।
బహు నిర్యూహసంకీర్ణం దదర్శ పవనాత్మజః॥ ౧౦

శ్లో॥ బ్రాహ్మణోర్థేకృతం దివ్యం దివి యద్విశ్వకర్మణా।
విమానంపుష్పకం నామ సర్వరత్నవిభూషితమ్॥ [illegible]
పరేణ తపసా లేభే యత్కుబేరః పితామహాత్।
కుబేర మోజసా జిత్వా లేభే త ద్రాక్షసేశ్వరః॥ [illegible]

టీ॥ తస్య = ఆరావణునియొక్క. హర్మ్యస్య = భవనము[illegible]. మధ్యస్థం = మధ్యయందున్నట్టియు. అన్యత్ = వే[illegible]. [illegible] యోగ్యముగా నిర్మింపబడినట్టియు. బహు నిర్యూహ [illegible] బహు = అనేకములైన. నిర్యూహ = మత్తగజములతో. [illegible] వ్యాప్తమైనటువంటియు. వేశ్మ = గృహమును. పవనాత్మజః = వా[illegible] కుమారుడైన ఆంజనేయుడు. దదర్శ = చూచెను - దివి = [illegible]. దివ్యం = ప్రకాశమానమైనట్టియు. విశ్వకర్మణా = వి[illegible] రత్నవిభూషితం - సర్వ = సమస్తమైన. రత్న = రత్నములతో. [illegible] షితం = అలంకరింపబడినదై. యత్ = ఏ. పుష్పకంనామ = పుష్పకమనుపేరుగల. విమానం = విమానము. బ్రహ్మణః = బ్రహ్మయొక్క. అర్థే = నిమిత్తము. కృతం = [illegible] యత్ = ఏవిమానమును. కుబేరః = కుబేరుడు. పితామహాత్ = బ్రహ్మ వలన. పరేణ = ఉత్కృష్టమైన. తపసా = తపస్సుచేత. లేభే = పొం దెనో. తత్ = దానిని. రాక్షసేశ్వరః = రావణుడు. కుబేరం = కుబేరుని. ఓజసా = పరాక్రమముచేత. జిత్వా = జయించి. లేభే = పొందెను.

తా॥ రావణుని భవనమధ్యయందు గృహమువలె సుయోగ్యముగా నిర్మింపబడినదియు. అనేకమత్తగజములచే వ్యాప్తమై యున్నదియు. పూర్వము బ్రహ్మదేవుని నిమిత్తము విశ్వకర్మ తన శిల్పకౌశలముతో సర్వరత్నములచేతను సువర్ణముచేతను నిర్మించియున్నదియు తదుపరి మహాతపస్సుతో బ్రహ్మను మెప్పించి కుబేరుడు బ్రహ్మవలన పొందినదియు. ఆ కుబేరుని తనపరాక్రమముచేత జయించి రావణుడు వశము చేసికొనియున్న పుష్పకవిమానము అని ఆంజనేయుడు తెలిసి కొనెను.

శ్లో॥ ఈహామృగ సమాయుక్తైః కార్తస్వర హిరణ్మయైః।
సుకృతై రాచితం స్తమ్భైః ప్రదీప్త మివ చ శ్రియా॥ ౧౨
మేరు మన్దర సజ్కాశై రుల్లిఖద్భి రివామ్బరమ్।
కూటాగారైః శుభాకారైః స్సర్వత స్సమలఙ్కృతమ్॥ ౧౩
జ్వలనార్క ప్రతీకాశం సుకృతం విశ్వకర్మణా।
హేమ సోపాన సంయుక్తం చారు ప్రవర వేదికమ్॥ ౧౪
జాలవాతాయనై ర్యుక్తం కాఞ్చనై స్స్ఫాటికై రపి।
ఇన్ద్రనీల మహానీల మణిప్రవర వేదికమ్॥ ౧౫
విద్రుమేణ విచిత్రేణ మణిభి శ్చ మహాధనైః।
నిస్తులాభి శ్చ ముక్తాభి స్తలే నాభి విరాజితమ్॥ ౧౬
చన్దనేన చ రక్తేణ తపనీయ నిభేన చ।
సుపుణ్యగన్ధినా యుక్తమాదిత్య తరుణోపమమ్॥ ౧౭
కూటాగారై ర్వరాకారై ర్వివిధై స్సమలఙ్కృతమ్।
విమానం పుష్పకం దివ్యమారురోహ మహాకపిః॥ ౧౭

టీ॥ ఈహామృగసమాయుక్తైః - ఈహామృగ = తోడేళ్ళతో. సమాయుక్తైః = కూడికొనియున్నట్టియు. కార్తస్వర హిరణ్మయైః = వెండి, బంగారు, వికారము లైనట్టియు, సుకృతైః = యోగ్యముగా, నిర్మించబడిన. స్తంభైః = స్తంభములతో, ఆచితం = వ్యాప్తమైనట్టియు.చ = మరియు, శ్రియా = లక్ష్మితో. ప్రదీప్తమివస్థితం = ప్రకాశింపచేయబడినదానివలె నున్నట్టియు. మేరుమన్దర సజ్కాశైః = మేరు = మేరుపర్వతము. మన్దర = మందరపర్వతములతో, సజ్కాశైః = సమానము లైనట్టియు, శుభాకారైః = శోభనాకారములు గలిగి. అంబరం = ఆకాశమును, ఉల్లిఖద్భి రివస్థితైః = తాకుచున్నట్లు ఉన్నటువంటి. కూటాగారైః = పై అంతస్థుల చేత, సర్వతః = అంతట, సమలంకృతం = అలంకరింపబడి యున్నట్టియు,-

జ్వలనార్క ప్రతీకాశం–జ్వలన = ప్రజ్వరిల్లుచున్న, అర్క = సూర్యునితో, ప్రతీకాశం = సమానమైనదియు. విశ్వకర్మణా = విశ్వకర్మచేత. సుకృతం = యోగ్యముగ నిర్మించబడినదియు, హేమసోపాన సంయుక్తం–హేమ = బంగారపు. సోపాన = మెట్లుతో, సంయుక్తం = కూడియున్నదియు. చారుప్రవరవేదికం–చారు = సుందరమైన. ప్రవర = శ్రేష్ఠములైన, వేదికం = అరుగులు కలదియు, కాఞ్చనైః = బంగారుమయములైన, స్ఫాటికైః = స్ఫటికమయములైన. జాలవాతాయనైః–జాల = రంధ్రములుగల. వాతాయనైః = కిటికీలతో, యుక్తం = కూడియున్నదియు. అపిచ = మరియు, ఇంద్రనీల మహానీల మణిప్రవర వేదికం–ఇంద్రనీల = ఇంద్రనీలములు, మహానీల = మహానీలములు. మణిప్రవర = శ్రేష్ఠమాణిక్యములతో నిర్మించిన వేదికం = అరుగులు కలగినదియు, విచిత్రేణ = విచిత్రమైన. విద్రుమేణ = పగడము (ల) చేత, మణిభిః = మణులతోను. చ = మరియు. మహాధనైః = గొప్పధనములచేతను. నిస్తులాభిః = సాటిలేని. ముక్తాభిః = ముత్యములచేతను. తలేన = ముంగిటిప్రదేశముతో, అభివిరాజితం = మనోహరముగా ప్రకాశించునదియు. రక్తేన = ఎఱ్ఱనైనట్టియు, తపనీయనిభేన చ– తపనీయ = బంగారముతో. నిభేన చ = సమానమైనదియు. సుపుణ్యగన్ధినా–సుపుణ్య = యోగ్యము పవిత్రమునైన. గన్ధినా = = పరిమళముగల. చందనేన చ = గంధముతోను. యుక్తం = కూడియున్నదియు. ఆదిత్యతరుణోపమం–ఆదిత్యతరుణ = బాలభాస్కరునితో. ఉపమం = సమానమైనదియు, వరాకారైః–వర = శ్రేష్ఠములైన. ఆకారైః = ఆకారములుగల. వివిధైః = అనేకవిధములైన. కూటాగారైః = పై అంతస్థులతోను. సమలంకృతం = అలంకరించబడినదియు. దివ్యం = దేవతాసంబంధమైన, పుష్పకం = పుష్పకమును. విమానం = విమానమును. మహాకపిః = ఆంజనేయుడు. ఆరురోహ = అధిష్ఠించెను.

తా॥ రావణ భవన మధ్య మందున్నట్టియు, బంగారము వెండితో తయారుచేయబడిన తోడేళ్లు అనుమృగములతో కూడియున్నట్టి బంగారు వెండి మయములై ఉన్నతమైన స్తంభములతో శోభాయమానముగా నున్నట్టియు, మేరు. మందర పర్వతములతో సమానములై ఆకసము నంటి అత్యున్నతములైన మేడలపై అంతస్థులతో శోభాయమానముగా అలంకరించబడినదియు, సూర్యునితో సమానమైన కాంతులతో విశ్వకర్మచే సుయోగ్యముగా నిర్మించబడినట్టియు, బంగారుమెట్లు సుందరములైన అరుగులు, బంగారు కిటికీలతో నొప్పుచున్నదియు, ఇంద్రనీల మహానీల, నుంచినీలమణులతో నిర్మించబడిన వేదికలు కలిగియున్నట్టియు, (ఇంద్రనీలము. మహానీలము. నీలమణి యని నీలములు మూడు విధములు-"క్షీరమధ్యేక్షిపే న్నీలం, క్షీరం చే న్నీలతాం వ్రజేత్। ఇంద్రనీల మితిఖ్యాత మితి చాగస్త్య భాషితం" పాలయందుంచిన నీలముచేత పాలు నీలమురంగుతో యున్న యెడల అది ఇంద్రనీల మని పిలువబడును. "సంహళాకరసంభూతా మహానీలా ఇతిస్మృతాః॥" అని రత్నశాస్త్రము. సింహళద్వీపమున లభ్యమగునవి మహానీలములు, నీలముమీద పచ్చగడ్డిపోచగాని, పొట్టుగాని, గసగసాలుగాని యుంచి యూదినను, తలక్రిందులుగా త్రిప్పినను పడిపోవదేని, దానిని తృణగ్రాహి యందురు) గొప్పవిలువగల పగడములచేత, మణులచేత, సాటిలేని ముత్యములచేత అంతటా ప్రకాశింపజేయుచున్నట్టియు, మంచిగంధ పరిమళముతో కూడి పరిమళించుచున్నట్టియు, బాలభాస్కరునివలె ప్రకాశించుచున్నట్టియు, పై అంతస్థులతో కూడి యిందుకు సాటి మరియొకటి లేదను భావమును గలిగించుచున్నట్టి పుష్పక విమానమును ఆంజనేయు డధిష్ఠించెను.

శ్లో॥ తత్రస్థ స్స తదాగన్ధం పాన భక్ష్యాన్న సంభవమ్।
దివ్యం సమ్మూర్ఛితం జిఘ్ర ద్రూపవన్త మివానిలమ్॥ ౨౦

టీ॥ సః = ఆ, హనుమంతుడు, తదా = అప్పుడు, తత్ర = అక్కడ, స్థః = ఉన్నవాడై యుండ, పానభక్ష్యాన్నసంభవం - పాన = పానీయ ములవలన, భక్ష్యాన్న = భోజ్యపదార్ధముల వలన. సంభవం = పుట్టి నదియు. దివ్యం = యోగ్యమైనదియు. సమ్మూర్ఛితం = మనస్సుకు వ్యామోహపరచునదియు, రూపవంతం = మూర్తిభవించిన, అనిల మివ (స్థితం) = వాయువువలె నున్న. గంధం = పరిమళమును, జిఘ్రత్ = ఆఘ్రాణించెను.

తా॥ ఆంజనేయుడు అక్కడకు చేరి పానీయములు, భక్ష్యాదులవలన పుట్టి వించి, మనస్సు నువ్విళ్లూరించుచు, రూపమును బొందిన వాయువే అన్నట్లు భ్రాంతిగొల్పుచున్న దివ్యమగు పరిమళమును ఆఘ్రాణించెను.

శ్లో॥ సగన్ధ స్తం మహాసత్వం బన్ధు ర్బన్ధు మివోత్తమమ్।
ఇతఏహీ త్యువాచేవ తత్ర యత్ర స రావణః॥ ౨౧

టీ॥ సః = ఆ, గన్ధః = పరిమళము, మహాసత్వం = గొప్పపరాక్రమవంతు డైన, తం = ఆహనుమంతుని, బన్ధుః = బంధువు, ఉత్తమం = ఉత్త ముడైన, బన్ధు మివ = బంధువునువలెనే, యత్ర = ఎక్కడ, సః = ఆ, రావణః = రావణుడో, తత్ర = అక్కడకు, ఇతః = ఇటు, ఏహి = రమ్ము, ఇతి = అని, ఉవాచేవ = ఆహ్వానించుచున్నట్లు (స్థితః) = ఉండెను.

తా॥ ఉత్తమ బాంధవుని ఆప్తబాంధవు డాహ్వానించి గౌరవించునట్లు అచ్చటి పానీయముల యొక్కయు భక్ష్యాదులయొక్కయు. సుగంధము "ఇటు రమ్ము" అని హనుమంతుని రావణుడుండు తావునకు పిలుచుచున్నటు లుండెను.

శ్లో॥ తత స్తాం ప్రస్థిత శ్శాలాం దదర్శ మహతీం శుభామ్।
రావణస్య మనఃకాన్తా కాన్తా మివ వరస్త్రియమ్॥ ౨౨

శ్లో॥ మణిసోపాన వికృతాం హేమాజాల విభూషితామ్।
స్ఫాటికై రావృతతలాం దన్తాన్తరిత రూపికామ్॥ ౨౩
ముక్తాభి శ్చ ప్రవాళై శ్చ రూప్య చామీకరై రపి।
విభూషితాం మణిస్తమ్భై స్సుబహూ స్తమ్భభూషితామ్॥ ౨౪
సమై రృజుభి రత్యుచ్చై స్సమన్తా త్సువిభూషితైః।
స్తమ్భైః పక్షై రివాత్యుచ్చై ర్దివం సంప్రస్థితా మివ॥ ౨౫
మహాత్యా కుథయా స్తీర్ణాం పృథివీలక్షణాఙ్కయా।
పృథివీ మివ విస్తీర్ణా సరాష్ట్ర గృహమాలినీమ్॥ ౨౬
నాదితాం మత్తవిహగై ర్దివ్యగన్ధాధివాసితామ్॥
పరార్ధ్యాస్తరణోపేతాం రక్షోధిప నిషేవితామ్॥ ౨౭
ధూమ్రా మగరుధూపేన విమలాం హంసపాణ్డురామ్।
చిత్రాం పుష్పోపహారేణ కల్మాషీ మివ సుప్రభామ్॥ ౨౮
మన స్సంహ్లాదజననీం వర్ణస్యాపి ప్రసాదినీమ్॥
తాం శోకనాశినీం దివ్యాం శ్రియ స్సంజననీ మివ॥ ౨౯

టీ॥ తతః = ఆతరువాత, మహతీం = గొప్పదైన, శుభాం = శుభప్రదమైన, తాం = ఆ, శాలాం = శాలను, రావణస్య = రావణునియొక్క మనఃకాంతాం – మనః = మనస్సునకు, కాంతాం = మనోహరమైనటువంటియు. పరస్త్రియం–వర = శ్రేష్ఠమైన, స్త్రియం = స్త్రీలుకలిగినదియు కాంతా మివ = భార్యనువలె. స్థితాం = ఉన్నటువంటియు, మణిసోపాన వికృతాం–మణి = మాణిక్యములచే నిర్మితమైన, సోపాన = మెట్లతో వికృతాం = విడివిడిగా చేయబడినదియు, హేమాజాలవిభూషితాం – హేమాజాల = బంగారుకిటికీలచే, విభూషితాం = అలంకరింపబడినదియు, స్ఫాటికైః = స్ఫటికములచేత, ఆవృతతలాం–ఆవృత = కూడిన =, తలాం = ప్రదేశములుకలిగినదియు, దంతాంతరితరూపికాం–దంత = దంతములు, అంతరిత = మధ్యనమర్చబడిన, రూపికాం = ఆకారముకలిగినదియు, ముక్తాభి శ్చ = ముత్యములతోను,

ప్రవాళైశ్చ = పగడములతోను. రూప్యచామీకరైరపి - రూప్య = వెండి, చామీకరైరపి = బంగారములతోను. విభూషితాం = విశేషముగ నలంకరించబడినదియు, మణిస్తంభైః = మణులచే నిర్మించబడిన స్తంభములతో, సుబహుస్తంభభూషితాం-సు = యోగ్యము, బహు = అనేకములైన, స్తంభ = స్తంభములతో, భూషితాం = అలకరింపబడియున్నదియు, సమైః = సమానములైన, ఋజుభిః = దృష్టాంతములతో, అత్యుచ్చైః = మిక్కిలిఉన్నతములైనట్టియు, సమంతాత్ = అంతటను, విభూషితైః = యోగ్యముగ సలంకరించబడిన, స్తంభైః = స్తంభములతో, అత్యుచ్చైః = మిక్కిలిఉన్నతములైన, పక్షైః = రెక్కలతో. దివం = ఆకాశమునుగూర్చి, సంప్రస్థితామివ = ప్రయాణమైవెళ్లుచున్నట్లున్నదియు, పృథివీలక్షణాంకయా-పృథివీ = భూమియొక్క. లక్షణ = లక్షణములచే, అంకయా = చిహ్నితమైన. మహాత్యా = గొప్పదైన. కుథయా = చిత్రకంబళముచేత, ఆస్తీర్ణాం = పరచబడియున్నదియు, సరాష్ట్రగృహమాలినీం-సరాష్ట్ర = రాష్ట్రములతోకూడిన, గృహ = గృహములయొక్క, మాలినీం = పంక్తులుగలిగినదియు, పృథివీమివ = భూమినివలె, విస్తీర్ణాం = వ్యాపించియున్నదియు, మత్తవిహంగైః = మదించినపక్షులతో, నాదితాం = ధ్వనింపజేయబడుచున్నదియు, దివ్యగంధాధివాసితాం-దివ్య = దేవతాసంబంధమైన, గంధ = పరిమళముతో, అధివాసితాం = అధికముగాపరిమళింపచేయబడినదియు, పరార్ధ్యాస్తరణోపేతాం-పరార్ధ్య = మిక్కిలిశ్రేష్ఠమైన, ఆస్తరణ = కంబళ్ళచేత, ఉపేతాం = కూడియున్నదియు, రక్షోధిపనిషేవితాం-రక్షోధిప = రాక్షసప్రభువైనరావణునిచే, నిషేవితాం = సేవించ బడుచున్నదియు, అగరుధూపేన = అగరుపొగచేత, ధూమ్రాం = పొగవేయబడుచున్నదియు, విమలాం = నిర్మలమైనదియు, హంసపాండురాం-హంస = హంసలవలె, పాణ్డురాం = తెల్లనైనదియు, పుష్పోపహారేణ – పుష్ప = పుష్పములయొక్క, ఉపహా

రేణ = కానుకచేత, చిత్రాం = చిత్రమైనదియు. సుప్రభాం = మంచి కాంతికలిగినదియు. కల్మాషీ మివ = నందినీధేనువువలె నున్నదియు, మనస్సంహ్లాదజననీం—మనః = మనస్సునకు. సంహ్లాద = సంతోష మును, జననీం = పుట్టించునదియు, వర్ణస్యాపి = వర్ణమునకును. ప్రసాదినీం = ఉత్కర్ష కలుగజేయునదియు. శోకనాశినీం = దుఃఖమును నశింపజేయునదియు, దివ్యాం = దివ్యమైనదియు, శ్రియః = లక్ష్మికి, సంజననీ మివస్థితాం = పుట్టుకస్థానమైన పద్మమువలె నున్నదియునగు, తాం = ఆ. శాలాం = శాలను. దదర్శ = చూచెను.

తా॥ ఆంజనేయుడు సీతను వెదకుటలో రావణుని భవన మధ్యస్థమైన పుష్పకవిమానము నారోహించి, పరిసరశాలల పరిస్థితులు వైభవాది విశేషములు సీతాన్వేషణ ప్రత్యేకలక్ష్యము గలవాడైనను యెక్కడ సీత యుండునో యన్న యంశము అవకాశాదు లుండుటను బట్టి, ప్రతి దృశ్యాదృశ్యస్థితులను కూడ చూచుటతో అంతరభావితాత్మపరిశీలనలు చేయుచునే బాహ్యదృష్టిశీల సన్నివేశాదుల సమ్యగావలోకనాదులు లేక పోవుటలో భవిష్యత్తులో సంపూర్ణవిశ్వాసము దీక్ష గలవాడైనను భవన శాలాది స్థితిగతుల ఆశ్చర్యానందాతిశయంబులచే సాగుచు చూచు చుండెను. రావణుని ఆశాల సుందరముగాను మాణిక్యములతో అమర్చిన మెట్లు బంగారుకిటికీలు స్ఫటికపురాళ్లు పరచిన ప్రదేశములు దంతముల మధ్య నమర్చిన రాళ్లు పరుపబడినదియు, ముత్యములు, పగడములు, వెండి, బంగారము మాణిక్యముల స్తంభములతో బాగుగా అలంకరింప బడియున్నదియు. (పాముపడగలోని ముత్యము గురివిందగింజ వన్నె కలది. వెదురునందు బుట్టిన ముత్యము నక్షత్రకాంతి కలిగియుండును. ఇది స్త్రీవశీకరణమందుపయోగపడును. ఇది మినపగింజంతయుండును. చేప తలయందుండు ముత్యము వెండివలె, మల్లెపూవువలె తెల్లగా నుండును. దీనికి నిప్పుభయములేదు. ఏనుగు కుంభస్థలమునందుండు ముత్యము యుసిరికకాయంత యుండును. వెట్టి చెరకునందు బుట్టిన

ముత్యము ప్రేంకణపుపూవు చాయ గలది. పందికొమ్ముననుండు ముత్యము రేగుపండంత యుండును. కుంకుమఛాయగలది. వెదురు ముత్యములు కోడిగ్రుడ్డంత యుండును. ఇది మంత్రసాధకులకు లభించును. స్వాతియందు ముత్యపుచిప్పలలో బడిన వానచినుకులు మంచి ముత్యము లగును. వర్షబిందువుకొలది ముత్యము. ఇందు శృంగళ శుక్తులందు బుట్టినవి యెఱ్ఱగను, రావణశుక్తులందు బుట్టినవి బంగారు వన్నెగ నుండును, తామ్రపర్ణీశుక్తి యందలివి తెల్లగా నుండును. వీనిలో అణి, సుతారము, సుపాణీ, అనునవి మంచిజాతులు) ఉన్నతమైన రెక్కలతో ఆకాశమునకు పయనించుచున్న ట్లున్నదియు, విచిత్ర వర్ణములు గల కంబళ్లు పరచియున్నదియు, రాష్ట్రి, గృహా, వరుసలు గలిగి భూమివలె భాసిల్లుచున్నదియు, మత్త శుక, శారికాది పక్షుల యొక్క కూజితములతో ధ్వనింపజేయబడుచున్నదియు, అగరుధూపాదులచే అధికముగా పరిమళించుచున్నదియు, నందినీధేనువువలె నిర్మలముగా నున్నదియు, చూచువారల హృదయముల నాకర్షించునదియు, లక్ష్మీదేవికి పుట్టిన యిల్లువలె నున్నదియు, శోకనాశనకారియు, రావణపాలితయు, నగు అశాలను హనుమంతుడు చూచెను.

శ్లో॥ ఇంద్రియాణీన్ద్రియార్థైస్తు పఞ్చ పఞ్చభి రుత్తమైః।
తర్పయామాస మాతేవ తదా రావణపాలితా॥ 30

టీ॥ తదా = అప్పుడు, రావణపాలితా = రావణునిచే పాలింపబడుచున్న ఆశాల, ఇంద్రియాణి = ఇంద్రియములను, పంచ = అయిదింటిని, ఉత్తమైః = ఉత్తమములైన, పంచభిః = అయిదయిన, ఇంద్రియార్థైః - ఇంద్రియ = ఇంద్రియములయొక్క, అర్థైః = అర్థములైన విషయములచేత, మాతేవ = తల్లివలె, తర్పయామాస = తృప్తిపరచెను.

తా॥ అప్పుడు రావణపాలిత యగు అశాల, హనుమంతుని పంచేంద్రియములకు (త్వ క్చక్షుః జిహ్వా నాశికా కర్ణములు ఐదింటిని) ఇంద్రియవిషయములు ఐదింటిచే (శబ్ద, స్పర్శ, రూప, రస, గంధము లనేవిషయములతో)-చల్లని మలయమారుతముచేత త్వగింద్రియమునకు, సుందర వస్తుదర్శనముచేత చక్షురింద్రియమునకు నృత్త గీతాది శ్రవణమువలన శ్రవణేంద్రియమునకు, అమృతోపమానములైన పంచ భక్ష్యాదుల అనుభవముచేత రసనేంద్రియమునకు అగరు మొదలగు పరిమళవస్తువుల సువాసనలచేత ఘ్రాణేంద్రియమునకు అత్యంత తృప్తిని కలుగజేసి తల్లివలె సౌఖ్యమును గలిగించెను.

శ్లో॥ స్వర్గోఽయం దేవలోకోఽయ మిన్ద్రస్యేయం పురీభవేత్।
సిద్ధి ర్వేయం పరాహి స్యాదిత్య మన్యత మారుతిః॥ ౩౧

టీ॥ అయం = ఇది, స్వర్గః = స్వర్గము, అయం = ఇది, దేవలోకః = దేవలోకము, అయం = ఇది, ఇంద్రస్య = ఇంద్రునియొక్క, పురీ = పట్టణము, భవేత్ = అగును, చ = మరియు, అయం = ఇది, పరా సిద్ధిర్హి = బ్రహ్మలోకమే, స్యాత్ = అగును, ఇతి = అని, మారుతిః = ఆంజనేయుడు, అమన్యత = తలచెను.

తా॥ ఆంజనేయుడు రావణుని భవనముయొక్క, మధ్యనున్న ఆశాలను జూచి ఇది స్వర్గలోకము, ఇది దేవలోకము, ఇది దేవేంద్రుని పట్టణమైన అమరావతి, ఇది బ్రహ్మలోకమే కావచ్చు నని తలచెను.

(1 స్వర్గము, పాతాళాదిలోకములలోనిది. 2 దేవలోకము వాయు, వరుణ లోకములలోనిది, ఇందు మొదటి స్వర్గముకంటె రెండవదగు దేవలోకముగొప్పది. దేవలోకముకంటె యింద్రుని అమరావతీపట్టణము గొప్పది. అమరావతికంటె బ్రహ్మలోకము మిక్కిలి గొప్పది. అని ఆంజనేయుడు శ్రేష్ఠ, తర, తమ భేదములను తలచెను.)

శ్లో॥ ప్రధ్యాయత ఇవాపశ్య త్ప్రదీప్తాం స్తత్ర కాఞ్చనాన్।
ధూర్తా నివ మహాధూర్తై ర్దేవనేన పరాజితాన్॥ ౩౨

టీ॥ తత్ర = అక్కడ, కాఞ్చనాన్ = బంగారపువైన, ప్రదీప్తాన్ = ప్రకాశవంతములైన దీపములను, ప్రధ్యాయత ఇవ = నిశ్చలముగా ధ్యానించునట్లుగా, మహాధూర్తైః = మిక్కిలి పెద్దవారలచేత. దేవనేన = జూదముచేత, పరాజితాన్ = ఓడింపబడిన, ధూర్తానివ = పెద్దవారిని వలెనే, అపశ్యత్ = చూచెను.

తా॥ ఆ రావణుని భవనమునందు నిర్మింపబడి ప్రకాశవంతముగా నున్న బంగారు దీపములను పెద్దనేర్పరులగు ధూర్తులచే జూదమందు ఓడింపబడిన అనుభవహీనులగు ఆటగాళ్లనువలె చూచెను.

శ్లో॥ దీపానాం చ ప్రకాశేన తేజసా రావణస్య చ।
అర్చిభి ర్భూషణానాం చ ప్రదీప్తే త్యభ్యమన్యత॥ ౩౩

టీ॥ దీపానాం = దీపములయొక్క. ప్రకాశేన చ = ప్రకాశముచేతను. రావణస్య = రావణునియొక్క, తేజసా చ = తేజస్సుచేతను, భూషణానాం = ఆభరణములయొక్క, అర్చిభిశ్చ = ప్రకాశ జ్వాలలచేతను. ప్రదీప్తా = ప్రకాశించుచున్నది. ఇతి = అని, అభ్యమన్యత = తలచెను.

తా॥ ఈ భవనము దీపముల ప్రకాశముచేతను, రావణుని తేజస్సుచేతను, ఆభరణములయొక్క గొప్పకాంతులచేతను, ప్రకాశించుచున్న దని ఆంజనేయుడు తలచెను.

* హనుమంతుడు నిద్రించుచున్న రావణాంతఃపుర స్త్రీలను జూచుట *

శ్లో॥ తతోఽపశ్య త్కుథాసీనం. నానా వర్ణామ్బర స్రజమ్।
సహస్రం వరనారీణాం, నానావేష విభూషితమ్॥ ౩౪

శ్లో॥ పరివృత్తేఽర్ధరాత్రే తు పాన నిద్రావశంగతమ్।
క్రీడిత్వోపరతం రాత్రౌ సుష్వాప బలవత్తదా॥ ౩౫

టీ॥ తత = అటుతరువాత, నానావర్ణాంబరస్రజం- నానావర్ణ = అనేకరంగులుగల, అమ్బర = వస్త్రములు, స్రజం = మాలికలు గలిగియు, నానావేషవిభూషితం—నానావేష = అనేకవేషములచే, విభూషితం = అలంకరింపబడియు, కుధాసీనం = కంబళ్లయందు పడియున్న. పరనారీణాం = శ్రేష్ఠమైన స్త్రీలయొక్క, సహస్రం = వేయిమందిని, అపశ్యత్ = చూచెను. అర్ధరాత్రే = అర్ధరాత్రి, పరివృత్తే తు = గడచుచుండగా, రాత్రౌ = రాత్రిఅంతయు. ఉపరతం = సరససల్లాప, రత్యాదిక్రియలతో సహితము, క్రీడిత్వా = క్రీడించి, తదా = అప్పుడు, బలవత్ = పెద్దగా, సుష్వాప = (నారీసహస్రము) నిద్రించెను.

తా॥ నానావిధ వర్ణములుగల బట్టలను ధరించి, అనేకరకముల మాలికలు ధరించి, తప్పత్రాగి స్వాధీనము తప్పినవారై భర్తలతో సరససల్లాప రతిక్రియావిశేషములతో అలసి, అర్ధరాత్రి గడచిపోవుచుండగా కంబళ్ళ యందు పడి గాఢముగా నిద్రించుచున్న వేయిమంది స్త్రీలను హనుమంతుడు చూచెను.

శ్లో॥ తత్ప్రసుప్తం విరురుచే నిశ్శబ్దాన్తర భూషణమ్।
నిశ్శబ్ద హంస భ్రమరం, యథా పద్మవనం మహత్॥ ౩౬

టీ॥ నిశ్శబ్దాన్తర భూషణం — నిశ్శబ్ద = ధ్వనులులేని, అంతర = మధ్యయందున్న. భూషణం = అభరణములుగల, తత్ = అ, ప్రసుప్తం = గాఢనిద్ర. నిశ్శబ్దహంసభ్రమరం — నిశ్శబ్ద = నిశ్శబ్దముగానున్న, హంస = హంసలు, భ్రమరం = తుమ్మెదలుగల, మహత్ = గొప్పదైన, పద్మవనం యథా = పద్మవనమువలె, విరురుచే = విస్తారముగా ప్రకాశించెను.

తా॥ అంతవరకు ఆభరణముల యొక్క ధ్వనులతో మహోత్కర్షగా కామినీ కాంతలతో సురుచిరముగా వెలుగొందు ఆ ప్రదేశము ఆ స్త్రీలు తప్ప త్రాగి నిద్రించుట వలన ఆభరణముల యొక్కయు చీరల యొక్కయు శబ్దములేక, నిశ్శబ్దముగా నున్న హంసలు, తుమ్మెదలు గల పద్మవనమువలె భాసించెను.

శ్లో॥ తాసాం సంవృత దన్తాని. మీలితాక్షాణి మారుతిః।
అపశ్యత్పద్మ గంధీని, వదనాని సుయోషితామ్॥ ౩౭

టీ॥ మారుతిః = ఆంజనేయుడు, తాసాం = ఆ, సుయోషితాం = యోగ్యరాండ్రైన స్త్రీలయొక్క. సంవృత దన్తాని - సంవృత = కప్పబడియున్న. దన్తాని = దంతములు గలిగియున్నట్టియు, మీలితాక్షాణి - మీలిత = మూయబడిన. అక్షాణి = నేత్రములు గలిగినట్టియు, పద్మగన్ధీని—పద్మ = పద్మములయొక్క, గన్ధీని = పరిమళములు గలిగియున్న, వదనాని = ముఖములను, అపశ్యత్ = చూచెను.

తా॥ హనుమంతు డక్కడ బయటకు కనబడని విధముగా పెదవులతో కప్పబడియున్న దంతములతో మూసియున్న నేత్రములతో పద్మముల యొక్క పరిమళమువలె సుగంధయుక్తములైన ముఖములతో నిద్రించుచున్న పద్మినీజాతిస్త్రీలను జూచెను. పద్మినీ "పద్మగంధా" అని శాస్త్ర నిర్ణయము. నోళ్లుతెరచి పండ్లు వెళ్ళబెట్టి నిదురించుట అధమస్త్రీల లక్షణము. ఈ స్త్రీలు అట్టివారు కాదని భావము.

శ్లో॥ ప్రబుద్ధా నీవ పద్మాని తాసాం భూత్వా క్షపాక్షయే।
పున స్సంవృత పత్రాణి, రాత్రా వివ బభు స్తదా॥ ౩౮

టీ॥ తదా = అప్పుడు, తాసాం = ఆస్త్రీలయొక్క. పద్మాని = ముఖపద్మముల, క్షపాక్షయే = పగటియందు. ప్రబుద్ధా నీవ = వికసించనవివలె, భూత్వా = అయి, పునః = తిరిగి. రాత్రౌ = రాత్రియందు, సంవృత

పత్రాణీవ-సంవృత = కప్పబడిన, పత్రాణీవ = రేకులుగలవివలెనే, (ముకుళించియున్నట్లు) బభుః = అయ్యెను,

తా॥ పగటియందు చక్కగా వికసించి. రాత్రులయందు ముకుళించుకుపోయిన పద్మములవలెనే ఆ స్త్రీలయొక్క ముఖపద్మములు రాత్రియందలి గాఢనిద్రలో ప్రకాశించెను.

శ్లో॥ ఇమాని ముఖపద్మాని నియతం మత్తషట్పదాః।
అమ్బుజా నీవ ఫుల్లాని ప్రార్థయన్తి పునః పునః॥ ౩౯

టీ॥ మత్తషట్పదాని-మత్త = మదించిన, షట్పదాని = తుమ్మెదలు ఇమాని = ఈ, ముఖపద్మాని = పద్మములవంటి ముఖములను, నియతం = నిశ్చయముగా, ఫుల్లాని = వికసించిన, అమ్బుజా నీవ = పద్మములనువలెనే, పునఃపునః = మాటిమాటికి, ప్రార్థయన్తి = కోరుచున్నవి

తా॥ పద్మినీజాతి స్త్రీలగుటచే, పద్మపరిమళముతో నొప్పుచున్న ఆస్త్రీల ముఖపద్మములను, తుమ్మెదలు వికసించిన పద్మములే యనెడి భ్రాంతితో మాటి మాటికి వాటిని కోరుచున్నట్లుండెను.

పద్మినీజాతి స్త్రీ లక్షణములు :

కమలముకుళ మృద్వీ ఫుల్ల రాజీవగంధ
స్సురత పయసి యస్యా స్సౌరభం దివ్యమంగే
చకిత మృగదృగాభే ప్రాంతరక్తే చ నేత్రే
స్తనయుగళ మనర్ఘ్యం శ్రీఫల విడంబి॥
తిలకుసుమ సమానం బిభ్రతీ నాసికాగ్రం
ద్విజగురు సురపూజా శ్రద్ధధానా సదైవ
కువలయదళ కాంతిః కాపి చాంపేయగౌరీ
వికచ కమల కోశాకార కామాతపత్రా॥

వ్రజతి మృదుసలీలం రాజహంసీవ తన్వీ
త్రివళి లలిత పద్మా హంసవాణీ సువేషా
మృదు శుచి లఘు భుంక్తే మానినీ గాఢలజ్జా
ధవళ కుసుమ వాసో వల్లభా పద్మినీస్యాత్॥

అని పద్మినీజాతి స్త్రీలక్షణము. పద్మినీజాతిస్త్రీలు తొలిమూడుజాములందు భర్తలతో గలియుదు. ఈకాలమందు వీరు నిద్రించుచున్నా రని చెప్పుట చేత కూడ వీరుపద్మినులనియే చెప్పనగును. "రమయతి రమణీయాం పద్మినీ తుర్యయామే" అని లక్షణము.

శ్లో॥ ఇతి చామన్యత శ్రీమా, నుపపత్త్యా మహాకపిః।
మేనే హి గుణత స్తాని, సమాని సలిలోద్భవైః॥ ౪౦

టీ॥ శ్రీమాన్ = శోభాయుక్తుడైన, మహాకపిః = హనుమంతుడు, ఉపపత్త్యా = వృత్తాంతముచేత, ఇతి = ఈలాగున, అమన్యత = తలచెను. చ = మరియు, గుణతః = గుణములవలన, తాని = ఆముఖములను, సలిలోద్భవైః = పద్మములతో, సమాని హి = సమానమైనవిగానే మేనే = తలచెను.

తా॥ ఆంజనేయుడు కమలములతో సమానగుణములు చరిత్రలు కలవి గనుకనే ఆ స్త్రీలముఖములను పద్మములని తలచెను.

శ్లో॥ సా తస్య శుశుభే శాలా, తాభిః స్త్రీభి ర్విరాజితా।
శారదీవ ప్రసన్నా ద్యౌ స్తారాభి రభిశోభితా॥ ౪౧

టీ॥ తస్య = ఆ రావణునియొక్క, సా = ఆ, శాలా = శాల, తాభిః = ఆ, స్త్రీభిః = స్త్రీలచేత, విరాజితా = ప్రకాశింపచేయబడినదై, తారాభిః = నక్షత్రములచేత, శారది = శరత్కాలమందు, అభిశోభితా = అంతట ప్రకాశింపజేయబడుచు, ప్రసన్నా = ఆహ్లాదమును కలుగజేయు, ద్యౌరివ = ఆకాశమువలె, శుశుభే = శోభించెను.

తా॥ పద్మినీస్త్రీలతో నిండి ప్రకాశించుచున్న ఆ రావణుని శయనమందిరము శరత్కాలమునందు నక్షత్రములతో ప్రకాశించు నిర్మలాకాశమువలె ప్రకాశించెను.

శ్లో॥ స చ తాభిః పరివృత శ్శుశుభే రాక్షసాధిపః ।
యథా హ్యుడుపతి శ్శ్రీమాం స్తారాభి రభిసంవృతః॥ ४२

టీ॥ చ = మరియు, సః = ఆ, రాక్షసాధిపః = రావణుడు, తాభిః = ఆ స్త్రీలతో, పరివృతః = కూడికొన్నవాడై, తారాభిః = నక్షత్రములతో, అభిసంవృతం = కూడియున్న, శ్రీమాన్ = శోభాయుక్తుడైన, ఉడుపతిర్యథా = చంద్రునివలె, శుశుభే = ప్రకాశించుచుండెను.

తా॥ ఆరావణుడు నక్షత్రములతో కూడి ప్రకాశించుచంద్రునివలె ఆస్త్రీలతో కూడి ప్రకాశించుచుండెను.

శ్లో॥ యాశ్చ్యవన్తేఽమ్బరా త్తారాః పుణ్యశేష సమావృతాః ।
ఇమా స్తా స్సఙ్గతాః కృత్స్నా ఇతి మేనే హరి స్తదా॥ ४३

టీ॥ తదా = అప్పుడు, హరిః = వానరుడైన హనుమంతుడు, యాః = ఏ, తారాః = నక్షత్రములు, పుణ్యశేషసమావృతాః—పుణ్యశేష = శేషించిన పుణ్యముతో, సమావృతాః = కూడినవై, అమ్బరాత్ = ఆకాశమునుండి చ్యవన్తే = జారిపడుచున్నవో, తాః = ఆనక్షత్రములే, ఇమాః = ఈ స్త్రీలుగా, కృత్స్నాః = పూర్తిఆకారములను, సంగతాః = పొందినవి.

తా॥ పుణ్యము క్షయించిపోయిన పిదప నక్షత్రములు నేలపై రాలుచుండును. ఆట్లే క్షీణపుణ్యమున నేలపై రాలిన నక్షత్రములే యీ సుందరాకారమును ధరించిన మగువ లని హనుమంతుడు తలచెను. అవ-ఉత్తమజాతి క్షత్రియస్త్రీలు రాక్షసునితో సంభోగింపవలసివచ్చుట వారి పుణ్యక్షయము చేతనే కదా। ఇందువలన ఉత్తమజాతిస్త్రీ అధమజాతి పురుషునితో కలియరా దని భావము.

"క్షీణే పుణ్యే మ_ర్త్యలోకం విశంతి"

శ్లో॥ తారాణా మివ సువ్య_క్తం మహతీనాం శుభార్చిషామ్।
ప్రభావర్ణప్రసాదా శ్చ విరేజు _స్తత్ర యోషితామ్॥ ౬౮

టీ॥ తత్ర = ఆ రావణశయన మందిరమందు, మహతీనాం = గొప్పవారైన, శుభార్చిషాం = శుభతేజస్సులు గల, యోషితాం = స్త్రీలయొక్క, ప్రభావర్ణప్రసాదాః = నిర్మలమైన వర్ణకాంతులు, సువ్యక్తం = స్ఫుటముగా, తారాణా మివ = నక్షత్రములకువలెనే, విరేజుః = ప్రకాశించినవి.

తా॥ ఆ రావణ శయన మందిర మందలి గొప్పవా రగు ఆ స్త్రీలయొక్క నిర్మల వర్ణకాంతులు నక్షత్రములకు వలె స్ఫుటముగా ప్రకాశించు చుండెను.

శ్లో॥ వ్యావృ_త్త గురుపీన స్రక్ప్రకీర్ణ వరభూషణాః।
పాన వ్యాయామ కాలేషు, నిద్రాపహృత చేతసః॥ ౬౯

టీ॥ పానవ్యాయామ కాలేషు-పాన = మద్యపానానంతరము జరుగు, వ్యాయామకాలేషు = (నృత్య-గాన-రతిక్రీడాది) వ్యాయామ కార్యము లందు, వ్యావృ_త్తగురుపీనస్రక్ప్రకీర్ణవరభూషణాః - వ్యావృ_త్త = వేరుగా చేయబడిన, గురు = గొప్పవైన, పీన = లావైన, స్రక్ = మాలలచే, ప్రకీర్ణ = వ్యాప్తములైన, వర = శ్రేష్ఠములైన, భూష ణాః = అలంకారములు గలవారై, నిద్రాపహృతచేతసః = నిద్రచేత పోగొట్టబడిన మనస్సులు గలవారైరి.

తా॥ ఆ స్త్రీలు మద్యపానానంతరము నృత్య, గాన, రతిక్రీడల యందు నలిగిపోయిన పెద్ద పుష్పమాలికలు చిందరగాపడిన శ్రేష్ఠ ఆభరణములు గలవారై నిద్రాపరవశలై యుండిరి. హనుమంతుడు సంచరించు ఈ

కాలము రెండవజాము గనుక యీ స్త్రీలు హస్తినీ జాతి స్త్రీ లని సూచన. " భజతి దినరజన్యో ర్హస్తినీం శ్చ ద్వితీయే " అని రతి శాస్త్రము.

శ్లో॥ వ్యావృత్త తిలకాః కాశ్చి త్కాశ్చి దుద్భ్రాన్త నూపురాః।
పార్శ్వే గళితహారా శ్చ కాశ్చి త్పరమయోషితః॥ ౪౬

టీ॥ పరమయోషితః-పరమ = శ్రేష్ఠులైన. యోషితః = స్త్రీలు. కాశ్చిత్ = కొందరు. వ్యావృత్తతిలకాః-వ్యావృత్త = చెదరిన, తిలకాః = బొట్లు గలవారును, కాశ్చిత్ = కొందరు, ఉద్భ్రాన్తనూపురాః-ఉద్భ్రాన్త = పైకిజారిపోయిన. నూపురాః = అందెలుగలవారును, కాశ్చిత్ = కొందరు; పార్శ్వే = ప్రక్కకు. గళితహారా శ్చ-గళిత = జారబడిన. హారాశ్చ = హారములు గలవారును.

తా॥ రావణాంతఃపురము నందలి కొందరు స్త్రీలు రత్యోపరత్యాదిస్థితులచేతను పానాదులచేతను మై మరపులతో పడియుండ తిలకములు చెదరిపోయి యుండిరి. మరికొందరి కాలిఅందె లూడిపడి యుండెను. కొందరి హారములు ప్రక్కలపై తెగిపడి యుండెను.

శ్లో॥ ముక్తాహారావృతా శ్చాన్యాః కాశ్చి ద్విస్రస్త వాససః।
వ్యావిద్ధ రశనాదామాః కిశోర్య ఇవ వాహితాః॥ ౪౭

టీ॥ అన్యాః = మిగిలినవారు. ముక్తాహారావృతాః-ముక్త = విడువబడిన. హార = హారములతో. ఆవృతాః = కూడియున్నవారును. కాశ్చిత్ = కొందరు, విస్రస్త వాససః = జారిపోయిన వస్త్రములు గలవారును. వ్యావిద్ధ రశనాదామాః - వ్యావిద్ధ = ఊడిపోయిన. రశనాదామాః = వడ్డాణములు గలవారును నై, వాహితాః = శ్రమాధుల నలసియున్న, కిశోర్య ఇవ = గుఱ్ఱపుపిల్లలవలె నుండిరి.

తా॥ అచ్చట కొందరు స్త్రీలు హారములు తెగినవారును, మరికొందరు వివస్త్రలుగను, కొందరు ఊడిపోయిన వడ్డాణములు గలిగి భారములు మోసి మోసి అలసియున్న ఆడ గుఱ్ఱపుపిల్లలవలెనుండిరి,

శ్లో॥ సుకుణ్డలధరా శ్చాన్యా విచ్ఛిన్న మృదిత స్రజః।
గజేన్ద్ర మృదితాః ఫుల్లా లతా ఇవ మహావనే॥ ౪౦

టీ॥ అన్యాః = మరికొందరు, సుకుణ్డలధరా శ్చ = యోగ్యములగు కుండలములను ధరించినవారును, విచ్ఛిన్నమృదితస్రజః - విచ్ఛిన్న = విడిపోయి, మృదిత = నలిగిన, స్రజః = పుష్పమాలికలు గలవారును, మహావనే = గొప్ప అరణ్యమునందు, ఫుల్లాః = వికసించినవై, గజేన్ద్ర మృదితాః–గజేన్ద్ర = గజరాజుచేత, మృదితాః = నలగగొట్టబడిన. లతా ఇవ = లతలవలె నుండిరి.

తా॥ కొందరుస్త్రీలు మంచికుండలములు ధరించి యుండిరి. మరికొందరు తెగి నలిగిపోయిన పుష్పమాలలు గలవారై అడవియందు ఏనుగుచే నలగగొట్టబడిన లతలవలె నుండిరి.

శ్లో॥ చన్ద్రాంశు కిరణాభా శ్చ హారాః కాసాంచి దుత్కటాః।
హంసా ఇవ బభు స్సుప్తా స్తనమధ్యేషు యోషితామ్॥ ౪౧

టీ॥ కాసాంచిత్ = కొందరియొక్క, ఉత్కటాః = స్థూలములైనట్టియు, చంద్రాంశుకిరణాభాః–చంద్రాంశు = సూర్యచంద్రులయొక్క, కిరణ = కిరణములయొక్క, అభాః = కాంతివంటి కాంతి గలిగినట్టియు, హారాః = ముత్యాలహారములు, యోషితాం = స్త్రీలయొక్క, స్తనమధ్యేషు = స్తనముల మధ్యయందు, సుప్తాః = నిద్రించుచున్న, హంసా ఇవ = హంసలువలె, బభుః = ప్రకాశించుచున్నవి.

తా॥ ఆ స్త్రీలయొక్క స్థూలములైన ముత్యాలహారములు చంద్రసూర్యుల యొక్క కిరణములవంటి కాంతితో నుండి వారి స్తనమధ్యములందు నిద్రించుచున్న హంసలవలె ప్రకాశించుచుండెను.

శ్లో॥ అపరాసాం చ వైడూర్యాః కాదమ్బా ఇవ పక్షిణః।
హేమసూత్రాణి చాన్యాసాం చక్రవాకా ఇవా భవన్॥ ౨౦

టీ॥ అపరాసాం = మరికొందరియొక్క, వైడూర్యాః = వైడూర్యహారములు. కాదంబాః = కలహంసలనెడి, పక్షిణ ఇవ = పక్షుల వలెను, చ = మరియు, అన్యాసాం = మరికొందరి యొక్క, హేమసూత్రాణి = బంగారుసూత్రములు. చక్రవాకా ఇవ చ = చక్రవాక పక్షులవలెను, అభవన్ = ఉండెను.

తా॥ కొందరి స్త్రీలయొక్క వైడూర్యహారములు కలహంసలవలెను, బంగారుసూత్రములు చక్రవాకములవలె నుండెను.

శ్లో॥ హంస కారణ్డ వాకీర్ణా శ్చక్రవా కోపశోభితాః।
అపగా ఇవ తా రేజు ర్జఘనైః పులినై రివ॥ ౨౧

టీ॥ హంస కారణ్డ వాకీర్ణాః—హంస = హంసలు. కారణ్డవ = కన్నెలేళ్ల చేత, అకీర్ణాః = వ్యాప్తము లైనట్టియు, చక్రవాకోపశోభితాః—చక్రవాక = చక్రవాకములతో, ఉపశోభితాః = ప్రకాశింపజేయబడుచున్న అపగాః = నదులు, పులినై రివ = ఇసుకతిన్నెలతోవలె. తాః = అస్త్రీలు. జఘనైః = పిరుదులచేత, రేజుః = ప్రకాశించిరి.

తా॥ హంసలు లేళ్లు చక్రవాకపక్షులతో కూడి ప్రకాశించు నదులు యిసుకతిన్నెలచేత వలెనే ఆ స్త్రీలు జఘన ప్రదేశములతో శోభాయమానముగా ప్రకాశించిరి.

శ్లో॥ కిఙ్కిణీజాల సంకోశా స్తా హైమవిపులామ్బుజాః।
భావగ్రాహా యశ స్తీరా స్సుప్తా నద్య ఇవా బభుః॥ ౨౨

టీ॥ కిఙ్కిణీజాలసఙ్కోశాః = తామరమొగ్గల వలె యున్న గజ్జెల సమూహములు గలిగినట్టియు, హైమవిపులామ్బుజాః = విశాల

పద్మములవంటి సువర్ణాభరణములు గలిగినట్టియు. యశ స్త్రీరాః = యశస్సులనే తీరములు గలిగినట్టియు భావగ్రాహాః = మనస్సు మోహింపజేయ సమర్థములగు శృంగారచేష్ట లనెడి మొసళ్ళుగలిగి, సుప్తాః = నిద్రించుచున్న, తాః = ఆస్త్రీలు, నద్య ఇవ = నదులువలెనే ఆబభుః = ప్రకాశించిరి.

తా॥ అచ్చటి బంగారు అభరణములయొక్కయు, కాళ్ల గజ్జెలయొక్కయు ధ్వనులతో పూమొగ్గలవలె నున్న బాలలు, వికసించిన, బంగారు తామరపుష్పముల వలె నున్న యువతులు, పూర్తి అనుభవనీయము లైనప్పటికి మొసళ్ళ వంటి హావభావములు ప్రదర్శించు ప్రౌఢలు నిద్రించుచున్నవారై, పూమొగ్గలు, వికసించిన తామరలు మొసళ్ళ తీరములు గల నదులవలె తనూకాంతులతో ప్రకాశించుచుండిరి.

శ్లో॥ బాలాస్యాత్ షోడశాబ్దా త్తదుపరి తరుణీ వింశతే ర్యావదూర్ధ్వం।
ప్రౌఢాస్యా త్పంచపంచాశదవధి పరతో వృద్ధతా మేతి నారీ॥

పదునారు సంవత్సరములకు పైబడినది బాల యనియు, యిరువది యేళ్ళకు పైబడినది తరుణి అనియు. ఆపై నేబదిఅయిదుసంవత్సరములు వరకు ప్రౌఢ అనియు. ఆపై వృద్ధ అనియు చెప్పబడును. ముప్పది యేండ్లవరకు తరుణియని పాఠాంతరముగలదు. ఇట్లు చెప్పుటచే పదునారు సంవత్సరములకు తక్కువ వయస్సు గలది రతికి యోగ్యురాలు కాదని శాస్త్రాభిప్రాయము. ప్రథమ రజస్వల యెప్పుడైనను పదునారవ సంవత్సరము వచ్చువరకు గర్భాదానము చేయరాదు.

శ్లో॥ మృదు ష్వంగేషు కాసాంచి త్కుచాగ్రేషు చ సంస్థితాః।
బభూవు ర్భూషణా నీవ శుభా భూషణరాజయః॥ ౫౩

టీ॥ కాసాంచిత్ = కొందరియొక్క, శుభాః = శుభప్రదములైన, భూషణ రాజయః = ఆభరణములయొక్క గుర్తులు, మృదుషు = సుకుమారము

లైన, అంగేషు = అవయవముల యందు, కుచాగ్రేషు చ = స్తనాగ్రములయందును, సంస్థితాః = ఉన్నవై, భూషణానీవ = ఆభరణములువలెనే, బభూవుః = ఆయెను.

తా॥ కొందరి స్త్రీల యొక్క మృదువులైన కర చరణ స్తనా ద్యవయవములందు అలంకారముగా నుంచుకొను బంగారు ఆభరణములు రతికేళ్యాది విలాసములలో తీసివేయబడినను, ఆ సుకుమారావయవములందు ఆయాభరణముల గుర్తులు ఆభరణము లున్నట్లుగానే ప్రకాశించుచుండెను. సుకుమారు లైన స్త్రీలు తమ శరీరమునందలి ఆభరణములు తీసివేసినను అవి యున్నట్లుగానే కనుపించు గుర్తులు చూచు మగవారిని మోహింపజేయ సమర్థములై యుండును. గాన నిదురించుచున్న స్త్రీలను పురుషులు చూడరాదనియు. స్త్రీలు వెల్లకిల పరుండరాదనియు ఆర్యోక్తి కలదు.

శ్లో॥ అంశుకాన్తా శ్చ కాసాంచి న్ముఖ మారుత కమ్పితాః।
ఉప ర్యుపరి వక్త్రాణాం వ్యాధూయ న్తే పునః పునః॥ ౨౪

టీ॥ కాసాంచిత్ = కొందరి స్త్రీలయొక్క. అంశుకాన్తాః-అంశుక = వస్త్రముల యొక్క, అన్తాః = చివరలు, ముఖమారుతకంపితాః-ముఖ = ముఖముయొక్క, మారుత = వాయువుచేత, కంపితాః = కదపబడుచున్నవై, పునః పునః = మాటిమాటికి, వక్త్రాణాం = ముఖముల యొక్క, ఉపర్యుపరి = పైపైకి. వ్యాధూయన్తే = ఎగురుచున్నవి.

తా॥ కొందరి స్త్రీలయొక్క సుందరములైన పైటకొంగులు వారి ముఖమునుండి వెలి వెడలిన గాలిచేత ఎగురగొట్టబడి తిరిగి వచ్చుచు ఎగురుచుండ, అవి విసనకర్రలవలె ఉపయోగపడుచున్న ట్లుండెను.

శ్లో॥ తాః పతాకా ఇవోద్ధూతాః పత్నీనాం రుచిరప్రభాః।
నానావర్ణ సువర్ణానాం వక్త్రమూలేషు రేజిరే॥ ౨౫

టీ॥ నానావర్ణ సువర్ణానాం-నానా = అనేకములైన, వర్ణ = వర్ణముల సువర్ణానాం = బంగారములు గల, పత్నీనాం = రావణుని భార్యల యొక్క, రుచిరప్రభాః = ప్రకాశమానములైన కాంతులు గలిగిన, తాః = ఆవస్త్రములు, వక్త్రమూలేషు-వక్త్ర = ముఖములయొక్క, మూలేషు = మూలలయందు, పతాకా ఇవ = జండాలువలె, ఉద్ధూతాః = ఎగరగొట్టబడినవై, రేజిరే = ప్రకాశించెను.

తా॥ అనేక బంగారు ఆభరణములు గల రావణుని భార్యలయొక్క ముఖములనుండి వెడలు గాలులచే ఎగురగొట్టబడిన పైటకొంగులు రంగు రంగుల కాంతులు గలవై జండాలవలె ప్రకాశించెను.

శ్లో॥ వవల్గు శ్చాత్ర కాసాంచి త్కుణ్డలాని శుభార్చిషామ్।
ముఖమారుత సంసర్గా న్మందం మన్దం సుయోషితామ్॥ ౨౬

టీ॥ శుభార్చిషాం-శుభ = శుభప్రదములైన, అర్చిషాం = కాంతులుగలిగిన, కాసాంచిత్ = కొందరు, సుయోషితాం = యోగ్యస్త్రీలయొక్క, కుణ్డలాని = కర్ణభూషణములు, ముఖమారుతసంసర్గాత్-ముఖ = ముఖముల యొక్క, మారుత = వాయువులయొక్క, సంసర్గాత్ = కలియుటవలన, మన్దంమన్దం = నెమ్మది నెమ్మదిగా, అత్ర = ఇక్కడ, వవల్గుః = ఊగుచుండెను.

తా॥ మంచి కాంతులుగల రావణుని స్త్రీలయొక్క కర్ణాలంకారములైన కుణ్డలములు, వారి ముఖములనుండి వెలివడు గాలులచే నెమ్మదినెమ్మదిగా నూగుచుండెను.

శ్లో॥ శర్కరాసవ గన్ధై శ్చ ప్రకృత్యా సురభి స్సుఖః।
తాసాం వదన నిశ్వాస స్సిషేవే రావణం తదా॥ ౨౭

టీ॥ తదా = అప్పుడు, తాసాం = ఆస్త్రీలయొక్క, శర్కరాసవగంధైః-శర్కరాసవ = పంచదార మద్యములయొక్క, గంధైః = పరిమళముల చేతను, ప్రకృత్యా = స్వభావసిద్ధముగాను, సురభిః = పరిమళించు చున్న, వదన నిశ్శ్వాసః = ముఖనిట్టూర్పు రావణం = రావణుని, సుఖః = సుఖపెట్టునదియై, సిషేవే = సేవింపుచుండెను.

తా॥ ఉత్తమురాండ్రగు రావణుని స్త్రీలయొక్క ముఖములు స్వభావసిద్ధము లైన పరిమళములు గలవి. వారు సేవించిన పంచదార మద్యముల పరి మళముగలిగి వారి ముఖములనుండి వెడలుచున్న నిట్టూర్పుగాలి రావ ణునికి సంతోషము కలిగించునదిగా యుండెను.

శ్లో॥ రావణాననశఙ్కాశ్చ కాశ్చి ద్రావణ యోషితః।
ముఖాని స్మ సపత్నీనా ముపాజిఘ్ర న్పునః పునః॥ ౩౯

టీ॥ కాశ్చిత్ = కొందరు, రావణయోషితః = రావణునిభార్యలు, రావణా ననశఙ్కాః-రావణ = రావణునియొక్క, ఆననశఙ్కాః = ముఖము లను ఊహగలవారై, సపత్నీనాం = సవతులయొక్క, ముఖాని = ముఖములను, పునఃపునః = మాటిమాటికి, ఉపాజిఘ్రన్ = ముద్దు పెట్టుకొనుచుండిరి,

తా॥ కొందరు స్త్రీలు కామోద్రేకముతో తామేమిచేయుచున్నది తెలియని స్థితిలో రావణుని యందు గాఢానురాగ సక్తలై రావణుని ముఖము లనుకొని సవతుల ముఖములను ముద్దుపెట్టుకొనుచుండిరి, కామాం ధులకు తామేమిచేయుచున్నారో వారికే తెలియదు. "కామాతురాణాం న భయం న లజ్జా"

శ్లో॥ అత్యర్థం సక్తమనసో రావణే తా వరస్త్రియః।
అస్వతన్త్రా స్సపత్నీనాం ప్రియమే వాచరం స్తదా॥ ౪౦

టీ॥ తదా = అప్పుడు, తాః = ఆ, వరస్త్రియః = శ్రేష్ఠులైన స్త్రీలు, రావణే = రావణునియందు, అత్యర్థం = మిక్కిలి, సక్తమనసః = తగులుకొన్న మనస్సుగలవారై, అస్వతంత్రాః = స్వతంత్రము లేని వారై, సపత్నీనాం = సవతులకు, ప్రియమేవ = ఇష్టమునే, ఆచరన్ = చేసిరి.

తా॥ శ్రేష్ఠులైన ఆస్త్రీలు రావణునియందు ఆసక్తి గల మనస్సుగలవారు కనుకను మద్యపానముచే స్పృహలు తప్పి సవతుల ముఖములను ముద్దుపెట్టుకొనగా వారును మైమరచి యుండుటవలన రావణు డనే భ్రాంతిచే తిరిగి సవతుల కిష్టముగానే ముద్దులి డుచుండిరి. కామోద్రేక మున ఏమి చేయుచున్నది తెలియకుండిరి.

శ్లో॥ బాహూ నుపనిధాయాన్యాః పారిహార్య విభూషితాన్।
అంశుకాని చ రమ్యాణి ప్రమదా స్తత్ర శిశ్యిరే॥ ౬౦

టీ॥ తత్ర = అక్కడ, అన్యాః = మరికొందరు, ప్రమదాః = స్త్రీలు, పారిహార్యవిభూషితాన్ - పారిహార్య = పరిహరించబడిన, విభూషితాన్ = అలంకారములుగల, బాహూన్ = బాహువులను, రమ్యాణి = సుందరములైన, అంశుకాని = వస్త్రములను. ఉపనిధాయ = దగ్గర చేర్చుకొని, శిశ్యిరే = సేవించిరి,

తా॥ అచ్చట మరికొంతమంది స్త్రీలు కంకణాద్యలంకారములను తీసివేసిన చేతులను వస్త్రములను దగ్గరకు చేర్చుకొని పరవశతచే నిద్రను తట్టు కొనలేక ఎట్లున్నవా రట్లే నిద్రించిరి.

శ్లో॥ అన్యా వక్షసి చాన్యస్యా స్తస్యాః కాశ్చి త్పున ర్భుజమ్।
అపరా త్వఙ్క మన్యస్యా స్తస్యా శ్చాప్యపరా భుజౌ॥ ౬౧
ఊరు పార్శ్వ కటీ పృష్ఠ మన్యోన్యస్య సమాశ్రితాః।
పరస్పర నివిష్టాఙ్గ్యో మద స్నేహవశానుగాః॥ ౬౨

టీ॥ అన్యా = మరియొకతె. అన్యస్యాః = మరియొకదానియొక్క, వక్షసి = వక్షస్థలమందును. కాచిత్ = ఒకానొకతె, పునః = తిరిగి, తస్యాః = దానియొక్క. భుజం చ = భుజమును. అపరా = మరియొకతె, అన్యస్యాః = మరియొకదానియొక్క, అంకం = తొడను, అపరా = మరియొకతె, తస్యాః = దానియొక్క, భుజౌ చ = భుజములను, అన్యోన్యస్య = ఒకరి కొకరి యొక్క. ఊరుపార్శ్వకటీపృష్ఠం- ఊరు = తొడలను. పార్శ్వ = ప్రక్కభాగములను. కటీ = మొలప్రదేశములను పృష్ఠం = వీపులను. సమాశ్రితాః = ఆశ్రయించుకొన్నవారగుచు, పరస్పరనివిష్టాఙ్గ్యః - పరస్పర = అన్యోన్యము, నివిష్ట = అమర్చుకోబడిన, అంగ్యః = అవయవములు కలవారగుచు, మదస్నేహవశానుగాః-మదస్నేహ = కామమునకు, వశానుగాః = వశ్యలై శిశ్యిరే = నిద్రించిరి,

తా॥ అచ్చటి స్త్రీలు ఒకర్తె వక్షస్థలమం దింకొకస్త్రీ భుజమును, ఒకస్త్రీ తొడను మరియొకతె, భుజములను తొడలను ప్రక్కల మొలనూళ్లమీద వీపుమీద ఒకరి కొకరు ఎవరికి యెక్క డెట్లమరిన నట్లు అన్యోన్యముగా అవయవములను తమ దిండ్లుగా చేసికొని కామపరవశలై నిద్రించిరి.

శ్లో॥ అన్యోన్య భుజసూత్రేణ స్త్రీమాలా గ్రథితా హి సా।
మాలేవ గ్రథితా సూత్రే శుశుభే మత షట్పదా॥ ౬౩

టీ॥ అన్యోన్యభుజసూత్రేణ - అన్యోన్య = ఒండొరులయొక్క, భుజ = భుజము, సూత్రేణ = త్రాడుచేత, సా = ఆ, స్త్రీమాలా = స్త్రీలపంక్తి, గ్రథితా = కూర్చబడినదై, మత్తషట్పదా - మత్త = మదించిన, షట్పదా = తుమ్మెదలుకలిగిన, మాలాహి = మాలయే, సూత్రే = దారమునందు, గ్రథితేవ = కూర్చబడినదివలె, శుశుభే = ప్రకాశించెను.

తా॥ ఆస్త్రీలు ఒకరిభుజముమీద మరియొకరు చేతులు దండగా వైచికొని యుండ వారి నల్లని వెంట్రుకలు. స్త్రీలముఖపద్మము లందలి మకరంద పానాసక్తములై వ్రాలు తుమ్మెదల దండువలె ప్రకాశించెను.

శ్లో॥ లతానాం మాధవేమాసి ఫుల్లానాం వాయుసేవనాత్।
అన్యోన్య మాలాగ్రథితం సంసక్త కుసుమోచ్చయమ్॥ ౬౪
వ్యతివేష్టిత సుస్కన్ధ మన్యోన్య భ్రమరాకులమ్।
ఆసీ ద్వన మివోద్ధూతం స్త్రీవనం రావణస్య తత్॥ ౬౫

టీ॥ మాధవే మాసి = వసంతఋతువునందు, ఫుల్లానాం = వికసించిన, లతానాం = లతలయొక్క, వాయుసేవనాత్-వాయు = గాలియొక్క, సేవనాత్ = సేవించుటవలన, అన్యోన్యమాలాగ్రథితం-అన్యోన్య = ఒకరికొకరుగా, మాలా = మాలగ, గ్రథితం = కూర్చబడిన, సంసక్తకుసుమోచ్చయం-సంసక్త = తగులుకొన్న, కుసుమోచ్చయం = మంచి పుష్పములు కలిగినటువంటి, రావణస్య = రావణునియొక్క, తత్ = ఆ, స్త్రీవనం = స్త్రీలనెడి వనము, వ్యతివేష్టితసుస్కన్ధం-వ్యతివేష్టిత = మిక్కిలికలసియున్న, సుస్కన్ధం = యోగ్యమైన మొదళ్లుగలిగినటువంటి, అన్యోన్య భ్రమరాకులం-అన్యోన్య = అన్యోన్యము, భ్రమర = తుమ్మెదలచే, ఆకులం = వ్యాకులమైనట్టి, ఉద్ధూతం = ఎగరగొట్టబడినటువంటి, వనమివ = వనమువలెనే, ఆసీత్ = ఆయెను.

తా॥ అక్కడ స్త్రీలు ఒకరి కొకరు చేతులు కలిపి మాలలుగా పరవశులై నిద్రించుచుండ వారి ముఖపద్మములనుండి బయల్వెడలిన నిట్టూర్పు వాయువులచే ఎగరగొట్టబడిన నల్లని వెంట్రుకలు, వారు ధరించిన పుష్పాదులు ఒకరివి వేరొకరిమీద పడుచుండ, వసంతఋతువునందు మొదళ్లు కలిసియున్న లతలయొక్క వికసించిన పుష్పములు వాయువుచే కదల్చబడి తుమ్మెదలు వ్రాలుచున్న వనముగా ఆరావణుని స్త్రీవనము ప్రకాశించెను.

శ్లో॥ ఉచితేష్వపి సువ్యక్తం న తాసాం యోషితాం తదా।
వివేక శ్శక్య ఆధాతుం భూషణాఙ్గామ్బర స్రజామ్॥ ౬౬

టీ॥ తదా = అప్పుడు, తాసాం = ఆ, యోషితాం = స్త్రీలయొక్క, భూషణాఙ్గామ్బరస్రజాం — భూషణాఙ్గ = అవయవముల అలంకారములు, అమ్బర = వస్త్రములు, స్రజాం = మాలికను, సువ్యక్తం = స్ఫుటముగా, ఆధాతుం = చేయుటకు; ఉచితేష్వపి = తగినవారలయందు, వివేకః = జ్ఞానము, నశక్యః = శక్యముగాదు.

తా॥ ఆ రావణుని స్త్రీలయొక్క అవయవాలంకారములు, వస్త్రములు హారములు. ఏవి యెవరివో చెప్పుట కెంతవారికైన శక్యముగాదు.

శ్లో॥ రావణే సుఖసంవిష్టే తాః స్త్రియో వివిధప్రభాః।
జ్వలన్తః కాఞ్చనా దీపాః ప్రైక్షన్తానిమిషా ఇవ॥ ౬౭

టీ॥ రావణే = రావణుడు, సుఖసంవిష్టేసతి = సుఖముగా నిద్రించుచుండగా, వివిధప్రభాః = అనేకకాంతులుగల, తాః = ఆ, స్త్రియః = స్త్రీలును, కాఞ్చనాః = బంగారుమయములైన, దీపాః = దీపములు జ్వలన్తః = ప్రకాశించుచున్నవగుచు, అనిమిషా ఇవ = రెప్పపాటులేనివానివలె, ప్రైక్షన్త = చూచుచుండెను.

తా॥ రావణుడు సుఖముగా నిద్రించుచుండ మహాసుందరులైన ఆకామినులను అచ్చట నున్న బంగారుదీపములు రెప్పపాటులేకుండ చూచుచున్నట్లుండెను.

శ్లో॥ రాజర్షి పితృ దైత్యానాం గన్ధర్వాణాం చ యోషితః।
రాక్షసానాం చ యాః కన్యా స్తస్య కామవశం గతాః॥ ౬౮

టీ॥ రాజర్షి పితృ దైత్యానాం-రాజర్షి = రాజర్షులయొక్కయు, పితృ = పితృదేవతలయొక్కయు, దైత్యానాం = దైత్యులయొక్కయు,

గన్ధర్వాణాంచ = గంధర్వులయొక్కయు, రాక్షసానాం చ = రాక్షసుల యొక్కయు. యాః = ఏ, కన్యాః = కన్యలో, తాః = ఆకన్యలు, తస్య = ఆరావణునియొక్క, కామవశం = కామమునకు స్వాధీనత్వ మును, గతాః = పొందినవారైరి,

తా॥ రాజర్షులు, పితృదేవతలు, దైత్యులు గంధర్వులు, రాక్షసులు మొదలగు వారియొక్క కన్యలు రావణుని మోహించి రావణుని కామమునకు వశలైరి.

శ్లో॥ యుద్ధకామేన తా స్సర్వా రావణేన హృతా స్త్రియః।
సమదా మదనేనైవ మోహితాః కాశ్చి దంగనాః॥ ౬౫

టీ॥ యుద్ధకామేన = యుద్ధమునకోర్కెగల, రావణేన = రావణునిచేత, హృతాః = హరింపబడిన, తాః = ఆ, సర్వాః = సమస్తమైన, స్త్రియః = స్త్రీలు, సమదాః = మదముతో కూడినవారై, కాశ్చిత్ = కొందరు, అంగనాః = స్త్రీలు, మదనేన = మన్మధునిచేత. మోహితా ఇవస్థితాః = మోహింపబడినవారువలె ఉండిరి.

తా॥ యుద్ధోన్మాదియైన రావణునిచే జయించి తీసికొనిరాబడిన రాచకన్యలు మన్మధునికూడ మోహింపజేయు సౌందర్యవతులు స్వయముగా రావణుని మోహించి సుఖించుచుండిరి.

శ్లో॥ న తత్ర కాచి త్ప్రమదా ప్రసహ్య
వీరోపపన్నేన గుణేన లబ్ధా।
న చాన్య కామాపి నచాన్య పూర్వా
వినా వరార్హాం జనకాత్మజాం తామ్॥ ౬౦

టీ॥ తత్ర = అక్కడ. కాచిత్ = ఏ. ప్రమదా = స్త్రీ. వీరోపపన్నేన– వీర = పరాక్రమముతో. ఉపపన్నేన = కూడినటువంటి. గుణేన = గుణముతో, ప్రసహ్య = బలాత్కారముగ, న లబ్ధా = పొందబడలేదు,

వరార్హాం = శ్రేష్ఠురాలైన, తాం = ఆ, జనకాత్మజాం వినా = సీతను మినహా, అన్యకామా = ఇతరునియందు కోరికగలది, కాచిదపి = ఏ ఒక్కర్తెయు. న = లేదు, అన్యపూర్వా = పూర్వమునం దితరునిజేరి యున్నది, కాచిత్ = ఎవతెయు. న = లేదు.

తా॥ ఆస్త్రీలు రావణుని అందమును జూచియే ప్రేమించిరి. కాని పరాక్రమముచేతగాని బలాత్కారముగగాని తేబడినది ఎవతెయు లేదు. పెండ్లి అయినదిగాని, ఇతరునియందు మనస్సుగలది గాని అక్కడ ఏస్త్రీయు లేదు. పెండ్లిఅయిభర్తయందు అనురాగముకలది బలాత్కారముగ తీసికొని రాబడినది ఒక్క సీతమాత్రమే గలదు.

శ్లో॥ న చాకులీనా నచ హీనరూపా।
నా దక్షిణా నా నుపచారయుక్తా।
భార్యా భవత్తస్య న హీనసత్త్వా
న చాపి కాన్తస్య న కామనీయా॥ ౭౧

టీ॥ అకులీనా = సద్వంశమునపుట్టనిది, న = లేదు, హీనరూపా = అందములేనిది. న = లేదు అదక్షిణా = సమర్థురాలుకానిది. న = లేదు, అనుపచారయుక్తా = సేవచేయుటకు తగనిది, న = లేదు, తస్య = అరావణునికి, భార్యా = భార్యగా, హీనసత్త్వా = బలహీనురాలు, నభవత్ = కాదు, కాన్తస్య = భర్తకు, నకామనీయా - అపిచ = కోరతగనిదికూడ, న = లేదు.

తా॥ హీనకులమునబుట్టినది గాని, వికృతరూపము గలది గాని, అసమర్థురాలు గాని, ఉపచారములు చేయజాలనిది గాని, అరావణునికి భార్యగా తగనిదిగాని, వానికి వాంఛింప తగనిదిగాని, అచ్చట నున్న వారిలో నెవ్వతెయు లేదు.

శ్లో॥ బభూవ బుద్ధిస్తు హరీశ్వరస్య, యదీదృశీ రాఘవ ధర్మపత్నీ।
ఇమా యథా రాక్షసరాజభార్యాః స్సుజాత మస్యేతి హి
సాధుబుద్ధేః॥ ౨౨

టీ॥ ఇమాః = ఈ, రాక్షసరాజభార్యాః = రావణునిభార్యలు, యథా = ఏ ప్రకారముగా భర్తృసాన్నిధ్యమందుండి సమస్తభోగములననుభవించుచుండిరో, తథా = ఆప్రకారము, రాఘవధర్మపత్నీ = శ్రీరాముని భార్యయగు సీత, ఈదృశీయది = ఇట్లే తనభర్తయగురాఘవునితో సుఖించుచున్నదైన, అస్య = ఈరావణునికి. సుజాతం హి = ఎంతోమంచిదయ్యేదిగదా।, ఇతి = ఇట్లు, సాధుబుద్ధేః = మంచిధీశాలియైన, హరీశ్వరస్య = వానరశ్రేష్ఠుడగు హనుమంతునికి, బుద్ధిః = బుద్ధి, బభూవ = కలిగెను.

తా॥ రావణునిభార్యలు తమభర్తప్రేమను పొంది యిచ్చట ఎట్లు సకలవిధముల సుఖించుచుండిరో, అట్లే రావణుడు సీతను తీసికొనిరాకపోయిన సీతకూడ తనభర్తయగు శ్రీరామచంద్రుని సాన్నిధ్యమున స్వస్థచిత్తయై సుఖముల ననుభవించును గదా। అప్పుడీరావణునకే వినాశము జరుగక సుఖ మనుభవించుటకు వీలుండెడిది. అని హనుమంతుడు ఆలోచించెను.

శ్లో॥ పునశ్చ సోఽచిన్తయ దార్తరూపో
ధ్రువం విశిష్టా గుణతోహి సీతా।
అథాయమస్యాం కృతవా న్మహాత్మా
లఙ్కేశ్వరః కష్ట మనార్యకర్మ॥ ౨౩

టీ॥ అథ = అటుతరువాత, ఆర్తరూపః = విచారగ్రస్తుడైన, సః = ఆ హనుమంతుడు, పునశ్చ = తిరిగి, అచిన్తయత్ = ఆలోచించెను, సీతా = సీత, గుణతః = గుణములరీత్యా. విశిష్టా హి = ఉత్కృష్ట

స్వభావురాలే, ధ్రువం = నిశ్చయము, అయం = ఈ, లఙ్కేశ్వరః = రావణుడు, మహాత్మాఽపి = గొప్పవాడై నప్పటికి, అస్యాం = ఈసీతాపహరణమునందు, అనార్యకర్మా = దుష్కార్యమును చేసినవాడై, కష్టం = వినాశమనెడి కష్టమును, కృతవాన్ = చేసినవా డయ్యెను.

తా॥ ఆ తరువాత ఆంజనేయుడు సీతకనబడకపోవుటచే దుఃఖితుడై తిరిగి యిట్లాలోచించెను. సీతాదేవి తనపాతివ్రత్యాది సుగుణములచేత విశిష్టయైనదే, అందుకు సందేహ మేలేదు. ఇక యీరావణుడు సీత నపహరించి తీసికొనివచ్చి యీ లంకలో నుంచుటవలన, తానెంతగొప్పవాడై నప్పటికి. తన నాశనమును తానే కల్పించుకొనినాడు.

ఇతి నవమస్సర్గః

---

## శ్రీమద్వాల్మీకిరామాయణే సున్దరకాణ్డే దశమ స్సర్గః

* హనుమంతుడు నిద్రించుచున్న రావణుని జూచుట *

శ్లో॥ తత్ర దివ్యోపమం ముఖ్యం స్ఫాటికం రత్నభూషితమ్।
అవేక్షమాణో హనుమాన్ దదర్శ శయనాసనమ్॥ ౧
దాన్తకాఞ్చనచిత్రాఙ్గై ర్వైడూర్యైశ్చ వరాసనైః।
మహార్హాస్తరణోపేతై రుపపన్నం మహాధనైః॥ ౨

టీ॥ తత్ర = అక్కడ, హనుమాన్ = ఆంజనేయుడు, దివ్యోపమం- దివ్య = స్వర్గముతో, ఉపమం = సమానమైనట్టియు, ముఖ్యం = ప్రధానమైనట్టియు, స్ఫాటికం = స్ఫటికమణిమయమైనట్టియు, రత్నభూషితం-రత్న = రత్నములతో, భూషితం = అలంకరించబడినట్టియు, దాన్తకాఞ్చనచిత్రాఙ్గైః-దాంత = దంతములయొక్కయు, కాఞ్చన

బంగారుమయములైన, చిత్రాంగైః = బొమ్మలచిత్రములు కలిగియు న్నట్టియు, వైడూర్యైః = వైడూర్య ఖచితములైన, వరాసనైః = శ్రేష్ఠములైనసింహాసనములచేతను,మహార్హాస్తరణోపేతైః-మహార్హ = అతివిలువగల. ఆస్తరణ = రత్నకంబళ్ళతో, ఉపేతైః = కూడియున్న టువంటి, మహాధనైః = గొప్పధనములచేత, ఉపపన్నం = కూడియు న్నట్లు, అవేక్షమాణః = చూచుచున్నవాడగుచు, శయనాసనం = పడక మంచమును. దదర్శ = చూచెను.

తా॥ అంజనేయుడు ఆశాల నంతయు కలయదిరిగి చూచుచున్నవాడై అక్కడ స్ఫటిక మాణిక్యములు, రత్నములచే నలంకరింపబడి, దంత ములు, బంగారములు మొదలైన చిత్రములు గలిగి వైడూర్యస్థాపిత ములైన సింహాసనములతో విలువైన రత్నకంబళ్ళతో కూడియున్న రావణుని పడకమంచమును జూచెను.

శ్లో॥ తస్య చైకతమే దేశే సోఽగ్ర్యమాలా విభూషితమ్।
దదర్శ పాణ్డురం ఛత్రం తారాధిపతిసన్నిభమ్॥ 3

టీ॥ సః = ఆ హనుమంతుడు, తస్య = ఆశయనాసనమునకు, ఏకతమే = ఒకటైన. దేశే = ప్రదేశమందు. అగ్ర్యమాలావిభూషితం-అగ్ర్య = శ్రేష్ఠములైన, మాలా = మాలికలచే, విభూషితం = అలంకరించబడి నట్టియు, తారాధిపతిసన్నిభం-తారాధిపతి = చంద్రునితో, సన్నిభం = సమానమైనట్టియు, పాణ్డురం = తెల్లనైన, ఛత్రం = గొడుగును, దదర్శ = చూచెను.

తా॥ ఆ పడకమంచమునకు పైభాగమున శ్రేష్ఠములైన హారాదులచే అలంకరించబడి నక్షత్రములలో చంద్రునివలె ప్రకాశించుచున్న తెల్లని గొడుగును అంజనేయు డచ్చట చూచెను.

శ్లో॥ జాతరూప పరిక్షిప్తం చిత్రభాను సమప్రభమ్।
అశోకమాలా వితతం దదర్శ పరమాసనమ్॥ 4

శ్లో॥ వాలవ్యజనహస్తాభి ర్వీజ్యమానం సమన్తతః।
గన్ధైశ్చ వివిధై ర్జుష్టం వరధూపేన ధూపితమ్॥ ౨౫
పరమాస్తరణాస్తీర్ణ మావికాజిన సంవృతమ్,
దామభి ర్వర మాల్యానాం, సమన్తా దుపశోభితమ్ ౨౬

టీ॥ జాతరూపపరిక్షిప్తం-జాతరూప = బంగారముచే, పరిక్షిప్తం = చేయబడినదియు, చిత్రభాను సమప్రభం-చిత్రభాను = సూర్యునితో, సమప్రభం = సమానమైన కాంతికలదియు, అశోకమాలావితతం-అశోకమాలా = అశోకపుష్పములమాలికలతో, వితతం = వ్యాప్తమైయున్నదియు, వాలవ్యజనహస్తాభిః-వాలవ్యజన = వింజామరలు, హస్తాభిః = హస్తములయందు ధరించిన స్త్రీలచేత, సమన్తతః = అంతటను, వీజ్యమానం = విసరబడుచున్నదియు, వివిధైః = అనేకవిధములైన, గంధైః = పరిమళములచేత, జుష్టం = వ్యాప్తమై యున్నదియు, వరధూపేన-వర = శ్రేష్ఠమైన, ధూపేన = అగరుపొగచేత, ధూపితం = ధూపమువేయబడుచున్నదియు, పరమాస్తరణాస్తీర్ణం - పరమ = ఉత్కృష్టమైన, ఆస్తరణ = కంబళ్ల (దిండులతో) ఆస్తీర్ణం = పరవబడియున్నదియు, ఆవికాజినసంవృతం-ఆవికాజిన = గొఱ్ఱెలచర్మములతో, సంవృతం = కూడియున్నదియు, వరమాల్యానాం-వర = శ్రేష్ఠములైన, మాల్యానాం = పుష్పమాలికలయొక్క, దామభిః = హారములతో, సమన్తాత్ = అంతట, ఉపశోభితం = ప్రకాశింపజేయబడుచున్నదియు నైన, పరమాసనం = ఉత్కృష్టమైన శయనాసనమును, దదర్శ = చూచెను.

తా॥ బంగారముతో చేయబడినది, సూర్యునితో సమానమైన కాంతిగలది, అశోక పుష్పమాలలచే వ్యాప్తమై యున్నది, నానావిధ పరిమళములతో కూడియున్నది, అగరువత్తుల పొగతో ధూపము వేయబడియున్నది, వింజామరలు చేత బట్టుకొని విసరుచున్నట్లున్న బొమ్మలు గలిగి

యున్నది, గొఱ్ఱెలచర్మములు, రత్నకంబళ్లు, దిండ్లు పరచబడియున్నది. పరిమళించుపుష్పమాలికలచే అలంకరించబడి యున్నదియు నైన ఆ రావణుని పడకమంచమును ఆంజనేయుడు చూచెను.

శ్లో॥ తస్మిన్ జీమూతసఙ్కాశం ప్రదీప్తోత్తమ కుణ్డలమ్।
లోహితాక్షం మహాబాహుం మహా రజతవాససమ్॥ ౭
లోహితే నానులిప్తాఙ్గం చన్దనేన సుగన్ధినా।
సన్ధ్యారక్తమి వాకాశే తోయదం స తటిద్గణమ్॥ ౮
వృత మాభరణై ర్దివ్యై స్సురూపం కామరూపిణమ్।
సవృక్ష వనగుల్మాఢ్యం ప్రసుప్త మివ మన్దరమ్॥ ౯
క్రీడిత్వో పరతం రాత్రౌ వరాభరణభూషితమ్।
ప్రియం రాక్షసకన్యానాం రాక్షసానాం సుఖావహమ్॥ ౧౦
పీత్వా ప్యుపరతం చాపి దదర్శ స మహాకపిః।

టీ॥ సః = ఆ, మహాకపిః = వానరశ్రేష్ఠుడైన హనుమంతుడు. తస్మిన్ = అశయ్యయందు. జీమూతసంకాశం–జీమూత = మేఘునితో సంకాశం = సమానమైనట్టియు, ప్రదీప్తోత్తమకుండలం–ప్రదీప్త = అధికప్రకాశము గలిగిన, ఉత్తమకుండలం = మంచికుండలములు గలిగినట్టియు, లోహితాక్షం = ఎఱ్ఱనినేత్రములు గలిగినట్టియు. మహాబాహుం = ఆజానుబాహువైనట్టియు. మహారజతవాససం = గొప్పదైన వెండిజరీవస్త్రములు కలిగినట్టియు. లోహితేన = ఎఱ్ఱనైన, సుగంధినా = పరిమళయుక్తమైన. చందనేన = మంచిగంధముచేత. అనులిప్తాంగం = పూయబడిన శరీరము గలిగినట్టియు, సంధ్యారక్తమివ = సంధ్యాకాలమందలి ఎఱుపువలె నున్నట్టియు, ఆకాశే = ఆకాశమునందు, స తటిద్గణం = మెఱుపులసమూహముతోకూడిన, తోయదమివ స్థితం = మేఘుడువలె నున్నట్టియు, దివ్యైః = దేవతాసంబంధములైన, ఆభరణైః = ఆభరణములతో, వృతం = కూడియున్నట్టియు,

సురూపం = మంచిరూపము కలిగినట్టియు, కామరూపిణం = కోరిన రూపమును, ధరించ గలిగినట్టియు. సవృక్ష వన గుల్మాఢ్యం-సవృక్ష = వృక్షసహితములైన, వన = అరణ్యములు. గుల్మ = లతాకుంజము లతో. ఆఢ్యం = కూడియున్న. మందరమివ స్థితం = మందరపర్వత మువలె నున్నట్టియు. ప్రసుప్తం = గాఢనిద్రలోనున్నటువంటియు. రాత్రౌ = రాత్రియందు, క్రీడిత్వా = భోగించి. ఉపరతం = ఉడిగి నట్టియు, వరాభరణభూషితం-వర = శ్రేష్ఠములైన, ఆభరణ = ఆభ రణములతో, భూషితం = అలంకరించబడినట్టియు, రాక్షసకన్యానాం = రాక్షసకన్యలకు, ప్రియం = ఇష్టుడైనట్టియు, రాక్షసానాం = రాక్షసు లకు, సుఖావహం = సుఖమును కలుగజేయునట్టియు, పీత్వాపి చ = పానముచేసియు కూడ, ఉపరతం = ఉడిగినటువంటి రావణుని, దదర్శ = చూచెను.

తా॥ మేఘముతో సమానమైన నల్లనిశరీరముకలవాడు, కుండలములు ధరించి అతిసౌందర్యము గలవాడు. ఎఱ్ఱని నేత్రములు, విశాలములైన బాహువులు గలవాడు, వెండిజరీవస్త్రములు ధరించినవాడు, ఎఱ్ఱచంద నపుపూతచే పరిమళించు శరీరము గలవాడు. సంధ్యాకాలపు ఎరుపువలె చందనపుపూతచే ఎఱ్ఱగనున్నవాడు, దేవతాసంబంధమైన ఆభరణములు ధరించి మెరుపులతో కూడిన మేఘమువలె, ప్రకాశించుచున్న వాడు, కోరినరూపమును ధరించగలవాడు, చెట్లు, వనములు, లతాగుల్మాదు దులతో కూడిన మందరపర్వతమువలె చలించని గాఢనిద్రలో నున్న వాడు, అనేక శ్రేష్ఠాభరణములు ధరించినవాడు, రాత్రిఅంతయు, క్రీడించి అలసియున్నవాడు, రాక్షసస్త్రీల కత్యంత ప్రియమైనవాడు, రాక్షసులకుసుఖము కలుగజేయువాడు, మద్యపానమువలన కూడ అల సట తీరనట్లు నిద్రించుచున్న రావణుని హనుమంతుడు చూచెను.

శ్లో॥ భాస్వరే శయనే వీరం ప్రసుప్తం రాక్షసాధిపమ్॥ ౧౧
నిశ్శ్వసన్తం యథానాగం రావణం వానరర్షభః।
ఆసాద్య పరమోద్విగ్నః సోపాసర్పత్సుభీతవత్॥ ౧౨

టీ॥ భాస్వరే = ప్రకాశించుచున్న, శయనే = శయ్యయందు, ప్రసుప్తం = గాఢముగా నిద్రించుచున్నట్టియు, వీరం = పరాక్రమశాలియైనట్టియు, రాక్షసాధిపం = రాక్షసులకు ప్రభువైనట్టియు, నాగంయథా = సర్పము వలె, నిశ్శ్వసన్తం = బుసలుకొట్టుచున్నట్టియు. రావణం = రావణుని, వానరర్షభః = వానరశ్రేష్ఠుడైన. సః = ఆహనుమంతుడు, ఆసాద్య = పొంది, పరమోద్విగ్నః = మిగుల కలతజెందినవాడై, సుభీతవత్ = భయపడినవానివలె, ఉపాసర్పత్ = దగ్గరనుండి తొలగి పోయెను.

తా॥ ఆహనుమంతుడు శయ్యయందు సర్పమువలె బుసలుకొట్టుచు గాఢ నిద్రలో నున్న రావణుని సమీపించి, యీ పాపి చెంతకు నెందుకు వచ్చితినా యని కలతజెంది, పాపాత్ముని దరిజేరుటవలన పాపమంటునని భయము జెంది దూరముగా పోయెను(పాపాత్ముల సమీపించరా దని దీని వలన తెలియబడుచున్నది.)

శ్లో॥ అథారోహణ మాసాద్య వేదికాన్తర మాశ్రితః।
సుప్తం రాక్షసశార్దూలం ప్రేక్షతేస్మ మహాకపిః॥ ౧౩

టీ॥ అథ = అటుతరువాత, మహాకపిః = హనుమంతుడు, వేదికాన్తరం = మరియొకవేదికను, ఆశ్రితః = పొందినవాడై, ఆరోహణం = మెట్టును ఆసాద్య = పొంది, సుప్తం = నిద్రించుచున్న, రాక్షసశార్దూలం = రాక్షసశ్రేష్ఠుడైన రావణుని, ప్రేక్షతేస్మ = చూచుచుండెను.

తా॥ అతరువాత ఆంజనేయుడు రావణునిచెంతనుండి దూరముగా వెళ్లి సోపానమార్గము నందలి మధ్యమెట్టును ఎక్కి అచ్చటనుండి నిద్రించు చున్నరావణుని చూచుచుండెను.

శ్లో॥ శుశుభే రాక్షసేన్ద్రస్య స్వపత శ్శయనోత్తమమ్।
గన్ధహస్తిని సంవిష్టే యథా ప్రస్రవణం మహత్॥ ౧౪

టీ॥ స్వపతః = నిద్రించుచున్న. రాక్షసేన్ద్రస్య = రావణునియొక్క. శయనోత్తమం = ఉత్తమమైనశయ్య, గన్ధహస్తిని = పరిమళముగల, ఏనుగు. సంవిష్టేసతి = ప్రవేశించినదై యుండ, మహాత్ = గొప్పదైన ప్రస్రవణం యథా = ప్రస్రవణగిరివలె, శుశుభే = శోభించెను.

తా॥ ఆరావణుడు నిద్రించుచుండగా అతనిశయ్య, మదించిన యేనుగు ప్రవేశించియున్న ప్రస్రవణగిరివలె పరిమళయుక్తమై ప్రకాశించుచుండెను.

శ్లో॥ కాఞ్చనాఙ్గద నద్ధౌచ దదర్శ స మహాత్మనః।
విక్షిప్తౌ రాక్షసేన్ద్రస్య భుజౌ విన్ద్రధ్వజోపమౌ॥ ౧౫

ఐరావత విషాణాగ్రై రాపీడనకృతవ్రణౌ।
వజ్రోల్లిఖిత పీనాంసౌ విష్ణుచక్ర పరిక్షతౌ॥ ౧౬

పీనౌ సమసుజాతాంసౌ సఙ్గతౌ బలసంయుతౌ।
సులక్షణ నఖాఙ్గుష్ఠౌ స్వఙ్గుళీయకలక్షితౌ॥ ౧౭

సఙ్గతౌ పరిఘాకారౌ వృత్తౌ కరికరోపమౌ,
విక్షిప్తౌ శయనే శుభ్రే పఞ్చశీర్షావివోరగౌ॥ ౧౮

శశక్షతజ కల్పేన సుశతేన సుగన్ధినా।
చన్దనేన పరార్ధ్యేన స్వనులిప్తౌ స్వలఙ్కృతౌ॥ ౧౯

ఉత్తమస్త్రీవిమృదితౌ గన్ధోత్తమ నిషేవితౌ।
యక్ష పన్నగ గన్ధర్వ దేవ దానవ రావిణౌ॥ ౨౦

దదర్శ స కపి స్తత్ర బాహూ శయన సంస్థితౌ।
మన్దరస్యా న్తరే సుప్తౌ మహాహీ రుషితా వివ॥ ౨౧

టీ॥ సః = ఆహనుమంతుడు, మహాత్మనః = మహానుభావుడైన, రాక్షసేన్ద్రస్య = రావణునియొక్క, కాఞ్చనాఙ్గదనద్ధౌ - కాంచన = బంగారు మయమైన. అంగద = భుజకీర్తులచే, నద్ధౌ = కట్టబడియున్నట్టియు, చ = మరియు. విక్షిప్తౌ = శయ్య యందు చాపబడియున్నట్టియు,

ఇంద్రధ్వజోపమౌ - ఇంద్రధ్వజ = ఇంద్రునిజండాతో, ఉపమౌ = సమానములైనట్టియు, భుజౌ = రెండుభుజములను, దదర్శ = చూచెను. ఐరావతవిషాణాగ్రైః-ఐరావత = ఐరావతగజముయొక్క, విషాణాగ్రైః = దంతపుకొనలచేత, ఆపీడనకృతవ్రణౌ-ఆపీడన = కొట్టబడుటచేత, కృతవ్రణౌ = కాయలుకాచియున్నట్టియు, వజ్రోల్లిఖితపీనాంసౌ—వజ్ర = వజ్రాయుధముచేత, ఉల్లిఖిత = కొట్టబడిన, పీనాంసౌ = బలసిన భుజమూపురములు కలిగినట్టియు, విష్ణుచక్రపరిక్షతౌ-విష్ణుచక్ర = విష్ణుచక్రముచేత, పరిక్షతౌ = నరకబడినగాయములు కలిగినట్టియు, పీనౌ = బలసియున్నట్టియు, సమసుజాతాంసౌ-సమ = సమానముగా, సుజాత = యోగ్యముగా పుట్టబడిన, అంసౌ = భుజమూపురములు గలిగినట్టియు, బలసంయుతౌ = బలముతోకూడియున్న, సంగతౌ = కలసియున్న, సులక్షణనఖాఙ్గుష్ఠౌ = శుభలక్షణయుక్తమైన వేళ్లగోళ్లు కలిగియున్నట్టియు, స్వంగుళీయకలక్షితౌ = యోగ్యములగు ఉంగరములచేత చూడబడుచున్నటువంటి, సంగతౌ = కలసియున్నట్టియు, పరిఘాకారౌ = పరిఘాకారముగా నున్నటువంటియు, కరికరోపమౌ = ఏనుగు తొండముతో సమానమై, వృత్తౌ = గుండ్రముగా నున్నట్టియు, శుభ్రే = శుభ్రములై, పంచశీర్షే = అయిదుతలలుగల, ఉరగా ఇవ = సర్పములవలె, శయనే = పక్కమీద, విక్షిప్తౌ = ఉంచబడినట్టియు, శశక్షతజకల్పేన — శశ = కుందేలుయొక్క, క్షతజ = రక్తముతో, కల్పేన = సమానమైన, సుశీతేన = మిక్కిలి చల్లనైన, సుగంధినా = బాగుగాపరిమళించుచున్న, పరార్థ్యేన = శ్రేష్ఠమైన, చందనేన = మంచిగంధముతో, స్వనులిప్తౌ = యోగ్యముగా పూయబడియున్నట్టియు, స్వలంకృతౌ = యోగ్యముగా అలంకరింపబడినట్టియు, ఉత్తమస్త్రీవిమృదితౌ - ఉత్తమస్త్రీ = యోగ్యస్త్రీలచేత, విమృదితౌ = విశేషముగ మర్దనచేయబడినట్టియు, గన్ధోత్తమనిషేవితౌ—గన్ధోత్తమ = ఉత్తమమైనగంధముచేత, నిషేవితౌ = చక్కగాసేవించ

బడినట్టియు, యక్ష కిన్నర గన్ధర్వ దేవ దానవ రావిణౌ - యక్ష = యక్షులు, కిన్నర = కిన్నరులు, గన్ధర్వ = గంధర్వులు, దేవ = దేవతలు, దానవ = దానవులను, రావిణౌ = మర్దించినట్టియు, మందరస్య = మందరపర్వతముయొక్క, అంతరే = మధ్యయందు, సుప్తౌ = నిద్రించుచున్నవై, రుషితౌ = అతిరోషముగల. మహాహీఇవ = రెండుగొప్పసర్పములవలె, శయనసంస్థితౌ = ప్రక్కయందున్న, బాహూ = రెండు బాహువులను, తత్ర = అక్కడ, సః = ఆ, కపిః = హనుమంతుడు, దదర్శ = చూచెను.

తా॥ రావణుడు సర్వవిధముల శోభాయమానముగా నున్న ఆశయ్యయందు గాఢ నిద్రలో భుజములుచాచి, పరుండియుండెను. ఆభుజములకు బంగారు భుజకీర్తులు కట్టబడియుండెను. ఇంద్రుని జండావలె నవరత్నములచే ప్రకాశించుచుండెను. ఐరావత గజముయొక్క దంతపుకొనదెబ్బలచేతను, వజ్రాయుధముచేతను, కొట్టబడిన గుర్తులు, విష్ణుచక్రమను ఆయుధముచేతనైన నరుకులు కలిగి, బాగుగా బలిసి కలిసిన కండలతో నున్నవియు, సుయోగ్యలక్షణములు గల వ్రేళ్ళగోళ్లు, ఉంగరములు, కలిగియుండెను. పరిఘాయుధముల జంటవలెనుండెను. ఏనుగుతొండమువలె బలసి గుండ్రముగా నుండెను. శయ్యమీద అయిదు శిరస్సులు గల సర్పముల జంటవలె నగుపించుచుండెను. ఇంద్రుని చెక్కముతో సమానముగా నుండెను. చల్లని, పరిమళముతో గుబాళించు, శ్రేష్ఠమైన మంచిగంధముతో చక్కగాపూయబడి, అలంకరించబడియుండెను. ఉత్తమస్త్రీల ఆలింగనాదులవలన భుజములు నలిగినట్లుగా నుండెను. యక్ష. కిన్నర. పన్నగ, గంధర్వ దేవ దానవులను జయించెడివిగా నుండెను. మందరపర్వత పైభాగమున బుసలుకొట్టు రెండుమహాసర్పములవలె ఆశయ్యయందు బుసకొట్టుచు నిద్రించుచున్న రావణుని రెండుబాహువులను హనుమంతుడు చూచెను.

శ్లో॥ తాభ్యాం సపరిపూర్ణాభ్యాం భుజాభ్యాం రాక్షసేశ్వరః।
శుశుభే ఽచలసఙ్కాశః శృఙ్గాభ్యా మివ మన్దరః॥ ౨౨

టీ॥ సః = ఆ, రాక్షసేశ్వరః = రాక్షసప్రభువైన రావణుడు, పరిపూర్ణాభ్యాం = సర్వశుభలక్షణ సంపన్నములైన, తాభ్యాం = ఆ, భుజాభ్యాం = భుజములతో. అచలసఙ్కాశః = పర్వతసమానుడై, శృఙ్గాభ్యాం = శిఖరములజంటతో. మన్దరఇవ = మందరపర్వతమువలె, శుశుభే = శోభించెను.

తా॥ ఆరావణుడు సర్వ శుభలక్షణ సమేతమైన భుజములతో రెండుశిఖరములతో శోభాయమానముగా నుండు మందరపర్వతమువలె శోభించుచుండెను. ఇందు రావణుని కౌకతల రెండుచేతు లున్నట్లు చెప్పబడినది.

శ్లో॥ చూత పున్నాగ సురభి ర్వకుళోత్తమ సంయుతః।
మృష్టాన్న రస సంయుక్తః పాన గన్ధ పురస్సరః॥ ౨౩
తస్యరాక్షస సింహస్య నిశ్చక్రామ మహాముఖాత్।
శయానస్య వినిశ్శ్వాసః పూరయ న్నివ తద్గృహమ్॥ ౨౪

టీ॥ శయానస్య = నిద్రించుచున్న, రాక్షససింహస్య = రాక్షసశ్రేష్ఠుడైన, తస్య = ఆరావణునియొక్క, మహాముఖాత్ = గొప్పముఖము నుండి, చూతపున్నాగసురభిః-చూతపున్నాగ = మామిడి పొన్నల యొక్క, సురభిః = పరిమళము గలిగినట్టియు, వకుళోత్తమసంయుతః – వకుళోత్తమ = ఉత్తమపొగడల సువాసనతో, సంయుతః = కూడియున్నట్టియు, మృష్టాన్న రససంయుక్తః–మృష్టాన్నరస = షడ్రసోపేతాన్నరసముతో, సంయుక్తః = కూడియున్నట్టియు, పానగన్ధపురస్సరః = మద్యపానపరిమళము ముందుగానున్న, వినిశ్శ్వాసః = విశేషమైన నిట్టూర్పు, తద్గృహం = ఆరావణ గృహమును, పూరయన్నివ = నిండించుచున్నది వలె, నిశ్చక్రామ = బయలువెడలుచుండెను.

తా॥ మహాశయ్యయందు అలసి గాఢనిద్రలో నున్న రావణుని ముఖము నుండి మామిడి, సురపొన్న, పొగడ పుష్పములచే తయారు కాబడిన సారాయము పానముచేసిన పరిమళము షడ్రసోపేతమైన వివిధసువాసనలతో కూడిన అన్నరస పరిమళమును మించి, నిట్టూర్పువాయువుతో కలసి ఆగృహమును నిండించి వెడలుచుండెను.

శ్లో॥ ముక్తామణివిచిత్రేణ కాఞ్చనేన విరాజితమ్।
మకుటేనాపవృత్తేన కుణ్డలోజ్జ్వలితాననమ్॥ ౨౫
రక్తచందన దిగ్ధేన తథాహారేణ శోభినా।
పీనాయతవిశాలేన వక్షసాభి విరాజితమ్॥ ౨౬
పాణ్డురే ణాపవిద్ధేన క్షౌమేన క్షత జేక్షణమ్।
మహార్హేణ సుసంవీతం పీతే నోత్తమ వాససా॥ ౨౭
మాషరాశి ప్రతీకాశం నిశ్శ్వసన్తం భుజంగవత్।
గాఙ్గే మహతి తోయాన్తే ప్రసుప్త మివ కుఞ్జరమ్॥ ౨౮
చతుర్భిః కాఞ్చనై ర్దీపై ర్దీప్యమానం చతుర్దిశమ్।
ప్రకాశీకృత సర్వాఙ్గం మేఘం విద్యుద్గణై రివ॥ ౨౯
పాదమూల గతా శ్చాపి దదర్శ సుమహాత్మనః।
పత్నీ స్సప్రియభార్యస్య తస్య రక్షఃపతే ర్గృహే॥ ౩౦

టీ॥ ముక్తామణివిచిత్రేణ = విచిత్రములైన ముత్యములు మాణిక్యములు కలిగినట్టియు, కాఞ్చనేన = బంగారముచేత. విరాజితం = ప్రకాశింపజేయబడుచున్నట్టియు, అపవృత్తేన = వేరుగానుంచబడిన, మకుటేన = కిరీటముచేత, కుణ్డలోజ్జ్వలితాననం-కుండల = కుండలముల చేత, ఉజ్జ్వలిత = ప్రకాశింపచేయబడుచున్న, ఆననం = ముఖము గలిగినట్టియు, రక్తచన్దనదిగ్ధేన = ఎఱ్ఱచందన పూతచేతను తథా = ఆప్రకారముగా, శోభినా = ప్రకాశించుచున్న, హారేణ = హారముచేతను, పీనాయత విశాలేన-పీన = బలసిన, ఆయతవిశాలేన =

పొడవు, వెడల్పునైన, వక్షసా = వక్షఃస్థలముచేత, అభివిరాజితం = అధికముగా, ప్రకాశింపబడుచున్నట్టియు, పాణ్డురేణ = తెల్లనైన అప విద్ధేన = కూర్చబడిన, క్షౌమేన = పట్టుఉత్తరీయము చేతను, క్షతజే క్షణం–క్షతజ = నెత్తురువలె, నెఱ్ఱనైన ఈక్షణం = నేత్రములు కలిగి నట్టియు, మహార్హేణ = గొప్పవిలువగల, పీతేన = పచ్చనైన, ఉత్త మవాససా = మేలుకట్టువస్త్రముతో, సుసంవీతం = కూడియున్నట్టియు. మాషరాశిప్రతీకాశం = మినుములరాశితో సమానముగా నున్నట్టియు భుజంగవత్ = సర్పమువలె, నిశ్శ్వసన్తం = బుసకొట్టుచున్నట్టియు, గాంగే = గంగాసంబంధమైన, మహతి = గొప్పదైన, తోయాంతే = ఉదకమధ్యమందు. కుఞ్జర మివ = ఏనుగువలె, ప్రసుప్తం = గాఢ ముగా నిద్రించుచున్నట్టియు. చతుర్భిః = నాలుగైన, కాంచనైః = బంగారుసంబంధమైన, దీపైః = దీపములతో, చతుర్దిశం = నాలుగు దిక్కులను, దీప్యమానం = ప్రకాశింపచేయుచున్నట్టియు, విద్యుద్గ ణైః = మెఱుపుల సమూహములతో, మేఘమివ = మేఘమువలె, ప్రకా శీకృతసర్వాంగం–ప్రకాశీకృత = ప్రకాశింపచేయబడుచున్న, సర్వాం గం = శరీరము కలిగినరావణుని సుమహాత్మనః = మహాత్ముడైన ట్టియు, ప్రియభార్యస్య = ప్రియమైనభార్యలు గలిగినట్టియు, తస్య = ఆ, రక్షఃపతేః = రావణాసురునియొక్క, గృహే = గృహమునందు, అపిచ = మరియు, పాదమూలగతాః = పాదములమీదనున్న, పత్నీః = భార్యలను, సః = ఆహనుమంతుడు. దదర్శ = చూచెను.

తా॥ చిత్రములైన ముత్యములు మాణిక్యములు చేర్చిన బంగారపు కిరీట ముచేత చెవులకుండలములచేత, ఎఱ్ఱచందనపు పూతచేత, ముత్యాలహార ముచేత, ప్రకాశింపబడుచున్న ముఖము గలవాడును, బలసియుండుట వలన ఎత్తుగాను వెడల్పుగా నున్న వక్షఃస్థలముతోను, గొప్పవిలువ అయిన పచ్చని మేలు పట్టువస్త్రముతోను, తెల్లనిపట్టు ఉత్తరీయ ముతోను ఎఱ్ఱని నేత్రములతోను ప్రకాశింపబడుచున్న వాడును,

మినుములరాశివలె నల్లని దేహకాంతి కలవాడును, సర్పము వలె బుసకొట్టుచు నిద్రించుచున్నవాడును, గంగాప్రవాహమునందలి ఏనుగువలె నున్నవాడును, నాలుగు బంగారు దీపములతో నాలుగు దిక్కుల ప్రకాశింపబడుచున్న వాడును, మెఱుపుతో కూడిన మేఘము వలె నున్న రావణుని మరియు నతని పాదములచెంత పరుండి యున్న అతనిభార్యలను ఆంజనేయుడు చూచెను.

శ్లో॥ శశిప్రకాశవదనా శ్చారుకుణ్డల భూషితాః।
అమ్లాన మాల్యాభరణా దదర్శ హరియూథపః॥ 31

టీ॥ శశిప్రకాశవదనాః - శశిప్రకాశ = చంద్రకాంతివంటి, వదనాః = ముఖములుగలిగినట్టియు, చారుకుణ్డలభూషితాః—చారు = సుందరము లైన, కుణ్డల = కుండలములతో, భూషితాః = అలంకరింపబడినట్టియు, అమ్లానమాల్యాభరణాః - అమ్లాన = వాడిపోని, మాల్యాభరణాః = మాలలు ఆభరణములు గలవారిని, హరియూథపః = ఆంజనేయుడు దదర్శ = చూచెను.

తా॥ ఆంజనేయుడు రావణుని శయనగృహమున రావణపాదసమీపమున పడి నిద్రించుచున్న, చంద్రికాంతిసమానము లైన ముఖములు గలిగి వాడని హారములు ఆభరణములు ధరించి, అందమైన కర్ణ కుండలము లను ధరించి యున్న రావణభార్యలను చూచెను.

శ్లో॥ నృత్త వాదిత్ర కుశలా రాక్షసేన్ద్ర భుజాఙ్కగాః।
వరాభరణధారిణ్యో నిషణ్ణా దదృశే హరిః॥ 32

టీ॥ హరిః = కపియైన ఆంజనేయుడు, నృత్త వాదిత్ర కుశలాః-నృత్త = నాట్యమునందు, వాదిత్ర = మృదంగాదివాద్యములందు, కుశలాః = నేర్పరులైనట్టియు, రాక్షసేన్ద్రభుజాఙ్కగాః – రాక్షసేన్ద్ర = రావణుని యొక్క భుజాఙ్కగాః = భుజములయందు తొడలయందున్నట్టియు,

వరాభరణ ధారిణ్యః - వరాభరణ = శ్రేష్ఠమైన అలంకారములను, ధారిణ్యః = ధరించినట్టియు, నిషణ్ణాః = నిద్రించుచున్నవారలను, దదృశే = చూచెను.

తా॥ హనుమంతు డక్కడ నాట్యమునందు మృదంగాది వాద్యములందు మంచి నేర్పరులును, శ్రేష్ఠమైన అలంకారములు గలవారు, రావణుని భుజములయందు తొడలయందు పడి నిద్రించుచున్న వారు నగు స్త్రీలను చూచెను.

శ్లో॥ వజ్ర వైడూర్య గర్భాణి శ్రవణాంతేషు యోషితామ్।
దదర్శ తాపనీయాని కుణ్డలా న్యఙ్గదాని చ॥ ౩౩

టీ॥ యోషితాం = స్త్రీలయొక్క, శ్రవణాంతేషు = చెవికొనలయందు, వజ్ర వైడూర్య గర్భాణి = మధ్యభాగమున వజ్రములు, వైడూర్యములు, తాపనీయాని = పొదగబడిన, (తాపడము చేయబడిన), కుణ్డలాని = కుండలములను, చ = మరియు, అంగదాని = భుజకీర్తులను, దదర్శ = చూచెను.

తా॥ ఆరావణుని భార్యలయొక్క. చెవుల చివరభాగములందు వజ్రములు వైడూర్యములు మధ్యయందు పొదగబడియున్న బంగారపు కుండలములను భుజముల నలంకరింపబడి యున్న భుజకీర్తులను హనుమంతుడు చూచెను.

శ్లో॥ తాసాం చన్ద్రోపమై ర్వక్త్రై శ్శుభై ర్లలిత కుణ్డలైః।
విరరాజ విమానం త న్నభ స్తారాగణై రివ॥ ౩౪

టీ॥ తాసాం = ఆస్త్రీలయొక్క, చన్ద్రోపమైః = చంద్రునితోసమానమైనట్టియు, లలితకుణ్డలైః = సుందరములైన కుండలములు గలిగినట్టియు, శుభైః = శుభప్రదములైన, వక్త్రైః = ముఖములచేత, తత్ =

ఆ విమానం = మంచము, తారాగణైః = నక్షత్రసమూహములతో, నభ ఇవ = ఆకాశమువలె, విరరాజ = ప్రకాశించెను.

తా॥ సుందరములైన కర్ణకుండలములను ధరించి, చంద్రుని బోలు ముఖములుగల ఆరావణస్త్రీలచేత రావణుని శయనతల్ప విశేషము నక్షత్రములచేత నిండియున్న ఆకాశమువలె శోభిల్లెను.

శ్లో॥ మద వ్యాయామ ఖిన్నాస్తా రాక్షసేన్ద్రస్య యోషితః।
తేషు తే ష్వవకాశేషు ప్రసుప్తా స్తనుమధ్యమాః॥ ౩౫

టీ॥ తనుమధ్యమాః = సన్నని నడుములుగల, తాః = ఆ, రాక్షసేన్ద్రస్య = రాక్షసప్రభువైన రావణునియొక్క, యోషితః = స్త్రీలు, మదవ్యాయామఖిన్నాః–మద = మదముచేనైన, వ్యాయామ = ధేనుకాదిబంధన వ్యాయామముచేత, ఖిన్నాః = అలసినవారలై, తేషుతేషు = ఆయాయి, అవకాశేషు = అవకాశస్థానములందు, ప్రసుప్తాః = గాఢనిద్రచెందిరి.

తా॥ ఆ రావణ పరిసరములందున్న మత్తకాశినులు సరస, సల్లాప, సంభోగాది వ్యాయామముతో పూర్తిగా అలసిపోయి యెవరి కెక్కడ అవకాశము దొరికిన అచ్చటనే పడి గాఢనిద్రను చెందిరి.

శ్లో॥ అఙ్గహారై స్తథైవాన్యా కోమలై ర్నృత్తశాలినీ।
విన్యస్త శుభసర్వాఙ్గీ ప్రసుప్తా వరవర్ణినీ॥ ౩౬

టీ॥ కోమలైః = సుందరములైన, అఙ్గహారైః = అఙ్గవిక్షేపములచేత, తథైవ చ = ఆదేప్రకారముగ అన్యా = మరియొకతె, నృత్తశాలినీ = నటించునట్లున్నదై, వరవర్ణినీ = శ్రేష్ఠమైన అందముగలది, విన్యస్త శుభసర్వాఙ్గీ - విన్యస్త = విన్యాసముచేయుచున్న, శుభసర్వాఙ్గీ = శోభించు సర్వావయవములుగలదై, ప్రసుప్తా = గాఢముగా నిద్రించెను.

తా॥ మంచి అందమైన మరియొకస్త్రీ శోభించుచున్న తన మృదు అవయవములతో అభినయ నృత్య విన్యాసములు చేయుచున్నట్లు కలదై గాఢ నిద్ర జెంది అవశయై శరీరమును పాన్పునం దుంచినను వాసనాబలముచే సర్వస్థితుల సాగుచున్నట్లుగనే కనబడుచుండెను.

శ్లో॥ కాచి ద్వీణాం పరిష్వజ్య ప్రసుప్తా సంప్రకాశతే।
మహానదీ ప్రకీర్ణేవ నళినీ పోత మాశ్రితా॥ ౩౭

టీ॥ కాచిత్ = ఒకానొకస్త్రీ, వీణాం = వీణను, పరిష్వజ్య = కౌగిలించుకొని, మహానదీప్రకీర్ణా-మహానదీ = గొప్పనదియందు, ప్రకీర్ణా = కొట్టుకొనిపోవుచున్న, నళినీ = తామరతీగ, పోతం = నావను, ఆశ్రితా ఇవ = ఆశ్రయించినదివలె, ప్రసుప్తా = గాఢనిద్రపోవుచున్నదై, సంప్రకాశతే = ప్రకాశించుచుండెను.

తా॥ ఒకస్త్రీ వీణ వాయించుచునే నిద్రాపరవశురాలై వాయించుచున్న వీణను కౌగిలించుకొన్నట్లు పట్టుకొని నిద్రించుచు నదిలో కొట్టుకొనిపోవు తామర తీగ దైవికముగా తనకందిన ఓడను పట్టినట్లు ప్రకాశించుచుండెను.

శ్లో॥ అన్యా కక్షగతేనైవ మడ్డుకే నాసితేక్షణా।
ప్రసుప్తా భామినీభాతి బాలపుత్రేవ వత్సలా॥ ౩౮

టీ॥ అసితేక్షణా = నల్లనిచూపులుగల, అన్యా = మరియొకస్త్రీ, కక్షగతేన = చంకయందుంచుకొన్న, మడ్డుకేన = డవండై యను వాయిద్యముచేత, ప్రసుప్తా = గాఢనిద్రచెందినదై, బాలపుత్రా = చిన్నమగబిడ్డ గలదియు, వత్సలా = వాత్సల్యముగల, భామినీవ = స్త్రీవలె, భాతి = ప్రకాశించుచున్నది.

తా॥ నల్లని కన్నులుగల ఒకానొకస్త్రీ డవండై అనే వాద్యవిశేషమును చంకనుంచుకొని తెలియని నిద్రలో గట్టిగా పట్టుకొనియుండి, వాత్సల్యముతో తన బిడ్డను చంకనుబెట్టుకొనియున్న మాతవలె ప్రకాశించుచుండెను.

శ్లో॥ పటహం చారు సర్వాఙ్గీ పీడ్య శేతే శుభ స్తనీ।
చిరస్య రమణం లబ్ధ్వా పరిష్వజ్యేవ భామినీ॥ ౩౯

టీ॥ చారుసర్వాంగి — చారు = సుందరములైన, సర్వాంగి = సమస్తఅంగములు గల. శుభస్తనీ = శుభప్రదములైన స్తనములు గల మరియొక స్త్రీ, పటహం = తప్పెటయను వాద్యమును, పీడ్య = గట్టిగాపట్టుకొని, చిరస్య = చిరకాలమునకు, రమణం = భర్తను, లబ్ధ్వా = పొంది, పరిష్వజ్య = కౌగిలించుకొన్న, భామినీవ = స్త్రీవలె, శేతే = నిద్రించెను.

తా॥ మంచి స్తనములుగల మరియొకస్త్రీ తనరెండుచేతులతోను తప్పెటయను ఒకానొక వాద్యవిశేషమును గట్టిగాపట్టుకొని నిద్రించుచుండెను. అప్పుడామె చాలాకాలమునకు తనభర్తను పొంది గట్టిగా కౌగిలించుకొన్న భార్యవలె నుండెను.

శ్లో॥ కాచి ద్వంశం పరిష్వజ్య సుప్తా కమలలోచనా।
రహః ప్రియతమం గృహ్య సకామేవ చ కామినీ॥ ౪౦

టీ॥ కాచిత్ = ఒకానొక. కమలలోచనా = పద్మములవంటి నేత్రములుగల, కామినీ = స్త్రీ. వంశం = పిల్లనగ్రోవిని. పరిష్వజ్య = కౌగిలించుకొని రహః = రహస్యముగా, ప్రియతమం = ప్రియపురుషుని. గృహ్య = గ్రహించి (పొంది) సకామేవ చ = కోర్కెతో కూడికొన్నదివలె, సుప్తా = నిద్రించెను.

తా॥ పద్మములవంటి నేత్రములు గల ఒకానొకస్త్రీ పిల్లనగ్రోవిని తనచేతులతో వక్షఃస్థలమున కానించుకొని నిద్రించుచు, రహస్యస్థలమున తన ప్రియపురుషుని పొంది కౌగిలించికొని యున్నట్లు కనబడుచుండెను.

శ్లో॥ విపఞ్చీం పరిగృహ్యాన్యా నియతా నృత్తశాలినీ।
నిద్రావశ మనుప్రాప్తా సహకాన్తేవ భామినీ॥ ౪౧

టీ॥ అన్యా = మరియొక, నియతా = నాట్యమునందు నియమింపబడిన, నృత్తశాలినీ = నాట్యగత్తె, విపఞ్చీం = వీణను, పరిగృహ్య = పొంది; సహకాన్తేవ = భర్తతోకలసియున్నట్లు, నిద్రావశం = నిద్రాధీనమును; అనుప్రాప్తా = పొందినదయ్యెను.

తా॥ మరియొక విశేషనృత్యమునందు నియమింపబడిన నాట్యగత్తె నాట్యము చేయుచునే తన చేతియందలి వీణ (వీణావిశేషము) ను తొడయందుంచుకొని నిద్రాపరవశురాలై నిద్రించుచుండ భర్తతోకలిసి సుఖించి అలసి నిద్రించుభార్యవలె కనబడెను.

శ్లో॥ అన్యా కనకసఙ్కాశై ర్మృదుపీనై ర్మనోరమైః।
మృదఙ్గం పరిపీడ్యాఙ్గైః ప్రసుప్తా మత్తలోచనా॥ 42

టీ॥ మత్తలోచనా = మదభరితములగుచూపులుగల, అన్యా = మరియొక స్త్రీ, కనకసఙ్కాశైః = బంగారముతో సమానములైన, మృదుపీనైః = మెత్తని బలసియున్న, మనోరమైః = సుందరములైన, అఙ్గైః = అవయవములచేత, మృదంగం = మద్దెలను, పరిపీడ్య = బిగిగా కౌగిలించుకొని, ప్రసుప్తా = గాఢనిద్రనుచెందెను.

తా॥ మదభరితములైన నేత్రములుగల మరియొకస్త్రీ బంగారమువన్నెతో సుందరముగాను, మృదువుగాను, బలసియున్న తనశరీరావయవముతో మద్దెలను కౌగిలించి నిద్రించుచుండ, శరీరమునకంటియున్న మద్దెలకు ఏ అవయవ మేమాత్రము తగిలిన మద్దెల వాయించుచున్నట్లుగనే ఉండెను.

శ్లో॥ భుజపార్శ్వాన్తరస్థేన కక్షగేన కృశోదరీ
పణవేన సహానిన్ద్యా సుప్తామదకృతశ్రమా॥ 43

టీ॥ కృశోదరీ = సన్నని నడుముగల, అనిన్ద్యా = పవిత్రతగల మరియొక స్త్రీ, మదకృతశ్రమా-మద = కామమదముచే కృతా = చేయబడిన,

శ్రమా = రత్యోపరత్యాదిశ్రమగలదగుచు. భుజపార్శ్వాన్తరస్థేన — భుజ = భుజములయొక్క, పార్శ్వాన్తరస్థేన = పార్శ్వములమధ్య నున్నట్టియు, కక్షగేన = చంకలోనున్న, పణవేనసహ = మద్దెలతో కూడ, సుప్తా = నిద్రించెను.

తా॥ సన్నని నడుముగల మరియొకస్త్రీ భుజపార్శ్వముల మధ్యయందు చంకయందు బిగించి పట్టుకొన్న మద్దెలతో నిద్రించుచు, కామోద్రేకముచే రత్యోపరత్యాది శ్రమచే గాఢనిద్రచెందినదివలె నుండెను.

శ్లో॥ డిణ్డిమం పరిగృహ్యాన్యా తథైవాసక్తడిణ్డిమా।
ప్రసుప్తా తరుణం వత్స ముపగూహ్యేవ భామినీ॥ ४२

టీ॥ అన్యా = మరియొక, భామినీ, = స్త్రీ. డిణ్డిమం = డిండిమమను వాయిద్యమును, పరిగృహ్య = స్వీకరించి. తథైవ = అప్రకారముగనే, ఆసక్తడిండిమా = తగిలించుకొన్న డిండిమముగలదై, తరుణం = యుక్తవయస్కుడగు భర్తను, ఉపగూహ్య = దగ్గరయుంచుకొని, వత్సం = బిడ్డను, ఉపగుహ్య = దగ్గరకుచేర్చుకొని, ప్రసుప్తేవస్థితా = గాఢనిద్రచెందినదివలె నుండెను.

తా॥ మరియొకస్త్రీ డిండిమ(ఢక్కా) మను వాయిద్యమును పట్టుకొని, మరియొక డిండిమమును తగిలించుకొని, తరుణుడైన భర్తను వెనుకను, బిడ్డను ముందు బెట్టుకొని నిద్రించుచున్నట్లు గాఢనిద్రలో నుండెను.

శ్లో॥ కాచిదాడమ్బరం నారీ భుజసంయోగపీడితమ్।
కృత్వా కమలపత్రాక్షీ ప్రసుప్తా మదమోహితా॥ ४३

టీ॥ మదమోహితా-మద = కామమదముచే. మోహితా = మోహితురాలైన, కాచిత్ = ఒకానొక, కమలపత్రాక్షీ - కమల = పద్మములయొక్క, పత్ర = రేకులవంటి, అక్షీ = నేత్రములుగల. నారీ = స్త్రీ. ఆడంబ

రం = ఆడంబరమనుపేరుగల ఒకవాద్యవిశేషమును, భుజసంయోగ పీడితం-భుజ = భుజములయొక్క. సంయోగ = సంపర్కముతో, పీడితం = పీడించుట, (నొక్కియుంచుట) ను, కృత్వా = చేసి, ప్రసుప్తా = గాఢముగా నిద్రించెను.

తా॥ పద్మపురేకులవంటి నేత్రములుగల ఒకానొకస్త్రీ కామమదోన్మత్తురాలై తనభుజములకు, తగిలించియున్న ఆడంబర మను వాద్యమును విడువక గట్టిగా కౌగిలించుకొని గాఢ నిద్రావశురా లయ్యెను.

"ఆడంబర స్సమారంభే గజగర్జిత తూర్యయోః॥" (విశ్వము)

శ్లో॥ కలశీ మపవిధ్యాన్యా ప్రసుప్తా భాతి భామినీ।
వసన్తే పుష్పశబలా మాలేవ పరిమార్జితా॥ ౪౬

టీ॥ అన్యా = మరియొక, భామినీ = స్త్రీ. కలశీం = నీటికలశమును, అపవిధ్య = దొర్లించి, ప్రసుప్తా = గాఢముగా నిద్రించుచున్నదై, వసంతే = వసంతఋతువునందు, పుష్పశబలా = పుష్పములతో గ్రుచ్చబడినదై, పరిమార్జితా = నీటితోతడపబడిన, మాలేవ = పూలమాలవలె, భాతి = ప్రకాశించుచుండెను.

తా॥ రావణునకు కలశము నందించు మరియొక యువిద నిదరమత్తచే కలశమును దొర్లింపజేసి పిదప ఆ తడిసిన నేలమీదనే గాఢనిద్రను పొందినదై, వసంతఋతువులో నానావర్ణపుష్పములతో కట్టబడి పిదప నీటిబిందువులచే తడపబడిన పూలమాలవలె ప్రకాశించుచుండెను.

శ్లో॥ పాణిభ్యాం చ కుచౌ కాచిత్సువర్ణ కలశోపమౌ।
ఉపగుహ్యా బలాసుప్తా నిద్రాబలపరాజితా॥ ౪౭

టీ॥ కాచిత్ = ఒకానొక, అబలా = స్త్రీ, నిద్రాబల = బలమైననిద్రచే, పరాజితా = జయింపబడినదై. సువర్ణకలశోపమౌ = బంగారుకలశము

లవంటి, కుచౌ = స్తనములను, పాణిభ్యాం = హస్తములతో, ఉప గుహ్య = దాచుకొని, సుప్తా = నిద్రించెను.

తా॥ మరియొకస్త్రీ అధికమగు నిద్రకువశురాలై బంగారుకలశములవంటి తన స్తనద్వయమును చేతులతో కప్పుకొని మైమరచి నిద్రించుచుండెను.

శ్లో॥ అన్యాకమలపత్రాక్షీ పూర్ణేన్దుసదృశాననా।
అన్యా మాలిఙ్గ్య సుశ్రోణీం ప్రసుప్తా మదవిహ్వలా॥ ౪౮

టీ॥ కమలపత్రాక్షీ = తామరరేకులవంటి నేత్రములుగలిగిన, పూర్ణేన్దుసదృశాననా - పూర్ణేందు = నిండుచంద్రునితో, సదృశ = సమానమైన, ఆననా = ముఖముగలస్త్రీ, మదవిహ్వలా = కామాతురురాలై, సుశ్రోణీం = మంచిపిరుదులుగల, అన్యాం = మరికయొస్త్రీని, ఆలిఙ్గ్య = కౌగిలించుకొని, ప్రసుప్తా = గాఢనిద్రచెందెను.

తా॥ పద్మపత్రములవంటి నేత్రములుగలిగి పూర్ణచంద్రుని వంటి ముఖము గల మరియొకస్త్రీ యోగ్యమైన పిరుదులు గల మరియొకస్త్రీని కౌగిలించుకొని గాఢనిద్రావశంవదురాలై కామాతురయై పురుషుని గాఢాలింగనముచేసి కొన్నట్లు భావించుచానివలె నుండెను.

శ్లో॥ ఆతోద్యాని విచిత్రాణి పరిష్వజ్యాపరాః స్త్రియః।
నిపీడ్య చ కుచైః సుప్తాః కామిన్యః కాముకా నివ॥ ౪౯

టీ॥ అపరాః = మరికొంతమంది, స్త్రియః = స్త్రీలు, విచిత్రాణి = విచిత్రములైన, ఆతోద్యాని = చతుర్విధవాయిద్యములను. కుచైః = స్తనములతో, కామిన్యః = కామినీస్త్రీలు. కాముకా నివ = కాముకులైన పురుషులను వలె, నిపీడ్య చ = గట్టిగా కౌగిలించుకొని, సుప్తాః = నిద్రించిరి.

తా॥ మరికొంత మంది స్త్రీలు చిత్రవిచిత్రములైన తమతమ వాయిద్యములను కాముకురాండ్రైన స్త్రీలు తమ ప్రియకాముకులను కామపరవశతతో కౌగిలించుకొనునట్లు తమ స్తనములతో నొత్తుచు కౌగిలించుకొని నిద్రించుచుండిరి.

* హనుమంతుడు మందోదరిని చూచుట *

శ్లో॥ తాసా మేకాన్త విన్యస్తే శయానాం శయనే శుభే।
దదర్శ రూపసంపన్నా మపరాం స కపిః స్త్రియం॥ ౫౦

టీ॥ సః = ఆ, కపిః = వానరుడైన హనుమంతుడు, తాసాం = ఆస్త్రీల యొక్క, శయానాం = శయ్యలకు, ఏకాంతవిన్యస్తే-ఏకాంత = ప్రత్యేక స్థలమందు, విన్యస్తే = ఉంచబడిన, శుభే = శుభమైన, శయనే = పాన్పునందు, రూపసంపన్నాం = అందముతో కూడియున్న, అపరాం = మరియొక, స్త్రియం = స్త్రీని, దదర్శ = చూచెను.

తా॥ ఆ స్త్రీ లందరి పాన్పులకు కొంతదూరములో ఏకాంతస్థలమున శ్రేష్ఠమైన పాన్పునందు పవ్వళించి యున్న మరియొక సౌందర్యవతియైన స్త్రీని హనుమంతుడు చూచెను.

శ్లో॥ ముక్తామణి సమాయుక్తై ర్భూషణై స్సుభూషితామ్।
విభూషయన్తీ మివ తత్స్వశ్రియా భవనోత్తమమ్॥ ౫౧
గౌరీం కనకవర్ణాభా మిష్టా మన్తఃపు రేశ్వరీమ్।
కపి ర్మన్దోదరీం తత్ర శయానాం చారురూపిణీమ్॥ ౫౨
సతాం దృష్ట్వా మహాబాహు ర్భూషితాం మారుతాత్మజః।
తర్కయామాస సీతేతి రూపయౌవన సంపదా॥ ౫౩
హర్షేణ మహతా యుక్తో ననన్ద హరియూథపః।

టీ॥ ముక్తామణిసమాయుక్తైః-ముక్త = ముత్యములతోను, మణి = మాణిక్యములతోను, సమాయుక్తైః = కూడియున్న, భూషణైః = ఆభరణములతో, సువిభూషితాం = యోగ్యముగ సలంకరించబడినట్టి, స్వశ్రియా = స్వకీయకాంతిచేత, తత్ = ఆ, భవనోత్తమం = శ్రేష్ఠమైన భవనమును, విభూషయన్తీ మివ స్థితాం = అలంకరించుచున్నదివలె నున్నట్టియు, గౌరీం = తెల్లనిశరీరచ్ఛాయగలిగినట్టియు, కనకవర్ణాభాం-కనకవర్ణ = బంగారము వర్ణము యొక్క, అభాం = కాంతికలిగినట్టియు, ఇష్టాం = రావణుని కిష్టురాలైనట్టియు, అంతఃపురేశ్వరీం = అంతఃపురాధికారిణియైనట్టియు, చారురూపిణీం = సుందరమైన రూపముగలిగినట్టియు, తత్ర = అక్కడ శయానాం = నిద్రించుచున్న, మన్దోదరీం = మన్దోదరిని. సః = ఆ, హరియూధపః = వానరశ్రేష్ఠుడైన, మహాబాహుః = అజానుబాహుడైన, మారుతాత్మజః = వాయుపుత్రుడైన హనుమంతుడు. భూషితాం = అలంకరింపబడియున్న, తాం = ఆమెను, దృష్ట్వా = చూచి. రూపయౌవనసమ్పదా = రూపము యౌవనముల యొక్క శోభచే, సీతేతి = సీత అని, తర్కయామాస = ఊహించెను, మహతా = గొప్పదైన, హర్షేణ = సంతోషముతో, యుక్తః = కూడినవాడై, ననన్ద = సంతోషించెను.

తా॥ ముత్యములు మాణిక్యములతో కూర్చబడిన ఆభరణములతో బాగుగా అలంకరింపబడినట్టియు, దేదీప్యమానమైన తనదేహశోభతో ఆ భవనమును ప్రకాశింపజేయుచున్నట్టియు, బంగారు వర్ణముయొక్క కాంతి కలిగినట్టియు, రావణునికి ప్రియురాలైనట్టియు, అంతఃపురరాణియైనట్టియు, యోగ్యమైన అలంకారములతోను దివ్యమైన సౌందర్యముతోను ప్రకాశించుచు నట నిద్రించుచున్న మన్దోదరిని వానరశ్రేష్ఠుడు వాయుపుత్రుడు నైన హనుమంతుడు చూచి రూపయౌవనసంపదతో కూడియున్న ఆమెను సీతయని తలచి మిక్కిలిసంతోషించెను.

శ్లో॥ ఆస్ఫోటయామాస చుచుమ్బ పుచ్ఛమ్ ।
నననన్ద చిక్రీడ జగౌ జగామ ।
స్తమ్భా నరోహ న్నిపపాత భూమౌ ।
నిదర్శయన్ స్వాం ప్రకృతిం కపీనామ్ ॥

టీ॥ ఆస్ఫోటయామాస = భుజాస్ఫాలనము చేసెను. పుచ్ఛం = తోకను, చుచుమ్బ = ముద్దుపెట్టుకొనెను. ననన్ద = సంతోషించెను. చిక్రీడ = పల్టీకిలించెను, జగౌ = పాడెను, జగామ = వెళ్లెను, స్తమ్భాన్ = స్తంభములను, ఆరోహన్ = ఎక్కుచు, భూమౌ = భూమియందు, నిపపాత = పడుచుండెను, కపీనాం = వానరులయొక్క, స్వాం = స్వకీయమైన, ప్రకృతిం = స్వభావమును, నిదర్శయన్ = చూపుచుండెను.

తా॥ ఆంజనేయుడు మందోదరిని చూచి ఆమెయే సీతయని తలంచి పట్టరాని సంతోషము గలవాడై స్వజాతి స్వభావములైన వానరచేష్టలతో, భుజములు చరచుకొనుచు, తోకను ముద్దుపెట్టుకొనుచు, కిచకిచ లాడుచు, దూని రాగముల తీయుచు, స్తంభములనెక్కుచు అటనుండి భూమిపై బడుచు, సీతను జూచితి నను మహానందము ననుభవించెను.

దశమస్సర్గః సమాప్తః

# శ్రీమద్వాల్మీకిరామయణే సున్దరకాణ్డే ఏకాదశ స్సర్గః

* హనుమంతుడు సీతాదేవిని పానశాలయందు వెదకుట *

శ్లో॥ అవధూయ చ తాం బుద్ధిం బభూవావస్థిత స్తదా।
జగామ చాపరాం చిన్తాం సీతాం ప్రతి మహాకపిః॥ ౧

టీ॥ తదా = అప్పుడు, మహాకపిః = గొప్పవానరుడైన హనుమంతుడు, తాం = ఆ, బుద్ధిం = సీత అనెడి బుద్ధిని, అవధూయ = తిరస్కరించి, అవస్థితః బభూవ = స్వస్థచిత్తు డాయెను, సీతాంప్రతి = సీతనుగూర్చి, అపరాం = మరియొకటైన, చింతాంచ = ఆలోచననుగూర్చి, జగామ = వెళ్లెను.

తా॥ ఆంజనేయు డాశయనశాలయందు నిద్రించుచున్న మన్దోదరిని జూచి ఆమె రూప యౌవన సౌకుమార్యాదులు గమనించి యామెయే సీతయని తలంచి మిక్కిలి సంతసించెను, కాని మరల వెంటనే ఆమె సీతకాదను నిర్ణయమునకు వచ్చి, సీతనుగూర్చి యీ విధముగా మరికొన్ని యంశముల నాలోచించెను.

శ్లో॥ న రామేణ వియుక్తా సా స్వప్తు మర్హతి భామినీ।
న భోక్తుం నాప్యలంకర్తుం న పాన ముపసేవితుమ్॥ ౨
నాన్యం నరముపస్థాతుం సురాణా మపి చేశ్వరమ్।
న హి రామసమః కశ్చి ద్విద్యతే త్రిదశే ష్వపి॥ ౩
అన్యేయ మితి నిశ్చిత్య పానభూమౌ చచార సః।

టీ॥ రామేణ = శ్రీరామునితో, వియుక్తా = ఎడబాసియున్న, సా = ఆ, భామినీ = స్త్రీ, స్వప్తుం = నిద్రించుటకు, నార్హతి = తగదు, భోక్తుం = భుజించుటకు, నార్హతి = తగదు, అలంకర్తు మపి = అలంకరించుకొనుటకును, నార్హతి = తగదు. పానం = మద్యపానమును, ఉపసేవి

తుం = సేవించేటందుకు, నార్హతి = తగదు, అన్యం = ఇతరుడైన, నరం = పురుషుని, సురాణాం = దేవతలయొక్క; ఈశ్వరమపి చ = ప్రభువైన దేవేంద్రునినైన ఉపస్థాతుం = సమీపించుటకు, నార్హతి = తగదు, త్రిదశేష్వపి = దేవతలలోకూడ, రామసమః = రామునితో సమానమైన వాడు, కశ్చిత్ = ఎవడు, నహి = లేడుగదా। ఇయం = ఈమె, అన్యా = మరియొకతె, ఇతి = అని, నిశ్చిత్య = నిశ్చయించుకొని, సః = ఆహనుమంతుడు, పానభూమౌ = పానభూమియందు చచార = తిరిగెను.

తా॥ ఈ నిద్రించుచున్న స్త్రీని జూచి సీతయని తలంచితినిగాని ఇదిసరిగాదు. సీత అయినచో రాముని నెడబాపి యున్నకారణమున నిద్రించదు, భుజించదు, అలంకరించుకొనదు, మద్యముకాదుగదా మంచినీరుకూడ ముట్టదు. సీత, రామచంద్రుని మినహా మరి యేపురుషుని, అతడు కేవలము దేవేంద్రుడైనను దరిచేరదు. శ్రీరామచంద్రునితో సమానమైన వాడు దేవతలలో కూడ లేడని నిర్ణయము చేసికొని పానభూమియందు తిరిగి వెదక దలంచెను.

శ్లో॥ క్రీడితేనాపరాః క్లాన్తా గీతేన చ తథాఽపరాః॥ ౪
నృత్తేనచాపరాః క్లాన్తాః పాన విప్రహతా స్తథా।
మురజేషు మృదఙ్గేషు పీఠికాసు చ సంస్థితాః॥ ౫
తథా స్తరణ ముఖ్యేషు సంవిష్టా శ్చాపరాః స్త్రియః।
అఙ్గనానాం సహస్రేణ భూషితేన విభూషణైః॥ ౬
రూప సల్లాప శీలేన యుక్తగీతార్థ భాషిణా।
దేశకాలాభి యుక్తేన యుక్త వాక్యాభి ధాయినా॥ ౭
రతాభిరత సంసుప్తం దదర్శ హరియూథపః।

టీ॥ క్రీడితేన = సుంతాదిక్రీడానుభవముచే, అపరాః = కొందరు, గీతేన = గానముచేత, అపరాః = కొందరు, తథా = ఆప్రకారముగ, నృత్తేన = నాట్యముచేత, అపరాః = కొందరు, క్లాన్తాః = అలసినవారును,

తథా = ఆప్రకారముగ. పానవిప్రహతాః-పాన = మద్యపానముచేత, విప్రహతాః = స్పృహతప్పినవారై. క్లాన్తాః = అలసి పడియున్నవారును, మురజేషు = డోళ్ళనువాయిద్యములందు, మృదఙ్గేషు = మృదంగముల యందు, పీఠికాసు చ = పీఠికలయందును, సంస్థితాః = ఉన్నవారును తథా = ఆప్రకారముగ, ఆస్తరణముఖ్యేషు = ముఖ్యములైన, కంబళ్ళయందు, అపరాః = మరికొందరు, స్త్రియశ్చ = స్త్రీలును. సంవిష్టాః = నిద్రించినవారును, విభూషణైః = ఆభరణములచేత, భూషితేన = అలంకరించబడిన, అంగనానాంసహస్రేణ = వేయిమందిస్త్రీలచేత రూపసల్లాపశీలేన-రూప = సౌందర్యము, సల్లాప = సరససల్లాపముల యొక్క, శీలేన = స్వభావము గలిగినట్టియు, యుక్తగీతార్థభాషిణా-యుక్త = తగిన, గీతార్థ = భరతగీతార్థమును, భాషిణా = పలుకుచున్నట్టియు, దేశకాలాభియుక్తేన-దేశకాల = దేశకాలములకు, అభియుక్తేన = తగియున్నట్టియు, యుక్తవాక్యాభిధాయినా - యుక్త వాక్య = ఉచితమైనవాక్యములను. అభిధాయినా = పలుకుచున్నట్టియు, అంగనానాంసహస్రేణ = వేయిమందిస్త్రీలచేత, రతాభిరతసంసుప్తం-రతాభిరత = సంభోగశ్రమముతో. సంసుప్తం = గాఢనిద్రచెంది యున్న రావణుని, హరియూథపః = వానరశ్రేష్ఠుడై హనుమంతుడు దదర్శ = చూచెను.

తా॥ ఈప్రకారము హనుమంతుడు నిశ్చయించి తిరిగి సీతాన్వేషణకై బయలుదేరి, ఆసమీపముననే యున్న మద్యపానశాలయందు అప్పటి వరకు ఆటలు ఆడి పాటలు పాడి, శ్రమజెంది నిద్రించుకొందరిని, మద్యపానమత్తుచే శరీరములను మరచి నిద్రించుచున్నవారిని, డోళ్లు మృదంగములు మున్నగు వాయిద్యములను తలదిండ్లుగా నమర్చుకొని నిద్రించువారిని, కంబళ్లు తివాసీలయందు పడి నిద్రించువారిని, సువర్ణరత్నాభరణముల నలంకరించుకొని సౌందర్యలక్షణ ముపన్యసించునైజముగలవారిని, దేశకాలోచిత జ్ఞానముగల వేయిమందిస్త్రీలను, అ

స్త్రీలచే చుట్టుకొనబడి, బాహ్యాభ్యంతరముల నలసి నిద్రించుచున్న రావణుని నచ్చట హనుమంతుడు చూచెను. "బాహ్య మాభ్యంతరం చేతి. ద్వివిధం రత ముచ్యతే, తత్రాద్యం చుంబ నాశ్లేష. నఖ దంత క్షతాదికం, ద్వితీయం సురతం సాక్షా న్నానా కరణ కల్పితమ్। ఆదౌ రతం బాహ్య మిహ ప్రయోజ్యం, తత్రాపి చాలింగన మేవ పూర్వమ్" (రతిరహస్యే)—బాహ్యమనియు, అభ్యంతరమనియు, రతి రెండువిధములు, ముద్దులు, కౌగిలింతలు. నఖక్షత, దంతక్షతములు లోనైనవి బాహ్యమనబడును, నానాబంధ కల్పిత సాక్షా త్సురతము అభ్యంతరమనబడును. బాహ్యముతో నందు నాలింగనముతో రతినారంభింప వలె ననిభావము.

శ్లో॥ తాసాం మధ్యే మహాబాహు శ్శుశుభే రాక్షసేశ్వరః। ౯
గోష్ఠే మహతి ముఖ్యానాం గవాం మధ్యే యథావృషః

టీ॥ తాసాం = ఆస్త్రీలయొక్క, మధ్యే = మధ్యయందు. మహాబాహుః = అజానుబాహుండైన. రాక్షసేశ్వరః = రాక్షసప్రభువైన రావణుడు, మహతి = గొప్పదగు, గోష్ఠే = గోశాలయందు, ముఖ్యానాం = ముఖ్యమైన, గవాం = గోవులయొక్క, మధ్యే = మధ్యయందు, వృషఃయథా = ఆబోతువలె, శుశుభే = శోభించెను.

తా॥ అజానుబాహుడైన ఆరావణుడు స్త్రీలమధ్య గొప్పదైన గోశాలయందు ముఖ్యమైన గోవులమధ్య ఆబోతువలె ప్రకాశించెను.

శ్లో॥ సరాక్షసేన్ద్రి శ్శుశుభే తాభిః పరివృతః స్వయమ్॥ ౧౦
కరేణుభి ర్యథాఽరణ్యే పరికీర్ణో మహాద్విపః॥

టీ॥ సః = ఆ. రాక్షసేన్ద్రః = రాక్షసప్రభువైన రావణుడు, తాభిః = ఆ. స్త్రీలతో, స్వయం = స్వయముగా. పరివృతః = కూడియున్నవాడై అరణ్యే = అరణ్యమునందు. కరేణుభిః = ఆడయేనుగులతో. పరికీర్ణః = వ్యాప్తమైన. మహాద్విపోయథా = గొప్పయేనుగువలె. శుశుభే = ప్రకాశించెను.

తా॥ రాక్షసప్రభువైన రావణుడు ఆస్త్రీలతో కూడియున్నవాడై, అరణ్యములో ఆడయేనుగులతో కూడియున్న మగయేనుగువలె ప్రకాశించెను.

శ్లో॥ సర్వకామై రుపేతాం చ పానభూమిం మహాత్మనః॥ ౧౦
దదర్శ హరిశార్దూల స్తస్య రక్షఃపతే ర్గృహే।

టీ॥ హరిశార్దూలః = కపిశ్రేష్ఠుడైన హనుమంతుడు, మహాత్మనః = మహానుభావుడైన, తస్య = ఆ, రక్షఃపతేః = రాక్షసప్రభువైనరావణునియొక్క, గృహే = గృహమునందు, సర్వకామైః—సర్వ = సమస్తమైనవారియొక్క, కామైః = కోరికలతో, ఉపేతాం = కూడియున్న, పానభూమించ = పానశాలను, దదర్శ = చూచెను.

తా॥ వానరశ్రేష్ఠుడైన, హనుమంతుడు రాక్షసేశ్వరుడైన రావణుని గృహమం దందరికి నిష్టమగు సర్వాహారాది పదార్థములు మద్యాది పానంబులు గల పానశాలను చూచెను,

శ్లో॥ మృగాణాం మహిషాణాం చ వరాహాణాం చ భాగశః॥ ౧౧
తత్ర న్యస్తాని మాంసాని పానభూమౌ దదర్శ సః।

టీ॥ సః = ఆహనుమంతుడు, తత్ర = అక్కడ, పానభూమౌ = పానశాలయందు, మృగాణాం = లేళ్ళయొక్క, మహిషాణాంచ = దున్నపోతులయొక్కయు, వరాహాణాం చ = అడవిపందులయొక్కయు, భాగశః = భాగములుగ, న్యస్తాని = ఉంచబడిన, మాంసాని = మాంసములను, దదర్శ = చూచెను.

తా॥ ఆహనుమంతు డాపానశాల యందు లేళ్ళ, దున్నపోతుల, అడవిపందులయొక్క మాంసములు వేర్వేరు రాశులుగా విభజించి యుండుటను జూచెను,

శ్లో॥ రౌక్మేషు చ విశాలేషు భాజనే ష్వర్ధభక్షితాన్॥ ౧౨
దదర్శ హరిశార్దూలో మయూరాన్ కుక్కుటాం స్తథా।

టీ॥ హరిశార్దూలః = కపిశ్రేష్ఠుడైన హనుమంతుడు, రౌక్మేషు = బంగారు మయములైన, విశాలేషు = పెద్దవైన, భాజనేషు = పాత్రలయందు, అర్ధభక్షితాన్ = సగముతిన్న, మయూరాన్ = నెమళ్ళమాంసమును, తథా = ఆప్రకారముగా, కుక్కుటాంశ్చ = కోళ్లమాంసమును, దదర్శ = చూచెను.

తా॥ హనుమంతుడా పానశాలయందు, బంగారపు పెద్ద పెద్ద పాత్రలలో సగము సగమువరకు తినబడియున్న నెమళ్లను, కోళ్లను చూచెను.

శ్లో॥ వరాహా వార్ధ్రాణసకాన్ దధి సౌవర్చలాయుతాన్॥ ౧౩
శల్యా న్మృగమయూరాంశ్చ హనుమా నన్వవైక్షత।
క్రకరా న్వివిధా న్సిద్ధాం శ్చకోరా నర్ధభక్షితాన్॥ ౧౪
మహిషానేక శల్యాంశ్చ భాగాంశ్చ కృతనిష్ఠితాన్।
లేహ్యా నుచ్చావచాన్ పేయాన్ భోజ్యాని వివిధానిచ॥ ౧౫

టీ॥ హనుమాన్ = హనుమంతుడు, దధిసౌవర్చలాయుతాన్ - దధి = పెరుగు, సౌవర్చలాయుతాన్ = సువర్చ లవణముతో కూడియున్న, వరాహవార్ధ్రాణసకాన్ - వరాహ = పంది, వార్ధ్రాణసకాన్ = ఖడ్గమృగములమాంసములను, శల్యాన్ = ఏదుపందులమాంసములను. మృగమయూరాంశ్చ-మృగ = లేళ్ళయొక్కయు, మయూరాంశ్చ = నెమళ్ళయొక్క, మాంసములను, క్రకరాన్ = కొంగలను పక్షులయొక్క మాంసములను, వివిధాన్ = అనేకవిధములైన, సిద్ధాంశ్చ = పక్వముచేయబడి సిద్ధములైయున్న,చకోరాన్ = చకోరపక్షులమాంసములను,అర్ధభక్షితాన్ = సగముభక్షింపబడిన, మహిషాన్ = దున్నపోతుల మాంసములను, ఏకశల్యాన్ = ఇంగిడాయులను, కృతనిష్ఠితాన్ = వంటకు సిద్ధముచేయబడిన, భాగాంశ్చ = భాగములను, ఉచ్చావచాన్ = రుచిచూడదగిన,లేహ్యాన్ = నాకితినేపచ్చళ్ళను. పేయాన్ = పానయోగ్యములగు క్షీరాన్నాదులను, వివిధాని = అనేకవిధములైన, భోజ్యాని = భక్ష్యములను, అన్వవైక్షత = చూచెను.

తా॥ ఆంజనేయుడచ్చట పెరుగు సౌవర్చలవణాదులతో చక్కగా తయారుచేయబడిన అడవిపంది, ఖడ్గమృగము, ఏదుపంది, లేడి, నెమలి, మేక, చకోరపక్షి, దున్నపోతు, ఇంగిడాయిచేప. మొదలగున వన్నియు స్వస్వరూపములుగనే వండబడి సగము సగము తిని విడువబడిన మాంసములను, మంచిలేహ్యములను, మంచిపానీయములను, చూచెను.

శ్లో॥ తథామ్ల లవణోత్తంసై ర్వివిధై రాగషాడబైః।
హారనూపురకేయూరై రపవిద్ధై ర్మహాధనైః॥ ౧౮

పానభాజన విక్షిప్తైః ఫలైశ్చ వివిధై రపి।
కృత పుష్పోపహారాభూ రధికం పుష్యతి శ్రియమ్॥ ౧౯

టీ॥ తథా = ఆప్రకారముగ, అమ్లలవణోత్తంసైః-అమ్ల = చింతపండు, లవణ = ఉప్పుచేత, ఉత్తంసైః = శ్రేష్ఠములై యున్న, వివిధైః = అనేకవిధములైన. రాగషాడబైః - రాగ = పలుచనైన మధురరసము, షాడబైః = చిక్కగానున్న మధురరసము (చక్కెర, తేనె, ద్రాక్ష, దానిమ్మల రసము) లచేతను, మహాధనైః = అధికధనములతో, అపవిద్ధైః = కూర్చబడిన. హారనూపురకేయూరైః- హార = ముత్యాల హారములు, నూపుర = కాలిఅందియలు, కేయూరైః = భుజమూపురములచేత, వివిధైః = అనేకవిధములైన, పానభాజనవిక్షిప్తైః = అటనట విసరివేయబడిన పానభాజనములు (పాత్రలు) తోను, ఫలైశ్చ = పండ్లతోను, భూః = భూమి, కృతపుష్పోపహారా-కృత = చేయబడిన, పుష్ప = పుష్పములు, ఉపహారా = కానుకలుగలదై, శ్రియం = శోభను అధికం = అధికముగా. పుష్యతి = పోషించుచున్నది.

తా॥ ఆపానభూమి ఉత్తమ ఆమ్లలవణాదులచేతను పలుచని, చిక్కని మధుర రసములచేతను అధిక మూల్యములైన ముత్యాలహారములు, భుజబందులు మొదలగు ఆభరణములతోను, మత్తుచే విసరివేయబడిన

పానపాత్రలచేతను, పుష్పములు, ఫలములచేతను, మిగుల ప్రకాశించు చుండెను. రాగషాడబము లనగా. రాగ = తెల్లయావాలు. "రాగసిద్ధార్థకోజ్ఞేయః" అనిపాకశాస్త్రము. షాడబము = షడ్రసములు కలిగినట్లు చేయబడిన భక్ష్యము, అనికూడ అర్థమున్నది. "సితా మధ్వాది మధురో ద్రాక్షా దాడిమయో రసః, విరళశ్చేత్ కృతోరాగః, సాంద్రశ్చేత్ షాడబస్మృతిః" "పానకం ద్రాక్ష మాధూకం ఖార్జూరం తాల మైక్షవం. మధూత్థం శీధు మాధ్వీకం మైరేయం నారికేళజమ్" అర్ణవమ్ అను వాక్యము ప్రమాణము.

శ్లో॥ తత్ర తత్ర చ విన్యస్తై స్సుశ్లిష్టై శ్శయ నాసనైః।
పానభూమి ర్వినా వహ్నిం ప్రదీప్తే వోపలక్ష్యతే॥ ౧౮
బహుప్రకారై ర్వివిధై ర్వరసంస్కార సంస్కృతైః।
మాంసైః కుశలసంయుక్తైః పానభూమిగతైః పృథక్॥ ౧౯

టీ॥ తత్ర తత్ర = అక్కడక్కడ, విన్యస్తైః = ఉంచబడిన, సుశ్లిష్టై = యోగ్యసంధానములుగా చేయబడిన, శయనాసనైః = పడకమంచములచేతను, బహుప్రకారైః = అనేకవిధము లైనట్టియు, వివిధైః = అనేకము లైనట్టియు. వరసంస్కారసంస్కృతైః - వరసంస్కార = మంచిశుద్ధిగా, సంస్కృతైః = యోగ్యముగా చేయబడినట్టియు. కుశలసంయుక్తైః - కుశల = నేర్పరులచేత, సంయుక్తైః = పక్వముచేయబడినట్టియు, పృథక్ = వేరుగా, పానభూమిగతైః = పానభూమియం దున్న, మాంసైః = మాంసములచేత, పానభూమిః = పానభూమి, వహ్నిర్వినా = అగ్నిలేకయే, ప్రదీప్తేవ = ప్రత్యేకముగ మండుచున్నది వలె, ఉపలక్ష్యతే = చూడబడుచున్నది.

తా॥ ఆ పానభూమియందు ధక్కడక్కడ మంచి వడకమంచముల చేతను, అనేకవిధములుగా నేర్పరులైన వారిచేత, బాగుగా శుద్ధిచేయబడి, యోగ్యముగా వండబడిన మాంసములచేతను, ఆ పానభూమి అగ్ని లేకయే తనంత తాను కాలుచున్నట్లు ఎఱ్ఱని కాంతులతో ప్రకాశించు చుండెను.

శ్లో॥ దివ్యాః ప్రసన్నా వివిధా స్సురాః కృతసురా అపి।
శర్కరాసవ మాధ్వీక పుష్పాసవ ఫలాసవాః॥ ౨౦
వాసచూర్ణై శ్చ వివిధై ర్దృష్టా స్తై స్తైః పృథక్ పృథక్।
స న్తతా శుశుభే భూమి ర్మాల్యై శ్చ బహుసంస్థితైః॥ ౨౧
హిరణ్మయై శ్చ వివిధై ర్భాజనై స్స్ఫాటికై రపి।
జామ్బూనదమయైశ్చాన్యైః కరకై రభిసంవృతా॥ ౨౨

టీ॥ భూమిః = పానభూమి, దివ్యాః = దేవతాసంబంధములు, ప్రసన్నా అపి = పరిశుభ్రములైనను, వివిధాః = అనేకములైన, సురాః = మద్యములు, కృతసురా అపి = కృత్రిమమద్యములు, శర్కరాసవ మాధ్వీక పుష్పాసవ ఫలాసవాః - శర్కరాసవ = పంచదారమద్యము మాధ్వీక = మధువుచేచేయబడిన ఆసవము, పుష్పాసవ = పుష్పములమద్యము, ఫలాసవాః = ఫలములచే చేయబడిన మద్యములు. వివిధైః = అనేకములైన, వాసచూర్ణైశ్చ = పరిమళచూర్ణముల చేతను, తైస్తైః = ఆయాయి బహుసంస్థితైః = విస్తారముగానున్న, మాల్యైః = పుష్పమాలలచేతను, హిరణ్మయైః = బంగారువికారములైనట్టియు, స్ఫాటికైః = స్ఫటికసంబంధములైన, వివిధైః = అనేకములైన భాజనైః = పాత్రలతోను, అన్యైః = ఇతరములైన, జామ్బూనదమయైః = బంగారపువైన, కరకైః = గుండిగలతోను, అభిసంవృతా = అంతట కూడియున్నదై, సన్తతా = ఎల్లవేళల, పృథక్పృథక్ = వేర్వేరుగా, శుశుభే = ప్రకాశించెను.

తా॥ ఆ పానభూమి దేవతాసంబంధము లైన అనేక మద్యములు కృత్రిమముగా తయారు చేయబడిన మద్యములు. పంచదార. తేనె, పుష్పములు ఫలములు, వివిధరసములచే తయారుచేయబడిన ఆసవములు, మంచి సువాసనగల చూర్ణములు మున్నగు వానితోను. అనేక పుష్పమాలలతోను. బంగారు. స్ఫటిక పాత్రలు బంగారు గుండిగలు చెంబులు, మొదలగువాటి తోను. అంతట నిండియున్నదై బహుప్రకాశమానముగ నుండెను. "శీధు రిక్షు రసైః పక్వైరపక్వైరాసవో భవేత్। మైరేయం ధాతకీపుష్ప గుడ ధాన్యంబు సంహితమ్॥" చెఱకుపాలతో గాచిన సారాయము శీధువనియు. కాచక సిద్ధముచేసినది ఆసవమనియు. ఆరె పూలు. బెల్లము, ధాన్యము .(ధనియాలు) నీళ్లు కలిపి కాచినది మైరేయమనియు నందురు.

శ్లో॥ రాజతేషు చ కుంభేషు జాంబూనదమయేషు చ।
పానశ్రేష్ఠం తదా భూరి కపి స్తత్ర దదర్శ సః॥ ౨౩

టీ॥ తత్ర = అక్కడ, తదా = అప్పుడు, సః = ఆ, కపిః = హనుమంతుడు, రాజతేషు = ప్రకాశించుచున్నట్టి. జాంబూనదమయేషు చ = బంగారుమయములైన, కుంభేషు = బానలయందు. భూరి = అధికమైన, పానశ్రేష్ఠం = శ్రేష్ఠమైన మద్యమును, దదర్శ = చూచెను.

తా॥ ఆ పానశాలయం దాంజనేయుడు వెండి, బంగారములచే చేయబడిన పెద్ద పెద్ద కలశము లందు నిండియున్న శ్రేష్ఠ మైన మద్యమును చూచెను.

శ్లో॥ సోఽపశ్య చ్ఛాతకుమ్భాని శీధో ర్మణిమయాని చ।
రాజతాని చ పూర్ణాని భాజనాని మహాకపిః॥ ౨౪

టీ॥ సః = ఆ, మహాకపిః = వానరశ్రేష్ఠుడైన హనుమంతుడు, పూర్ణాని = పూర్తిగా నిండియున్నట్టియు, శాతకుంభాని = బంగారు కడవలు,

మణిమయాని చ = మాణిక్యములతో పొదగబడినవియు, రాజతాని = వెండిసంబంధములైనవియు. శీధోః = మద్యముయొక్క, భాజనాని = పాత్రలను, అపశ్యత్ = చూచెను.

తా॥ హనుమంతు డాపానశాలయందు మాణిక్యములు కూర్చబడిన, బంగారము, వెండి సంబంధమైన పూర్తిగా మద్యముతో నిండియున్న పాత్రలను చూచెను.

శ్లో॥ క్వచి దర్ధావశేషాణి క్వచి త్పీతాని భాగశః।
క్వచి దన్నావశేషాణి పశ్యన్వై విచచార హ॥ ౨౬
క్వచి త్ప్రభిన్నైః కరకైః క్వచి దాలోళితైర్ఘటైః।
క్వచి త్సంపృక్త మాల్యాని జలాని చ ఫలాని చ॥ ౨౭
శయనా న్యత్ర నారీణాం శుభ్రాణి బహుధా పునః।
పరస్పరం సమాశ్లిష్య కాచి త్సుప్తా వరాఙ్గనాః॥ ౨౮
కాశ్చి చ్చ వస్త్ర మన్యస్యా స్స్వపన్త్యాః పరిధాయ చ।
ఆహృత్య చాబలా సుప్తా నిద్రా బలపరాజితాః॥ ౨౯

టీ॥ క్వచిత్ = ఒకానొకచోట, అర్ధావశేషాణి = సగము మిగిలిన, భక్ష్యంశ్చ = భోజనపదార్థములను. క్వచిత్ = ఒకానొకచోట, భాగశః = భాగములుగా నున్న, పీతాని = మద్యపానములను, క్వచిత్ = ఒకానొకచోట, అన్నావశేషాణి = మిగిలిపోయిన అన్నములను, క్వచిత్ = ఒకానొకచోట; ప్రభిన్నైః = పగిలిపోయిన, కరకైః = చెంబులతోను, క్వచిత్ = ఒకానొకచోట, ఆలోళితైః = బోర్లించబడిన, ఘటైః = కుండలతోను, సంపృక్తమాల్యాని = తగులుకోబడిన పూలమాలలను, క్వచిత్ = ఒకానొకచోట, జలాని చ = జలములను, ఫలానిచ = ఫలములను, అన్యత్ర = మరియొకచోట, బహుధా = అనేకవిధములుగా, శుభ్రాణి = పరిశుభ్రములైన, నారీణాం = స్త్రీలయొక్క, శయనాని = శయ్యలను, పునః = మరియు, పరస్పరం = ఒకరినొకరు, సమాశ్లి

ష్య = కౌగిలించుకొని, సుప్తాః = నిద్రించుచున్న, కాశ్చిత్ = కొందరు, వరాంగనాః = శ్రేష్ఠమైన స్త్రీలను, అన్యస్యాః = మరియొకస్త్రీయొక్క, వస్త్రం = బట్టను, ఆహృత్య = లాగికొని, పరిధాయ చ = కప్పుకొనియు, స్వపన్త్యాః = నిద్రించుచున్న, కాశ్చిత్ = కొందరిని నిద్రాబలపరాజితాః-నిద్రాబల = అధికనిద్రచేత, పరాజితాః = జయింపబడిన, సుప్తాః = నిద్రించుచున్న, అబలాః = స్త్రీలను, సః = ఆహనుమంతుడు, పశ్యన్ = చూచుచున్నవాడగుచు, విచచార = సంచరించెను.

తా॥ ఆ పానశాలయందు హనుమంతుడు ఒకచోట భోజనపదార్థములను, మరియొకచోట అనేకవిధములైన మధుపానీయములను, ఒకచోట మిగిలిపోయిన అన్నములను యింకొకచోట పగిలిపోయిన చెంబులతోను దొర్లుచున్న కడవలతోను తగిలికొనియున్న పూలమాలలను, జలమును, ఫలములను, ఒకచోట పరిశుభ్రముగా నున్న స్త్రీల పాన్పులను, మఱియొకచోట ఒకరినొకరు కౌగిలించుకొని నిద్రించుచున్న కొంతమంది స్త్రీలను, ఒకరివస్త్రములను మరియొకరు లాగికొని కప్పుకొని నిద్రించు స్త్రీలను, నిద్రాధిక్యతచే నొడలెరుంగక గాఢనిద్రావిష్టలైన మరికొంతమంది స్త్రీలను, మరియు నస్తవ్యస్తముగా నున్న వివిధ పరిస్థితులను జూచుచు సీతను వెదకుటకు గాను అంతటను తిరిగెను.

శ్లో॥ తాసా ముచ్ఛ్వాస వాతేన వస్త్రం మాల్యం చ గాత్రజమ్।
నాత్యర్థం స్పన్దతే చిత్రం ప్రాప్య మన్దమి వానిలమ్॥ 30

టీ॥ తాసాం = ఆస్త్రీలయొక్క, ఉచ్ఛ్వాసవాతేన - ఉచ్ఛ్వాస = నిట్టూర్పులయొక్క, వాతేన = వాయువుచేత, వస్త్రం = వస్త్రమును, గాత్రజం = శరీరసంబంధములైన, మాల్యంచ = పుష్పమాలాదులును, మందం = మందమైన, అనిలం = వాయువును, ప్రాప్య ఇవ = పొందినదివలెనే, చిత్రం = విచిత్రముగా, అత్యర్థం = మిక్కిలి, నస్పందతే = కదలుటలేదు.

తా॥ ఆ స్త్రీల నిట్టూర్పు వాయువు ఆస్త్రీల శరీరములందలి వస్త్రములను, పుష్పమాలల పరిమళాదులు పొంది కదలలేనిదానివలె బహుచిత్రముగా నెమ్మదిగా కదలుచుండెను.

శ్లో॥ చన్దనస్య చ శీతస్య శీధో ర్మధురసస్యచ।
వివిధస్య చ మాల్యస్య ధూపస్య వివిధస్య చ॥ ౩౧
బహుధా మారుత స్తత్ర గన్ధం వివిధ ముద్వహన్।
రసానాం చన్దనానాం చ ధూపానాం చైవ మూర్ఛితః॥ ౩౨
ప్రవవౌ సురభి గ్గన్ధో విమానే పుష్పకే తదా।

టీ॥ తత్ర = అక్కడ. శీతస్య = చల్లనైన, చన్దనస్య = మంచిగంధము యొక్క, చ = మరియు, శీధోః = మద్యముయొక్క, మధురసస్య చ = మధురరసము యొక్కయు, వివిధస్య = అనేకవిధములైన, మాల్యస్య చ = పుష్పమాలికల యొక్కయు, వివిధస్య = అనేకవిధములైన, ధూపస్య చ = ధూపముల యొక్కయు, రసానాం = రసములయొక్కయు, చన్దనానాం చ = మంచిగంధముల యొక్కయు. ధూపానాం చైవ = ధూపముల యొక్కయు. గంధం = పరిమళమును, ఉద్వహన్ = వహించుచున్నదై, మారుతః = వాయువు, మూర్ఛితః = వ్యాపించినటువంటిదై, వివిధం = అనేకవిధములైన, గంధం = పరిమళమును. ఉద్వహన్ = పైకి వ్యాపింపజేయుచున్నవా డగుచు, తదా = అప్పుడు, గంధః = పరిమళించుచున్న, సురభిః = సువాసన, పుష్పకే = పుష్పకమను, విమానే = విమానమందు. ప్రవవౌ = ప్రత్యేకముగా వీచుచుండెను.

తా॥ ఆపాన భూమియందు చల్లని మంచిగంధము యొక్కయు, మద్యరసములయొక్కయు, అనేక పుష్పమాలికల యొక్కయు, అనేక విధములగు ధూపముల యొక్కయు, అనేక రసములయొక్కయు, పరిమళముల వెదజల్లు సువాసన పుష్పకవిమాన మంతయు వ్యాపించెను.

శ్లో॥ శ్యామావదాతా_స్తత్రాన్యాః కాశ్చి త్కృష్ణా వరాఙ్గనాః॥ 33
కాశ్చి త్కాఞ్చన వర్ణాఙ్గ్యాః ప్రమదా రాక్షసాలయే।

టీ॥ తత్ర = అక్కడ, రాక్షసాలయే = రావణగృహమునందు ప్రమదాః = స్త్రీలు, శ్యామావదాతాః-శ్యామ = చామనఛాయగలవారు. అవదాతాః = తెల్లని వర్ణము గలవారు, అన్యాః = ఇతరులు, కాశ్చిత్ = కొందరు, కృష్ణాః = నల్లని వర్ణము గలవారు, వరాఙ్గనాః = శ్రేష్ఠమైనవారు, కాశ్చిత్ = కొందరు, కాఞ్చనవర్ణాఙ్గ్యాః = బంగారువర్ణము కలవారును నై యుండిరి,

తా॥ ఆ రావణగృహమున చామనఛాయ గలవారు, తెలుపు వర్ణము గలవారు, శ్రేష్ఠమైన అవయవముల పొందిక గలవారు, నల్లవర్ణము గలవారు. బంగారు వర్ణము గలిగిన స్త్రీ లుండిరి.

శ్లో॥ తాసాం నిద్రావశత్వా చ్చ మదనేన విమూర్ఛితమ్॥ 34
పద్మినీనాం ప్రసుప్తానాం రూపమాసీ ద్యథై వ హి।

టీ॥ నిద్రావశత్వాత్ = నిద్రావశత్వమువలన, మదనేన = మన్మథక్రీడచేత, విమూర్ఛితం = విశేషముగా నలసియున్న, తాసాం = ఆస్త్రీలయొక్క, రూపం = రూపము, ప్రసుప్తానాం = గాఢముగా నిదురించుచున్న, పద్మినీనాం = తామరతీగలయొక్క. రూపం యథైవ = రూపమువలెనే, ఆసీత్ హి = ఆయెను,

తా॥ నిద్రావశులయిన ఆ స్త్రీలయొక్క సురతాదిక్రీడలచే శ్రమజెందిన రూపములు (ముకుళించి) నిదురించిన తామరతూడుల ఆకారమువలె నుండెను.

శ్లో॥ ఏవం సర్వ మశేషేణ రావణా_న్తఃపురం కపిః॥ 35
దదర్శ సుమహాతేజా న దదర్శ చ జానకీమ్।

టీ॥ ఏవం = ఈప్రకారముగ, సుమహాతేజా = గొప్పతేజశ్శాలి యైన కపిః = హనుమంతుడు, రావణాన్తఃపురం = రావణునియొక్క అంతఃపురమును, అశేషేణ = శేషములేకుండ, సర్వం చ = అంతటను, దదర్శ = చూచెను. జానకీం = సీతను, న దదర్శ = కనుగొనలేక పోయెను.

తా॥ గొప్ప తేజశ్శాలి యైన ఆ హనుమంతు డిట్లు రావణాంతఃపురమంతయు వెదకినను సీతయొక్క జాడ మాత్రము కనుగొనలేకపోయెను.

* పరాంగనా దర్శనమునకు హనుమంతుడు చింతించుట *

శ్లో॥ నిరీక్షమాణ శ్చ తదా తాః స్త్రియ స్స మహాకపిః।
జగామ మహతీం చిన్తాం ధర్మసాధ్వస శఙ్కితః॥ 36
పరదారావరోధస్య ప్రసుప్తస్య నిరీక్షణం।
ఇదం ఖలు మమాత్యర్థం ధర్మలోపం కరిష్యతి॥ 37
న హి మే పరదారాణాం దృష్టి ర్విషయవర్తినీ ।
అయం చాత్ర మయా దృష్టః పరదార పరిగ్రహః॥ 38

టీ॥ సః = ఆ, మహాకపిః = హనుమంతుడు, తదా = అప్పుడు, తాః = ఆ, స్త్రియః = స్త్రీలను, నిరీక్షమాణ శ్చ = చూచినవా డగుచును, ధర్మసాధ్వసశఙ్కితః - ధర్మ = ధర్మముయొక్క, సాధ్వస = భయముచే, శఙ్కితః = అనుమానించుకొనబడిన వాడై, మహతీం = గొప్పదైన, చిన్తాం = విచారమును, జగామ = పొందెను, ప్రసుప్తస్య = గాఢముగా నిద్రించుచున్న, పరదారావరోధస్య = పరదారానిరీక్షణావరోధమునకు, ఇదం = ఇది, మమ = నాకు, అత్యర్థం = మిక్కిలి, ధర్మలోపం = ధర్మలోపమును, కరిష్యతి ఖలు = చేయగల్గునుగదా, మే = నాకు, పరదారాణాం = పరస్త్రీలయొక్క, దృష్టిః = దృష్టి, విషయవర్తినీ = విషయవాంఛలను కలుగజేయునదై, నహి = లేదుగదా! అత్ర = ఇక్కడ, మయా = నాచేత, పరదారపరిగ్రహః = పరస్త్రీలను జూచుట, అయం చ = ఇదియేయై, దృష్టః = చూడబడినది,

తా॥ హనుమంతు డాప్రకారముగ అంతఃపురస్త్రీలను జూచిన వాడై “నేక్షే తార్కం ననగ్నాం స్త్రీం। నచ సంస క్త మైథునామ్” ఖరకిరణు డైన సూర్యునిగాని, నగ్నముగానున్న స్త్రీని గాని, రతి సంస క్తమైన స్త్రీని గాని చూడరాదని గదా ఆర్యో క్తి. కనుక నే నిప్పుడు గొప్ప ధర్మలోపమును చేసితి నని ప్రథమమున విచారించియు, పిదప యేపరి స్థితులలో జూచినను నాబుద్ధి పరదారాదర్శన జనిత విషయవాంఛా లగ్నము కాదుగదా! అట్టి స్థితిలో ధార్మికలోపము జరుగ నవకాశములే దని నిశ్చయ మైన బుద్ధితో తనకు తానై తిరిగి నిశ్చయించుకొనెను.

శ్లో॥ తస్యప్రాదు రభూ చ్చిన్తా పునరన్యా మనస్వినః।
నిశ్చి తై కా న్త చి త్తస్య కార్యనిశ్చయ దర్శినీ॥ ౩౯
కామం దృష్టా మయా సర్వా విశ్వస్తా రావణస్త్రియః।
నహి మే మనసః కించి ద్వైకృత్య ముపపద్యతే॥ ౪౦
మనోహి హేతు స్సర్వేషా మింద్రియాణాం ప్రవ ర్తనే।
శుభాశుభావ్యవస్థాసు తచ్చమే సువ్యవస్థితమ్॥ ౪౧
నాన్యత్రహి మయా శక్యా వై దేహీ పరిమార్గితుమ్।
స్త్రియోహి స్త్రీషు దృశ్య న్తే సదా సంపరి మార్గణే॥ ౪౨
యస్య సత్వస్య యాయోని స్తస్యాం తత్పరిమార్గ్యతే।
న శ క్తా ప్రమదా నష్టా మృగీషు పరిమార్గితుమ్॥ ౪౩
తదిదం మార్గితం తావ చ్ఛుద్ధేన మనసా మయా।
రావణా న్తఃపురం సర్వం దృశ్యతే న చ జానకీ॥ ౪౪

టీ॥ ఏకా న్తచిత్తస్య-ఏకా న్త = నిశ్చలమైన, చి త్తస్య = మనస్సు కలిగినట్టి, మనస్వినః = స్వాభిమానముగలిగిన, తస్య = ఆ హను మంతునికి, కార్యనిశ్చయదర్శినీ-కార్యనిశ్చయ = నిశ్చయకార్యమును, దర్శినీ = చూపించినదియు, నిశ్చితా = స్థిరమైన, అన్యా = మరియొక,

చిన్తా = ఆలోచన. పునః = తిరిగి, ప్రాదురభూత్ = పుట్టెను, మయా = నాచేత, సర్వాః = సమస్తమైన, రావణస్త్రియః = రావణుని స్త్రీలు, విశ్వస్తాః = నమ్మకముగలవారుగా, కామం = మిక్కిలి, దృష్టాః = చూడబడిరి. మే = నాయొక్క, మనసః = మనస్సునకు, కించిత్ = కొంచెము, వైకృత్యం = వికారత్వము, నోపపద్యతే హి = పొందలేదుగదా. సర్వేషాం = సమస్తములైన, ఇంద్రియాణాం = ఇంద్రియములకు, మనహి = మనస్సే, ప్రవర్తనే = ప్రవర్తింపజేయుటయందు, హేతుః = కారణభూతమగును, మే = నాయొక్క, తత్ = ఆమనస్సు, శుభాశుభాసు = మంచిచెడ్డవైన, అవస్థాసు = అవస్థలయందు. సువ్యవస్థితం = యోగ్యముగా నుంచబడినది. మయా = నాచేత, వైదేహీ = సీత, అన్యత్ర = మరియొకచోట, పరిమార్గితుం = వెదికేటందుకొరకు, నశక్యా హి = శక్యముకాదా! స్త్రియః = స్త్రీలు, స్త్రీషు = స్త్రీలయందు, సంపరిమార్గణే = వెదకుటయందు. సదా = ఎల్లప్పుడు. దృశ్యతే హి = చూడబడుచున్నదిగదా, యస్య = ఏ, సత్వస్య = మృగమునకు, యా = ఏది, యోనిః = స్థానమో, తస్యాం = ఆస్థానమందు, తత్ = ఆజంతువు. పరిమార్గ్యతే = వెదకబడుచున్నది, ప్రమదా = స్త్రీ, నష్టా = కనబడనిదైనచో. మృగేషు = మృగములయందు. పరిమార్గితుం = వెదకేటందుకు. నశక్తా హి = శక్యముకాదుగదా, తత్ = ఆకారణమువలన. శుద్ధేన = పరిశుద్ధమైన, మనసా = మనస్సుతో, మయా = నాచేత, ఇదం = ఈ, సర్వం = సమస్తమైన. రావణాంతఃపురం = రావణునియొక్క అంతఃపురము, మార్గితం = వెదకబడినది. జానకీ చ = సీతమాత్రము, నదృశ్యతే = కనబడలేదు.

తా॥ ఆత్మాభిమాని యగు హనుమంతుడు నిశ్చలమైన మనస్సుతో ఆలోచించి మరియొక నిర్ణయమును తీసికొనదలచి యిట్లాలోచించెను. నాచేత రావణాంతఃపురము నందలి స్త్రీలంతా వివిధస్థితిగతులలో చూడ

బడిరి. అయినప్పటికి నా మనస్సు నిర్విషయస్థితిగా నెంతమాత్రము వికలత జెందలేదు. "మనఏవ మనుష్యాణాం కారణంబంధ మోక్షయోః" అని కలదుగదా। కావున మనోవ్యాపారము ప్రధానముగాని యింద్రియ వ్యాపారము మాత్రముకాదు. అట్టి నామనస్సునందు అభిలాషయన్నది లేదు. నేను కామాసక్తితోచూడలేదు, అట్టి నిర్విషయకమనః స్థితిగల నాకు దోష మెట్లుండును? స్త్రీయైన సీతను స్త్రీలయందే వెదకవలయును గదా। ఏజాతి జీవి ఆజాతిలోనే మరియు ఆజాతి స్థానమునందే యుండును గాని యితర మృగ - పక్ష్యాదులలో నుండదుగదా। ఆధర్మము ననుసరించియే సీతను, వెదకే కార్యము నిమిత్తము రావణాంతఃపుర స్త్రీలను పరిశుద్ధ మనస్సుతోనే పరిశీలించితిని. కావున నాకెట్టిదోషము అంటదు. సీత కనబడకపోవుటచే పునఃపరిశీలనచే అర్ధనగ్నముగాను నగ్నముగా నున్న పరస్త్రీలను చూడవలసివచ్చిన దని ధర్మలోపబుద్ధిని పోగొట్టుకొన్న వాడై, ధైర్యవంతుడు, ధీమంతుడు నైన హనుమంతుడు, తన పవిత్రపరిశీలనతో బాధ్యతాయుత కార్యకర్తృత్వ నిర్ణయమును గైకొనెను.

శ్లో॥ దేవ గన్ధర్వ కన్యా శ్చ నాగకన్యా శ్చ వీర్యవాన్।
అవీక్షమాణో హనుమాన్ నైవాపశ్యత జానకీమ్॥ ౪౫

టీ॥ వీర్యవాన్ = పరాక్రమవంతుడైన, హనుమాన్ = ఆంజనేయుడు, దేవగన్ధర్వకన్యా శ్చ = దేవ గంధర్వ కన్యలను, నాగకన్యా శ్చ = నాగకన్యలను; అవీక్షమాణః = చూచినవాడై, జానకీమేవ = సీతను మాత్రమే. నాపశ్యత = చూడజాలకపోయెను.

తా॥ పరాక్రమవంతు డగు ఆంజనేయుడు ఆపరిసరములలోని దేవకాంతలను గంధర్వకన్యలను, నాగకన్యలను చూచెనేగాని సీతను మాత్రము చూడలేకపోయెను.

శ్లో॥ తా మపశ్యన్ కపి స్తత్ర పశ్యం శ్చాన్యా వరస్త్రియః।
అపక్రమ్య తదా వీరః ప్రధ్యాతు ముపచక్రమే॥ ౪౭
సభూయ స్తు పరం శ్రీమాన్ మారుతి ర్యత్న మాస్థితః।
అపానభూమి ముత్సృజ్య తద్విచేతుం ప్రచక్రమే॥ ౪౮

టీ॥ వీరః = వీరుడైన, కపిః = హనుమంతుడు, తత్ర = అక్కడ, అన్యాః = మరికొందరిని, వరస్త్రియః = శ్రేష్ఠస్త్రీలను, పశ్యన్ = చూచినవాడగుచు, తాం = ఆసీతాదేవిని, అపశ్యన్ = చూడనివాడై, అపక్రమ్య = అచ్చోటునువీడి, ప్రధ్యాతుం = తిరిగిఆలోచించుకొరకు, ఉపచక్రమే = ప్రారంభించెను. శ్రీమాన్ = శోభాయుక్తుడైన, సః = ఆ, మారుతిః = హనుమంతుడు, భూయస్తు = తిరిగియు, పరం = ఉత్కృష్టమైన, యత్నం = ప్రయత్నమును, ఆస్థితః = పొందినవాడై, అపానభూమిం = పానభూమినంతను, ఉత్సృజ్య = వదలి, తత్ = దానిని, విచేతుం = విడిచి ముందుకుపోవుటకు, ప్రచక్రమే = ప్రారంభించెను.

తా॥ వీరుడైన యా హనుమంతుడు ఆపరిసరములలో నున్న శ్రేష్ఠులైన మరికొందరు స్త్రీలను జూచెను కాని సీతమాత్రము కనబడనందున అచ్చోటు వీడుచు మరియు నాలోచింప నారంభించెను. ఏజాతివస్తువు నాజాతిలోనే పరిశీలింపవలసి యుండును. స్త్రీజాతి యగు సీతను స్త్రీల యందే వెదకవలెను; అందువలన సామాన్యశాస్త్రముగ చెప్పబడిన స్త్రీదర్శనాదులు మానసికములుగ నైన ఆర్య వాక్యవిరుద్ధములు కాని వేరు కానేరవు. కాని నిష్కామ కర్మప్రిధానము గాని అవశ్యకమగు కర్మ త్యాగము మాత్రము సరిగాదు. బుద్ధిశాలియగు హనుమంతుడు సీతాన్వేషణము చేయనిచో రామాయణశుభస్థితియే లేకుండును.

ఇతి ఏకాదశ స్సర్గః

---

# శ్రీమద్వాల్మీకిరామాయణే సున్దరకాణ్డే ద్వాదశస్సర్గః

* హనుమంతుడు సీతను గానక విచారించుట *

శ్లో॥ స తస్య మధ్యే భవనస్య మారుతి
ర్లతాగృహాం శ్చిత్రగృహాన్ నిశాగృహాన్।
జగామ సీతాంప్రతి దర్శనోత్సుకో
నచైవ తాం పశ్యతి చారుదర్శనామ్॥ ౧

టీ॥ సః = ఆ. మారుతిః = హనుమంతుడు, సీతాంప్రతి = సీతనుగురించి, దర్శనోత్సుకః = చూచెడి వేడుకగలవాడై, తస్య = ఆ, భవనస్య = భవనముయొక్క, మధ్యే = మధ్యయందు, లతాగృహాన్ = లతలచే కట్టబడిన గృహములను, చిత్రగృహాన్ = విచిత్రములైన గృహములను, నిశాగృహాన్ = రాత్రులయందు సంచరించే గృహములనుగూర్చి, జగామ = వెళ్లెను, చారుదర్శనాం-చారు = సుందరమైన, దర్శనాం = దర్శనముకల్గిన, తాంచైవ = ఆసీతను మాత్రమే, నపశ్యతి = చూడలేదు.

తా॥ ఆ హనుమంతుడు. సీతను వెదకితీరవలె నని, చూచితీరవలె నని, మంచివేడుక, దీక్షగలవాడై రావణుని భవనమధ్య నున్న మహావిచిత్రములైన లతాగృహములను నిశాగృహములను వెదకిచూచెను గాని ఎచ్చట సీతజాడమాత్రము కనబడలేదు.

శ్లో॥ స చిన్తయామాస తతో మహాకపిః।
ప్రియా మపశ్యన్ రఘునన్దనస్య తామ్।
ధ్రువం హి సీతా ప్రియతే యథా నమే।
విచిన్వతో దర్శన మేతి మైథిలీ॥ ౨

టీ॥ తతః = ఆటుతరువాత, సః = ఆ, మహాకపిః = హనుమంతుడు, రఘునన్దనస్య = శ్రీరామునికి, ప్రియాం = ఇష్టురాలైన, తాం = ఆ సీతను, అపశ్యన్ = చూడనివాడై, చిన్తయామాస = విచారించెను,

యథా = ఏప్రకారముగ, విచిన్వతః = వెదకుచున్న, మే = నాకు, మైథిలీ = మిథిలేశునికుమార్తె యగు సీత, నదర్శనమేతి = దర్శనము కాలేదో (తస్మాత్) అందువలన, ధ్రువం = నిశ్చయముగా, సీతా = సీత, మ్రియతేహి = మరణించియే యుండును.

తా॥ హనుమంతుడు "శ్రీరాముని భార్యయైన సీత నిచ్చట నేను ఎంత వెదకినా ఆమె కనబడలేదు. నిశ్చయముగా భర్తృవియోగముచే ఆమె మరణించియే యుండవచ్చు" నని విచారించెను.

శ్లో॥ సా రాక్షసానాం ప్రవరేణ జానకీ
స్వశీల సంరక్షణ తత్పరా సతీ।
అనేన నూనం ప్రతిదుష్టకర్మణా।
హతా భవే దార్యపథే పరేస్థితా॥ 3

టీ॥ ప్రతిదుష్టకర్మణా = దుష్టముగా ప్రతిక్రియ నొనర్చు స్వభావముగల, అనేన = ఈ, రాక్షసానాం = రాక్షసులలో, ప్రవరేణ = శ్రేష్ఠుడైనరావణునిచేత, పరే = ఉత్కృష్టమైన, ఆర్యపథే = పెద్దల మార్గమందు, స్థితా = ఉన్నటువంటి, సా = ఆ, జానకీ = సీత, స్వశీల సంరక్షణ తత్పరా సతీ-స్వశీల = తనశీలమును, సంరక్షణ = రక్షించుకొనుట యందు, తత్పరా సతీ = ఆసక్తి కలదగుచు నుండగా, నూనం = నిశ్చయముగా, హతా = చంపబడినదై, భవేత్ = అయియుండును.

తా॥ సీత, ఆర్యధర్మము ననుసరించి పతివ్రతాధర్మమును కాపాడుకొనునిమిత్తము తనశీలసంరక్షణాసక్తి కలదగుటవలన దుష్టప్రతిక్రియాశీలుడైన రావణునిచే హతమార్చబడి యుండవచ్చును. లేక అభిమానవతిగా మరణించి యుండవచ్చును. కానిచో కనబడక పోవునా ? అని హనుమంతుడు తలచెను.

శ్లో॥ విరూపరూపా వికృతా వివర్చసో,
మహాననా దీర్ఘ విరూప దర్శనాః,
సమీక్ష్య సా రాక్షస రాజ యోషితో,
భయా ద్వినష్టా జనకేశ్వరాత్మజా॥ ౪

టీ॥ సా = ఆ, జనకేశ్వరాత్మజా = జనకమహారాజుకుమార్తెయగు సీత, విరూపరూపాః = అందవికారములుగా నున్నట్టియు, వికృతాః = వికారములుగ జేయబడినట్టియు, వివర్చసః = కళావిహీనములుగ నున్నట్టియు, మహాననాః = పెద్దనోళ్లు కలిగియున్నట్టియు, దీర్ఘవిరూప దర్శనాః = పొడవుగ అందవికారములుగ కనబడు, రాక్షసరాజ యోషితః = రాక్షసప్రభువైన రావణుని స్త్రీలను, సమీక్ష్య = చూచి, భయాత్ = భయమువలన, వినష్టా = మృతిజెందియే యుండును.

తా॥ అందవికారములు, వికృతఆకారములుగలవారు, అందవిహీనము లగు ముఖవర్చస్సులు గలవారును, పెద్ద నోరులుగలవారు, అతిదీర్ఘముగ నుండి చూడ నసహ్యముగ నున్నవారు నగు రావణునిస్త్రీలను చూచి భయము జెంది జానకి మృతిజెందియే యుండును.

శ్లో॥ సీతా మదృష్ట్వా హ్యనవాప్య పౌరుషమ్।
విహృత్య కాలం సహవానరై శ్చిరమ్।
న మేఽస్తి సుగ్రీవ సమీపగా గతి।
స్సుతీక్ష్ణ దండో బలవాం శ్చ వానరః॥ ౫

టీ॥ సీతాం = సీతను, అదృష్ట్వాహి = చూడకనే, పౌరుషం = పురుషార్థమును, అనవాప్యహి = పొందకనే, వానరైస్సహ = వానరులతోకూడ, చిరం = సుదీర్ఘమైన, కాలం = సమయమును, విహృత్య = గడిపి (న)

మే = నాకు, సుగ్రీవసమీపగా = సుగ్రీవునిదగ్గరకు చేరు, గతిః = మార్గము, నాస్తి = లేదు, వానరః = వానరుడైన సుగ్రీవుడు, సుతీక్ష్ణ దండః = మహాతీవ్రమైన దండనగలవాడు, బలవాంశ్చ = మహాబలము కలవాడును.

తా॥ ఇంతవరకు సీత కనబడలేదు. అందుచే నాయొక్క పురుషార్థమునకు ఫలితము దక్కలేదు. సుగ్రీవుని ఆజ్ఞ దాట వీలుకానంతటి బలమైనది. ఆయన పెట్టిన గడువు కాలము జాంబవదాదుల దగ్గరసుండే గడపివేసి తిని. ఇట్టిస్థితిలో సుగ్రీవుని దగ్గరకు పోవుమార్గము నాకు కనుపించుట లేదు. వానరప్రభువైన ఆసుగ్రీవుడు మహాబలపరాక్రమములు గల వాడును తీక్ష్ణమైన దండనీతి గలవాడుకదా ! ఇప్పుడు నేనేమి చేయ వలెను ?

శ్లో॥ దృష్ట మన్తఃపురం సర్వం దృష్టా రావణయోషితః।
న సీతా దృశ్యతే సాధ్వీ వృథాజాతో మమ శ్రమః॥ ౭
కింను మాం వానరాస్సర్వే గతం వక్ష్యన్తి సంగతాః।
గత్వా తత్ర త్వయా వీర కింకృతం తద్వదస్వ నః॥ ౮
అదృష్ట్వా కిం ప్రవక్ష్యామి తామహం జనకాత్మజామ్।
ధ్రువం ప్రాయ ముపైష్యన్తి కాలస్య వ్యతివర్తనే॥ ౯
కింవా వక్ష్యతి వృద్ధశ్చ జామ్బవా నఙ్గద శ్చ సః।
గతం పారం సముద్రస్య వానరాశ్చ సమాగతాః॥ ౯
అనిర్వేద శ్శ్రియో మూల మనిర్వేదః పరం సుఖమ్॥
అనిర్వేదో హి సతతం సర్వార్థేషు ప్రవర్తకః॥ ౧౦
కరోతి సఫలం జంతోః కర్మ యత్త త్కరోతి సః।
తస్మా దనిర్వేదకృతం యత్నం చేష్టేఽహ ముత్తమమ్॥ ౧౧
భూయ స్తావ ద్విచేష్యామి దేశా న్రావణపాలితాన్।
ఆపానశాలా విచితా స్తథా పుష్పగృహాణి చ॥ ౧౨

శ్లో॥ చిత్రశాలా శ్చ విచితా భూయః క్రీడాగృహాణి చ॥
నిష్కుటా న్తర రథ్యాశ్చ విమానాని చ సర్వశః॥ ౧౩
ఇతి సంచిన్త్య భూయోపి విచేతు ముపచక్రమే।
భూమీ గృహాం శ్చైత్య గృహాన్ గృహాతిగృహకానపి॥ ౧౪

టీ॥ సర్వం = సమస్తమైన, అంతఃపురం = అంతఃపురము, దృష్టం = చూడబడినది, రావణయోషితః = రావణునిస్త్రీలు, దృష్టాః = చూడబడిరి. సాధ్వీ = పతివ్రతయగు, సీతా = సీత, నదృశ్యతే = కనబడలేదు మమ = నాయొక్క, శ్రమః = సముద్రలంఘనాదిశ్రమ, వృథా = వ్యర్థమై, జాతః = అయ్యెను, గతం = అచ్చటకువెళ్ళిన, మాం = నన్ను, సర్వే = సమస్తమైన, వానరాః = వానరులు, సంగతాః = కూడినవారై, కింనువక్ష్యంతి = ఏమనిపలుకుదురు? హేవీర = వీరుడవైన హనుమా! తత్ర = అచ్చటకు, గత్వా = వెళ్లి, త్వయా = నీచేత, కింకృతం = ఏమిచేయబడినది, నః = మాకు, తత్ = దానిని, వదస్వ = చెప్పుము. అహం = నేను, తాం = ఆ, జనకాత్మజాం = సీతను, అదృష్ట్వా = చూడక, కిం = ఏమి, ప్రవక్ష్యామి = చెప్పగలను? కాలస్య = కాలముయొక్క, వ్యతివర్తనే = వ్యతిరేకమునందు, ప్రాయం = ఆమరణము. ధ్రువం = నిశ్చయముగా, ఉపైష్యన్తి = ఉపవాసము చేయుదురు, వృద్ధః = వృద్ధుడైన. జామ్బవాన్ = జాంబవంతుడు, సః = ఆ, అఙ్గదశ్చ = అంగదుడును, వానరాశ్చ = మిగిలినవానరులును, సమాగతాః = దరిజేరినవారై, సముద్రస్య = సముద్రముయొక్క, పారం = ఆవలిఒడ్డును, గతం = పొందిన నన్ను గూర్చి, కింవావక్ష్యన్తి = ఏమనిఅడుగుదురు, అనిర్వేదః-హి = ఉత్సాహమే. శ్రియః = శుభసంపదకు, మూలం = కారణమగును, అనిర్వేదోహి = ఉత్సాహమే, పరం = ఉత్కృష్టమైన, సుఖం = సుఖము, అనిర్వేదోహి = ఉత్సాహమే, సర్వార్థేషు = సమస్తకార్యములందు, సతతం = ఎల్లి

ప్పుడు, ప్రవర్తః = ప్రవర్తించుచుండును. యత్ = ఏ. కర్మ = పని, జంతోః = ప్రాణికి. సఫలం = సాఫల్యమును, కరోతి = చేయునో, తత్ = ఆపనిని, సః = అప్రాణి, కరోతి = చేయుచుండును, తస్మాత్ = ఆకారణమువలన, అహం = నేను, అనిర్వేదకృతం = ఉత్సాహముతో చేయవలసిన, ఉత్తమం = ఉత్తమమైన. యత్నం = ప్రయత్నమును, చేష్టే = చేయుదును. భూయస్తావత్ = తిరిగియు. రావణపాలితాన్ = రావణునిచే పాలింపబడుచున్న. దేశాన్ = ప్రదేశములను, విచేష్యామి = వెదకుదును, తథా = అప్రకారముగ. ఆపానశాలాః = పానగృహముల పర్యంతము, పుష్పగృహాణి చ = పుష్పగృహములును, విచితాః = వెదకబడినవి. చిత్రశాలాశ్చ = చిత్రశాలలును, విచితాః = వెదకబడినవి, భూయః = తిరిగి, క్రీడాగృహాణి చ = క్రీడాగృహములును నిష్కుటాన్తరరథ్యాశ్చ = గృహోద్యానములయొక్క మధ్యవీధులను. విమానాని చ = విమానములను, సర్వశః = అంతట. విచితాః = వెదకబడినవి. ఇతి = ఈలాగున. సంచిన్త్య = ఆలోచించి, భూయోపి = తిరిగియు, భూమిగృహాంశ్చ = భూగర్భగృహములను. చైత్యగృహాన్ = చతుష్పద మండపములను. గృహాతిగృహకానపి = గృహోపరిగృహములను. విచేతుం = వెదకుటకొరకు. ఉపచక్రమే = ప్రారంభించెను.

తా॥ సీతాన్వేషణము నిమిత్తము హనుమంతుడు రావణాంతఃపురమున స్త్రీనివాసముల కష్టములైన ప్రదేశము లన్నియు వెదకి, సీత కనబడకపోవుటచే అవసరకార్యాచరణలకు అవగాహనల నొంద ఆత్మచింతన జేయ నారంభించెను. సముద్రలంఘన మొనర్చి యిచ్చటకు వచ్చిన శ్రమఅంతయు వృథా అయ్యెనుగదా! "సర్వథా కృతకార్యో హమేష్యామి" ఎట్లయిన నేను సీతను జూచియే వచ్చెదను అని పూర్వము వానరులతో జెప్పియుంటిని. ఇప్పుడు ఊరకపోయినచో "ఓఆంజనేయః లంకకుబోయి సీతనుజూచివచ్చితివా?" యని వారడిగిన నేనేమి జవాబు

నీయవలెను. వచ్చిన కార్యమును నిర్వర్తించక యిప్పుడు నేను రిక్త హస్తములతో పోయిన నా సాహసకార్యముల బొగడు జాంబవదాదులు "నీకార్యకర్తృత్వ విధాన మింతమాత్రముదేనా!" యని నిరసింపరా? ఏమిబ్రతుకునాది! ఛీ, సీతాన్వేషణ కార్యమునందు సఫలత నొందని నాకు మరణమే శరణ్యము అయితే నన్ను గానని జాంబవదాది మహా వీరులు కూడ సుగ్రీవుని చేరుటకు వెరచి, మరణము నొందుదురు. ఏ విధముగా పరిశీలించినను అనర్థమే కలుగనున్నది. చేయునదేమి? అని దీర్ఘముగ పరిశీలించి శుభ నిశ్చితార్థమునకు రాదొడంగి ఊరక విచారించుట అన్నిటికంటె చెఱుపు. ఉత్సాహముతోనే యుండవలెను. కావున నిచ్చట యుండుట తగదు, వ్యర్థుడనై పోరాదు. ఈవిధమున విచారించుచు అధైర్యముగ నుండతగదు. కార్యమెటులనైన సాధించవలెను. కార్యసాధన మందుత్సాము ప్రథమసోపానము, దానిని విడిచి నేనేమి చేయగలను? సర్వశ్రేయోదాయకము సర్వసిద్ధిప్రద ముత్సాహమేగదా। ధీరపురుషు లుత్సాహమును వీడరు కనుక మరియొక పర్యాయము ప్రయత్నించి కార్యసాఫల్యము చేసికొనవలె ననెడి శ్రద్ధ దీక్షలు గల ఉత్సాహముతో ప్రయత్నించి వెదకెద నని, నిశ్చితార్థముగ తిరిగి సీతను వెదకుటయే తనకర్తవ్యకార్యమని తలచి ఇదివరలో వెదకినవి వెదకనివి, భూబిలగృహములు, దూరమున క్రీడార్థమై నిర్మించిన గృహాంబులు మరియు ననేకస్థలములయందు హనుమంతుడు వెదకనారంభించెను.

* హనుమ యుత్సాహంబు వహించి మరల సీతాదేవిని వెదకుట *

శ్లో॥ ఉత్పత న్నిపతంశ్చాపి తిష్ఠ న్గచ్ఛ న్పునః పునః।
అపావృణ్వంశ్చ ద్వారాణి కవాటా న్యవఘాటయన్॥ ౧౨
ప్రవిశ న్నిష్పతంశ్చాపి ప్రపత న్నుత్పత న్నపి।
సర్వ మప్యవకాశం సవిచచార మహాకపిః॥ ౧౬

టీ॥ సః = ఆ, మహాకపిః = హనుమంతుడు, ఉత్పతన్ = పైకిఎగురుచున్నవాడగుచు, నిష్పతన్ = క్రిందికి పడుచున్నవాడగుచు, తిష్ఠన్ = నిలుచున్నవాడగుచు, పునఃపునః = మాటిమాటికి, గచ్ఛన్ = వెళ్లుచున్నవాడగుచు, ద్వారాణి = ద్వారములను, అపావృణ్వం శ్చ = తొంగి చూచుచున్నవాడగుచు. కవాటాని = తలుపులను, అవఘాటయన్ = త్రోయుచున్న వాడగుచు. ప్రవిశన్ = లోపలప్రవేశించుచు. నిష్పతన్ = బయటికివచ్చుచు, అపిచ = మరియు, ప్రపతన్ = క్రిందికి దూకుచు, ఉత్పతన్ = పైకెగురుచున్నవాడగుచు, సర్వం = సమస్తమైన, అవకాశమపి = అవకాశమును, విచచార = పరిశీలనతో వెదకుచు తిరుగుచుండెను.

తా॥ హనుమంతుడు మిక్కిలి యెత్తుగనున్న మిద్దెలమీది కెగిరి వెదకుచు, తిరిగి క్రిందికి దుమికియు, నచ్చటచ్చట నిలబడియు, మాటిమాటికి నిదానించుచు, ఇచ్చట సీత యుండునేమో యని చూచుచు, అచ్చట నుండి పోయి ద్వారములను తెరచుచు, తలుపులను త్రోయుచు, తలుపుల సందులనుండి లోనికి చూచుచు యిండ్లలోనికి పోవుచు, తిరిగి వచ్చుచు, భూగృహములకు బోయి చూచుచు, అచ్చట సీతను గానక యేమాత్ర మవకాశమును విడువక సీతను వెదకసాగెను.

శ్లో॥ చతురఙ్గుల మాత్రోఽపి నావకాశ స్సవిద్యతే।
రావణాంతఃపురే తస్మిన్ యం కపి ర్నజగామ సః॥ ౧౮

టీ॥ సః = ఆ, కపిః = ఆంజనేయుడు, తస్మిన్ = ఆ, రావణాన్తఃపురే = రావణుని అంతఃపురమునందు, యం = ఏఅవకాశమునుగూర్చి, న జగామ = వెళ్లలేదో, సః = అటువంటి, అవకాశః = అవకాశము చతురఙ్గులమాత్రోఽపి = నాలుగంగుళములమేర మాత్రము కూడ, న విద్యతే = యుండదు.

తా॥ ఆ హనుమంతుడు రావణాంతఃపురమునంతయు యెచ్చట నాల్గు అంగుళముల స్థలమును కూడ విడువక నిదానముగ పరికించి వెదకెను.

శ్లో॥ ప్రాకారాన్తర రథ్యాశ్చ వేదికా శ్చైత్య సంశ్రయః।
దీర్ఘికాః పుష్కరిణ్య శ్చ సర్వంతే నావలోకితమ్॥ ౧౮

టీ॥ ప్రాకారాన్తరరథ్యాశ్చ = ప్రాకారముల మధ్య నున్న వీధులను, వేదికాః = అరుగులను, చైత్యసంశ్రియాః = చతుష్పధవర్తి వృక్షముల కాలంబనములైన అరుగులను, దీర్ఘికాః = దిగుడుబావులను, పుష్కరిణ్య శ్చ = కోనేరులును, సర్వం = సమస్తమును, తేన = ఆహనుమంతుని చేత, అవలోకితం = చూడబడెను.

తా॥ ఆ హనుమంతుడు కోటలోనున్న సమస్త వీధులు, వీధులలో చెట్లకవలంబముగా నిర్మించబడిన అరుగులు, గృహాముల కాని యున్న దిగుడుబావులను కోనేరులును సమస్తమును వెదకెను.

శ్లో॥ రాక్షస్యో వివిధాకారా విరూపా వికృతా స్తథా।
దృష్టా హనుమతా తత్ర న తు సా జనకాత్మజా॥ ౧౯

టీ॥ తత్ర = అక్కడ, వివిధాకారాః = అనేకాకారములు గలిగినట్టియు, వికృతాః = వికృతరూపములు గలిగినట్టియు, తథా = ఆప్రకారముగా, విరూపాః = అందవికారముగ నున్నట్టి, రాక్షస్యః = రాక్షసస్త్రీలు, హనుమతా = హనుమంతుని చేత, దృష్టాః = చూడబడిరి, సా = ఆ, జనకాత్మజా తు = సీతమాత్రము, నదృష్టా = చూడబడలేదు.

తా॥ హనుమంతు డచ్చట వివిధాకారములతో అందవికారులుగా నున్న వికారచేష్టలు జేయుచున్న రాక్షసస్త్రీలను జూచెను. కాని జానకిమాత్రము కనబడలేదు.

శ్లో॥ రూపేణాప్రతిమా లోకే వరా విద్యాధరస్త్రియః।
దృష్టా హనుమతా తత్ర నతు రాఘవ నన్దినీ॥ ౨౦
నాగకన్యా వరారోహాః పూర్ణచన్ద్రనిభాననాః।
దృష్టా హనుమతా తత్ర న తు సీతా సుమధ్యమా॥ ౨౧
ప్రమథ్య రాక్షసేన్ద్రేణ దేవకన్యా బలాద్ధృతాః।
దృష్టా హనుమతా తత్ర న సా జనక నన్దినీ॥ ౨౨

టీ॥ తత్ర = అక్కడ, హనుమతా = హనుమంతునిచేత, లోకే = ప్రపంచమందు, రూపేణ = సౌందర్యముతో, అప్రతిమాః = సాటిలేనట్టి, వరాః = శ్రేష్ఠురాండ్రైన, విద్యాధరస్త్రియః = విద్యాధరస్త్రీలు, దృష్టాః = చూడబడిరి. రాఘవనన్దినీతు = శ్రీరాముని సంతోషపెట్టు సీతమాత్రము. నదృష్టా = చూడబడలేదు-తత్ర = అక్కడ, హనుమతా = ఆంజనేయునిచేత, వరారోహాః = మిక్కిలిశ్రేష్ఠులైన, పూర్ణచన్ద్రనిభాననాః = పూర్ణచంద్రునితో సమాన ముఖములుగల, నాగకన్యాః = నాగకన్యలు, దృష్టాః = చూడబడిరి, సుమధ్యమా = యోగ్యమైన, నడుముగల, సీతాతు = సీతమాత్రము, నదృష్టా = చూడబడలేదు. తత్ర = అక్కడ, హనుమతా = హనుమంతునిచేత, రాక్షసేన్ద్రేణ = రావణునిచే, ప్రమథ్య = దేవసైన్యమును మధించి. బలాద్ధృతాః = బలాత్కారముగ గొనిరాబడిన, దేవకన్యాః = దేవకన్యకలు, దృష్టాః = చూడబడిరి, సా = ఆ, జనకనన్దినీ = జనకునిపుత్రికయగు సీతమాత్రము, నదృష్టా = చూడబడలేదు.

తా॥ రావణాంతఃపురములో ప్రపంచమున నెక్కడ సాటిలేని సౌందర్యములు గల విద్యాధరస్త్రీలను, పూర్ణచన్ద్రుని బోలు ముఖములు గల నాగకన్యలను దేవతాసైన్యమును మర్దించి బలాత్కారముగా తీసికొనిరాబడిన దేవకన్యలను మరియు ననేక మంది సుందరాంగుల నచ్చట హనుమంతుడు చూచెను గాని జనకుని పుత్రిక శ్రీరాముని ప్రియభార్యయగు సీతను మాత్రము చూడలేదు.

శ్లో॥ సోఽపశ్యం స్తాం మహాబాహుః పశ్యం శ్చాన్యా వరస్త్రియః।
విషసాద ముహుర్ధీమాన్ హనుమా న్మారుతాత్మజః॥ ౨౩

టీ॥ మహాబాహుః = అజానుబాహుఁడైన, సః = ఆహనుమంతుడు; తాం = ఆసీతను, అపశ్యన్ = చూడనివాఁడై, అన్యాః = ఇతరులైన, వరస్త్రియః = శ్రేష్ఠస్త్రీలను, పశ్యం శ్చ = చూచినవాఁ డగుచును, ధీమాన్ = బుద్ధిమంతుఁడు, మారుతాత్మజః = వాయుపుత్రుఁడునైన, హనుమాన్ = ఆంజనేయుఁడు, ముహుః = మాటిమాటికి, విషసాద = దుఃఖించెను.

తా॥ అజానుబాహుఁడు వాయుపుత్రుడు నైన ఆహనుమంతుఁ డా అంతఃపుర మంతయు, వెదకిచూచిన వారలనే మరల చూచెను గాని సీతాదేవిని చూడలేకపోవుటచే మిగులవిచారించెను.

శ్లో॥ ఉద్యోగం వానరేన్ద్రాణాం ప్లవనం సాగరస్య చ।
వ్యర్థం వీక్ష్యానిలసుత శ్చిన్తాం పున రుపాగమత్॥ ౨౪

టీ॥ అనిలసుతః = వాయుకుమారుఁడైన హనుమంతుఁడు, వానరేన్ద్రాణాం = వానరశ్రేష్ఠులయొక్క, ఉద్యోగం = ప్రయత్నమును, సాగరస్య = సముద్రముయొక్క, ప్లవనం చ = దాటుటయు; వ్యర్థం = వృథాయగుటను, వీక్ష్య = చూచి, పునః = తిరిగి, చిన్తాం = విచారమును, ఉపాగమత్ = పొందెను.

తా॥ వానరశ్రేష్ఠులైన సుగ్రీవ జాంబవదాదులు సీతాన్వేషణ చేసిన ప్రయత్నము, అందునిమిత్తమై నే నీ సముద్రమును లంఘించి వచ్చుటయు అంతావ్యర్థమాయెను గదా। ఎంతశ్రమపడి యెన్నిచోట్ల వెదకిన సీతకనబడ లేదు. అని హనుమంతుఁడు తిరిగి విచారపడెను,

శ్లో॥ అవతీర్య విమానాచ్చ హనుమా న్మారుతాత్మజః।
చిన్తా ముపజగామాథ శోకోపహత చేతనః॥ ౨౫

టీ॥ అథ = అటుతరువాత, శోకోపహతచేతస్కః = శోకముచేత, హరింపబడిన, చైతన్యముగలవాడై, మారుతాత్మజః = వాయుపుత్రుడైన, హనుమాన్ = ఆంజనేయుడు, విమానాత్ = విమానమునుండి, అవతీర్య = దిగి. చ = మరియు, చిన్తాం = విచారమును, ఉపజగామ = పొందెను,

తా॥ తరువాత ఆహనుమంతుడు, సీత కనబడకపోవుటచేత దుఃఖముచేత కర్తవ్యాకర్తవ్య జ్ఞాన రహితుడై విమానమునుండి క్రిందికిదిగి తిరిగి వికలమనస్కుడై విచారమును పొందెను.

ద్వాదశస్సర్గః సమాప్తః



## శ్రీమద్వాల్మీకిరామాయణే సున్దరకాణ్డే త్రయోదశ స్సర్గః

* హనుమంతుడు ప్రాకారమును జేరి సీత గానరామికి వ్యసనపడుట *

శ్లో॥ విమానాత్తు సుసఙ్క్రమ్య ప్రాకారం హరియూథపః।
హనుమా న్వేగవా నాసీ ద్యథా విద్యుద్ఘనాన్తరే॥ ౧

టీ॥ వేగవాన్ = వేగవంతుడైన, హరియూథపః = వానరశ్రేష్ఠుడైన, హనుమాన్ = హనునుంతుడు. విమానాత్ = విమానమునుండి, ప్రాకారం = ప్రాకారమును, సుసఙ్క్రమ్య = యోగ్యముగా, నధిష్ఠించి, ఘనాన్తరే = మేఘములమధ్య, విద్యుద్యథా = మెఱపువలె, ఆసీత్ = ఆయెను.

తా॥ వానరశ్రేష్ఠుడైన హనుమంతుడు విమానమునుండి కడువేగముగ దిగివచ్చి ప్రాకారము నెక్కి మేఘమధ్యమందు మెఱపువలె ప్రకాశించెను

శ్లో॥ సం పరిక్రమ్య హనుమాన్ రావణస్య నివేశనాత్।
అదృష్ట్వా జానకీం సీతా మబ్రవీ ద్వచనం కపిః॥ ౨

టీ॥ కపిః = వానరుడైన, హనుమాన్ = హనుమంతుడు, రావణస్య = రావణునియొక్క, నివేశనాత్ = గృహమునుండి, సంపరిక్రమ్య = ముందుకుదాటి, జానకీం = జనకపుత్రియగు, సీతాం = సీతను, అదృష్ట్వా = చూడక, వచనం = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా॥ హనుమంతుడు రావణగృహమున నెంతవెదకినను సీతకనబడకపోవుటచే అచ్చటనుండి దిగివచ్చి ప్రాకారమెక్కి చూచియు యెచ్చటను గానక తనతో తాను విచారమున నిట్లనుకొనెను.

శ్లో॥ భూయిష్ఠం లోళితా లఙ్కా రామస్య చర తా ప్రియమ్।
నహి పశ్యామి వైదేహీం సీతాం సర్వాఙ్గశోభనామ్॥ ౩

టీ॥ రామస్య = శ్రీరామునికి, ప్రియం = ప్రియమును, చరతా = చేకూర్చ ప్రయత్నించిన నాచేత, లఙ్కా = లంక, భూయిష్ఠం = సంపూర్తిగా, లోళితా = వెదకబడినది, సర్వాఙ్గశోభనాం = శుభప్రదమైన సర్వావయవములు గలిగిన, వైదేహీం = విదేహరాజపుత్రికయగు, సీతాంహి = సీతనుమాత్రమే, నపశ్యామి = చూడలేకపోయితిని,

తా॥ శ్రీరామున కిష్టమైన కార్యమును జేయ నుద్దేశించియే నేనులంకనంతయు గాలించి వెదకితిని కాని సర్వాంగసుందరి యగు సీతమాత్రము కనబడలేదు అని హనుమంతుడు చింతించెను.

శ్లో॥ పల్వలాని తటాకాని సరాంసి సరిత స్తథా।
నద్యోఽనూపవనా న్తాశ్చ దుర్గాశ్చ ధరణీధరాః॥ ౪
లోళితా వసుధాసర్వా నతు పశ్యామి జానకీమ్।

టీ॥ పల్వలాని = అల్పసరస్సులు, తటాకాని = చెఱువులు, సరాంసి = సరస్సులు, తథా = అప్రకారముగ, సరితః = చిన్నసదులు, నద్యః = పెద్దనదులు, అనూపవనాన్తాశ్చ = జలప్రాయవనప్రదేశములు, దుర్గాః = దుర్గమములైన, ధరణీధరాః = పర్వతములు, చ = మరియు, సర్వా = సమస్తమైన, వసుధా = భూమి, లోళితా = వెదకబడినది, జానకీంతు = సీతనుమాత్రము, నపశ్యామి = చూడలేకపోయితిని,

తా॥ చిన్నసరస్సులు చెఱువులు, కొలనులు, చిన్న పెద్ద నదులు, నీళ్లుండే వన్యప్రాంతములు, దుర్గమము లైన పర్వతములు, యింకను సమస్తమైన భూమి నాచేత వెదకబడినది. అయినను సీతనుమాత్రము చూడలేకపోయితిని.

శ్లో॥ ఇహ సమ్పాతినా సీతా రావణస్య నివేశనే। ౫
అఖ్యాతా గృధ్రరాజేన న చ పశ్యామి తా మహమ్।

టీ॥ ఇహ = ఇక్కడ, రావణస్య = రావణునియొక్క, నివేశనే = గృహమునందు, సీతా = సీత (యున్నట్లు). గృధ్రరాజేన = గృధ్రరాజైన, సంపాతినా = సంపాతిచేత, అఖ్యాతా = చెప్పబడినది. అహం = నేను, తాం = ఆసీతను, నచపశ్యామి = చూడలేకపోయితిని.

తా॥ పక్షిరాజైన సంపాతి రావణగృహమునందే సీత యున్నదని చెప్పుటచే నే నెంతో శ్రమించి లంకనంతయు వెదకితిని, గాని సీతమాత్రము కానరాదయ్యెను.

శ్లో॥ కిన్ను సీతాథ వైదేహీ మైథిలీ జనకాత్మజా॥ ౬
ఉపతిష్ఠేత వివశా రావణం దుష్టచారిణమ్।

టీ॥ అథ = ఆటుతరువాత, వైదేహీ = విదేహదేశమున బుట్టినదియు, మైథిలీ = మిథిలానగరవాసియు. జనకాత్మజా = జనకుని పుత్రికయు

నగు, సీతా = సీత, వివశా = వశముతప్పినదై. దుష్టచారిణం = దుర్మార్గుడగు, రావణం = రావణుని, ఉపతిష్ఠేతకిన్ను = పొందియుం డునా యేమి?

తా॥ పవిత్రి విదేహదేశమున బుట్టినది సదాచారసంపత్తి గలది, భగవత్కైంకర్యమం దాసక్తి గలది, పూజ్యు డగు జనకునికి కుమార్తె యగు సీత దుర్మార్గు డగు రావణుని మోస మోహాముల కామపరాధీను రాలై ఆదుర్మార్గుని కలసి యుండునా? అట్లు జరిగియుండదు.

శ్లో॥ క్షిప్రి ముత్పతతో మన్యే సీతామాదాయ రక్షసః॥ ౭
బిభ్యతో రామబాణానా మన్తరా పతితా భవేత్।

టీ॥ రామబాణానాం = శ్రీరాముని బాణములకు, బిభ్యతః = భయపడుచున్న వాడై, సీతాం = సీతను, ఆదాయ = తీసికొని, క్షిప్రం = శీఘ్రముగా, ఉత్పతతః = పైకెగయుచున్న. రక్షసః = రావణునుండి, అన్తరా = క్రిందకు, పతితా = పడినదై, భవేత్ = అయ్యెనా? మన్యే = అని అనుకొనా?

తా॥ పరస్త్రీని అందునను శ్రీరాముని భార్యను తాను మోసగించి తీసికొని పోవు సమయమున ఆమెభర్త యగు శ్రీరాముని బాణములకు మిగుల భయపడుచు పైకెగయు సమయమున భయభ్రాంతు డైన రావణునుండి క్రిందికి జారిపడెనా? అని అనుమానముగా తలచెను.

శ్లో॥ అథవా హ్రియమాణాయాః పథి సిద్ధనిషేవితే॥ ౮
మన్యే పతిత మార్యాయా హృదయం ప్రేక్ష్య సాగరమ్।

టీ॥ అథవా = ఇట్లుకానిచో, సిద్ధనిషేవితే = సిద్ధులచే సేవించబడు, పథి = మార్గమందు (ఆకాశమార్గమందు), హ్రియమాణాయాః = హరించి తీసికొని పోబడుచున్న, ఆర్యాయాః = పూజ్యురాలైన సీతయొక్క, హృదయం = మనస్సు, సాగరం = సముద్రమును. ప్రేక్ష్య = చూచి, పతితం = పతనమైనదానిగా. మన్యే = తలచుచున్నాను.

తా॥ సీత యెంత వెదకిన నెచ్చట కనబడుటలేదు. రావణు డాకాశమార్గమున వేగముగా నెత్తికొని పోవుసమయమున సీత క్రింది మహాసముద్రమును తన ప్రస్తుత స్థితిని గమనించి, అసముద్రమున పడి యుండ వచ్చునని తోచుచున్నది.

శ్లో॥ రావణ స్యోరువేగేన భుజాభ్యాం పీడితేన చ॥ ౯
తయా మన్యే విశాలాక్ష్యా త్యక్తం జీవిత మార్యయా।

టీ॥ రావణస్య = రావణునియొక్క, ఊరువేగేన = వేగముకలిగిన తొడల చేతను, భుజాభ్యాం = భుజములయొక్క, పీడితేన చ = బాధపెట్టబడి యుండుటచేతను, విశాలాక్ష్యా = విశాలనేత్రములుగల, ఆర్యయా = ధర్మపరాయణయైన, తయా = ఆసీతచేత, జీవితం = జీవితము, త్యక్తం = విడువబడిన దని, మన్యే = తలచుచున్నాను.

తా॥ మిక్కిలి ధర్మపరాయణురాలైన సీత దుష్టుడగు రావణుడు ఆకాశమార్గమున వేగముగా గొనిపోవుటలో రావణుని ఊరువుల వేగమునను భుజములయొక్క పీడనమునను చైతన్యరహితయై ప్రాణముల విడచి యుండును.

శ్లో॥ ఉప ర్యుపరి వా నూనం సాగరం క్రమత స్తదా॥ ౧౦
వివేష్టమానా పతితా సముద్రే జనకాత్మజా।

టీ॥ వా = లేక, జనకాత్మజా = సీత, సాగరం = సముద్రమును, ఉపర్యుపరి = బహుఎత్తైన భాగమునుంచి, క్రమతః = దాటుటవలన, తదా = అప్పుడు, వివేష్టమానా = (భయమును) ఎక్కువగా చుట్టుకొన్నదై, సముద్రే = సముద్రమునందు, పతితా = పడియుండును, నూనం = నిశ్చయము.

తా॥ లేక ఆకాశమున బహుఎత్తైన ప్రదేశమునుంచి తీసికొని పోబడుటలో భయముజెంది, ఆవేగమును సహించలేక సముద్రమున బడి యుండును. ఇదే నిజమై యుండును.

శ్లో॥ అహో౽ క్షుద్రేణ చానేన రక్షన్తీ శీల మాత్మనః॥ ౧౧
అబన్ధు ర్భక్షితా సీతా రావణేన తపస్వినీ।

టీ॥ చ = మరియు, క్షుద్రేణ = నీచుడైన, అనేన = ఈ, రావణేన = రావణుని చేత, తపస్వినీ = తపోస్థితికలిగియున్న, సీతా = సీత, అబన్ధుః = రక్షించుబంధువులులేనిదై, ఆత్మనః = తనయొక్క, శీలం = శీలమును, రక్షంతీ = రక్షించుకొనుచుండగా, భక్షితా = భక్షించబడి యుండును, అహో = ఏమాశ్చర్యము.

తా॥ నీచుడగు రావణుడు సీతను వశపరచుకొనుటకే కపటోపాయమున ప్రయత్నించినను పతియే దైవమను పరిపూర్ణ విశ్వాసము గలదగుటచే లక్ష్యపెట్టక పోవుటలో సీతకు నిచ్చట రక్షకులైన బంధువులు లేరు, దిక్కెవ్వరని ఆమెను భక్షించిరేమో! ఆహా!

శ్లో॥ అథవా రాక్షసేన్ద్రస్య పత్నీభి రసితేక్షణా॥ ౧౨
అదుష్టా దుష్టభావాభి ర్భక్షితా సా భవిష్యతి।
సమ్పూర్ణ చన్ద్రప్రతిమం పద్మపత్ర నిభేక్షణమ్॥ ౧౩
రామస్య ధ్యాయతీ వక్త్రం పఞ్చత్వం కృపణం గతా।
హా రామ లక్ష్మణేత్యేవం హాయోధ్యే చేతి మైథిలీ॥ ౧౪
విలప్య బహు వైదేహీ న్యస్తదేహా భవిష్యతి।
అథవా విహితా మన్యే రావణస్య నివేశనే॥ ౧౫
నూనం లాలప్యతే సీతా పంజరస్థేవ శారికా।

టీ॥ అథవా = ఇట్లుకానిచో, దుష్టభావాభిః = చెడుభావములుగల, రాక్షసేన్ద్రస్య = రావణునియొక్క, పత్నీభిః = భార్యలచే, అసితేక్షణా = నల్లనిచూపులుగలిగిన, అదుష్టా = పవిత్రురాలైన, సా = ఆసీత, భక్షితా = భక్షింపబడినదై, భవిష్యతి = అయియుండును. సమ్పూర్ణ చన్ద్రప్రతిమం = నిండుచంద్రునితో సమానమైన, పద్మపత్రనిభేక్షణా = పద్మపత్రములవంటి నేత్రములుగల, రామస్య = శ్రీరామునియొక్క,

వక్త్రం = ముఖమును, ధ్యాయతీ = ధ్యానము చేయుచు. కృపణం = నీచమైన, పఞ్చత్వం = మృతిని, గతా = పొందినదా?. మైధిలీ = సీత. హారామ = అయ్యోరామా। హాలక్ష్మణ = అయ్యోలక్ష్మణ, హాఅయోధ్య = అయ్యో అయోధ్య। ఇతి = అని, బహూ = ఎక్కువగ, విలప్య = విచారించి, చ = మరియు. న్యస్తదేహా = శరీరము విడచినదై, భవిష్యతి = అయియుండును. అథవా = ఇలాకానిచో, రావణస్య = రావణునియొక్క, నివేశనే = గృహమందు, నిహితా=ఉంచబడినదై, పంజరస్థా = పంజరమందుంచబడిన, శారికా ఇవ = గోరువంక పిట్టవలె, లాలప్యతా = పెంచబడుచున్నదా? నూనం = నిశ్చయము.

తా॥ కామవాంఛా నిరసన కారణముచే రావణుడు సీతను చంపకపోయినను సీతయందే కామాతిశయము గల్గినవాడని, సీతయున్న తమ సర్వస్థితులకు భంగమని రావణుని భార్యలు ఆ పతివ్రతయగు సీతను భక్షించియుందురా? లేనిచో సమ్పూర్ణ చంద్రునితో సమానమైన ముఖము పద్మపత్రముల వంటి నేత్రములు గల శ్రీరాముని ధ్యానించుచు సీత మరణించియుండునా? కాక హారామ, హాలక్ష్మణ హా అయోధ్యా యని అందరిని తలచుకొని విచారించుచు దేహమును విడిచియుండునా? కాక రావణగృహమందు పంజరమున బంధింపబడిన గోరువంకవలె పెంచబడుచున్నదా?

* సీత లేదని శ్రీరామునితో చెప్పిన కలుగుననర్థంబుల హనుమంతుడు యోచించుట *

శ్లో॥ జనకస్యసుతా సీతా రామపత్నీ సుమధ్యమా॥ ౧౬
కథ ముత్పల పత్రాక్షీ రావణస్య వశం వ్రజేత్।
వినష్టా వా ప్రణష్టా వా మృతావా జనకాత్మజా ౧౭
రామస్య ప్రియభార్యస్య న నివేదయితుం క్షమమ్।

శ్లో॥ నివేద్యమానే దోషస్స్యా ద్దోషస్స్యా దనివేదనే॥ ౧౭
కథం ను ఖలు కర్తవ్యం విషమం ప్రతిభాతిమే ।
అస్మిన్నేవం గతే కార్యే ప్రాప్తకాలం క్షమంచ కిమ్॥ ౧౮
భవే దితి మతం భూయో హనుమాన్ ప్రవిచారయత్।

టీ॥ ఉత్పలపత్రాక్షీ = నల్లకలువరేకులవంటి నేత్రములు గలిగినట్టియు, సుమధ్యమా = యోగ్యమైననడుము కలిగినట్టియు, జనకస్య = జనకునియొక్క సుతా = కుమార్తెయు, రామపత్నీ = శ్రీరాముని భార్యయునగు, సీతా = సీత, కథం = ఎట్లు, రావణస్య = రావణుని యొక్క, వశం = వశమును, వ్రజేత్ = పొందును ? జనకాత్మజా = జానకి, వినష్టావా = విపరీతపరిస్థితులవలన ఆత్మహత్యచేసికొన్నదా? పరిణష్టావా = ఎక్కువగా బాధింపబడి మరణించినదా। మృతావా = లేక స్వతహాగా మరణించినదా? ప్రియభార్యస్య = భార్యయందు మిగుల ప్రేమగల, రామస్య = శ్రీరామునికి, నివేదయితుం = తెలియజేయుటకు, నక్షమం = సమర్థత లేకుండెను. నివేద్యమానే = తెలియజేయుటయందును, దోషః = దోషము, అనివేదనే = తెలియజేయకపోవుటయందును. దోషః = దోషము, స్యాత్ = అగును, కథంమ = ఎట్లైనను, మే = నాకు, కర్తవ్యం = చేయవలసినపని, విషమం = పరస్పర విరుద్ధముగనే, ప్రతిభాతిఖలు = ద్యోతకమగుచున్నదిగదా? అస్మిన్ = ఈ, కార్యే = కార్యము, ఏవంగతేసతి = ఈప్రకారముగా, జరిగిన, ప్రాప్తకాలం = పొందబోయేకాలము, క్షమం = సమర్థనీయమైనదై, కిం = ఎట్లు, భవేత్ = అగును? ఇతి = ఇట్లు, హనుమాన్ = హనుమంతుడు, మతం = తన అభిమతమును, భూయః = తిరిగి, ప్రవిచారయత్ = ప్రత్యేకవిచారణచేసెను.

తా॥ సర్వ శుభలక్షణ సంపన్నురాలు, శ్రీరాముని ప్రియభార్య యగు జానకి నీచుడగు రావణుని వశమగునా। లేక సీత భూగృహముల యందు దాచబడినదా? సముద్రమున బడినదా? కష్టములు భరించలేక తనకు

తానై ప్రాణముల విడిచినదా? ఏవిధముననో సీత మరణించియే యుం డును. నే నీవిషయము శ్రీరామునకు తెలియపర్చుట అయుక్తము. తెలియపర్చక పోవుట అయుక్తమే, ఏమిచేయవలసియుండును. ఎట్లు చేసిన పరస్పర విరుద్ధముగనే తోచుచున్నది; కావున నాకర్తవ్యమేమి? అని హనుమంతుడు మరలచింతించెను,

శ్లో॥ యది సీతా మదృష్ట్వాఽహం వానరేన్ద్రపురీ మితః॥ ౨౦
గమిష్యామి తతః కోమే పురుషార్థో భవిష్యతి।
మమేదం లఙ్ఘనం వ్యర్థం సాగరస్య భవిష్యతి॥ ౨౧
ప్రవేశ శ్చైవ లఙ్కాయాం రాక్షసానాం చ దర్శనమ్।
కిం మాం వక్ష్యతి సుగ్రీవో హరయో వా సమాగతాః॥ ౨౨
కిష్కిన్ధాం సమను ప్రాప్యం తౌ వా దశరథాత్మజౌ।
గత్వాతు యది కాకుత్థ్సం వక్ష్యామి పరమ ప్రియమ్॥ ౨౩
న దృష్టేతి మయా సీతా తత స్త్య క్ష్యతి జీవితమ్।
పరుషం దారుణం క్రూరం తీక్ష్ణ మింద్రియ తాపనమ్॥ ౨౪
సీతా నిమిత్తం దుర్వాక్యం శ్రుత్వా స న భవిష్యతి।

టీ॥ తతః = అటుతరువాత, అహం = నేను, సీతాం = సీతను, అదృష్ట్వా = చూడక, ఇతః = ఇచ్చటనుంచి, వానరేన్ద్రపురీం = కిష్కింధాపురమునుగూర్చి, గమిష్యా మ్యది = వెళ్ళిననైన, మే = నాకు, పురుషార్థః = పురుషార్థము, కిం = ఏమి, భవిష్యతి = కాగలదు, మమ = నాయొక్క, ఇదం = ఈ, సాగరస్య = సముద్రముయొక్క, లఙ్ఘనం = దాటుటయు, లఙ్కాయాం = లంకయందు, ప్రవేశశ్చ = ప్రవేశమును, రాక్షసానాం = రాక్షసులయొక్క, దర్శనం = చూచుటయు వ్యర్థం = వ్యర్థము, కిష్కిన్ధాం = కిష్కింధాపురిని, సమనుప్రాప్తం = చేరిన, మాం = నన్నుగూర్చి, సుగ్రీవః = సుగ్రీవుడు, కింవక్ష్యతి = ఏమనును, సమాగతాః = అచ్చటికిచేరిన, హరయః = వానరులు,

(ఏమందురు) తౌ = ఆ, దశరథాత్మజౌ = రామలక్ష్మణులు (ఏమం దురు). గత్వాతు = వెళ్లుటతోడనే, మయా = నాచేత, సీతా = సీత, నదృష్టా = చూడబడలేదు. ఇతి = అని, కాకుత్థ్సం = శ్రీరాముని గూర్చి, పరమప్రియం = మిక్కిలిఅనిష్టమును, వక్ష్యమియది = చెప్పి నట్లైన, తతః = అతరువాత, జీవితం = జీవితమును, త్యక్ష్యతి = విడిచి పెట్టును. సః = అరాముడు, పరుషం = కఠినమైన, దారుణం = దారు ణమైన, క్రూరం = క్రూరమైన, తీక్ష్ణం = సహింపరాని, ఇంద్రియతాప నం = ఇంద్రియములనుతపింపజేయు, సీతానిమిత్తం = సీతసంబంధ మైన, దుర్వాక్యం = చెడువాక్యమును, శ్రుత్వా = విని, నభవిష్యతి = ఉండజాలడు.

తా॥ నేను సీతను చూడక కిష్కింధకుపోయిన పురుషార్థ మేమియుండును? సముద్రమును దాటుట, లంకానగరమున ప్రవేశించుట, రాక్షసుల జూచుట, ఇవన్నియు వ్యర్థములుగదా; నేను కిష్కింధకుచేరుట తోనే సుగ్రీవుడు, రామలక్ష్మణులు ఇతరవానరులు సీతనుగూర్చి యేమి చెప్పు దునో యని నన్ను చుట్టుముట్టుదురు. వారలకేమని చెప్పుదును? నేను సీతను జూడకయే యిటనుండి పోయిన వారందరు నన్ను నిందింతురు గదా! మరియు మహాకఠినము క్రూరమునైన సీత కనబడని దుర్వార్త వినుటతోడనే ఆశ్రీరాముడు ప్రాణములతో నుండజాలక తప్పక మర ణించును – అని హనుమంతుడు పరిపరివిధముల విచారించెను.

శ్లో॥ తంతు కృచ్ఛ్రగతం దృష్ట్వా పఞ్చత్వగత మానసమ్॥ ౨౩
భృశానురక్తో మేధావీ నభవిష్యతి లక్ష్మణః।
వినష్టౌ భ్రాతరౌ శ్రుత్వా భరతోఽపి మరిష్యతి॥ ౨౪
భరతం చ మృతం దృష్ట్వా శత్రుఘ్నో న భవిష్యతి।
పుత్రా న్మృతా న్సమీక్ష్య థ న భవిష్యన్తి మాతరః॥ ౨౫
కౌసల్యా చ సుమిత్రా చ కైకేయీ చ న సంశయః।

టీ॥ కృచ్ఛ్రగతం = కష్టమును పొందిన, పఞ్చత్వగతమానసం = మరణమును పొందగోరిన, తం = ఆరాముని. దృష్ట్వా = చూచి. భృశానురక్తః = మిక్కిలిఅనురాగముగలిగిన, లక్ష్మణస్తు = లక్ష్మణుడును, న భవిష్యతి = ఉండజాలడు. (మరణించును) భ్రాతరౌ = సోదరులు, వినష్టౌ = మరణించినట్లు. శ్రుత్వా = విని. భరతోఽపి = భరతుడును. మరిష్యతి = మరణించును, మృతం = మరణించిన. భరతం = భరతుని. దృష్ట్వా = చూచి. శత్రుఘ్నః = శత్రుఘ్నుడు, నభవిష్యతి = మరణించును. అథ = అపిమ్మట, పుత్రాన్ = కుమారులను, మృతాన్ = చనిపోయిన వారినిగా. సమీక్ష్య = చూచి, మాతరః = తల్లులైన కౌసల్యా చ = కౌసల్యయు, సుమిత్రా చ = సుమిత్రయు. కైకేయీ చ = కైకేయియు, నభవిష్యన్తి = మరణించెదరు. న సంశయః = సందేహములేదు.

తా॥ సీత కనబడలేదనే దుర్వార్త వినుటతోడనే శ్రీరాముడు తప్పక మరణించును, అదిచూచి రామభక్తుడు మహాబుద్ధిశాలి యగు లక్ష్మణుడు మరణించును, సోదరుల మరణవార్త వినగనే భరతుడు మరణించును వీరందరి మరణములను చూచి శత్రుఘ్నుడు మరణించును. అపిమ్మట కుమారుల మరణవార్తలను విని కౌసల్యా, సుమిత్రా, కైకేయీ కూడ పుత్రవాత్సల్యముతో తప్పక మరణించెదరు.

శ్లో॥ కృతజ్ఞః సత్యసన్ధశ్చ సుగ్రీవః ప్లవగాధిపః॥ ౨౮
రామం తథాగతం దృష్ట్వా తత స్త్యక్ష్యతి జీవితమ్।
దుర్మనా వ్యథితా దీనా నిరానన్దా తపస్వినీ॥ ౨౯
పీడితా భర్తృశోకేన రుమా త్యక్ష్యతి జీవితమ్।
వాలిజేన తు దుఃఖేన పీడితా శోకకర్శితా॥ ౩౦
పఞ్చత్వం చ గతే రాజ్ఞి తారా పి న భవిష్యతి।
మాతా పిత్రో ర్వినాశేన సుగ్రీవ వ్యసనేన చ॥ ౩౧
కుమారో ఽఙ్గదః కస్మా ద్ధారయిష్యతి జీవితమ్।

శ్లో॥ భర్తృజేన తు దుఃఖేన హ్యభిభూతా వనౌకసః॥ ౩౨
శిరాంస్యభిహనిష్యన్తి తలైర్ముష్టిభిరేవ చ।
సాన్త్వేనానుప్రదానేన మానేన చ యశస్వినా॥ ౩౩
లాలితాః కపిరాజేన ప్రాణాంస్త్యక్ష్యన్తి వానరాః।
న వనేషు న శైలేషు న నిరోధేషు వా పునః॥ ౩౪
క్రీడామనుభవిష్యన్తి సమేత్య కపికుఞ్జరాః।
సపుత్రదారాః సామాత్యా భర్తృవ్యసనపీడితాః॥ ౩౫
శైలాగ్రేభ్యః పతిష్యన్తి సమేత్య విషమేషు చ।
విషముద్బన్ధనం వాపి ప్రవేశం జ్వలనస్య వా॥ ౩౬
ఉపవాసమథో శస్త్రం ప్రచరిష్యన్తి వానరాః।
ఘోరమారోదనం మన్యే గతే మయి భవిష్యతి॥ ౩౭
ఇక్ష్వాకుకులనాశశ్చ నాశశ్చైవ వనౌకసామ్।
సోఽహం నైవ గమిష్యామి కిష్కిన్ధాం నగరీమితః॥ ౩౮
న చ శక్ష్యామ్యహం ద్రష్టుం సుగ్రీవం మైథిలీం వినా।

టీ॥ తతః = అటుతరువాత, తథాగతం = ఆప్రకారము అయిన, రామం = శ్రీరాముని, దృష్ట్వా = చూచి, కృతజ్ఞః = కృతజ్ఞుడైనట్టియు, సత్యసన్ధః = సత్యసంధుడైనట్టియు, ప్లవగాధిపః = వానరప్రభువైన, సుగ్రీవశ్చ = సుగ్రీవుడును, జీవితం = జీవితమును, త్యక్ష్యతి = విడువగలడు. భర్తృశోకేన = భర్తృశోకముచేత, పీడితా = బాధింపబడుచున్నట్టియు, దుర్మనా = వికలమైన మనస్సుకలదియు, వ్యథితా = బాధపడుచున్నదియు, దీనా = దీనురాలైనట్టియు, నిరానన్దా = విచారించుచున్నదియు, తపస్వినీ = తాపసురాలైన, రుమా = సుగ్రీవుని భార్యయగు రుమ. జీవితం = జీవితమును. త్యక్ష్యతి = విడువగలదు. రాజ్ఞి = ప్రభువైనసుగ్రీవుడు. పఞ్చత్వం గతే = మరణించగా, వాలిజేన = వాలివలన కలిగిన, దుఃఖేన తు = దుఃఖముచేత, పీడితా = బాధింపబడియున్నట్టియు, శోకకర్శితా = శోకముచేకృశించిన. తారాపి

తారయు. న భవిష్యతి = లేకుండును (మరణించును). మాతా పిత్రోః = తల్లిదండ్రులయొక్క, వినాశేన = మృతిజెందుటవలన, సుగ్రీవవ్యసనేన చ = సుగ్రీవునకు కలిగిన కష్టముచేతను. కుమారః = కుమారుడైన. అంగదోఽపి = అంగదుడును. జీవితం = జీవితమును, కస్మాత్ ధారయిష్యతి = ఎందుకుధరించియుండును? వనౌకసః = వానరులు, భర్తృజేన = ప్రభువైన సుగ్రీవునకు కలిగిన, దుఃఖేన తు = దుఃఖముచేత. అభిఘాతాః = అధికశోకితులై, తలైశ్చ = కరతలములచేతను. ముష్టిభిరేవ చ = పిడికిళ్లతోను. శిరాంసి = తలలను, అభిహనిష్యన్తి = బ్రద్దలుగొట్టుకొందురు, యశస్వినా = కీర్తిమంతుడైన, కపిరాజేన = సుగ్రీవునిచేత, సాంత్వేన = శాంతముచేత. అనుప్రదానేన = ఈయబడుచున్న, మానేన చ = గౌరవముచేతను, లాలితాః = పాలింపబడుచున్న, వానరాః = వానరులు, ప్రాణాన్ = ప్రాణములను, త్యక్ష్యన్తి = విడువగలరు. కపికుఞ్జరాః = వానరశ్రేష్ఠులు, సమేత్య = కలసి, వనేషు = వనములయందుగాని, శైలేషు = పర్వతములయందుగాని, పునః = తిరిగి, నిరోధేషు వా = గృహములయందు గాని, క్రీడాం = క్రీడను, నానుభవిష్యన్తి = అనుభవించలేరు. భర్తృవ్యసనపీడితాః = ప్రభువైన సుగ్రీవునికి కలిగిన దుఃఖముతో పీడింపబడినవారై, స పుత్రదారాః = భార్యాపుత్రులతోకలిసి, సామాత్యాః = అమాత్యసమేతులుగా సమేత్య = కలిసికొని, శైలాగ్రేభ్యః = పర్వతకొనల నుండి. విషమేషు = మెట్టపల్లములుగల ప్రదేశములందు, పతిష్యన్తి = పడగలరు, వానరాః = వానరులు, విషం = విషమును, ఉద్బన్ధనం చ = ఉరిపోసికొనుటను, జ్వలనస్య = అగ్నియొక్క, ప్రవేశనం వా = ప్రవేశమునుగాని, ఉపవాసం వా = ఉపవాసమునుగాని, అధఃశస్త్రం వా = క్రింద శస్త్రముల నుంచుకొని దూకుటనుగాని, ప్రచరిష్యన్తి = ఆచరించగలరు. మయి = నేను, గతేసతి = కిష్కింధకు వెళ్లిన యెడల, ఘోరం = ఘోరమైన. ఆరోదనం = = ఏడ్పు. భవిష్యతి = కాగలదు, ఇక్ష్వాకు కులనాశశ్చ = ఇక్ష్వాకు కులనాశమును,

వనౌకసాం = వానరులయొక్క, నాశశ్చైవ = నాశనమును, భవిష్యతి = కాగలదు, ఇతిమన్యే = అని తలచుచున్నాను. సః = ఆ, అహం = నేను, ఇతః = ఇచ్చటనుంచి, కిష్కింధాపురీం = కిష్కింధాపురమును గూర్చి, నైవగమిష్యామి = వెళ్లలేను, అహం = నేను, మైథిలీం వినా = సీతనుచూడక, సుగ్రీవం = సుగ్రీవుని, ద్రష్టుం = చూచుటకు, నశక్యామి = సమర్ధుడను గాను.

తా॥ శత్రునాశనము జేసి నన్ను పట్టాభిషిక్తుని చేసిన మహోపకారి యగు రాముడు, నావలన ప్రత్యుపకారము బొందకనే మృతిజెందెనా? ఎంత దురదృష్టవంతుడను! దుష్ట రావణ సంహారమున సహకరింతునని చేసిన ప్రతిజ్ఞ అసత్యమయ్యెనుగదా! యని చింతించి, రామవియోగ దుఃఖమును భరించలేక, సుగ్రీవుడు మరణించును. భర్త మరణ వార్త విని భార్యయైన రుమయు, వాలిభార్యతారయు పుత్రుడైన అంగదుడు మరణింతురు. సుగ్రీవుని మరణవార్త వినగనే సుపరిపాలనా దక్షుడగు రాజుయొక్క వియోగదుఃఖమును భరించలేక వానరులందరు విషము తినియు, ఉరిపోసికొనియు, మంటలలో జొరబడియు, పర్వత శిఖరముల నుండి దూకియు, ఇట్లనేకవిధముల ప్రాణముల బాయుదురు. కనుక నేను కిష్కింధకు బోయిన ఏడుపు మినహా మరేమియు కలుగదు. నేను వెళ్ళినచో యిక్ష్వాకువంశనాశనము వానరవంశనాశనము తప్పకజరుగును, కనుక నేను సీతనుజూచి, క్షేమము తెలిసికొని గాని నేనిక్కడనుంచి కిష్కింధకు బోనని హనుమంతుడు నిశ్చయించుకొనెను.

శ్లో॥ మయ్యగచ్ఛతి చేహస్థే ధర్మాత్మానౌ మహారథౌ॥ 38
ఆశయా తౌ ధరిష్యేతే వానరాశ్చ మనస్వినః।

టీ॥ మయి = నేను, అగచ్ఛతి = వెళ్లనివాడ నగుచు, చ = మరియు, ఇహస్థే = ఇచ్చటనే యున్నచో, ధర్మాత్మానౌ = ధర్మస్వరూపులు,

మహారథౌ = మహారథికులునైన తౌ = ఆరామలక్ష్మణులు. మనస్వినః = అభిమానవంతులైన, వానరాశ్చ = వానరులును, ఆశయా = సీతాక్షేమముయొక్క ఆశతో, ధరిష్యేతే = జీవించియుందురు.

తా॥ నేను కిష్కింధకు బోక యిచ్చటనే యున్నచో మహారథికులు మహానుభావులు నైన ఆరామలక్ష్మణులు అభిమానవంతు లగు వానరులు నావలన సీతయొక్క క్షేమవార్త తెలియునను ఆశతోజీవించియుందురు,

* హనుమంతుడు ప్రాణత్యాగముచేయ నాలోచించుట *

శ్లో॥ హస్తాదానో ముఖాదానో నియతో వృక్షమూలికః॥ ౪౦
వానప్రస్థో భవిష్యామి హ్యదృష్ట్వా జనకాత్మజామ్।
సాగరా నూపజేదేశే బహుమూల ఫలోదకే॥ ౪౧
చితాం కృత్వా ప్రవేక్ష్యామి సమిద్ధ మరణీసుతమ్।
ఉపవిష్టస్య వా సమ్య గ్లిఙ్గినీం సాధయిష్యతః॥ ౪౨
శరీరం భక్షయిష్యన్తి వాయసా శ్శ్వాపదాని చ।
ఇదం మహర్షిభి ర్దృష్టం నిర్యాణ మితి మే మతిః॥ ౪౩
సమ్యగాపః ప్రవేక్ష్యామి నచే త్పశ్యామి జానకీమ్।
సుజాతమూలా సుభగా కీర్తిమాలా యశస్వినీ॥ ౪౪
ప్రభగ్నా చిరరాత్రీయం మమ సీతా మపశ్యతః।
తాపసోవా భవిష్యామి నియతో వృక్షమూలికః॥ ౪౫
నేతః ప్రతిగమిష్యామి తా మదృష్ట్వా ఒసితేక్షణామ్।
యదీతః ప్రతిగచ్ఛామి సీతా మనధిగమ్యతామ్॥ ౪౬
అఙ్గద స్సహతైః స్సర్వై ర్వానరైః న భవిష్యతి।
వినాశే బహవో దోషా జీవ న్భద్రాణి పశ్యతి॥ ౪౭
తస్మా త్ప్రాణాన్ ధరిష్యామి ధ్రువో జీవితసఙ్గమః।
ఏవం బహువిధం దుఃఖం మనసా ధారయ న్ముహుః॥ ౪౮
నాధ్యగచ్ఛ త్తదా పారం శోకస్య కపికుఞ్జరః।

టీ॥ జనకాత్మజాం = సీతను, అదృష్ట్వా హి = చూడనట్లయినచో, వాన ప్రస్థః = వానప్రస్థాశ్రమస్థుడనై, వృక్షమూలికః = చెట్టుమొదటకూర్చున్నవాడనై, హస్తాదానః = చేతికివచ్చినది ముఖాదానః = నోటిలో పడినది, నియతః = నియమమైన ఆహారము గలవాడనై, భవిష్యామి = కాగలను. బహుమూలఫలోదకే = అనేక కందమూల ఫలములు ఉదకములు కలిగినట్టియు. సాగరానూపజే = సముద్రతీరమున బయలుదేరిన, దేశే = ప్రదేశమందు, సమిద్ధం = కూర్చబడిన, అరణీసుతం = అగ్నిహోత్రుని, చితాం = చితిగ, కృత్వా = చేసికొని, ప్రవేక్ష్యామి = ప్రవేశించెదను. లింగినీం = శరీరమును, సమ్యక్ = లెస్సగా, సాధయిష్యతః = సాధనజేయుచున్న, ఉపవిష్టస్య = కూర్చున్నవాయొక్క, శరీరం = శరీరమును, వాయసాః వా = కాకులుగాని శ్వాపదాని వా = క్రూరమృగములుగాని, భక్షయిష్యన్తి = భుజించగలవు, జానకీం = సీతను, నపశ్యామిచేత్ = చూడకపోయినయెడల, సమ్యక్ = లెస్సగా, అపః = ఉదకమును, ప్రవేక్ష్యామి = ప్రవేశించుదును. ఇదం = ఈ; నిర్యాణం = మరణము, మహర్షిభిః = మహర్షులచేత, దృష్టం = చూడబడుము, ఇతి = అని, మే = నాయొక్క మతిః = బుద్ధి, సీతాం = సీతను, అసితేక్షణాం = నల్లనిచూపులుగల, తాం = ఆసీతను. అదృష్ట్వా = చూడక, ఇతః = ఇచ్చటనుంచి. నప్రతిగమిష్యామి = తిరిగివెళ్లను, వృక్షమూలికః = చెట్టుమొదట కూర్చున్నవాడనై, నియతః = నియమముగలవానై, తాపసోవా = ఋషిగానైన, భవిష్యామి = కాగలను, తాం = ఆసీతలు, అనధిగమ్య = సమీపించిచూడక, ఇతః = ఇక్కడనుంచి, నప్రతిగమిష్యామ్యతి = తిరిగివెళ్లినట్లయిన, అంగదః = అంగదుడు, తైః = ఆ, సర్వైః = సమస్తమైన, వానరైస్సహ = వానరులతోకూడ. నభవిష్యతి = ఉండడు (మరణించును) వినాశే = మరణించుటయందు, బహవః = అనేకములైన, దోషాః = దోషములు, (ఉన్నవి) జీవన్ = బ్రతికియున్నవాడు, భద్రాణి = శుభములను, పశ్యతి = చూడగలడు, తస్మాత్ = ఆకారణ

ముచేవలన. ప్రాణాన్ = ప్రాణములను. ధరిష్యామి = ధరించెదను, జీవితసఙ్గమః = జీవించియుండుట. ధ్రువః = నిశ్చయము. కపికుఞ్జరః = కపిశ్రేష్ఠుడైన. హనుమంతుడు. ఏవం = ఈవిధముగా. బహువిధం = అనేకవిధములైన, దుఃఖం = విచారమును, మనసా = మనస్సుతో. ముహుః = మాటిమాటికి, ధారయన్ = ధరించుచున్నవాడై. తదా = అప్పుడు. శోకస్య = దుఃఖముయొక్క. పారం = అంతమును. నాధ్యగచ్ఛత్ = పొందజాలకపోయెను.

తా॥ బుద్ధిమంతుడైన హనుమంతుడు సీతనుజూడక కిష్కింధకు బోయిన జరుగుస్థితిని, వెళ్ళక యిచ్చటనే యున్న కలుగు ఫలితమును తాను మరణించిన లేక జీవించియున్న జరుగబోవు పరిణామములను తనలో తాను పరిశీలించి తర్కించుకొనుచుండెను. నేను కిష్కింధకు బోయి సీతకనబడలేదను వార్త చెప్పుటతోడనే, అచ్చటంతయు దుఃఖమయమైపోవును. కాక యిచ్చటనే యుండిన సీతను జూచి హనుమంతుడు రావచ్చునని రామలక్ష్మణులు, సుగ్రీవుడు, వానరులు ప్రశాంతముగానుందురు. కనుక ఇక సీత కనబడనిచో నేను వానప్రస్థాశ్రమమును స్వీకరించి నియమబద్ధుడనై చేతి కందినదానిని నోటి కందినదానిని భుజించుచు జీవించియుండును. లేనిచో యెక్కువగా కందమూలములు, పండ్లు, పుష్పములు, ఉదకము కలిగియున్న సముద్రతీరమందు చితి నిర్మించుకొని నాజీవితము నగ్నిహోత్రున కాహుతి చేయుదును. అదియుగాకపోయిన శరీరాపేక్షవీడి నియమముగా కూర్చుండియుండ కాకులుగాని అడవిలోనుండు క్రూరమృగములుగాని నా శరీరమును భక్షించును. సముద్రజలమందు బడి మృతినొందుదును, లేక తపస్సు చేసికొనుచు కాలమును గడపెదను. కాని సీతను చూడక మాత్రము కిష్కింధకు వెళ్ళుట సర్వానర్థములకు హేతువగును. "జీవన్ భద్రాణిపశ్యతి" అన్నట్లు జీవించియున్న సర్వసుఖములు పొందవచ్చును. కావున పరిశీలించి చూచిన నేను మరణించుటకంటె బ్రతికియుండుటయే మంచిది. అను శుభనిర్ణయమును గైకొనెను.

అయినను మనస్సులో ఆవేదన యంతరించక మాటిమాటికి విచారించుచు శాంతిని పొందజాలకపోయెను. వానప్రస్థాశ్రమము :- బ్రహ్మచర్యాది ఆశ్రమములలో నిది మూడవది. ఈ ఆశ్రమ మందు గృహస్థ ధర్మములను వదలి వైరాగ్యము నొంది వనమునకు బోయి పరబ్రహ్మ స్వరూపానుసంధానమునకు దగిన జపాద్యనుష్ఠానములను చేయుదురు. దీనినే వానప్రస్థాశ్రమ మందురు.

"జీవితం మరణాచ్ఛ్రేయో జీవన్ధర్మ మవాప్నుయాత్॥ (భారతం)
(విశ్వామిత్ర చండాల సంవాదం)
"శరీరం ధర్మ సర్వస్వం రక్షణీయం ప్రయత్నతః।
శరీరా త్స్రవతే ధర్మః పర్వతా త్సలిలం యథా॥ (శంఖుడు)
"బ్రతికియుండిన శుభములు బడయవచ్చు" (భారతం)
"శరీర మాద్యం ఖలు ధర్మసాధనమ్॥ (కాళిదాసు)

శ్లో॥ రావణం వా వధిష్యామి దశగ్రీవం మహాబలమ్॥ ౨౯
కామ మస్తు హృతా సీతా ప్రత్యాచీర్ణం భవిష్యతి।
అథవైనం సముత్క్షిప్య ఉపర్యుపరి సాగరమ్॥ ౩౦
రామాః యోపహరిష్యామి పశుం పశుపతే రివ।
ఇతి చిన్తాం సమాపన్న స్సీతా మనధిగమ్యతామ్॥ ౩౧
ధ్యాన శోకపరీతాత్మా చిన్తయామాస వానరః।

టీ॥ మహాబలం = గొప్పబలము కలిగిన, దశగ్రీవం = పదిశిరస్సులు కలిగిన, రావణం వా = రావణునైన, వధిష్యామి = చంపుదును, కామం = తప్పక, సీతా = సీత, హృతా = అపహరింపబడినదై అస్తు = అగుగాక, ప్రత్యాచీర్ణం = (రావణవధ) దానికిప్రతీకారము, భవిష్యతి = కాగలదు, అథవా = కానిచో, ఏనం = ఈరావణుని,

సాగరం = సముద్రుని. ఉపర్యుపరి = పైపైన. సముత్క్షిప్య = ఈడ్చుకొని తీసికొనిపోయి. పశుపతేః = అగ్నిహోత్రునికి. పశు మివ = యజ్ఞ పశువునువలె. రామాయ = శ్రీరామునికొఱకు. ఉపహరిష్యామి = సమర్పించెదను. తాం = ఆ. సీతాం = సీతను. అనధిగమ్య = చేరజాలక. వానరః = హనుమంతుడు. ఇతి = ఈలాగున. చిన్తాం = విచారమును. సమాపన్నః = పొందినవాడై. ధ్యానశోక పరీతాత్మా-ధ్యాన = సీతా ధ్యానముచేతను. శోక = ఆమె కనిపించలేదనే శోకముచేతను. పరీత. = వ్యాప్తమైన. ఆత్మా = మనస్సు గలవాడై. చిన్తయామాస = విచారించెను.

తా॥ రావణుడు సీతను తెచ్చిన మాట పూర్తిగా నిజము. అందుచే ప్రస్తుతము రావణుని చంపిగాని, లేక బంధించిగాని సముద్రము మీదుగా ఆకాశమున ఈడ్చుకొనుచు పోయి అగ్నిహోత్రునికి యజ్ఞపశువును సమర్పించినట్లు శ్రీరామునికి ఈపశుప్రాయుడైన రావణుని సమర్పించెదను. అని ఆలోచించుచు సీత కనబడని కారణముచే మహాదుఃఖమును పొందుచు హనుమంతుడు విచారించెను. పశుపతిః = అగ్నిహోత్రుడు "ఇమం పశుం పశుపతే అద్య బధ్నామ్యగ్నే" ఇతి శ్రుతిః॥ పశువు = మేక.

శ్లో॥ యావత్సీతాం హి పశ్యామి రామపత్నీం యశస్వినీమ్। ౨౨
తావదేతాం పురీం లఙ్కాం విచినోమి పునఃపునః।
సమ్పాతి వచనా చ్చాపి రామం యద్యాన యామ్యహమ్। ౨౩
అపశ్యన్ రాఘవో భార్యాం నిర్దహే త్సర్వ వానరాన్।
ఇహైవ నియతాహారో వత్స్యామి నియతేన్ద్రియః॥ ౨౪
నమత్కృతే వినశ్యేయు స్సర్వేతే నర వానరాః।
అశోకవనికా చేయం దృశ్యతే యా మహాద్రుమా॥ ౨౫
ఇమా మధిగమిష్యామి నహీయం విచితా మయా।
వసూన్ రుద్రాం స్తదాదిత్యా నశ్వినౌ మరుతోఽపి చ॥ ౨౬
నమస్కృత్వా గమిష్యామి రక్షసాం శోకవర్ధనః।

జిత్వా తు రాక్షసాన్ సర్వా నిక్ష్వాకుకుల నన్దినీమ్॥ ౫౭
సంప్రదాస్యామి రామాయ యథా సిద్ధిం తపస్వినే,
సుముహూర్త మివ ధ్యాత్వా చిన్తా వగ్రథితేన్ద్రియః॥ ౫౮
ఉదతిష్ఠ న్మహాతేజా హనుమా న్మారుతాత్మజః।

టీ॥ యావత్ = ఎంతపర్యంతము, యశస్వినీం = కీర్తివంతురాలైన, రామపత్నీం = శ్రీరామునిభార్య అయిన, సీతాం = సీతను, పశ్యామి = చూడగలనో, తావత్ హి = అంతపర్యంతము, ఏతాం = ఈ, లఙ్కాం = లంకాపట్టణమును, పునఃపునః = తిరిగి తిరిగి, విచినోమి = వెదకెదను, అపి చ = మరియు, అహం = నేను, సమ్పాతివచనాత్ = సంపాతియొక్క వాక్యమువలన, రామం = శ్రీరాముని, ఆనయామ్యది = తీసికొనివచ్చినట్లయిన, రాఘవః = శ్రీరాముడు, భార్యాం = భార్యయగు సీతను, అపశ్యన్ = చూడనివాడై, సర్వవానరాన్ = సమస్తవానరులను, నిర్దహేత్ = చంపివేయును, ఇహైవ = ఇచ్చటనే, నియతేన్ద్రియః = జితేంద్రియుడనై, నియతాహారః = ఆహారనియమము కలవాడనై, వత్స్యామి = ఉండెదను; మత్కృతే = ఇలా నే చేయుటయందు, తే = ఆ, సర్వే = సమస్తమైన, నరవానరాః = నరులు వానరులు, నవినశ్యేయుః = నశించరు, యా = ఏది, మహాద్రుమా = గొప్పవృక్షములు గలదిగా నున్నదో, ఇయం చ = ఇదే, అశోకవనికా = అశోకవనముగ, దృశ్యతే = కనబడుచున్నది, ఇయం = ఇది, మయా = నాచేత, నవిచితా హి = వెదకబడలేదుగదా। ఇమాం = దీనినిగూర్చి, అధిగమిష్యామి = వెళ్ళగలను, రక్షసాం = రాక్షసులకు, శోకవర్ధనః = శోకమును వృద్ధిపొందించే వాడనై, వసూన్ = వసువులను, రుద్రాన్ = రుద్రులను, తథా = ఆప్రకారముగా, ఆదిత్యాన్ = ఆదిత్యులను. అశ్వినౌ = అశ్వినీదేవతలను అపి చ = మరియు, మరుతః = మరుత్తులనుగూర్చి, నమస్కృత్వా = నమస్కరించి, గమిష్యామి = వెళ్ళగలను, సర్వాన్ = సమస్తమైన, రాక్ష

సాన్ = రాక్షసులను. జిత్వాతు = జయించియే. ఇక్ష్వాకుకులనందినీం = ఇక్ష్వాకు కులమునకు సంతోషప్రదురాలైన సీతను, రామాయ = శ్రీరామునికొఱకు, తపస్వినే = తపోధనునికొఱకు, సిద్ధిం యథా = మనోభీష్టసిద్ధివలెనే, సంప్రదాస్యామి = ఈయగలవాడను, మహాతేజాః = గొప్పతేజోవంతుడైన, మారుతాత్మజః = వాయుపుత్రుడైన, సః = ఆ, హనుమాన్ = హనుమంతుడు, ముహూర్తం = ముహూర్తకాలము ధ్యాత్వా = ధ్యానించి, చిన్తావగ్రథితేన్ద్రియః = విచారముచే ముకుళింపజేయబడిన, అంగములు గలవాడై, ఉపతిష్ఠన్ = పైకిలేచెను.

తా॥ సీత కనుపించేవరకు లంకలోనే యుండి తిరిగితిరిగి వెదకెదను. సమ్పాతి యొక్క మాటను నమ్మి శ్రీరాముని యిచ్చటకు గొనితెచ్చినచో సీత కనబడని కారణమున వానరుల నందరను చంపును. కనుక నేను జితేంద్రియుడనై ఆహార విహారములందు నియమబద్ధుడనై, ఇచ్చటనే జీవితాంతము గడపుదును. నా నిమిత్తమై శ్రీరామలక్ష్మణులు, వానరులు యెంతమాత్రము నశింపరాదు. అయితే ఆ కనబడునది అశోకవనమువలె తోచుచున్నది, అందు వెదకలేదు. అచ్చట కూడ సీతను వెదకెదను, అందునిమిత్తమై వసు రుద్రాదిత్యాది దేవతలకు నమస్కరించెదను. దైవానుగ్రహమున సీత కనబడినయెడల సర్వరాక్షసుల జయించి తపోధనునకు తపఃఫలసిద్ధి వలెనే శ్రీరామునకు సీత నర్పింతును. అని యీ విధమైన చిన్తానిబిడ మనస్కుడైన హనుమంతుడు కూర్చుండియున్న చోటునుండి లేచెను.

శ్లో॥ నమోఽస్తు రామాయ స లక్ష్మణాయ ।
దేవ్యై చ తస్యై జనకాత్మజాయై।
నమోఽస్తు రుద్రేన్ద్రయమానిలేభ్యో।
నమోఽస్తు చన్ద్రార్క మరుద్గణేభ్యః॥ 59

టీ॥ స లక్ష్మణాయ = లక్ష్మణునితో కూడిన, రామాయ = శ్రీ రామునికొఱకు, నమః = నమస్కారము, అస్తు = అగుగాక, చ = మరియు

దేవ్యై = దేవియగు, తస్యై = ఆ. జనకాత్మజాయై = జానకీదేవికొఱకు, నమః = నమస్కారము, అస్తు = అగుగాక. రుద్రేన్ద్రయమానిలేభ్యః = రుద్రుడు, ఇంద్రుడు. యముడు, వాయుదేవునికొఱకు, నమః = నమస్కారము, అస్తు = అగుగాక. చన్ద్రార్కమరుద్గణేభ్యః = సూర్య చంద్రులు మరుద్గణము కొఱకు, నమః = నమస్కారము, అస్తు = అగుగాక,

తా॥ హనుమంతుడు సీతాన్వేషణకొఱకు, అశోకవనమున కేగుటకుముందు ఇష్ట కార్యసిద్ధి నిమిత్తము ముందుగా సీతా రామలక్ష్మణులకు, సూర్యచంద్రులకు, అష్టదిక్పాలురకు, మరుద్గణమునకు నమస్కరించెను.

శ్లో॥ సతేభ్యస్తు నమస్కృత్య సుగ్రీవాయ చ మారుతిః।
దిశ స్సర్వా స్సమాలోక్య హ్యశోక వనికాం ప్రతి॥ ౬౦
సగత్వా మనసా పూర్వ మశోక వనికాం శుభామ్।
ఉత్తరం చిన్తయామాస వానరో మారుతాత్మజః॥ ౬౧

టీ॥ సః = ఆ, మారుతిః = హనుమంతుడు. తేభ్యః = ఆ రామలక్ష్మణ దిక్పాలాది యిష్టదేవతల కొఱకును, చ = మరియు, సుగ్రీవాయ = సుగ్రీవునికొఱకు, నమస్కృత్య = నమస్కరించి, సర్వాః = సమస్తమైన. దిశస్తు = దిక్కులను, అశోకవనికాం ప్రతి = అశోకవనమును, సమాలోక్య = చూచి, సః = ఆ, వానరః = వానరుడైన, మారుతాత్మజః = అంజనేయుడు, శుభాం = శుభప్రదమైన. అశోకవనికాం = అశోకవనమును గూర్చి, పూర్వం = ముందుగ, మనసా = మనస్సుతో గత్వా = వెళ్లి, ఉత్తరం = తదుపరి కర్తవ్యమునుగూర్చి, చిన్తయామాస = చింతించెను,

తా॥ ఆ హనుమంతుడు సీతారామలక్ష్మణ సూర్య చంద్రాది సర్వదేవతలకును సుగ్రీవునకును నమస్కరించి, సర్వదిక్కులను, తదుపరి అశోకవన

మును చూచి, శుభప్రదమైన ఆ అశోకవనమును ముందుగ మనస్సు తోనే ప్రవేశించి ఆతరువాత కార్యక్రమమును గూర్చి ఆలోచించ నారంభించెను.

శ్లో॥ ధ్రువం తు రక్షో బహులా భవిష్యతి వనాకులా।
అశోకవనికా చిన్త్యా సర్వ సంస్కార సంస్కృతా॥ ౬౨
రక్షిణ శ్చాత్ర విహితా నూనం రక్షన్తి పాదపాన్।
భగవా నపి సర్వాత్మా నాతిక్షోభం ప్రవాతి వై॥ ౬౩

టీ॥ రక్షోబహులా = అనేక సంరక్షకులు కలిగిన, వనాకులా = వనములతో వ్యాప్తమైన, అశోకవనికా = అశోకవనము, ధ్రువం = నిశ్చయముగా, సర్వసంస్కారసంస్కృతా = అన్నివిధములైన సంస్కారములతో కూడియున్నదిగా, చిన్త్యా = ఆలోచించబడినదై, భవిష్యతి = అగుచున్నది, అత్ర = ఇచ్చట, రక్షిణశ్చ = రక్షకులును, విహితాః = ఉంచబడినవారై, పాదపాన్ = వృక్షములను, రక్షన్తి = రక్షించుచున్నారు, సర్వాత్మా = సర్వవ్యాపకుడగు, భగవానపి = వాయువుకూడ, నూనం = నిశ్చయముగా, అతిక్షోభం = ఎక్కువ బాధాకరముగ, నప్రవాతి వై = విసరుటలేదు గదా।

తా॥ ఈ అశోకవనము అనేకరక్షకభటులతోను చుట్టును చిన్న చిన్న ఉపవనములతోను, చక్కగా సంస్కరింపబడి యున్నది, ఇచ్చట కావలి యున్న రాక్షసులు ఇందలి చెట్లను జాగ్రత్తగా రక్షించుచుండుటవలన వాయుదేవుడు కూడ ప్రకంపనము చేయలేక పోవుచున్నాడు గదా।

శ్లో॥ సంక్షిప్తోఽయం మయాత్మా చ రామార్థే రావణస్య హి।
సిద్ధిం మే సంవిధా స్యన్తి దేవా స్సర్షిగణా స్త్విహ॥ ౬౪

టీ॥ మయా = నాచేత, రామార్థే = శ్రీరాముని కొఱకు, రావణస్య = రావణునికి, అయం = ఈ, ఆత్మాచ = రూపమే, సంక్షిప్తః = సూక్ష్మ

కరించవలెగదా। ఇహ = ఇక్కడ, మే = నాకు, సర్షిగణాః = ఋషిగణములతో కూడిన, దేవాః = దేవతలు, సిద్ధం = సిద్ధిని, సంవిధాస్యన్తి = చేకూర్చుదురుగాక.

తా॥ సీతాన్వేషణ రూపమైన శ్రీరామకార్యమును జేయువాడనై నేనిప్పటికి వచ్చినాడను, సీతను జూచువరకు రావణుడు నన్ను జూడకుండునట్లు రహస్యముగ నుండునట్లు నాశరీరమును చిన్నదిగా చేసి కార్యసిద్ధికి తగునటుల ప్రయత్నము జేయుదును, దేవతలు మహర్షులు నా యీ కార్యసిద్ధి ననుగ్రహింతురు గాక.

శ్లో॥ బ్రహ్మా స్వయంభూ ర్భగవాన్ దేవాశ్చైవ దిశన్తు మే।
సిద్ధి మగ్నిశ్చ వాయు శ్చ పురుహూత శ్చ వజ్రభృత్॥ ౬౫
వరుణః పాశహ స్తశ్చ సోమాదిత్యౌ తథైవ చ।
అశ్వినౌ చ మహాత్మానౌ మారుత శ్శర్వఏవ చ॥ ౬౬

టీ॥ భగవాన్ = భగవంతుడు, స్వయంభూః = స్వయంభూతుడునైన, బ్రహ్మ = బ్రహ్మయు. దేవాశ్చ = దేవతలును, అగ్నిశ్చ = అగ్ని దేవుడును, వాయుశ్చ = వాయుదేవుడును, వజ్రభృత్ = వజ్రధారియగు, పురుహూతశ్చ = దేవేంద్రుడును, మే = నాకు. తథైవ చ = ఆప్రకారముగనే, వరుణః = వరుణదేవుడును, పాశహస్తశ్చ = యముడును, సోమాదిత్యౌ = చంద్రసూర్యులును, మహాత్మానౌ = మహాత్ములైన, అశ్వినౌ చ = అశ్వినీదేవతలును, మరుతః = సప్తమరుత్తులును, శర్వ ఏవ చ = రుద్రుడును, సిద్ధిమేవ = కార్యసిద్ధినే, దిశన్తు = ఇచ్చెదరుగాక.

తా॥ బ్రహ్మ రుద్రేంద్రాది సమస్తదేవతలు, వాయువు, అగ్ని, వరుణుడు, సూర్యచంద్రులు, అశ్వినీదేవతలు, సప్తమరుత్తులు, నాకు సీతాన్వేషణ కార్యసిద్ధిని కలుగజేయుదురు గాక.

శ్లో॥ సిద్ధిం సర్వాణి భూతాని భూతానాం చైవ యః ప్రభుః।
దాస్యన్తి మమ యేచాన్యే హ్యదృష్టాః పథిగోచరాః॥ ౬౭

టీ॥ సర్వాణి భూతాని = సమస్తమైన భూతములును, చ = మరియు భూతానాం = భూతములకు, యః = ఎవడు, ప్రభు రేవ = ప్రభుం సః = అతడును, అన్యే = = ఇతరములైన; యే = ఎవ్వి, పథి మార్గమందు, అదృష్టాః = చూడబడవో; చ = మరియు, పథి = మ మందు, గోచరాః = కనబడుసర్వులు, మమ = నాకు, సిద్ధిం = కా సిద్ధిని, దాస్యన్తి = ఇచ్చెదరుగాక.

తా॥ సమస్త భూతములు, ఆ సర్వభూతములకు ప్రభువు మరియు దృష్టి కనబడునట్టియు, కనబడని సమస్తదేవతలు నాకు కార్యసిద్ధిని కల జేయుదురుగాక.

శ్లో॥ త దున్నసం పాణ్డుర దన్త మవ్రణమ్।
శుచిస్మితం పద్మపలాశలోచనమ్।
ద్రక్ష్యే తదార్యావదనం కదాన్వహమ్।
ప్రసన్న తారాధిప తుల్య దర్శనమ్॥ ౬

టీ॥ ఉన్నసం = ఉన్నతమైన నాసిక కలిగినట్టియు, అవ్రణం = అనవద మైనట్టియు, పాణ్డురదన్తం = తెల్లని దంతములు కలిగినట్టియు, శు స్మితం = చిరునగవుతో కూడియున్నట్టియు, పద్మపలాశలోచనం = తామరరేకులవంటి నేత్రములు కలిగినట్టియు, ప్రసన్న తారాధిప తుల దర్శనం = పూర్ణచంద్రునితో సమానముగ కనబడు, తత్ = ఆ, ఆరా వదనం = సీతాదేవిముఖమును, అహం = నేను, కదా = ఎప్పుడు ద్రక్ష్యే = చూడగలను ?

తా॥ తామరరేకులవంటి నేత్రములతో, ఉన్నతమైన నాసికతో, తెల్లని దం పంక్తితో, చిరునగవుతో, మరియు సర్వ సాముద్రిక శాస్త్రోక్త శు లక్షణములతో కూడియుండి, పూర్ణచంద్రునితో సమానమైన ఆసీతాదే యొక్క ముఖము నెప్పుడు చూచెదనోకదా!

శ్లో॥ క్షుద్రేణ పాపేన నృశంసకర్మణా।
సుదారుణాలఙ్కృత వేషధారిణా।
బలాభిభూతా హ్యబలా తపస్వినీ।
కథంను మే దృష్టిపథేఽద్య సా భవేత్॥ ౨౫

టీ॥ క్షుద్రేణ = నీచుడైనట్టియు, పాపేన = పాపాత్ముడైనట్టియు, నృశంస కర్మణా = నీచకర్మ కలిగినట్టియు, సుదారుణాలఙ్కృతవేషధారిణా = దారుణముగ నలంకృతమైన వేషధారణ గల రావణునిచేత, బలాభిభూతా = బలాత్కారముగ తీసికొని రాబడినట్టియు, అబలా = అబల అయినట్టియు, తపస్వినీ = తపోధనురాలైన, సా = ఆసీతాదేవి, మే = నాయొక్క, దృష్టిపథే = దృష్టిమార్గమందు, అద్య = ఇప్పుడు, కథం = ఎట్లు, భవేత్ = అగును (కనబడును)

తా॥ మహాపాపి, నీచుడు, దుర్మార్గుడు, నీచకర్మగల రావణుడు కృత్రిమ తాపసవేషమును ధరించి, మాయోపాయమున బలాత్కారముగ తీసికొని వచ్చిన, అబల, తపోధనురాలైన రామపత్ని సీత ఎప్పుడు నా దృష్టి పథమున బడునో (అని చింతించెను)

త్రయోదశస్సర్గము సమాప్తము



# శ్రీమద్వాల్మీకిరామాయణే సున్దరకాణ్డే చతుర్దశ స్సర్గః

## * హనుమంతుడు అశోకవనంబున ప్రవేశించుట *

శ్లో॥ స ముహూర్త మివ ధ్యాత్వా మనసా చాధిగమ్యతామ్।
అవప్లుతో మహాతేజాః ప్రాకారం తస్య వేశ్మనః॥ ౧

టీ॥ మహాతేజాః = గొప్పతేజోవంతుడైన, సః = ఆహనుమంతుడు, ముహూర్తం = ముహూర్తకాలము, ధ్యాత్వా = ధ్యానముచేసికొని, మనసా చ = మనస్సుతోనే, తాం = ఆ అశోకవనమును, అధిగమ్య = పొంది, తస్య = ఆ, వేశ్మనః = గృహముయొక్క, ప్రాకారం = ప్రాకారమును, అవప్లుతః = దాటినవాడాయెను.

తా॥ ఆ హనుమంతుడు ముహూర్తకాలము ధ్యానము చేసి అశోకవనము నకు బోదలంచి రావణగృహమునుండి అశోకవనప్రాంతమునకు బోయెను.

శ్లో॥ సతు సంతుష్ట సర్వాఙ్గః ప్రాకారస్థో మహాకపిః।
పుష్పితాగ్రా న్వసన్తాదౌ దదర్శ వివిధాన్ ద్రుమాన్॥ ౨
సాలా నశోకా న్భవ్యాం శ్చ చమ్పకాం శ్చ సుపుష్పితాన్।
ఉద్దాలకా న్నాగవృక్షాం శ్చూతా న్కపిముఖా నపి॥ ౩

టీ॥ సంతుష్ట సర్వాఙ్గః-సంతుష్ట = సంతోషముతోనిండిన (పులకరించిన) సర్వాఙ్గః = సమస్తావయవములు గలవాడై, సః = ఆ, మహాకపిః = గొప్పవానరుడైన హనుమంతుడు, ప్రాకారస్థః = ప్రాకారమందున్న వాడగుచు, వసన్తాదౌ = వసంతఋతుప్రారంభమందు, పుష్పితాగ్రాన్ = పుష్పించిన కొమ్మలుగల, వివిధాన్ = అనేకవిధములైన, ద్రుమాన్ = చెట్లను, దదర్శ = చూచెను, సాలాన్ = మద్దివృక్షములను అశోకాన్ = అశోకవృక్షములను, భవ్యాన్ = సుందరములైన,

సుపుష్పితాన్ = బాగుగాపూసిన, ఉద్దాలకాన్ = విరిణిమ్రానులను, నాగవృక్షాన్ = గజవృక్షములను, చూతాన్ = మామిళ్లను, కపిముఖానపి = కోతిమూతికాయలుగల వృక్షములను. దదర్శ = చూచెను.

తా॥ ఆ హనుమంతుడు అశోకవనమునందు ప్రవేశింపగనే ఉత్సాహముతో నుప్పొంగి పులకరించిన సర్వాంగములు గలవాడై, వసంతఋతు ప్రారంభమునందు బాగుగా పుష్పించిన వివిధములైన మద్ది, అశోక చంపక విరిణి. నాగ, చూత, కపిముఖాది వృక్షములను చూచెను.

శ్లో॥ అథామ్రవణ సఞ్ఛన్నాం లతాశత సమావృతామ్।
జ్యాముక్త ఇవ నారాచః పుప్లువే వృక్షవాటికామ్॥ ౪

టీ॥ అథ = అటుతరువాత, ఆమ్రవణసఞ్ఛన్నాం - ఆమ్రవణ = మామిడి తోటలతో, సఞ్ఛన్నాం = కూడియున్నట్టియు, లతాశతసమావృతాం = వందలకొలది లతలతో కూడియున్న, వృక్షవాటికాం = అశోకవనమును గూర్చి, జ్యాముక్తః = నారినుండి విడువబడిన, నారాచ ఇవ = బాణము వలె, పుప్లువే = ఎగిరెను.

తా॥ హనుమంతుడు వసంతఋతువునందు పుష్పించిన నానావిధ వృక్షములను జూచుచు, చుట్టు మామిడితోటలు, వందలకొలది లతలతో కూడియున్న అశోకవనమును గూర్చి నారినుండి విడువబడిన బాణమువలె రివ్వున దూకెను.

శ్లో॥ స ప్రవిశ్య విచిత్రాం తాం విహగై రభినాదితామ్।
రాజతైః కాఞ్చనై శ్చైవ పాదపైః సర్వతో వృతామ్॥ ౫
విహగై ర్మృగసఙ్ఘై శ్చ విచిత్రాం చిత్రకాననామ్।
ఉదితాదిత్య సఙ్కాశాం దదర్శ హనుమా న్కపిః॥ ౬
వృతాం నానావిధై ర్వృక్షైః పుష్పోపగ ఫలోపగైః।
కోకిలై ర్భృఙ్గరాజై శ్చ మత్తై ర్నిత్యనిషేవితామ్॥ ౭

శ్లో॥ ప్రహృష్ట మనుజే కాలే మృగ పక్షి సమాకులే।
మత్త బర్హిణ సఙ్ఘుష్టాం నానా ద్విజగణాయుతామ్॥ ౭

టీ॥ సః = ఆ, కపిః = వానరుడైన హనుమంతుడు, విచిత్రాం = విశేష చిత్రముగానున్నట్టియు, విహగైః = పక్షులతో, అభినాదితాం = అంతట ధ్వనింపజేయబడుచున్నట్టియు, రాజతైః = వెండిమయములు, కాఞ్చనైః = బంగారుమయములు నైన, పాదపైశ్చైవ = చెట్లతో, సర్వతః = అంతట, వృతాం = కూడియున్నట్టియు, తాం = ఆ అశోక వనమును, ప్రవిశ్య = ప్రవేశించి, విహగైః = పక్షులతోను, మృగ సఙ్ఘైశ్చ = లేళ్లగుంపులతోను, విచిత్రాం = విశేషచిత్రముగానున్నట్టియు, చిత్రకాననాన్ = చిత్రములైన అరణ్యములు కలిగినట్టియు, ఉదితాదిత్య సఙ్కాశాం = బాలభానునితో సమానముగ నున్నట్టియు, పుష్పోపగ ఫలోపగైః–పుష్పోపగ = మొగ్గలు, ఫలోపగైః = దోరకాయలు గల, నానావిధైః = అనేకవిధములైన, వృక్షైః = వృక్షములతో, వృతాం = కూడియున్నట్టియు, కోకిలైః = కోకిలలతోను, మత్తైః = మదించిన, భృంగరాజైః = శ్రేష్ఠములైన తుమ్మెదలతోను, నిత్యనిషేవితాం = ఎల్లప్పుడు సేవించబడుచున్నట్టియు, మృగపక్షిసమాకులే = లేళ్లచేతను పక్షులచేతను వ్యాప్తమైనట్టియు, ప్రహృష్ట మనుజే కాలే = ఉత్సాహభరితమైన వసంతకాలమందు, మత్తబర్హిణసఙ్ఘుష్టాం–మత్త = మదించిన, బర్హిణ = నెమళ్లతో, సఙ్ఘుష్టాం = ధ్వనింపజేయబడుచున్నట్టియు, నానాద్విజగణాయుతాం = అనేక పక్షిసమూహములతో కూడియున్న, తాం = ఆ అశోకవనమును, దదర్శ = చూచెను.

తా॥ వివిధ స్థితులతో విచిత్రముగ నున్నట్టియు, అనేకవిధములైన పక్షులతో ధ్వనింపజేయబడుచున్నట్టియు, వెండి బంగారు మయములైన చెట్లతో కూడియున్నట్టియు, పక్షులు, లేళ్లతోకూడియున్నట్టియు, బాలసూర్యుని వలె ప్రకాశించుచున్నట్టియు, మొగ్గలు, దోరకాయలు తో నిండియున్న

చెట్లతో కూడియున్నట్టియు, మదించిన గండుతుమ్మెదలు కోయిలలతో ధ్వనింపజేయబడుచున్నట్టియు, మృగపక్షిసంకులమై, వస్తుత్కృష్టశోభాయమానముగా నున్న అశోకవనమును హనుమంతుడు చూచెను.

శ్లో॥ మార్గమాణో వరారోహాం రాజపుత్రీ మనిన్దితామ్।
సుఖప్రసుప్తా న్విహగా న్బోధయామాస వానరః॥ ౯

టీ॥ వానరః = హనుమంతుడు, వరారోహాం = శ్రేష్ఠురాలైనట్టియు, అనిన్దితాం = నిర్దోషురాలైనట్టియు; రాజపుత్రీం = జనకమహారాజు కుమార్తెయగు సీతను, మార్గమాణః = వెదకుచున్నవాడగుచు, సుఖప్రసుప్తాన్ = సుఖముగ గాఢనిద్రను పొందియున్న, విహంగాన్ = పక్షులను, బోధయామాస = మేల్కొల్పెను.

తా॥ హనుమంతుడు నిర్దోషురాలు శ్రేష్ఠురాలు నగు జానకిని వెదకుచు సుఖముగ గాఢనిద్రను చెందియున్న పక్షులను తాను చెట్లమీద తిరుగుటచే మేల్కొన్నట్లు చేసెను.

శ్లో॥ ఉత్పతద్భి ర్ద్విజగణైః పక్షైః స్సాలా సమాహతాః।
అనేకవర్ణా వివిధా ముముచుః పుష్పవృష్టయః॥ ౧౦

టీ॥ ఉత్పతద్భిః = పైకెగసిపోవుచున్న, ద్విజగణైః = పక్షిసమూహముల చేత, పక్షైః = రెక్కలతో, సమాహతాః = కొట్టబడిన, సాలాః = వృక్షములు, అనేకవర్ణాః = అనేకరంగులుగలిగిన, వివిధాః = అనేకములైన, పుష్పవృష్టయః = పుష్పవర్షములను, ముముచుః = వర్షించెను.

తా॥ పక్షులు పైకెగురుటవలన వాటి రెక్కలతో కొట్టబడి, కంపించుచున్న చెట్లనుండి అనేకరంగులతో విచిత్రముగ వికసించియున్న పుష్పములు క్రిందికి పడుచు పుష్పవర్షము వర్షించుచున్నట్లు ఉండెను.

శ్లో॥ పుష్పావకీర్ణ శ్శుశుభే హనుమా న్మారుతాత్మజః।
అశోక వనికా మధ్యే యథా పుష్పమయోగిరిః॥ ౧౧

టీ॥ మారుతాత్మజః = వాయుపుత్రుడైన, హనుమాన్ = హనుమంతుడు, పుష్పావకీర్ణః = పుష్పములతో వ్యాప్తమైనవాడై, అశోకవనికా మధ్యే = అశోకవనమధ్యయందు, పుష్పమయః = పుష్పవికారమైన, గిరిర్యథా = పర్వతమువలె, శుశుభే = శోభించెను.

తా॥ చెట్లనుండి రాలిన పుష్పములతో నిండిన శరీరముతో హనుమంతుడు అశోకవన మధ్యమందు పుష్పసముదాయముతో కప్పబడిన పర్వతము వలె ప్రకాశించెను.

శ్లో॥ దిశ స్సర్వాః ప్రధావన్తం వృక్షషణ్డగతం కపిమ్।
దృష్ట్వా సర్వాణి భూతాని వసన్త ఇతి మేనిరే॥ ౧౨

టీ॥ సర్వాః = సమస్తమయిన. దిశః = దిక్కులనుగూర్చి. ప్రధావన్తం = పరుగెత్తుచున్నట్టియు, వృక్షషణ్డగతం = చెట్లగుంపులలో నున్న, కపిం = ఆంజనేయుని, దృష్ట్వా = చూచి, సర్వాణి = సమస్తములైన, భూతాని = భూతములు, వసన్త ఇతి = వసంతుడని, మేనిరే = తలంచెను.

తా॥ అశోకవనమునందు సీతాన్వేషణకొఱకై పుష్పావకీర్ణమైన శరీరముతో నలుదిక్కులకు కలయదిరుగుచున్నట్టియు, చెట్లగుంపుల మధ్యనున్న హనుమంతుని సర్వభూతములు చూచి ప్రత్యక్ష వసంతునిగా తలంచెను.

శ్లో॥ వృక్షేభ్యః పతితైః పుష్పై రవకీర్ణా పృథగ్విధైః।
రరాజ వసుధా తత్ర ప్రమదేవ విభూషితా॥ ౧౩

టీ॥ తత్ర = అక్కడ. వృక్షేభ్యః = వృక్షములనుండి, పతితైః = పడినటువంటి, పృథగ్విధైః = వేరువేరుగనున్న, పుష్పైః = పుష్పములతో,

అవకీర్ణా = వ్యాప్తమైన, వసుధా = భూమి, విభూషితా = విశేషముగా నలంకరించబడిన, ప్రమదేవ = స్త్రీవలె, రరాజ = ప్రకాశించెను.

తా॥ చెట్లనుండి రాలిన అనేక రంగుల పూలచే నిండియున్న అశోకవన భూమి విశేషముగ సింగారించుకొన్న యౌవన స్త్రీవలె ప్రకాశించు చుండెను.

శ్లో॥ తరస్వినా తే తరవ స్తర సాభి ప్రకమ్పితాః।
కుసుమాని విచిత్రాణి ససృజుః కపినా తదా॥ ౧౪

టీ॥ తదా = అప్పుడు, తరస్వినా = బలవంతుడైన. కపినా = ఆంజనేయుని చేత, తరసా = వేగముగా, అభిప్రకమ్పితాః = అంతట కదల్చబడిన, తే = ఆ, తరవః = వృక్షములు. విచిత్రాణి = చిత్రాతిచిత్రములైన, కుసుమాని = పుష్పములను, ససృజుః = రాల్చెను.

తా॥ మహాబలసంపన్నుడైన హనుమంతునిచే బలముగ ఊపబడిన చెట్ల నుండి రాలిన చిత్ర విచిత్రములైన పూలు చూచువారలకు చోద్యమును కలుగజేసెను.

శ్లో॥ నిర్ధూత పత్ర శిఖరా శ్శీర్ణ పుష్ప ఫలా ద్రుమాః।
నిక్షిప్త వస్త్రాభరణా ధూర్తా ఇవ పరాజితాః॥ ౧౫
హనుమతా వేగవతా కమ్పితా స్తే నగోత్తమాః।
పుష్ప పర్ణ ఫలా న్యాశు ముముచుః పుష్పశాలినః॥ ౧౬

టీ॥ వేగవతా = మహావేగముగల, హనుమతా = హనుమంతునిచే, కమ్పితాః = కదల్చబడినట్టియు, నిర్ధూతపత్రశిఖరాః - నిర్ధూత = పోగొట్ట బడిన, పత్రశిఖరాః = ఆకులు కొమ్మలు గలిగినట్టియు, శీర్ణపుష్పఫలాః - శీర్ణ = రాలిన, పుష్పఫలాః = పుష్పములు ఫలములుగలవై, ద్రుమాః = చెట్లు, నిక్షిప్తవస్త్రాభరణాః-నిక్షిప్త = పోగొట్టుకొనబడిన, వస్త్రాభరణాః = వస్త్రములు అలంకారములుగలవారై, పరాజితాః = ఓడిపోయిన,

ధూర్తా ఇవ = జూదరులవలె, స్థితాః = యుండెను. నగోత్తమాః = ఉన్నతములైన వృక్షములు, పుష్పశాలినః = పుష్పములతోకూడినవై, ఆశు = వెంటనే, పుష్పపర్ణ ఫలాని = పూలను ఆకులను పండ్లను, ముముచుః = విడిచినవి.

తా॥ హనుమంతునిచే బలముగ ఊపబడిన చెట్లు ఆకులు పూలు పండ్లురాలినవై, జూదమందు వస్త్రాద్యలంకారములను సొమ్మును పోగొట్టుకొన్న జూదరులవలె శోభావిహీనములుగా నుండెను. కొన్ని ఎత్తైన చెట్లుకూడ ఫలపుష్పపత్రాలను రాల్చెను.

శ్లో॥ నిర్ధూతకేశీ యువతి ర్యథా మృదితవర్ణకా।
నిష్పీత శుభదంతోష్ఠీ నఖై ర్దన్తై శ్చ విక్షతా॥ ౧౭
తథా లాఙ్గూల హస్తై శ్చ చరణాభ్యాం చ మర్దితా।
బభూ వాశోకవనికా ప్రభగ్న వరపాదపా॥ ౧౮

టీ॥ నిర్ధూతకేశీ = విడివడిన కేశములు గలిగినట్టియు, మృదితవర్ణకా = పీడింపబడిన అవయవవర్ణము కలిగినట్టియు, నిష్పీతశుభదంతోష్ఠీ-నిష్పీత = పానముచేయబడిన, శుభ = శుభమైన, దంతోష్ఠీ = దంత,అధరోష్ఠములు కలిగినట్టియు, నఖైః = గోళ్లతోను,దంతై శ్చ = దంతములతోను, విక్షతా = విశేషముగ గాయపర్చబడినట్టియు, యువతిః = స్త్రీ, యథాస్థితా = ఏప్రకారముగనుండునో, తథా = ఆప్రకారముగనే, లాఙ్గూలహస్తైశ్చ - లాఙ్గూల = తోకతోను, హస్తైశ్చ = హస్తములతోను, చరణాభ్యాంచ = పాదములతోను, పీడితా = పీడింపబడినదై, అశోకవనికా = అశోకవనము, ప్రభగ్నవరపాదపా — ప్రభగ్న = విశేషముగా విరిగిన, వరపాదపా = శ్రేష్ఠమైన చెట్లు గలదై, బభూవ = అయెను,

తా॥ అశోకవనిక యనే స్త్రీని హనుమంతుడు చేతులతో నాలింగనము చేసి కౌగిలించినట్లుగ, తోకతో చుట్టియు, నఖ దంత క్షతాదులుగ పాదముల పీడించుటయు, అధరపానాది సంభోగోపరతిక్రియాదులుగ పుష్పఫలాదుల రసాస్వాదనలు చేసెను. కొమ్మలు మున్నగునవి విరిగి పడుటతో కేశములు విరబోసికొన్నట్లుండి లంకకు ప్రమాదాది స్థితులు కూడ సూచితముగ నుండెను.

* హనుమంతుడు అశోకవనమున విహరించుట *

శ్లో॥ మహాలతానాం దామాని వ్యధమ త్తరసా కపిః।
యథాప్రావృషి విన్ధ్యస్య మేఘజాలాని మారుతః॥ ౨౦

టీ॥ కపిః = వానరుడైన హనుమంతుడు, ప్రావృషి = వర్షాకాలమందు, మారుతః = వాయువు. విన్ధ్యస్య = వింధ్యపర్వతము యొక్క, మేఘజాలాని = మేఘసమూహములను, యథా = ఏప్రకారము, వ్యధమత్ = విడగొట్టునో, తథా = అప్రకారముగ, మహాలతానాం = గొప్పలతల యొక్క, దామాని = గుంపులను, తరసా = వేగముగా, వ్యధమత్ = త్రెంపివేసెను.

తా॥ హనుమంతుడు వింధ్యపర్వతమునందలి మేఘములను వాయువు ఏ ప్రకారముగ వర్షాకాలమందు చెల్లాచెదురు చేయునో, అట్లే ఆఅశోకవనమందలి తీగల గుంపులను వేగముతో త్రెంపి వేసి నానా బీభత్సము చేసెను.

శ్లో॥ స తత్ర మణిభూమీ శ్చ రాజతీ శ్చ మనోరమాః।
తథా కాఞ్చన భూమీ శ్చ దదర్శ విచర న్కపిః॥ ౨౧
వాపీశ్చ వివిధాకారాః పూర్ణాః పరమ వారిణా।
మహార్హై ర్మణిసోపానై రుపపన్నా స్తత స్తతః॥ ౨౨

శ్లో॥ ముక్తప్రవాళ సికతాః స్ఫాటికాన్తర కుట్టిమాః।
కాఞ్చనై స్తరుభి శ్చిత్రై స్తీరజై రుపశోభితాః॥ ౨౩
ఫుల్ల పద్మోత్పలవనా శ్చక్రవా కోపకూజితాః।
నత్యూహ రుత సఙ్ఘుష్టా హంస సారస నాదితాః॥ ౨౪
దీర్ఘాభి ర్ద్రుమయు క్తాభి స్సరిద్భి శ్చ సమ న్తతః।
అమృతోపమ తోయాభి శ్శివాభి రుపసంస్కృతాః॥ ౨౫
లతాశతై రవతతా స్సన్తాన కుసుమావృతాః।
నానా గుల్మావృత ఘనాః కరవీర కృతాన్తరాః॥ ౨౬

టీ॥ తత్ర = అక్కడ, సః = ఆ. కపిః = హనుమంతుడు. విచరన్ = సంచరించుచున్నవాడగుచు, మణిభూమీశ్చ = మాణిక్యమయమైన భూములను, మనోరమాః = సుందరములైన. రాజతీశ్చ = వెండివలె నున్నభూములను, తథా = ఆప్రకారముగ. కాఞ్చనభూమీశ్చ = బంగారమువలె నున్న ప్రదేశములను, దదర్శ = చూచెను, తత స్తతః = అక్కడక్కడ, వివిధాకారాః = అనేకరూపములుగ నున్నట్టియు, పరమవారిణా = ఉత్కృష్టోదకములచేత, పూర్ణాః = నిండియున్నట్టియు. మహార్హైః = మంచివిలువైన, మణిసోపానైః = మాణిక్యముల మెట్లతో, ఉపపన్నాః = కూడియున్న. వాపీశ్చ = దిగుడుబావులను, ముక్తాప్రవాళసికతాః–ముక్తా = ముత్యములు; ప్రవాళ = పగడములతో కూడిన, సికతాః = ఇసుకతిన్నెలను. స్ఫాటికా స్తరకుట్టిమాః – స్ఫాటికాన్తర = మధ్య స్ఫటికములు పొదిగిన, కుట్టిమాః = ఫలకములను. చిత్రైః = చిత్రములైనట్టియు, కాఞ్చనైః = బంగారువికారములైనట్టియు, తీరజైః = ఒడ్డున మొలిచిన, తరుభిః = వృక్షములతో, ఉపశోభితాః = ప్రకాశింపజేయబడుచున్నట్టియు. చక్రవాకోపకూజితాః – చక్రవాక = చక్రవాకపక్షులతో, ఉపకూజితాః = అంతటధ్వనింపజేయబడుచున్నట్టియు, నత్యూహరుతసఙ్ఘుష్టాః – నత్యూహ = నీటియిబ్బుల యొక్క, రుత = ధ్వనులతో. సఙ్ఘుష్టాః = వ్యాప్తమైనటువంటియు,

హంస సారస నాదితాః - హంస = హంసలు, సారస = బెగ్గురుపక్షుల చేత. నాదితాః = ధ్వనింపజేయబడుచున్నట్టియు, ఫుల్లపద్మోత్పలవనాః - ఫుల్ల = వికసించిన. పద్మ = పద్మములు, ఉత్పల = నల్లకలువలు గల. వనాః = వనములను, దీర్ఘాభిః = పొడవైనట్టియు, సమన్తతః = అంతట, ద్రుమయుక్తాభిః = చెట్లతోకూడినట్టియు, అమృతోపతోయాభిః - అమృత = అమృతముతో, ఉప = సమానమైన, తోయాభిః = ఉదకములుకలిగినట్టియు, శివాభిః = శుభప్రదములైన, సరిద్భిశ్చ = సరస్సులతోను, ఉపసంస్కృతాః = సింగారించబడినట్టియు, లతాశతైః = వందలకొలది లతలతో, అవతతాః = వ్యాపించియున్నట్టియు, సన్తానకుసుమావృతాః - సన్తాన = కల్పవృక్షముయొక్క, కుసుమ = పుష్పములతో, ఆవృతాః = కూడియున్నట్టియు, నానాగుల్మావృతఘనాః - నానా = అనేకములైన, గుల్మ = లతలతో, ఆవృత = ఆవరించబడి, ఘనాః = దట్టముగానున్నట్టియు, కరవీరకృతాన్తరాః - కరవీర = గన్నేరుచెట్లతో, కృత = చేయబడిన, అన్తరాః = మధ్యప్రదేశములు గల, వాపీశ్చ = దొడ్డనబావులను, దదర్శ = చూచెను.

తా॥ హనుమంతుడా అశోకవనమందంతట తిరుగుచు, మణిమయప్రదేశములను; వెండి, బంగారుమయములైన ప్రదేశములను, వివిధరూపములతో నుండి ఉత్కృష్టోదకములతో నిండి విలువైన సోపానపంక్తితో కూడియున్న దిగుడుబావులను, మణులు పగడములు స్థాపించి యిసుక తిన్నెలుగా మలచబడిన అరుగులను, చిత్రముగ బంగారముతో నిర్మించబడిన తీరమందలి వృక్షములతో శోభించుచున్నట్టియు, వికసించిన పద్మములు, నల్లకలువలు గలిగినట్టియు, చక్రవాకములు నీటియిఱ్ఱులు, హంసలు బెగ్గురుపక్షులతో ధ్వనింపజేయబడుచున్నట్టియు, అమృతమువంటి ఉదకములతో కూడి పెద్దపెద్ద సరస్సులతో, చక్కగసంస్కరింపబడియున్నట్టియు, అనేక లతలతో కల్పవృక్ష కుసుమములతో కూడియున్నట్టియు, ఇటాకాది వివరణమునకు గన్నేరుకట్టవలు గలిగి మిక్కిలి శోభాయమానముగా నున్న అశోకవనభూములను చూచెను.

శ్లో॥ తతోఽమ్బుధర సఙ్కాశం ప్రవృద్ధ శిఖరం గిరిమ్।
విచిత్రకూటం కూటైశ్చ సర్వతః పరివారితమ్॥ ౨౭
శిలాగృహై రవతతం నానావృక్షై స్సమావృతమ్।
దదర్శ హరిశార్దూలో రమ్యం జగతి పర్వతమ్॥ ౨౮

టీ॥ తతః = అటుతరువాత, హరిశార్దూలః = కపిశ్రేష్ఠుడైన హనుమంతుడు, అమ్బుధరసఙ్కాశం-అమ్బుధర = మేఘముతో, సఙ్కాశం = సమానమైనట్టియు, ప్రవృద్ధశిఖరం-ప్రవృద్ధ = ఉన్నతముగా వృద్ధిబొందిన, శిఖరం = శిఖరములు గలిగినట్టియు, విచిత్రకూటం-విచిత్ర = చిత్రములైన, కూటం = శిఖరప్రదేశములు గలిగినట్టియు, సర్వతః = అంతట, కూటైశ్చ = శిఖరోపరిభాగములతో, పరివృతః = కూడియున్నట్టియు, శిలాగృహైః = పాషాణనిర్మితగృహములతోను, అవతతం = వ్యాప్తమైనట్టియు, నానావృక్షైః = అనేకవృక్షములతో, సమావృతం = కూడియున్నట్టియు, జగతి = ప్రపంచమందు, రమ్యం = సుందరమైన, పర్వతం = క్రీడాపర్వతమును, దదర్శ = చూచెను.

తా॥ ఆ అశోకవనమందా హనుమంతుడు శిలాగృహములతోను, నానావిధ ఫల పుష్ప భరిత వృక్షములతోను, ఉన్నతశిఖరాగ్రములతోను, జగత్తునం దత్యంత సుందరమైనట్టి క్రీడాపర్వతము (క్రీడార్థముని ర్మింపబడినది) ను పెద్దమేఘముతో సమానముగ నున్నదానిని చూచెను.

శ్లో॥ దదర్శ చ నగా త్తస్మా న్నదీం నిపతితాం కపిః।
అఙ్కాదివ సముత్పత్య ప్రియస్య పతితాం ప్రియామ్॥ ౨౯
జలే నిపతితాగ్రైశ్చ పాదపై రుపశోభితామ్।
వార్యమాణా మివ క్రుద్ధాం ప్రమదాం ప్రియబన్ధుభిః॥ ౩౦
పునరావృత్తతోయాం చ దదర్శ స మహాకపిః।
ప్రసన్నా మివ కాన్తస్య కాన్తాం పునరుపస్థితామ్॥ ౩౧

టీ॥ కపిః = హనుమంతుడు, తస్మాత్ = ఆ, నగాత్ = పర్వతమునుండి, నిపతితాం = జారిపడుచున్న, నదీం = నదిని, ప్రియస్య = భర్త యొక్క, అఙ్కాత్ = తొడనుండి, సముత్పత్య = పైకిలేచి, పతితాం = పడుచున్న, ప్రియా మివ = ప్రియురాలువలె, దదర్శ = చూచెను. జలే = జలమందు, నిపతితాగ్రైః-నిపతిత = పడుచున్న, అగ్రైః = కొమ్మలుగల, పాదపైః = వృక్షములతో, ఉపశోభితాం = ప్రకాశింప జేయబడినట్టియు, క్రుద్ధాం = కోపించిన, ప్రమదాం = స్త్రీని, ప్రియ బన్ధుభిః = ప్రియబంధువులతో, వార్యమానా మివ = వారింపబడుచున్నది వలె నున్నట్టియు, పునః = తిరిగి, అన్వృత్తతోయాం = నిండింపబడిన ఉదకము కలిగినట్టియు, కాన్తస్య = భర్తకు, ప్రసన్నాం = కోపము తగ్గి ప్రసన్నురాలై, పునరుపస్థితాం = తిరిగి దరిజేరిన, కాన్తామివ = భార్యనువలె, సః = ఆ, మహాకపిః = వానరశ్రేష్ఠుడైన హనుమంతుడు దదర్శ = (ఆనదిని) చూచెను.

తా॥ అశోకవనమందు నిర్మింపబడిన క్రీడాపర్వతమునుండి ప్రియుని అంక స్థలమునుండి లేచి పడుచున్న ప్రియురాలినివలె ప్రవహించుచున్న నదిని చూచెను. ఒడ్డునమన్న చెట్లకొమ్మలా నదీజలమందు వాలి మిక్కిలి శోభించుచుండెను. ఆ వృక్షములయొక్క కొమ్మలు నీటికి అడ్డుపడుటచే నీరు వెనుకకు మరలి పైకిలేచి పడుచుండెను, అలా వెనుదిరిగి మరలి పోవు నీటితో ఆనది ప్రణయకలహముచే క్రుద్ధురాలై భర్తను వీడి ప్రియబంధువులచే లాలింపబడి, ప్రసన్నురాలై తిరిగి భర్తదరి చేరిన భార్యవలె బహుసుందరముగ ప్రవహించేచు ఆనదిని హనుమంతుడు చూచెను.

శ్లో॥ తస్యా దూరా త్సపద్మిన్యో నానా ద్విజ గణాయుతాః
దదర్శ హరిశార్దూలో హనుమా న్మారుతాత్మజః॥ ౩౨

టీ॥ సః = ఆ, మారుతాత్మజః = వాయుపుత్రుడైనట్టియు, హరిశార్దూలః = వానరశ్రేష్ఠుడైనట్టి, హనుమాన్ = హనుమంతుడు, తస్యాః = ఆనదికి, దూరాత్ = దూరమునుండి, నానాద్విజగణాయుతాః–నానాద్విజ = అనేక పక్షులయొక్క, గణ = సమూహములతో, అయుతాః = కూడినటువంటి, పద్మినీః = తామరకొలనులను, దదర్శ = చూచెను.

తా॥ వాయుపుత్రుడగు హనుమంతుడు ఆనదికి దూరమునుండియే అనేక పక్షిగణములతో కూడి శోభాయమానముగా వికసించియున్న పద్మముల కొలనులను చూచెను.

శ్లో॥ కృత్రిమాం దీర్ఘికాం చాపి పూర్ణాం శీతేన వారిణా।
మణిప్రవర సోపానాం ముక్తా సికత శోభితామ్ ॥ 33
వివిధై ర్మృగసఙ్ఘై శ్చ విచిత్రాం చిత్రకాననామ్ ।
ప్రాసాదై స్సుమహద్భి శ్చ నిర్మితై ర్విశ్వకర్మణా 34
కాననైః కృత్రిమై శ్చాపి సర్వత స్సమలఙ్కృతామ్।

టీ॥ అపిచ = మరియు, శీతేన = చల్లనైన, వారిణా = ఉదకముచేత, పూర్ణాం = నిండియున్నట్టియు, మణిప్రవరసోపానాం–మణిప్రవర = శ్రేష్ఠములైన మాణిక్యములతో నిర్మింపబడిన, సోపానాం = మెట్లుకలిగినట్టియు, ముక్తాసికతశోభితాం = మణులపొడులచే ప్రకాశింపజేయబడుచున్నట్టియు, వివిధైః = అనేకవిధములైన, మృగసఙ్ఘైశ్చ = లేళ్ల గుంపులతోను, విచిత్రాం = విశేషముగా చిత్రింపబడినట్టియు, చిత్రకాననాం = చిత్రితమైన అడవులు కలిగినట్టియు, విశ్వకర్మణా = విశ్వకర్మ చేత, నిర్మితైః = నిర్మింపబడినట్టియు, సుమహద్భిః = గొప్పవైన, ప్రాసాదైః చ = మేడలతోను, అపిచ = మరియు, కృత్రిమైః = కృత్రిమముగచేయబడిన, కాననైః = అరణ్యములతోను, సర్వతః = అంతట, సమలంకృతాం = చక్కగా అలంకరింపబడినట్టియు, కృత్రిమాం = కృతకముగా నిర్మించబడిన, దీర్ఘికాం = దిగుడుబావిని, దదర్శ = చూచెను.

తా॥ మరియు ఆనదికి సమీపమందు చల్లని నీటితో నిండియున్నదియు, మాణిక్యములచే రచించబడిన మెట్లు కలదియు, ముత్తెములతో నేర్పరుపబడిన యిసుకతిన్నెలు గలదియు, అనేక మృగముల సముదాయముతో చిత్రింపబడినట్టియు, విశ్వకర్మనిర్మితమైన గొప్పభవనములు కలిగినట్టియు, మిగుల సుందరముగ నిర్మింపబడిన కృతకమైన దిగుడు బావిని చూచెను.

శ్లో॥ యే కేచి త్పాదపా స్తత్ర పుష్పోపగ ఫలోపగాః॥ 32
సచ్ఛత్రా స్సవితర్దీకా స్సర్వే సౌవర్ణ వేదికాః।

టీ॥ తత్ర = అక్కడ, యే = ఏ, కేచిత్ = కొన్ని, పాదపాః = వృక్షములున్నవో, సర్వే = అన్నియు, పుష్పోపగఫలోపగాః - పుష్పోపగ = పుష్పములతో నున్నవియు, ఫలోపగాః = ఫలములతో కూడియున్నవి, యే = ఏ, కేచిత్ = కొన్ని, సౌవర్ణవేదికాః = సువర్ణమయ వేదికలు గలవో, సర్వే = అన్నియు, సవితర్దీకాః = బంగారు ఆసనములుగలవియు, సచ్ఛత్రాః = యోగ్యమగు గొడుగులతో కూడియున్నవి.

తా॥ అచ్చట నున్న సమస్త వృక్షములు పూలుఫలములతో నిండియుండెను. అచ్చట నున్న బంగారు అరుగులు మంచి ఆసనములతోను, ఆఆసనములపై యోగ్యములగు గొడుగులతోను మనోహరముగా నుండెను.

శ్లో॥ లతాప్రతానై ర్బహుభిః పర్ణై శ్చ బహుభి ర్వృతామ్॥ 33
కాఞ్చనీం శింశుపా మేకాం దదర్శ హనుమా న్కపిః।
వృతాం హేమమయీభిస్తు వేదికాభి స్సమన్తతః॥ 34

టీ॥ కపిః = వానరుడైన, హనుమాన్ = = హనుమంతుడు, బహుభిః = అనేకములైన, లతాప్రతానైః = లతలతోను, తీగెలతోను, బహుభిః = అనేకములైన; పర్ణైశ్చ = ఆకులతోను, వృతాం = కూడియున్నట్టియు,

హేమమయీభిః = బంగారువికారములైన, వేదికాభిః = అరుగుల తోను, సమన్తతః = అంతట, వృతాం = కూడినట్టియు, కాఞ్చనీం = బంగారువికారమగు, ఏకాం = ఒకటైన, శింశుపాం = అశోకవృక్షమును, దదర్శ = చూచెను.

తా॥ ఆ హనుమంతుడు అనేక లతలతోను,తీగలతోను, ఆకులతోను,ఆవరించబడి, బంగారముచే నిర్మితమైన వేదికలతో అలరారుచున్న సువర్ణనిర్మితమైన అశోకవృక్షము నొకదానిని చూచెను.

శ్లో॥ సోఽపశ్య ద్భూమిభాగాం శ్చ గర్తప్రస్రవణాని చ।
సువర్ణవృక్షా నపరాన్ దదర్శ శిఖిసన్నిభాన్॥ ౩౦

టీ॥ సః = ఆహనుమంతుడు, అపశ్యద్భూమిభాగాంశ్చ-అపశ్యత్ = చూడబడని, భూమిభాగాం శ్చ = భూప్రదేశములను, గర్తప్రస్రవణాని చ = లోతైనసెలయేళ్లను, అపరాన్ = మరికొన్ని శిఖిసన్నిభాన్ = అగ్నితో సమానమైన, సువర్ణవృక్షాన్ = బంగారువృక్షములను, దదర్శ = చూచెను.

తా॥ హనుమంతు డా అశోకవనమందు ఇదివరలో చూడని కొన్ని భూప్రదేశములను, లోతైనగుంటలను, కొండఊటసెలయేళ్లను, అగ్నిసదృశములైన కొన్ని బంగారపు వృక్షములను జూచెను.

శ్లో॥ తేషాం ద్రుమాణాం ప్రభయా మేరో రివ దివాకరః।
అమన్యత తదా వీరః కాఞ్చనోఽస్మీతి వానరః॥ ౩౧

టీ॥ తదా = అప్పుడు, వీరః = పరాక్రమవంతుడైన, వానరః = ఆంజనేయుడు, తేషాం = ఆ, ద్రుమాణాం = చెట్లయొక్క, ప్రభయా = కాంతిచేత, కాఞ్చనః = బంగారపు వర్ణముగలవాడై, మేరోః = మేరుపర్వతముయొక్క, ప్రభయా = కాంతిచేత, దివాకర ఇవ = సూర్యుడువలె, అస్మి = అయితిని, ఇతి = ఈలాగున, అమన్యత = తలచెను.

తా॥ మహావీరుడైన హనుమంతుడు వనమందలి బంగారుమయములైన చెట్లయొక్క కాంతిచేత బంగారపు వర్ణముగలవాడై మేరుగిరియొక్క కాంతిచే సూర్యుడువలె నయితి నని భావించుకొనెను.

శ్లో॥ తాం కాఞ్చనై స్తరుగణై ర్మారుతేన చ వీజితామ్।
కిఙ్కిణీశత నిర్ఘోషాం దృష్ట్వా విస్మయమాగమత్॥ ౪౦

టీ॥ కాఞ్చనైః = బంగారువికారములైన, తరుగణైః = చెట్లగుంపులతోను మారుతేన చ = వాయువుచేతను, వీజితాం = విసరబడుచున్నట్లున్నదియు, కిఙ్కిణీశతనిర్ఘోషాం - కిఙ్కిణీశత = నూర్లకొలది చిరుగంటలతో, నిర్ఘోషాం = ధ్వనింపజేయబడుచున్న, తాం = ఆ అశోకవృక్షమును, దృష్ట్వా = చూచి, విస్మయం = ఆశ్చర్యమును, అగమత్ = పొందెను.

తా॥ సువర్ణమయము లైన వృక్షసముదాయముచేతను, అచ్చట వీచుచున్న వాయువుచేతను, వీచబడి కదలుచు అలంకరింపబడియున్న చిరుగంటలతో ధ్వనింపజేయబడుచున్న అశోకవృక్షమును జూచి హనుమంతుడు ఆశ్చర్యమును పొందెను.

శ్లో॥ స పుష్పితాగ్రాం రుచిరాం తరుణాఙ్కుర పల్లవామ్।
తా మారుహ్య మహాబాహు శ్శింశుపాం పర్ణసంవృతామ్॥ ౪౧
ఇతో ద్రక్ష్యామి వైదేహీం రామదర్శన లాలసామ్।
ఇత శ్చేతశ్చ దుఃఖార్తాం సంతప న్తీం యదృచ్ఛయా॥ ౪౨
అశోకవనికా చేయం దృఢం రమ్యా దురాత్మనః।
చమ్పకై శ్చన్దనై శ్చాపి వకుళై శ్చ విభూషితా॥ ౪౩
ఇయం చ నలినీ రమ్యా ద్విజసఙ్ఘనిషేవితా।
ఇమాం సా రామమహిషీ నూనమేష్యతి జానకీ॥ ౪౪

సా రామా రామమహిషీ రాఘవస్య ప్రియా సతీ।
వనసఞ్చారకుశలా నూన మేష్యతి జానకీ॥ ౪౫

అథవా మృగశాబాక్షీ వనస్యాస్య విచక్షణా।
వన మేష్యతి సార్యేహ రామచిన్తానుకర్శితా॥ ౪౬

రామశోకాభిసన్తప్తా సాదేవీ వామలోచనా।
వనవాసేరతా నిత్య మేష్యతే వనచారిణీ॥ ౪౭

వనేచరాణాం సతతం నూనం స్పృహయతే పురా।
రామస్య దయితా భార్యా జనకస్య సుతా సతీ॥ ౪౮

సన్ధ్యాకాలమనా శ్శ్యామా ధ్రువ మేష్యతి జానకీ।
నదీంచేమాం శివజలాం సన్ధ్యార్థే వరవర్ణినీ॥ ౪౯

తస్యాశ్చాప్యను రూపేయ మశోకవనికా శుభా।
శుభాయా పార్థివేన్ద్రస్య పత్నీ రామస్య సమ్మతా॥ ౫౦

యది జీవతి సా దేవీ తారాధిపనిభాననా।
ఆగమిష్యతి సాఽవశ్య మిమాం శివజలాం నదీమ్॥ ౫౧

టీ॥ మహాబాహుః = భుజబలముకలిగిన, సః = ఆ హనుమంతుడు, పుష్పితాగ్రాం = పుష్పించిన కొమ్మలుగలిగినట్టియు, రుచిరాం = కాంతిగలిగినట్టియు, తరుణాఙ్కురపల్లవాం - తరుణ = లేతవైన, అఙ్కుర = మొలకలుగల, పల్లవాం = చిగురుటాకులు గలిగినట్టియు, పర్ణసంవృతాం = ఆకులతోకూడిన, తాం = ఆ, శింశుపాం = అశోకవృక్షమును, ఆరుహ్య = ఆరోహించి, ఇతశ్చేతశ్చ = ఇక్కడెక్కడో, దుఃఖార్తాం = దుఃఖముచే పీడింపబడుచున్నట్టియు, యదృచ్ఛయా = దైవికముచేత, సంతప్తాం = సంతాపమునొందుచున్నట్టియు, రామదర్శనలాలసాం-రామ = శ్రీరామునియొక్క, దర్శన = దర్శనమందు, లాలసాం = ఆసక్తిగలిగియున్న, వైదేహీం = విదేహరాజతనయయగు సీతను, ఇతః = ఇక్కడ, ద్రక్ష్యామి = చూడగలను, చమ్పకైః = చంపకపుష్పములతోను, చన్దనైశ్చ = మంచిగంధపువృక్షముల

తోను, వకుళైశ్చ = వకుళవృక్షములచేతను, విభూషితా = విశేషాలంకారములుగ చేయబడిన, ఇయం = ఇది. ధ్రువం = నిశ్చయముగా, దురాత్మనః = దుర్మార్గుడైన రావణునియొక్క, రమ్యా = రమించ పొనర్చుచున్న (సుందరమైన) అశోకవనికా చ = అశోకవనమే, ఇయం = ఈ అశోకవనము ద్విజసఙ్ఘనిషేవితా – ద్విజ = పక్షుల యొక్క, సఙ్ఘ = సమూహములతో, నిషేవితా = సేవించబడుచున్నదై, నళినీ = పద్మములుగలదై, రమ్యా = మనోహరముగానున్నది, ఇమాం = ఈవాటికనుగూర్చి, సా = ఆ, రామమహిషీ = శ్రీరాముని పట్టపురాణియైన, జానకీ = సీత, నూనం = నిశ్చయముగా, ఏష్యతి = రాగలదు, రామా = మనోహర రూపముగలిగినట్టియు, రాఘవస్య = శ్రీరామునికి, ప్రియా = ఇష్టురాలైనట్టియు, సతీ = పతివ్రతయైన, సా = ఆ, రామమహిషీ = శ్రీరామునిభార్యయగు, జానకీ = సీతాదేవి, వనసఞ్చారకుశలా – వన = అరణ్యమందు, సఞ్చార = సంచరించుటలో, కుశలా = నేర్పుగలదైనందున, నూనం = తప్పక, ఏష్యతి = రాగలదు, అథవా = కానిచో, మృగశాబాక్షీ – మృగశాబ = లేడికూనల యొక్క, అక్షీ = చూపులవంటిచూపులుగల, సా = ఆ, దేవి = సీతాదేవి, అస్య = ఈ, వనస్య = వనమునకు, విచక్షణాం = పరిసరజ్ఞానము కలదగుచు, రామచిన్తానుకర్శితా – రామచిన్త = శ్రీరామునిగూర్చి విచారించుటవలన, అనుకర్శితా = కృశించినదై, వనం = ఈవనమును గూర్చి, ఏష్యతి = రాగలదు, రామశోకాభిసన్తప్తా – రామ = శ్రీరాముని యొక్క యెడబాటువలన కలిగిన, శోక = విచారమువలన, అభిసన్తప్తా = అధికసంతాపమును పొందియున్న, వామలోచనా = సుందరమైన నేత్రములుగల, సా = ఆ, దేవీ = సీతాదేవి, నిత్యం = ఎల్లప్పుడు, వనవాసే = అరణ్యవాసమునందు, రతా = అసక్తిగలదిగనుక, వనచారిణీ = వనవిహారముచేయునదియై, ఏష్యతి = రాగలదు, రామస్య = శ్రీరామునికి, దయితా = ప్రియురాలైనట్టియు, భార్యా = భార్యయైనటియు, సతీ = పతివ్రతఅయినటువంటియు, జనకస్య =

జనకమహారాజుయొక్క. సుతా = కుమార్తెయగు జానకి. పురా = పూర్వము (ముందుగా) వనేచరాణాం = వన్యమృగములకు సతతం = ఎల్లప్పుడు, స్పృహాయతే = క్షేమమునుగోరుచుండును (స్మరించుకొనుచుండును), శ్యామా = యౌవనవతియు, వరవర్ణినీ = శ్రేష్ఠమైన శరీరకాంతిగలదియు నగు, జానకీ = సీత, సన్ధ్యాకాలమనాః = సంధ్యాసమయమందు మనస్సుగలదైనందున, శివజలాం = పవిత్రోదకములుగల. ఇమాం = ఈ, నదీంచ = నదినిగూర్చియే. సన్ధ్యార్థీ = సంధ్యోపాసనకొఱకై, ధృవం = నిశ్చయముగా, ఏష్యతి = రాగలదు, యా = ఏ. శుభా = శుభప్రదురాలు, పార్థివేంద్రస్య = రాజశ్రేష్ఠునకి. పత్నీ = భార్యయో, రామస్య = శ్రీరామునికి, సమ్మతా = ప్రియురాలో, తస్యాః = ఆసీతకు, శుభా = శుభప్రదమైన, ఇయం = ఈ, అశోకవనికాఅపి = అశోకవనమును, అనురూపాచ = తగియేయుండును, తారాధిపనిభాననా–తార = నక్షత్రములకు, అధిప = ప్రభువైన చంద్రునితో, నిభ = సమానమైన, ఆననా = ముఖముగల, సా = ఆ, దేవీ = సీతాదేవి, జీవతియది = జీవించియున్నట్లయిన, సా = ఆమె, శివజలాం = పవిత్రోదకములుగల. ఇమాం = ఈ, నదీం = నదినగూర్చి, అవశ్యం = ముఖ్యముగ, ఆగమిష్యతి = రాగలదు.

తా॥ లేతచిగుళ్లు పుష్పములు ఆకులతో ఆవృతమైన ఆ అశోకవృక్షమును హనుమంతు డారోహించి యిట్లాలోచింప నారంభించెను. దైవికముగా భర్తనుండి వేరై భర్తయగు ఆ శ్రీరామునే మదిని నిల్పి ధ్యానించుచు దుఃఖముచే తపించి కృశించి యుండు సీత యిచ్చ పెచ్చటనో తప్పక యుండును. దుర్మార్గుడగు యీరావణుని విహారస్థల మగు అశోకవనము గూడ చంపక చందన వకుళాది వృక్షసముదాయముతోను తామరలు నానావిధముల రొదలుచేయు పక్షుల గుంపులతోను, అత్యంతమనోహరముగా నున్నందున సీత యిచ్చటకు రావచ్చును. కాక యిదివరలో ఆమెభర్తతో వనసంచారము చేసి యున్నందున అరణ్యసంచారమందు

నేర్పుగలది కాన రావచ్చును. ఆమెకు వనవాసమందు గల ఆసక్తిచేత నైనా సదా భర్తృధ్యానముచే కృశించి పూర్వము భర్తతో కలసి సంచరించునప్పుడు వన్యమృగములయం దధికశ్రద్ధ యుంచునది గనుక అందునిమిత్తముగా నైన లేక యీ వనమందలి ప్రదేశములు తెలిసిన దగుటచేతనైనను, లేక సంధ్యాకాల సమయములందు సంధ్యావందన మొనర్చుకొఱకునైన. యీ సుందరదృశ్యములు జూచుటకునైన, పవిత్రోదకములు గల యీనదికి తప్పక రావచ్చును. మహారాజైన శ్రీరాముని భార్యయు, శుభప్రమదాలు నగు జానకికి సర్వవిధముల శుభప్రదమైన యీ అశోకవనముకూడ అనురూపముగానే యున్నది. నిజముగా మహాపతివ్రతయగు సీతాదేవి బ్రతికియే యున్నచో ఆమె తప్పక పవిత్రోదకములచే ప్రవహించు యీనదికి సంధ్యోపాసన నిమిత్తముగానైన తప్పక రాగలదు. పూర్వయుగములందు స్త్రీలకు సంధ్యావందనము ఉపనయనము గలవు. స్త్రీల యుపనయనము గుఱించి వైద్యనాథీయంబున వర్ణాశ్రమాచారకాండమం దీవాక్యములు గాననగును.

"స్త్రీణాం వివాహ ఏవ ఉపనయన మిత్యాహ మనుః"

శ్లో॥ వైవాహికో విధిః స్త్రీణా మౌపనాయనికః స్మృతః
పతిసేవా గురౌవాసో గృహార్థోగ్ని పరిక్రియా॥ (మను)

వివాహమే స్త్రీల కుపనయనము, పతిసేవయే గురుకులవాసము, గృహకృత్యనిర్వాహమే యగ్నిహోత్రము, కనుక వారికి వివాహములే యుపనయనాదులు, ఇదియిప్పటి కాలమున విధి. యమస్మృతియందు, "పురాకల్పే కుమారీణాం మౌంజీబంధన మిష్యతే। అధ్యాపనం చ వేదానాం సావిత్రీ వచనం తథా॥ పితా పితృవ్యో భ్రాతావా నైనా మధ్యాపయేత్పరః। స్వగృహే చైవ కన్యాయా భైక్షచర్యం విధీయతే। వర్జయేదజినం చీరం జటాధారణ మేవచ॥" పూర్వమందు కన్యకలకు మౌంజీబంధము, వేదాధ్యయనము, గాయత్రీజపము చెప్పబడెనుగాన తండ్రి

పినతండ్రి అన్నమాత్రమే యివి చెప్పవచ్చును గాని పరుడు చెప్పరాదు. కన్య తనయింటియందే భిక్షమెత్తవలయును. కృష్ణాజినము నారచీరలు ధరింపరాదు. జడలు మాత్రము ధరించవచ్చును. ఈకారణమున త్రేతా యుగమందలి సీతాదేవికి సంధ్యావందనము గలదని భావించవలెను)

శ్లో॥ ఏవంతు మత్వా హనుమా న్మహాత్మా
ప్రతీక్షమాణో మనుజేన్ద్రపత్నీమ్।
అవేక్షమాణ శ్చ దదర్శ సర్వమ్
సుపుష్పితే పర్ణఘనే నిలీనః॥ ౫౨

టీ॥ మహాత్మా = మహానుభావుడైన, హనుమాన్ = హనుమంతుడు, ఏవంతు = ఈప్రకారముగ, మత్వా = తలచి, మనుజేన్ద్రపత్నీం - మనుజేన్ద్ర = మనుజశ్రేష్ఠుడైన శ్రీరామునియొక్క, పత్నీం = భార్యయగు సీతను, ప్రతీక్షమాణః = ఎదురుచూచుచున్నవాడగుచు, సుపుష్పితే = యోగ్యముగ పుష్పించియున్న, పర్ణఘనే = ఆకులగుబురునందు, నిలీనః = అంతర్హితుడై, సర్వం = సమస్తమును, అవేక్షమాణః = వెదకుచున్నవాడై, దదర్శ = చూచెను.

తా॥ మహాత్ముడగు హనుమంతుడు సీత యిచ్చటనే యుండు ననెడి నిశ్చయము గలవాడై సీతాదేవిరాకకు ఎదురుచూచుచు, బాగుగా పుష్పించిన పచ్చని ఆకుల జొంపముచేరి సీతాన్వేషణకై ఆ అశోకవన మంతయు చూచుచుండెను.

చతుర్దశసర్గము సమాప్తము



# శ్రీమద్వాల్మీకిరామాయణే సున్దరకాణ్డే పంచదశ స్సర్గః

* హనుమంతుడు అశోకవనమున సీతాదేవిని వెదకుట *

శ్లో॥ సవీక్షమాణ స్తత్రస్థో మార్గమాణ శ్చ మైథిలీమ్।
అవేక్షమాణ శ్చ మహీం సర్వాం తా మన్వవైక్షత॥ ౧

టీ॥ సః = ఆ హనుమంతుడు, తత్ర = అక్కడ, స్థః = ఉన్నవాడై, వీక్షమాణః = చూచుచున్నవా డగుచు, మైథిలీం = సీతను, మార్గమాణ శ్చ = వెదకుచున్నవా డగుచు, తాం = ఆ, సర్వాం = సమస్తము నైన, మహీం = భూమిని, అవేక్షమాణ శ్చ = చూచుచున్నవా డగుచును. అన్వవైక్షత = అన్వేషించెను.

తా॥ ఆ హనుమంతుడు ఆ అశోకవృక్షముయొక్క ఆకుల చాటునుండి సీతను వెదకుటకు నానావిధములుగా దృష్టిని ప్రసరింపజేయుచు క్రిందికి చూచుచు మరల ఆ వనమంతయు చూచెను.

శ్లో॥ స న్తానక లతాభి శ్చ పాదపై రుపశోభితామ్।
దివ్యగంధ రసోపేతాం సర్వత స్సమలజ్కృతామ్॥ ౨
తాం సనన్దన సజ్కాశాం మృగపక్షిభి రావృతామ్।
హర్మ్య ప్రాసాద సమ్బాధాం కోకిలాకుల నిస్స్వనామ్॥ ౩
కాఞ్చ నోత్పల పద్మాభి ర్వాపీభి రుపశోభితామ్।
బహ్వాసన కుథోపేతాం బహుభూమి గృహాయుతామ్॥ ౪
సర్వర్తు కుసుమై రమ్యాం ఫలవద్భి శ్చ పాదపైః।
పుష్పితానా మశోకానాం శ్రియా సూర్యోదయ ప్రభామ్॥ ౫
ప్రదీప్తా మివ తత్రస్థో మారుతి స్సముదైక్షత।
నిష్పత్రశాఖాం విహగైః క్రియమాణా మివాసకృత్॥ ౬
వినిష్పతద్భి శ్శతశ శ్చిత్రైః పుష్పావతంసకైః।
ఆమూల పుష్పనిచితై రశోకై శ్శోకనాశనైః॥ ౭

శ్లో॥ పుష్పభారాతిభారైశ్చ స్పృశద్భిరివ మేదినీమ్।
కర్ణికారైః కుసుమితైః కింశుకైశ్చ సుపుష్పితైః॥ లా

టీ॥ సన్తానకలతాభిః = సంతానలతతతోడను, పాదపైశ్చ = వృక్షముల తోను, ఉపశోభితాం = ప్రకాశింపజేయబడుచున్నట్టియు, దివ్యగంధరసోపేతాం - దివ్య = దేవతాసంబంధమైన, గంధ = పరిమళముగల, రస = రసములతో. ఉపేతాం = కూడియున్నట్టియు, సర్వతః = అంతట, సమలఙ్కృతాం = అలంకరించబడియున్నట్టియు, నన్దనసఙ్కాశాం-నన్దన = నందనవనముతో, సఙ్కాశాం = సమానమైనట్టియు, మృగపక్షిభిః-మృగ = లేళ్లు, పక్షిభిః = పక్షులతో, ఆవృతామ్ = కూడియున్నట్టియు, హర్మ్యప్రాసాదసమ్బాధాం-హర్మ్య = మిద్దెలు, ప్రాసాద = మేడలతో. సమ్బాధాం = క్రిక్కిరిసియున్నట్టియు, కోకిలాకులనిస్స్వనాం-కోకిల = కోకిలలయొక్క, ఆకులనిస్స్వనాం = ధ్వనులతో వ్యాప్తమై యున్నట్టియు, కాఞ్చనోత్పలపద్మాభిః - కాఞ్చన = బంగారు వికారములైన, ఉత్పల = నల్లకలువలు, పద్మాభిః = పద్మములుగల, వాపీభిః = బొడ్డనబావులతో, ఉపశోభితాం = ప్రకాశింపజేయబడుచున్నట్టియు, బహ్వాసనకుథోపేతాం - బహు = అనేకములైన, ఆసన = సింహాసనములు, కుథ = కంబళ్లతో, ఉపేతాం = కూడియున్నట్టియు, బహుభూమిశ్చగృహాయుతాం- బహు = అనేకములైన, భూమిగృహ = బిలాగృహములతో, ఆయుతాం = అంతట కూడియున్నట్టియు, సర్వర్తుకుసుమైః-సర్వర్తు = సర్వఋతువుల వికసించు, కుసుమైః = పుష్పములతో, రమ్యాం = సుందరమై యున్నట్టియు; ఫలవద్భిః = పండ్లుగల, పాదపైశ్చ = వృక్షములతోను, రమ్యాం = సుందరముగానున్నట్టియు, పుష్పితానాం = పుష్పించిన, అశోకానాం = అశోకవృక్షములయొక్క, శ్రియా = శోభచేత, సూర్యోదయప్రభాం - సూర్యోదయ = ఉదయసూర్యునియొక్క, ప్రభాం = కాంతివంటి కాంతి కలిగినటువంటియు. ప్రదీప్తామివస్థితాం = ఎక్కుగా ప్రకాశింపజేయ

బడుచున్నది వలె నున్నటువంటియు, విహగైః = అపక్షులతో, సకృత్ = ఒక్కమారుగా. నిష్పత్రశాఖాం-నిష్పత్రి = ఆకులులేని, శాఖాం = కొమ్మలుగలదానినిగా, క్రియమాణామివ స్థితాం = చేయబడినదివలె నున్నటువంటియు, శతశః = వందలకొలది, వినిష్పతద్భిః = చెట్ల నుండి రాలుచున్నట్టియు, చిత్రైః = చిత్రములైనట్టియు, పుష్పావతంసకైః = పుష్పాలంకారములు గలిగినట్టియు. ఆమూలపుష్పనిచితైః- ఆమూల = మొదలునుండి, పుష్పనిచితైః = వ్యాపించిన పుష్పములు గలిగినట్టియు, శోకనాశనైః = శోకములపోగొట్టు, అశోకైః = అశోకవృక్షములతోను, పుష్పభారాతిభారైః-పుష్ప = పుష్పములయొక్క. భార = బరువుచేత, అతిభారైః = ఎక్కువబరువుకలదగుటచేత, మేదినీం = భూమిని. స్పృశద్భిరివస్థితైః = తాకుచున్న వన్నటున్నటువంటియు,కుసుమితైః = పుష్పించిన, కర్ణికారైః = కొండగోగులచేతను, సుపుష్పితైః = యోగ్యముగాపుష్పించిన, కింశుకైశ్చ = మోదుగులచేతను, రమ్యాం = సుందరమైన, తాం = ఆఅశోకవనమును, తత్రస్థః = అచ్చటనున్నవాడై, మారుతిః = హనుమంతుడు,సముద్వీక్షత = చూచెను.

తా॥ హనుమంతుడా అశోకవనమునందున్నవాడై అంతట కలయజూచెను. ఆవనము సంతానలతలతోను,దివ్యపరిమళము లీను పుష్పములతో నిండి శోభాయమానముగా నున్న వృక్షములతోను, దేవేంద్రుని నందనవనమువలె నున్నది. ఆ అశోకవనము అనేక దేవాలయములు, రాజమందిరములు, ధనికగృహములు, లేళ్లు, పక్షులు, అవ్యక్త మధుర ధ్వనులు గల కోయిలలు, బంగారు కలువలు పద్మములతో నిండియున్న దిగుడుబావులు, సోఫాలు మొదలైన ఆసనములు రత్నకంబళములు మొదలగు ఆస్తరణములు సర్వఋతువుల పుష్పఫలములతో కూడియున్న నానావిధ వృక్షజాతులు కలదియై కడు రమ్యముగనుండెను.

ఎఱ్ఱగా పుష్పించిన అశోకవృక్షములచే ఉదయసూర్యుని భాతి ప్రకాశించు చుండెను. పక్షుల రెక్కల తాకిడికి గుంపులు గుంపులుగా నొక్కసారే ఆకులు రాలుట వలన పక్షులవలన ఆకులులేని చెట్లుగా చేయబడినవా అన్నట్లు కొన్నిచెట్లుండెను. మొదటినుండి చివరవరకు పూసి అహ్లాదము గొల్పుచున్న కొండగోగులు మోదుగులు అశోకవృక్షములు పూలభారముచే క్రిందికి వంగి భూమిని తాకుచున్నవా అన్నట్లు కనబడుచున్నవి. ఇటువంటి సుందరమైన అశోకవనమును చూచెను.

శ్లో॥ స దేశః ప్రభయా తేషాం ప్రదీప్త ఇవ సర్వతః।

టీ॥ సః = ఆ, దేశః = ప్రదేశము, సర్వతః = అంతట, తేషాం = వాని యొక్క, ప్రభయా = కాంతిచేత. ప్రదీప్త ఇవ స్థితః = ఎక్కువగా ప్రకాశింపజేయబడిన దివలె, నుండెను.

తా॥ ఆ అశోకవన ప్రదేశ మంతయు అచ్చట పుష్పించిన నానావిధ వృక్షములయొక్క కాంతిచేత యెక్కువ కాన్తిమంతము చేయబడినట్లు కనుపించెను.

శ్లో॥ పున్నాగా స్సప్తపర్ణా శ్చ చమ్ప కోద్దాలకా స్తథా॥ ౯
వివృద్ధమూలా బహవ శ్శోభ న్తేస్మ సుపుష్పితాః।
శాతకుమ్భనిభాః కేచి త్కేచి దగ్నిశిఖోపమాః॥ ౧౦
నీలాఞ్జన నిభాః కేచి త్తత్రాశోకా సహస్రశః।
నన్దనం వివిధోద్యానం చిత్రం చైత్రరథం యథా॥ ౧౧
అతివృత్తమి వాచిన్త్యం దివ్యం రమ్యం శ్రియావృతమ్।
ద్వితీయ మివ చాకాశం పుష్ప జ్యోతిర్గణాయుతమ్॥ ౧౨
పుష్పరత్నశతై శ్చిత్రం పఞ్చమం సాగరం యథా।
సర్వర్తుపుష్పై ర్నిచితం పాదపై ర్మధుగన్ధిభిః॥ ౧౩
నానా నినాదై రుద్యానం రమ్యం మృగగణై ర్ద్విజైః।
అనేకగంధప్రవహం పుణ్యగంధం మనోరమమ్॥ ౧౪
శైలేన్ద్ర మివ గన్ధాఢ్యం ద్వితీయం గన్ధమాదనమ్।

టీ॥ పున్నాగాః = సురపొన్నలు, సప్తపర్ణాశ్చ = ఏడాకుల అరటులును చమ్పకోద్దాలకాః -- చమ్పక = సంపెంగ, ఉద్దాలకాః = విరుగుచెట్లు. తథా = ఆప్రకారముగా, వివృద్ధమూలాః—వివృద్ధ = విశేషముగా వృద్ధి పొందిన, మూలాః = మొదళ్లుగలిగినట్టియు, సుపుష్పితాః = యోగ్యముగపుష్పించినవై, బహవః = అనేకములు, శోభన్తేస్మ = ప్రకాశించుచుండెనట, కేచిత్ = కొన్ని, అగ్నిశిఖోపమాః - అగ్నిశిఖ = అగ్నిజ్వాలలతో, ఉపమాః = ఉపమానమైనవియు. కేచిత్ = కొన్ని, శాతకుమ్భనిభాః - శాతకుమ్భ = బంగారపుకలశములతో, నిభాః = సమానమైనవియు, కేచిత్ = కొన్ని. నీలాఞ్జననిభాః — నీల = నల్లని, అఞ్జన = కాటుకతో, నిభాః = సమానమైనవియు, సహస్రశః = వేలకొలది, అశోకాః = అశోకవృక్షములు, తత్ర = అక్కడ, శోభన్తేస్మ = ప్రకాశించుచుండెనట, వివిధోద్యానం = అనేకఉద్యానములం గలిగినట్టియు. చిత్రం = చిత్రమైన, చైత్రరథం యథా = కుబేరుని చైత్రరథ మను ఉద్యానవనమువలెనే, అతివృత్తం = అతిక్రమించి యున్నట్టియు, చిత్రం = చిత్రమైన. నన్దనం యథా = దేవేంద్రుని నందనోద్యానవనమువలె, నున్నట్టియు. అచిన్త్యం = ఊహింపలేనట్టియు, దివ్యం = దేవతాసంబంధమైనట్టియు, శ్రియా = శోభచే, వృతం = కూడినట్టియు, ద్వితీయం = రెండవదైన, ఆకాశమివ = ఆకాశమువలె నున్నట్టియు, చ = మరియు, సర్వర్తుపుష్పైః = సర్వఋతువులపుష్పములు కలిగినట్టియు, మధుగన్ధిభిః = మకరందపరిమళములు గలిగినట్టియు, పాదపైః = వృక్షములతో, నిచితం = వ్యాప్తమైనట్టియు, పుష్పరత్నశతైః = నూర్లకొలది శ్రేష్ఠములగు పుష్పములతో, చిత్రం = చిత్రముగ నున్నట్టియు, పఞ్చమం = అయిదవదైన, సాగరం యథా = సముద్రమువలె నున్నట్టియు, నానానినాదైః = అనేకధ్వనులు కలిగిన, మృగగణైః = లేళ్లగుంపులతోను, ద్విజైః = పక్షులతోను, రమ్యం = సుంద

రమైనట్టియు, అనేకగన్ధప్రవహం-అనేకగన్ధ = అనేకపరిమళములను. ప్రవహం = వీచుచున్నట్టియు, పుణ్యగన్ధం = పవిత్రపరిమళములు గలిగినట్టియు. మనోరమం = మనోహరమైనట్టియు, శైలేన్ద్రం = పర్వతశ్రేష్ఠమైనట్టియు. గన్ధాఢ్యం = పరిమళయుక్తమైన, ద్వితీయం = రెండవదైన. గన్ధమాదన మివ = గన్ధమాదన పర్వతము వలెనున్న. ఉద్యానం = అశోకఉద్యానమును. అపశ్యత్ = చూచెను.

తా॥ ఆ అశోకవనమున పున్నాగములు, ఏడాకుల అరటులు, సంపెంగ, విరుగుచెట్లు మంచి యేపుగా పెరిగి పుష్టియైన మొదళ్లుగలిగి బాగాపుష్పించి కొన్ని బంగారుమయముగాను మరికొన్ని అగ్నిజ్వాలలవంటి యెఱ్ఱని రంగులు కలవిగాను ప్రకాశించుచుండెను. నల్లని కాటుకరంగు గల మరికొన్ని అశోకవృక్షములు గలవు. మరియు అనేక ఉద్యానవనములతోకూడి దేవేంద్రుని నందనోద్యానమువలెను కుబేరుని చైత్రరథోద్యానమువలెను చిత్రముగ గూపట్టుచుండెను. అనేకపుష్పముల శోభతో ఆవనము నక్షత్రశోభతో ప్రకాశించు ఆకాశమువలెను అనేకములైన పుష్పములతో మనోహరమై యుండి నక్షత్రముల శోభతో ప్రకాశించు ఆకాశమువలెను. అన్నిఋతువులయందలి ఫలపుష్పజాతులతో నొప్పుచు మకరంద పరిమళయుక్తములైన వృక్షములతో కూడి చిత్రముగా అయిదవ సముద్రమువలెను, లేళ్లగుంపులతోను పక్షుల ధ్వనులతోను అనేకపుష్పముల పరిమళముల మేళవింపులతోను కూడి రెండవగంధమాదనపర్వతమువలె నేత్రానందము గలిగించుచున్న ఆ అశోక వనమును హనుమంతుడు చూచెను.

శ్లో॥ అశోకవనికాయాం తు తస్యాం వానరపుఙ్గవః॥ ౧౫
సదదర్శా విదూరస్థం చైత్యప్రాసాద ముచ్ఛ్రితమ్।
మధ్యే స్తమ్భసహస్రేణ స్థితం కైలాస పాణ్డురమ్॥ ౧౬
ప్రవాళకృతసోపానం తప్త కాఞ్చన వేదికమ్।

శ్లో॥ ముష్ణన్త మివ చక్షూంషి ద్యోతమాన మివ శ్రియా॥ ౧౦
విమలం ప్రాంశుభావత్వా దుల్లిఖన్త మి వామ్బరమ్।

టీ॥ సః = ఆ, వానరపుంగవః = వానరశ్రేష్ఠుడైన హనుమంతుడు, తస్యాం = ఆ, అశోకవనికాయాం = అశోకవనమునందు, మధ్యే = మధ్యయందు, అవిదూరస్థం = సమీపముననున్నట్టియు, స్తమ్భసహస్రేణ = వేయి స్తంభములతో, స్థితం = ఉన్నటువంటియు, చ = మరియు, కైలాసపాణ్డురం-కైలాస = కైలాసపర్వతమువలె, పాణ్డురం = తెల్లనైనటువంటియు, ప్రవాళకృతసోపానం-ప్రవాళ = పగడములతో, కృత = చేయబడిన, (నిర్మింపబడిన) సోపానం = మెట్లు కలిగినట్టియు, తప్తకాఞ్చన వేదికం — తప్త = పుటముబెట్టిన, కాఞ్చన = బంగారముతో నిర్మితమైన, వేదికం = అరుగులు కలిగినట్టియు, చక్షూంషి = నేత్రములను, ముష్ణన్త మివ = మిరిమిట్లుగొల్పునదివలె, స్థితం = ఉన్నటువంటియు, శ్రియా = శోభతో, విమలం = స్వచ్ఛమైనదిగా, ద్యోతమాన మివ (స్థితం) = ప్రకాశించుచున్నదివలె నున్నట్టియు, ప్రాంశుభావత్వాత్ = ఉన్నతముగా నుండుటవలన అంబరం = ఆకాశమును, ఉల్లిఖన్త మివ (స్థితం) = తాకుచున్నదివలె నున్నట్టియు, ఉచ్ఛ్రితం = ఉన్నతమైన, చైత్యప్రాసాదం = విహారసౌధమును, దదర్శ = చూచెను.

తా॥ ఆ అశోకవన మధ్యమున సహస్ర స్తంభములతోకూడి కైలాసపర్వతమువలె తెల్లగ ప్రకాశించుచు, పగడములతో నిర్మితమైన సోపానములు పుటము బెట్టిన బంగారముతో నిర్మింపబడిన వేదికలు గలిగి చూపరుల కండ్లు మిరుమిట్లు గొలుపు తేజస్సుతో నిర్మలాకాశమువలె అత్యున్నతమైన వసంతవిహారభవనమును ఆ హనుమంతుడు చూచెను.

### * హనుమంతుడు సీతాదేవిని చూచుట *

శ్లో॥ తతో మలినసంవీతాం రాక్షసీభి స్సమావృతామ్॥ ౧౮
ఉపవాస కృశాం దీనాం నిశ్శ్వస న్తీం పునః పునః।
దదర్శ శుక్లపక్షాదౌ చన్ద్రరేఖా మివామలామ్॥ ౧౯
మన్దప్రఖ్యాయమానేన రూపేణ రుచిరప్రభామ్।
పినద్ధాం ధూమజాలేన శిఖా మివ విభావసోః॥ ౨౦
పీతే నైకేన సంవీతాం క్లిష్టే గోత్తమ వాససా।
సపఙ్కా మనలంకారాం విపద్మా మివ పద్మినీమ్॥ ౨౧
వ్రీళితాం దుఃఖస న్తప్తాం పరిమ్లానాం తపస్వినీమ్।
గ్రహే ణాఙ్గారకేణేవ పీడితా మివ రోహిణీమ్॥ ౨౨
అశ్రుపూర్ణ ముఖీం దీనాం కృశా మనశనేన చ।
శోకధ్యానపరాం దీనాం నిత్యం దుఃఖపరాయణామ్॥ ౨౩
ప్రియంజన మపశ్య న్తీం పశ్య న్తీం రాక్షసీగణం॥
స్వగణేన మృగీం హీనాం శ్వగణాభివృతా మివ॥ ౨౪
నీలనాగాభయా వేణ్యా జఘనం గతయైకయా।
నీలయా నీరదాపాయే వనరాజ్యా మహీ మివ॥ ౨౫
సుఖార్హాం దుఃఖస న్తప్తాం వ్యసనానామకోవిదామ్।

టీ॥ తతః = అటుతరువాత. మలినసంవీతాం = మాలిన్యముతోకూడినట్టియు, రాక్షసీభిః = రాక్షసస్త్రీలతో, సమావృతాం = కూడియున్నట్టియు ఉపవాస = ఉపవాసములతో కృశాం = కృశించియున్నట్టియు, దీనాం = దీనావస్థలోనున్నట్టియు, పునఃపునః = మాటిమాటికి, నిశ్శ్వస న్తీం = నిట్టూర్పులువిడుచుచున్నట్టియు, శుక్లపక్షాదౌ = శుక్లపక్షప్రారంభమున, అమలాం = స్వచ్ఛమైన, చన్ద్రరేఖామివ(స్థితాం) = చన్ద్రరేఖవలెనున్నట్టియు, మన్దప్రఖ్యాయమానేన నెమ్మదిగగుర్తించగలుగు, రూపేణ =

రూపముతో, రుచిరప్రభాం = ప్రకాశించు కాంతి కలిగియున్నట్టియు, ధూమజాలేన = పొగసమూహము చేత, పినద్ధాం = కప్పబడిన, విభావసోః = అగ్నిహోత్రుని యొక్క, శిఖామివ(స్థితాం) = జ్వాలవలె నున్నట్టియు, పీతేన = పచ్చని, ఏకేన = ఒకటైన, క్లిష్టేన = క్లిష్టమైన, ఉత్తమవాససా = మంచివస్త్రముతో సంవీతాం = కూడియున్నట్టియు, సపఙ్కాం = బురదతో కూడియున్నట్టియు, అనలఙ్కారాం = అలంకారములు లేనటువంటియు, విపద్మాం = పద్మములు లేని, పద్మినీమివ (స్థితాం) = తామరకొలనువలెనున్నట్టియు, వ్రీళితాం = సిగ్గుపడుచున్నట్టియు, దుఃఖసన్తప్తాం = దుఃఖముతో సంతాపము జెందుచున్నట్టియు పరిమ్లానాం = వాడిపోయియున్నట్టియు, తపస్వినీం = రామతపన కలిగియున్నట్టియు, అఙ్గారకేణ = అంగారకుడనే, గ్రహేణ = గ్రహముచేత, పీడితాం = పీడించబడు, రోహిణీమివ = రోహిణివలె నున్నట్టియు, అశ్రుపూర్ణముఖీం-అశ్రు = కన్నీళ్లతో, పూర్ణ = అంతటా తడిసిన, ముఖీం = ముఖముగలిగినట్టియు, దీనాం = దీనురాలై నట్టియు, అనశనేన = భుజించకపోవుటవలన, కృశాం = చిక్కినటువంటియు, శోకధ్యానపరాం-శోక = శోకముచేత, ధ్యాన = భర్తృధ్యానమందు, పరాం = ఆసక్తికలిగియున్నట్టియు, దీనాం = దీనురాలైనట్టియు, నిత్యం = ఎల్లప్పుడు, దుఃఖపరాయణాం = దుఃఖితురాలైయున్నట్టియు, ప్రియం = ఇష్టమైన, జనం = జనమును, అపశ్యన్తీం = చూడనట్టియు, రాక్షసీగణం = రాక్షసస్త్రీసమూహమును, పశ్యన్తీం = చూచుచున్నట్టియు, స్వగణేన = తనసమూహముతో, హీనాం = శూన్యమైనదై, శ్వగణాభివృతాం-శ్వగణ = కుక్కలగుంపుతో, అభివృతాం = ముట్టడించబడిన, మృగీమివ = ఆడలేడివలె నున్నట్టియు నీలనాగాభయా = కృష్ణసర్పముతో సమానమైన, జఘనంగతయా = కటిప్రదేశమును, పొందిన, ఏకయా = ఒకటైన, వేణ్యా = జడచేత,

నీరదాపాయే = శరత్కాలమందు, నీలయా = నీలవర్ణముగల, వన రాజ్యా = వనపంక్తిచేత, మహీమివ = భూమినివలె నున్నట్టియు, సుఖార్హాం = సుఖమునకు, తగియున్నదైనను, దుఃఖసన్తప్తాం = దుఃఖముచేత సంతాపము జెందుచున్నట్టియు, వ్యసనానాం = వ్యసనములకు, అకోవిదాం = అతీతురాలగు సీతను, దదర్శ = చూచెను.

తా॥ ఆతరువాత మాలిన్యముతో కూడి, పచ్చని చాలీచాలని చిరిగిపోవు దశలో నున్న ధరించి, ఉపవాసమువలన కృశించి విచారగ్రస్తురాలై నిట్టూర్చుచు, శుక్లపక్ష విదియనాటి చంద్రునివలె తేజస్సుకలిగి, పొగతో కప్పబడిన అగ్నివలెనుండి, దుమ్ముచే కప్పబడి, ఆలస్యముగ గుర్తించ గలుగు ఆకారముతో, ఒకే చాలీచాలని శిథిలావస్థలోనున్న చీరతో, (రావణాపహరణకాలమందు చీరచించి నగలు మూటగట్టివేయుటచే) నుండి, అలంకారహీన యగుటచే పద్మరహితమగు కొలనువలె నుండి సిగ్గుపడుచు, దుఃఖసంతప్తురా లగుచు, వాడిపోయి రామసందర్శన లాలసతచే తపించుచు, అంగారకగ్రహముచే పీడింపబడురోహిణివలె దుష్ట రాక్షసునిచే పీడింపబడుచు, కన్నీళ్లతో ముఖము తడిసియుండ భుజింపక యుండుటచే కృశించి, దిక్కులేనిదానివలె విచారించుచు, శ్రీరామధ్యానమునందాసక్తి గలిగియుండి, స్వకీయజనమును జూడ జాలక సదా భయంకర రూపములు గల రాక్షసస్త్రీలనే చూచుచు, చింతించుచూ, స్వజాతి సంఘమును వీడి కుక్కలచే ముట్టడించబడిన ఆడు లేడి వలె కంపించుచు, నల్లత్రాచువలె నుండి పిరుదులపై వ్రేలాడు పొడవైన జడ కలిగి, శరత్కాలమందు నల్లని వనపంక్తిచే వ్యాప్తమై యుండు భూమివలె నుండి, కష్టములకోర్వజాలని, సుఖము ననుభవించుట కర్హురాలును, మహాపతివ్రతా శిరోమణియు నగు సీతను హనుమంతుడు చూచెను.

* హనుమంతుడు సీతాదేవిని చూచి తనలో వితర్కించుకొనుట *

శ్లో॥ తాం సమీక్ష్య విశాలాక్షీ మధికం మలినాం కృశామ్॥ ౨౬
తర్కయామాస సీతేతి కారణై రుపపాదిభిః।

టీ॥ విశాలాక్షీం = విశాలమైన నేత్రములు గలిగినట్టియు, అధికం = ఎక్కువగ మలినాం = మాలిన్యము నెందియున్నదియు, కృశాం = కృశించియున్నట్టియు, తాం = ఆమెను; సమీక్ష్య = చూచి. ఉపపాదిభిః = నిరూపించబోవు, కారణైః = కారణములతో, సీతేతి = సీతయని, తర్కయామాస = ఊహించెను.

తా॥ విశాలములగు నేత్రములు గలిగి ఎక్కువగా మాలిన్యముతో కూడి చిక్కి దీనురాలుగా నున్న ఆమెను చూచి హనుమంతు డీమెయే సీతయని నిరూపించబోవు కారణములతో నూహించెను.

శ్లో॥ హ్రియమాణా తదా తేన రక్షసా కామరూపిణా॥ ౨౭
యథా రూపా హి దృష్టా వై తథా రూపేయ మఙ్గనా।

టీ॥ తదా = అప్పుడు, కామరూపిణా = కోరినరూపముదాల్చు, తేన = ఆ. రక్షసా = రాక్షసుడైన రావణునిచేత, హ్రియమాణా = అపహరింపబడినదై. యథారూపా = ఏరూపమున, దృష్టా = చూడపడినదో, ఇయం = ఈ. అఙ్గనా = స్త్రీ, తథారూపా వై = అదేరూపముకలదై యుండెగదా!

తా॥ మాయారూపధారి యగు రావణుడు ఎత్తుకొనిపోవుసమయమున ఏరూపమున కనబడెనో అదేరూపములో నీ స్త్రీ కనుపించుచున్నది అని హనుమంతుడు పూర్వము తాను చూచిన స్థితిని తలంచుకొనెను.

శ్లో॥ పూర్ణచన్ద్రాననాం సుభ్రూం చారు వృత్త పయోధరామ్॥ ౨౮
కుర్వ న్తీం ప్రభయా దేవీం సర్వా వితిమిరా దిశః।
తాం నీలకేశీం బిమ్బోష్ఠీం సుమధ్యాం సుప్రతిష్ఠితామ్॥ ౨౯
సీతాం పద్మపలాశాక్షీం మన్మథస్య రతిం యథా।
ఇష్టాం సర్వస్య జగతః పూర్ణచన్ద్రప్రభా మివ॥ ౩౦
భూమౌ సతనుమాసీనాం నియతా మివ తాపసీమ్।
నిశ్శ్వాసబహుళాం భీరుం భుజగేన్ద్రవధూ మివ॥ ౩౧
శోకజాలేన మహతా వితతేన నరాజతీమ్।
సంసక్తాం ధూమజాలేన శిఖా మివ విభావసోః॥ ౩౨
తాం స్మృతి మివ సన్దిగ్ధా మృద్ధిం నిపతితా మివ।
విహతా మివచ శ్రద్ధా మాశాం ప్రతిహతా మివ॥ ౩౩
సోపసర్గాం యథాసిద్ధిం బుద్ధిం సకలుషా మివ।
అభూతేనాపవాదేన కీర్తిం నిపతితా మివ॥ ౩౪
రామోపరోధ వ్యథితాం రక్షోహరణ కర్శితామ్।
అబలాం మృగశాబాక్షీం వీక్షమాణాం తత స్తతః॥ ౩౫
బాష్పామ్బు పరిపూర్ణేన కృష్ణవక్రాక్షిపక్ష్మణా।
వదనేనా ప్రసన్నేనా నిశ్శ్వస న్తీం పునఃపునః॥ ౩౬
మలపఙ్కధరాం దీనాం మణ్డ నార్హా మమణ్డితామ్।
ప్రభాం నక్షత్ర రాజస్య కాలమేఘై రివావృతామ్॥ ౩౭
తస్య సన్దిదిహే బుద్ధి ర్ముహు స్సీతాం నిరీక్ష్య తు।
ఆమ్నాయానా మయోగేన విద్యాం ప్రశిథిలా మివ॥ ౩౮

టీ॥ పూర్ణచన్ద్రాననాం. పూర్ణచన్ద్ర = పూర్ణిమనాటి చంద్రునివంటి. ఆన నాం = ముఖముకలిగినట్టియు, సుభ్రూం = యోగ్యములగుకనుబొ మలు కలిగినట్టియు చారువృత్తపయోధరాం—చారు = సుందరములైన

వృత్త = గుండ్రని, పయోధరాం = పాలిండ్లుగలిగినట్టియు, సర్వాః = సమస్తములైన, దిశః = దిక్కులను, ప్రభయా = కాంతితో, వితిమిరాః = చీకట్లులేనట్లుగ, కుర్వన్తీం = చేయుచున్నట్టియు, దేవీం = దివ్యస్వరూపయైనట్టియు, నీలకేశీం = నల్లనివెంట్రుకలు గలిగినట్టియు, బిమ్బోష్ఠీం = దొండపండువంటి అధరోష్ఠము కలిగినట్టియు, సుమధ్యాం = యోగ్యమైన నడుము కలిగినట్టియు, సుప్రతిష్ఠితాం = యోగ్య ప్రతిమగ చేయబడినట్టియు, సీతాం = నాగటిచాలున, బుట్టినదియు పద్మపలాశాక్షీం-పద్మపలాశ = తామరరేకులవంటి,అక్షీం = నేత్రములు గలిగినట్టియు, మన్మథస్య = మన్మథునకు, రతింయథా = రతీదేవివలెనున్నట్టియు, సర్వస్య = సమస్తమైన, జగతః = జగత్తునకు, పూర్ణచన్ద్రప్రభామివ - పూర్ణచన్ద్ర = పౌర్ణమి చంద్రునియొక్క, ప్రభామివ = కాంతివలెనున్నట్టియు, భూమౌ = భూమియందు, సుతను = యోగ్యమైన శరీరముగలిగి, ఆసీనాం = కూర్చొనియున్నట్టియు తాపసీమివ = తాపసస్త్రీవలె, నియతాం = నియమముకలిగియున్నట్టియు, నిశ్వాసబహులాం = ఎక్కువగా నిట్టూర్చుచున్నట్టియు, భుజగేన్ద్రవధూమివ = ఆడసర్పమువలె, భీరుం = భయంకరముగానున్నట్టియు, వితతేన = వ్యాప్తమైన, మహతా = గొప్పదగు, శోకజాలేన = దుఃఖపరంపరతో, నరాజతీం = ప్రకాశములేకయున్నట్టియు, ధూమజాలేన = పొగసమూహముతో, సంసక్తాం = కూడియున్న, విభావసోః = అగ్నిహోత్రునియొక్క, శిఖామివస్థితాం = జ్వాలవలెనున్నట్టియు, సన్దిగ్ధాం = యోగ్యముగ బోధకాని, స్మృతీ మివ = ధర్మశాస్త్రమువలెను, నిపతితాం = క్షీణించుచున్న, వృద్ధి మివ = సంపదవలెను, విహతాం = విశ్వాసములేని, శ్రద్ధా మివ = ఆస్తిక బుద్ధివలెను, చ = మరియు, ప్రతిహతాం = వ్యర్థమైన, ఆశామివ = కోరికవలెను, సోపసర్గాం = విఘ్నములతో కూడిన, సిద్ధి యథా = కార్యసిద్ధివలెను, సకలుషాం = కపటముతో కూడిన, బుద్ధి మివ = బుద్ధి

వలెను. అభూతేన = లేనటువంటి, అపవాదేన = అపవాదుచేత, నిపతితాం = చెడిన, కీర్తి మివ = కీర్తివలె నున్నట్టియు, రామోపరోధవ్యధితాం—రామోపరోధ = శ్రీరాముడు లేకుండటచే, వ్యధితాం = వ్యధ చెందుచున్నట్టియు. రక్షోహరణకర్శితాం—రక్షః = రాక్షసుడైన రావణునిచేత, హరణ = అపహరింపబడియుండుటచేత, కర్శితాం = కృశించియున్నట్టియు, అబలాం = బలహీనురాలైనట్టియు, మృగశాబక్షీం—మృగశాబ = లేడికూన యొక్క, అక్షీం = నేత్రములవంటి నేత్రములు గలిగినట్టియు. తత స్తతః = అటునిటు, వీక్షమాణాం = చూచున్నట్టియు, బాష్పాంబు పరిపూర్ణేణ - బాష్పాంబు = కన్నీళ్లతో, పరిపూర్ణేణ = నిండినట్టియు, కృష్ణ వక్రాక్షిపక్ష్మణా—కృష్ణ = నల్లనైన, వక్ర = వంకరగనున్న, అక్షిపక్ష్మణా = కనురెప్పలు కలిగియున్నదియు, అప్రసన్నేన = దుఃఖముతో కూడిన, వదనేన = ముఖముతో, పునః పునః = మాటిమాటికి, నిశ్శ్వసన్తీం = నిట్టూర్చుచున్నదియు, మలపఙ్కధరాం = మాలిన్యముతో కూడియున్నదియు, దీనాం = దీనురాలైనట్టియు, మణ్డనార్హాం = అలంకారములకు తగియున్నదైనను, అమణ్డితాం = అలంకారరహితయై యున్నట్టియు. కాలమేఘైః = వర్షాకాలమేఘములతో, ఆవృతాం = కప్పబడిన, నక్షత్రరాజస్య = చంద్రుని యొక్క, ప్రభా మివ = కాంతివలెనున్నట్టియు, ఆమ్నాయానాం = వేదములయొక్క, అయోగేన = అనభ్యాసముచేత, ప్రశిథిలాం = ఎక్కువగా పాడైన, విద్యామివ = విద్యవలె నున్నట్టియు, తాం = ఆ సీతాం = సీతాదేవిని, నిరీక్ష్యతు = చూచుచునే, తస్య = ఆ హనుమంతునియొక్క, బుద్ధిః = బుద్ధి, ముహుః = మాటిమాటికి, సన్దిదిహే = సందేహమును పొందుచుండెను.

తా॥ పౌర్ణమిచంద్రునితో బోలిన ముఖమును సొగసైన కనుబొమలును సుందరముగా గుండ్రముగ నున్న స్తనములను, గల సీతాదేవి స్నానాద్యను ష్ఠానములు లేకపోయినను సమస్తదిక్కుల స్వకీయకాంతిపుంజ

ముతో ప్రకాశింపజేయుచు నల్లని కేశజాలము, దొండపండువంటి అధరోష్ఠము, సన్నని నడుము సర్వావయవములందు పొందిక కలిగి కామునిబాణముల వంటి నేత్రములు గలిగి రతీదేవివంటి సౌందర్యము గలిగియుండి సమస్తజగత్తునకు వెన్నెలవలె ప్రియమైనట్టియు, తాపసస్త్రీవలె భూమియందు దాసీనురాలై నియమముతో నున్నదియు ఆడ సర్పమువలె మిక్కుటముగ నిట్టూర్పుచున్నదియు, అధికదుఃఖముతో పొగచే కప్పబడిన అగ్నిహోత్రమువలె నున్నదియు. సందిగ్ధమైన ధర్మశాస్త్రము వలెను నశించుపోవు సంపదవలెను ఆస్తికత్వములేని బుద్ధివలెను అపవాదుచే నశించిన కీర్తిచంద్రికవలె నున్నట్టియు రామసాన్నిధ్యమును కోరి బాధపడుచున్నటియు రావణాపహరణముచేత కృశించియున్నదియు, భయముచే కంపితమైన లేడికూనవలె నటు నిటు దిక్కులు చూచుచున్నదియు నల్లని వంకరతిరిగిన కనుబొమలు కలిగినదియు కన్నీటితో నిండి మాలిన్యము పొందిన ముఖముతో మాటి మాటికి నిట్టూర్పులు విడుచుచున్నదియు శరీరమంతట ధూళితోను కన్నీరుతోను బురదవలె వ్యాపించబడి యున్నదియు, అలంకారయోగ్య అయి నప్పటికి అలంకారవిహీన అయినట్టియు దిక్కులేని దీనురాలువలె నున్న యా సీతను జూచి హనుమంతుని చిత్తము మాటి మాటికి సందేహించుచునే యుండెను.

శ్లో॥ దుంఖేన బుబుధే సీతాం హనుమా ననలఙ్కృతామ్ ।
సంస్కారేణ యథాహీనాం వాచ మర్థాన్తరం గతామ్॥ 39

టీ॥ హనుమాన్ = హనుమంతుడు, దుఃఖేన = దుఃఖముతో, అనలఙ్కృతాం = అలంకరించుకొననని; సీతాం = సీతను. సంస్కారేణ = శబ్దవ్యుత్పత్త్యాది సంస్కారముతో. అహీనాం = హీనముకాని. వాచం = వాక్యమును, అర్థాంతరం = మరియొకఅర్థమును, గతాంయథా = పొందినదానివలె, బుబుధే = తెలిసికొనెను.

తా॥ వ్యాకరణాదిశాస్త్రములయందు పరిశీలన లేని పురుషుడు శబ్దవ్యుత్పత్త్యర్థముల సంస్కార మెరిగి పిమ్మట దాని విశేషార్థముల బడయునట్లు హనుమంతుడు ధీకుశలత్వము గలపండితుడు గనుక మాలిన్యము దీనత శోకము కార్శ్యాది లక్షణములచే మొదట గుర్తుపట్టక పోయినను తరువాత కష్టముమీద సీతగా గుర్తుపట్టి తెలిసికొనెను

శ్లో॥ తాం సమీక్ష్య విశాలాక్షీం రాజపుత్రీ మనిన్దితామ్।
తర్కయామాస సీతేతి కారణై రుపపాదిభిః॥ ४०

టీ॥ విశాలాక్షీం = విశాలనేత్రములు గలిగినట్టియు, అనిన్దితాం = నిర్దోషురాలైనట్టియు. తాం = ఆ, రాజపుత్రీం = సీతను, ఉపపాదిభిః = ఉదాహరింపబడు, కారణైః = కారణములతో, సీతేతి = సీతయని, తర్కయామాస = ఊహించెను.

తా॥ హనుమంతుడు విశాలనేత్రములు గలిగి, నిర్దోషురాలైన ఆమెనుజూచి ముందు నిరూపించబడు కారణములతో సీతయని ఊహించెను,

* హనుమంతుడు తాను జూచిన శ్రీ సీతాదేవి యని నిశ్చయించుట *

శ్లో॥ వైదేహ్యాయాని చాఙ్గేషు తదా రామోన్వకీర్తయత్।
తాన్యాభరణజాలాని శాఖాశోభీ న్యలక్షయత్।

టీ॥ తదా = అప్పుడు, రామః = శ్రీరాముడు, వైదేహ్యాః = సీతయొక్క అఙ్గేషు = అవయవములందు. యాని = యే, ఆభరణజాలాని = ఆభరణ సమూహములను, అన్వకీర్తయత్ = ఉన్నవనిచెప్పెనో, తాని = ఆ, ఆభరణజాలాని = ఆభరణసమూహములు, శాఖాశోభీని = కొమ్మలయందుప్రకాశించుచున్నదై, అలక్షయత్ = కనబడుచున్నవి.

తా॥ నేను కిష్కింధనుండి బయలుదేరు సమయమున సీతను గుర్తుపట్టుటకు గాను శ్రీరాముడేయేగుర్తులు చెప్పెనో ఆ యాగుర్తులు గల ఆభరణములే చెట్టుకొమ్మల వ్రేలాడబడి, ప్రకాశించుచున్నవి,

శ్లో॥ సుకృతౌ కర్ణవేష్టౌ చ శ్వదంష్ట్రౌ చ సుసంస్థితౌ।
మణి విద్రుమ చిత్రాణి హస్తే స్వాభరణానిచ॥ ४२

శ్యామాని చిరయుక్తత్వా త్తథా సంస్థానవన్తిచ॥
తాన్యేవైతాని మన్యేఽహం యాని రామోఽన్వకీర్తయత్॥ ४३

టీ॥ సుకృతౌ = యోగ్యముగా చేయబడిన. కర్ణవేష్టౌచ = కర్ణకుండలము లును. సుసంస్థితౌ = యోగ్యముగ నుంచబడిన. శ్వదంష్ట్రౌ చ = సుకుమారములుగల త్రికర్ణములను జంపులును. హస్తేషు = హస్తములయందు, మణివిద్రుమచిత్రాణి = మణులు పగడములు చిత్రము లుగా, కూర్చబడిన కడియములును, తథా = అప్రకారముగ. చిరయుక్తత్వాత్ = చిరకాలముకూడియుండుటవల్ల. శ్యామాని = కొంచెమునల్లబడిన. సంస్థానవన్తి చ = తీసివేయబడిన యాభరణపు గుర్తులును. యాని = యే ఆభరణములగూర్చి. రామః = శ్రీరాముడు, అన్వకీర్తయత్ = ఉన్నవిధములు చెప్పెనో. తాన్యేవ = వాటినే, ఏతాని = వీటినిగా, అహం = నేను. మన్యే = తలంచుచున్నాను.

తా॥ సుయోగ్యములైన కర్ణకుండలములు, జంపులు, మణులు, పగడములు కూర్చిన హస్తకంకణములు, చిరకాలముండుటవలన మలినయుక్త ములై నల్లబడియున్నవి. కొన్నితీసివేయబడిన యాభరణముల గుర్తులు కూడ కనిపించుచున్నవి, నేనుబయలుదేరు కాలమున శ్రీరాముడు ఏయే నగల గూర్చి తెలియజేసెనో అవి ఇవియే అని తలంచెదను.

శ్లో॥ తత్ర యాన్యవహీనాని తాన్యహం నోపలక్షయే।
యాన్యస్యా నావహీనాని తానిమాని నసంశయః॥ ४४

పీతం కనకపట్టాభం స్రస్తం తద్వసనం శుభం।
ఉత్తరీయం నగాసక్తం తథా దృష్టం ప్లవంగమైః॥ ४५

భూషణాని చ ముఖ్యాని దృష్టాని ధరణీతలే।
అనయైవాపవిద్ధాని స్వనవన్తి మహాన్తిచ॥ ४६

శ్లో॥ ఇదం చిరగృహీతత్వా ద్వసనం క్లిష్టవ_త్తరమ్।
తథాఽపి నూనం తద్వర్ణం తథా శ్రీమద్య థేతరత్॥ ౪౭

టీ॥ తత్ర = అక్కడ ఋశ్యమూకమందు, యాని = ఏఆభరణములు అవహీనాని = పడియున్నవో, తాని = ఆ ఆభరణములను, అహం = నేను, (అత్ర = ఇచ్చట) నోపలక్షయే = చూచుటలేదు, అస్యాః = ఈమెయొక్క, యాని = యేఆభరణములు, నావహీనాని = (అచట) పడలేదో, తాని = అవి, ఇమాన్యేవ = ఇవియే, నశంసయః = సందేహములేదు. తథా = అప్పుడు, స్రస్తం = పైనుండి పడినటువంటియు నగాసక్తం = వృక్షమునకు, తగులుకొని యున్నట్టియు, పీతం = పచ్చనైన, ఉత్తరీయం (నగలమూటకట్టబడిన) వస్త్రము, ప్లవంగమైః = వానరులచే, దృష్టం = చూడబడినది, తత్ = ఆ, కనకపట్టాభం = బంగారువస్త్రముయొక్క కాంతికలిగినట్టి, శుభం = శుభప్రదమైన. వసనం = వస్త్రమే, (అగును). అనయైవ = ఈవస్త్రముచేతనే; అపవిద్ధాని = కట్టబడినటువంటియు, స్వనవన్తి = ధ్వనులుకలిగినట్టియు, భూషణాని చ = ఆభరణములే, ధరణీతలే = భూప్రదేశమందు, దృష్టాని = చూడబడుచున్నవి. ఇదం = ఈ, వసనం = వస్త్రము, చిరగృహీతత్వాత్ = ఎక్కువకాలము, ధరించి యుండుటవల్ల, క్లిష్టవత్తరం = శిథిలమైనట్లుగనున్నది, తథాపి = అయినప్పటికి, తద్వర్ణం = అవస్త్రముయొక్క రంగు, తథా = ఆప్రకారముగనే, శ్రీమత్ = శోభాయుక్తమై, యథేతరత్ = యథాపూర్వముగనే యున్నది. నూనం = నిశ్చయము.

తా॥ శ్రీరాముడు చెప్పిన ఆభరణములలో కొమ్మమీద కనబడని యాభరణములు ఆ ఋశ్యమూక పర్వతమందు పడినవానియందున్నవి, అచ్చట కనుపించనివి యిచ్చట నున్నవి. ఇవన్నియు శ్రీరాముడు చెప్పిన గుర్తులు గలవిగనే యున్నవి. ఈమె ధరించిన వస్త్రము చిరకాలము

ధరించిన దగుటచే మాసియున్నదయినను. ఋశ్యమూక పర్వతమం దాభరణములు కట్టి జారవిడిచిన చీరముక్కవలెనే పచ్చగ నున్నది. ఇవన్నియు శ్రీరాముడు చెప్పిన గుర్తులకు సరిపడియున్నవి, సందేహాము లేదు.

శ్లో॥ ఇయం కనకవర్ణాఙ్గీ రామస్య మహిషీప్రియా।
ప్రణష్టాపి సతీ యాఽస్య మనసో న ప్రణశ్యతి॥ ౪౮
ఇయం సా యత్కృతే రామశ్చతుర్భిః పరితప్యతే।
కారుణ్యే నానృశంస్యేన శోకేన మదనేన చ॥ ౪౯
స్త్రీ ప్రణష్టేతి కారుణ్యా దాశ్రితే త్యానృశంస్యతః।
పత్నీ నష్టేతి శోకేన ప్రియేతి మదనేన చ॥ ౫౦
అస్యా దేవ్యా యథారూప మఙ్గప్రత్యఙ్గ సౌష్ఠవమ్।
రామస్య చ యథారూపం తస్యేయ మసితేక్షణా ౫౧
అస్యా దేవ్యా మన స్తస్మిం స్తస్య చాస్యాం ప్రతిష్ఠితమ్।
తేనేయం స చ ధర్మాత్మా ముహూర్త మపి జీవతి॥ ౫౨

టీ॥ కనకవర్ణాఙ్గీ = బంగారు రంగు అవయవములు గలిగినట్టియు రామస్య = శ్రీరామునికి, ప్రియా = ఇష్టురాలైనట్టియు, మహిషీ = పట్టపురాణియైన, యా = ఏ సీతయో. ఇయం = ఈమె, ప్రణష్టాఽపి సతీ = దూరమైనదై యుండ, అస్య = ఈ శ్రీరాముని యొక్క, మనసః = మనస్సునుండి, న ప్రణశ్యతి = దూరము కాదు, రామః = శ్రీరాముడు, యత్కృతే = ఏ స్త్రీ నిమిత్తమై. చతుర్భిః = నాలుగైన. కారుణ్యేన = దయచేతను, ఆనృశంస్యేన = సద్బుద్ధిచేతను, శోకేన = దుఃఖము చేతను, మదనేన చ = మన్మథుని చేతను, పరితప్యతే = పరిపూర్ణ తాపము జెందుచున్నాడో, సా = ఆమె, ఇయం = ఈమెయే, స్త్రీ = స్త్రీ, ప్రణష్టా ఇతి = నష్టపడినదని (తీసికొనిపోబడినదని)

కారుణ్యాత్ = కరుణవలన, ఆశ్రితా = ఇతరులనాశ్రయించబడియు న్నది, ఇతి = ఈలాగునని, ఆనృశంస్యతః = అకౄరత్వమువలనను (ఆశ్రితరక్షణైకస్వభావమువలనను) పత్నీ = భార్య,నష్టా = కనబడుట లేదు; ఇతి = ఈలాగునని. శోకేన = దుఃఖముచేతను, ప్రియా = ప్రియురాలు, ఇతి = ఈలాగునని, మదనేనచ = మన్మధునిచేతను, పరి తప్యతే = తపింపజేయబడుచున్నాడు. అజ్గప్రత్యజ్గసౌష్ఠవం = (సాముద్రి కశాస్త్రోక్తశుభలక్షణసమన్వితమైన) కరచరణావ్యవయవసౌందర్యము అస్యాః = ఈ. దేవ్యాః = దేవికి. యథారూపం = సుందరాకారమునకుం తగినట్లున్నవో, రామస్య చ = శ్రీరామునియొక్కయు. యథారూపం = సుందరాకారమునకుతగినట్లున్నవి, అసితేక్షణా = నల్లనిచూపులు గలి గిన.ఇయం = ఈమె,తస్య = ఆ శ్రీరామునియొక్క, దేవీ = భార్యయే- అస్యాః = ఈ,దేవ్యాః = దేవియొక్క,మనః = మనస్సు, తస్మిన్ = ఆ శ్రీరామునియందును, తస్య = ఆ,శ్రీరామునియొక్క, మనః = మనస్సు అస్యాం = ఈమెయందును, ప్రతిష్ఠితం = విడివడియుండని స్థితితో స్థిరపరుపబడి యుండెను, తేన = ఆకారణముచేత, ఇయం = ఆమెయు ధర్మాత్మా = ధర్మస్వరూపుడైన, సచ = ఆ శ్రీరాముడును, ముహూర్త మపి = ముహూర్తకాలమైన, జీవతి = జీవించియున్నారు.

తా॥ లోకమున ననురూపధారులైన స్త్రీపురుషులలో స్త్రీకి అనుకూలుడగు భర్తయు భర్తకనుగుణ్యయగు భార్యయు సంప్రాప్తించుట దుర్లభము. రూపము, గుణము, పాతివ్రత్యము. ఏకపత్నీవ్రతము లున్నను అన్యోన్యతలు అతిదుర్లభము, ఇచ్చటసీతారాములందు సర్వసద్గుణసం పద లుండుటనుబట్టియే సర్వేశ్వరులు సాకారులుగా స్మరింపబడు చుండిరి. సౌందర్యమున్నను భర్తకు హితురాలగుట లేదు, ఇవ్వి యున్నను పాతివ్రత్యముండదు, పాతివ్రత్యాదులుండిన పట్టాభిషిక్తురా లగుట సంభవింపదు, ఏదో ఒక కొఱత గోచరించుచుండును. సీత సర్వ సద్గుణ సౌందర్యాది శుభలక్షణసంపన్నయగుటంజేసి శ్రీరాముడు

మానసమున విడువక తలచుచునే యుండును. అట్టి పతివ్రతాశిరోమణి నే యిప్పుడు నాచే చూడబడుచున్న స్త్రీ అగును. సంశయములేదు. ఆపద వచ్చినప్పుడు స్త్రీలు కాపాడదగిన వారుకదా! రక్షింపలేకపోయితిననే దయతోను, తన్ను వివాహమాడి ఆశ్రయించి నామెను ఆశ్రిత దీన రక్షణ స్వభావము గలిగియు, కాపాడలేకపోయితిగదా యనే సద్భావము చేతను, అర్ధాంగియగు భార్యను రక్షించుకోలేని దుఃఖముచేతను, మన స్సునకు మహదానందమును కలుగజేయు ప్రియురాలి యెడబాటుచే కలి గిన కామాది వికారములచేతను శ్రీరామచంద్రమూర్తి పరిపరివిధముల పరితాపము చెందుచుండెను. సాముద్రిక శాస్త్రోక్త సౌందర్య సౌకు మార్య లావణ్యాద్యనంత శుభలక్షణములతో కరచరణాద్యవయవ ముల కనువగు నమరికలతో నొప్పుచుండెను. ఉభయులు సర్వవిధ ముల యొకరికొకరు తగిన వారుగ నుండిరి. సీత శ్రీరాముని సన్ని ధానమున లేకపోయినను శ్రీరాముని మనస్సున ధ్యానముద్రకో సీతా రూపసాక్షాత్కారము కలుగుటచేతను, అట్లేసీత మనస్సున శ్రీరామ రూపదర్శనము సదాకలుగుటచేతనే వారుభయులు యాక్షణమువరకు జీవించి యుండగలిగిరి. ఇట్టి సర్వానురూపదాంపత్య మింకెక్కడ నుండజాలదు.

శ్లో॥ దుష్కరం కృతవాన్ రామో హీనో య దనయా ప్రభుః।
ధారయ త్యాత్మనో దేహం న శోకే నావసీదతి॥ ౫౩
దుష్కరం కురుతే రామో య ఇమాం మత్తకాశినీమ్।
సీతాం వినా మహాబాహూ ర్ముహూర్త మపి జీవతి॥ ౫౪

టీ॥ యత్ = ఏకారణమున, ప్రభుః = ప్రభువైన, రామః = శ్రీరాముడు అనయా = ఈమెతో, హీనః = లేనివాడై, ఆత్మనః = తనయొక్క, దేహం = శరీరమును, ధారయతి = ధరించుచున్నాడో, శోకేన = దుఃఖముతో, నావసీదతి = మరణించుటలేదో, తత్ = ఆకారణమున, దుష్కరం = గొప్పపాపమును, కృతవాన్ = చేసియుండును. యః =

ఏ. మహాబాహుః = ఆజానుబాహుం డగు శ్రీరాముడు, మత్తకాశినీం = మదగజగమనయైన, ఇమాం = ఈ, సీతాంవినా = సీతలేకపోయినను, ముహూర్తమపి = ముహూర్తకాలమైన, జీవతి = జీవించుచున్నాడో, సః = ఆ, రామః = శ్రీరాముడు, దుష్కరం = మహాపాపమును, కురుతే = చేయుచున్నాడు.

తా॥ ప్రభువైన శ్రీరాముడు తనకుపట్టపురాణియు ప్రియురాలు అర్ధాంగియు నగు నీసీత సమక్షమున లేకపోయినప్పటికి హరింపబడినదైనప్పటికి నింకా మరణించక ప్రాణములు నిలబెట్టుకొని బ్రతికియున్నాడంటే అతను పూర్వము మహాపాపముచేసికొని యుండవచ్చును. మరియు తన కన్నివిధముల సహధర్మచారిణి సుఖసంతోషానందముల చేకూర్చు భార్యయగు సీత తనచెంత లేకపోయినా ముహూర్తకాలమైనా బ్రతికి యున్నాడంటే యింకను మహాపాపమును చేయుచునే యున్నాడు.

శ్లో॥ ఏవం సీతాం తదా దృష్ట్వా హృష్టః పవనసమ్భవః।
జగామ మనసా రామం ప్రశశంస చ తం ప్రభుమ్॥ ౫౩

టీ॥ ఏవం = ఈప్రకారముగ, పవనసమ్భవః = వాయుసూనుడైన హనుమంతుడు, సీతాం = సీతాదేవిని, దృష్ట్వా = చూచి, హృష్టః = సంతోషించిన వాడగుచు, తం = ఆ, ప్రభుం = ప్రభువైన, శ్రీరామచంద్రుని నిగూర్చి, మనసా = మనస్సుచేతనే, ప్రశశంస = ప్రస్తుతించెను, తదా = అప్పుడు, జగామ = వెళ్ళెను.

తా॥ హనుమంతుడు సర్వ సద్గుణ శుభలక్షణ సమేతయు, పతివ్రతా శిరోమణియు, నగు సీతనుంజూచి యీమె తిరిగి రాముని పొందయోగ్యురాలుకదా యని సంతసించి మనసా రాముని దలంచి అచ్చటనుండి బయలుదేరెను.

పంచదశ సర్గము సమాప్తము

* హనుమంతుడు సీతాదేవి స్థితికి దుఃఖించుట *

శ్లో॥ ప్రశస్య తు ప్రశ స్తవ్యాం సీతాం తాం హరిపుఙ్గవః।
గుణాభిరామం రామం చ పున శ్చింతాపరోఽభవత్॥ ౧

టీ॥ హరిపుఙ్గవః = వానరశ్రేష్ఠుడైన హనుమంతుడు, ప్రశ స్తవ్యాం = ప్రస్తుతించదగిన, తాం = ఆ, సీతాం = సీతను, గుణాభిరామం-గుణ = గుణములచే, అభిరామం = మనోహరుడైన, రామం చ = శ్రీరాముని, ప్రశస్య = ప్రస్తుతించి; పునశ్చ = తిరిగియు, చిన్తాపరః = విచారగ్రిస్తుడు, అభవత్ = ఆయెను.

తా॥ హనుమంతుడు సీతను చూడగనే సర్వస్థితుల సదవగాహనలు కల వాడై బాహ్యరూపాది చేష్టితస్థితిలో ఆత్మ సౌశీల్యాది స్థితులందుకొని "అస్యాదేవ్యా యధారూపం" అనుశ్లోకమందు చెప్పబడిన రీతిగ పరస్పరానురూప దాంపత్యము గలవారగుటకు సంతోషించి సీతారాములను ప్రస్తుతించి మరల వారి వియోగ స్థితికి చింతాక్రాంతు డాయెను.

శ్లో॥ సుముహూర్త మివ ధ్యాత్వా బాష్పపర్యాకులేక్షణః।
సీతా మాశ్రిత్య తేజస్వీ హనుమా న్విలలాపహ॥ ౨

టీ॥ తేజస్వీ = తేజోవంతుడైన, సః = ఆ, హనుమాన్ = హనుమంతుడు ముహూర్తం = ముహూర్తకాలము, ధ్యాత్వా = ధ్యానించి, బాష్పపర్యాకులేక్షణః-బాష్ప = కన్నీళ్లతో, పర్యాకుల = వ్యాప్తమైన, ఈక్షణః = చూపులుగలవాడై, సీతాం = సీతసుగూర్చి, ఆశ్రిత్య ఇవ = ఉద్దేశించినట్లుగ, విలలాపహ = దుఃఖించెనట.

తా॥ మహాతేజశ్శాలి యగు హనుమంతుడు ముహూర్తకాలము సీతారాముల ధ్యానించి తదుపరి కంట నీరుపెట్టుకొని సీతయొక్క పరిస్థితికి మిగుల దుఃఖించెను.

శ్లో॥ మాన్యా గురువినీతస్య లక్ష్మణస్య గురుప్రియా।
యది సీతాఽపి దుఃఖార్తా కాలో హిదురతిక్రమః॥ 3

టీ॥ గురువినీతస్య-గురు = వశిష్ఠాది గురువులచే, వినీతస్య = శిక్షింపబడిన, లక్ష్మణస్య = లక్ష్మణునికి, మాన్యా = పూజ్యురాలైనట్టియు, గురుప్రియా-గురు = గురువుతోసమానుడైన శ్రీరామునికి, ప్రియా = భార్యయునగు, సీతాఽపి = సీతకూడ, దుఃఖార్తాయది = దుఃఖముచే పీడింపబడినట్లయిన, కాలః = కాలము, దురతిక్రమః = దాటశక్యముగానిదికదా।

తా॥ మహనీయులైన వశిష్ఠ విశ్వామిత్రు లాది గురువులయొద్ద సర్వశాస్త్రాదుల బడసి ఎట్టి వారలనైన జయించగల రామానుజు డగు లక్ష్మణునికి పరమపూజ్యురాలగు సీతయే దుఃఖముచే బాధపడుచున్నదన కాల మెవ్వరికి దాట శక్యముగానిదిసుమా.

శ్లో॥ రామస్య వ్యవసాయజ్ఞా లక్ష్మణస్య చ ధీమతః।
నాత్యర్థం క్షుభ్యతే దేవీ గఙ్గేవ జలదాగమే॥ 4

టీ॥ రామస్య = శ్రీరామునియొక్కయు, ధీమతః = బుద్ధిమంతుడైన, లక్ష్మణస్య చ = లక్ష్మణునియొక్కయు, వ్యవసాయజ్ఞా = ప్రయత్నము లెరింగిన దేవీం = సీత, జలదాగమే = వర్షాకాలమునందు, గఙ్గేవ = గంగవలె, అత్యర్థం = మిక్కిలి, నక్షుభ్యతే = క్షోభజెందదు.

తా॥ శ్రీరాముడు భక్తవత్సలుడు, ఆశ్రితుల కాపాడ ప్రాణమునైన విడతు ననెడి వ్రతముకలవాడు, అట్టి పవిత్రుడు, కృతజ్ఞుడు నైన శ్రీరాముని యొక్క బలపరాక్రమాదుల నెరిగినదియు, మాయలేడి రూపధారి

యగు మారీచుని మరణసమయమున రామా రామా యనిన మోసము నెరింగిన ధీశాలి యగు లక్ష్మణుడు నేనెంత నొవ్వనాడినను రాముని ప్రమాదమును నమ్మని, రక్షణనే మాస్యమని తలంచు లక్ష్మణుని ప్రయత్నమును నెరిగిన సీత వర్షాకాలమంచు బురదతో నెక్కువగా నీరు వచ్చినను గంగ క్షోభము చెందనట్లు శ్రీరామలక్ష్మణుల ప్రయత్నాదుల నెరింగిన సంపూర్ణపాత్రిరాలు గనుకనే మిగుల బాధచెందకుండా యున్నది.

శ్లో॥ తుల్యశీలవయోవృత్తాం తుల్యాభిజనలక్షణామ్।
రాఘవోఽర్హతి వైదేహీం తం చేయ మసితేక్షణా॥ 5

టీ॥ తుల్యశీలవయోవృత్తాః—తుల్య = సమానమైన, శీల = శీలము, వయః = వయస్సు, వృత్తాం = చరిత్రిదులు కలిగినట్టియు, తుల్యాభిజన లక్షణాం - తుల్య = సమానమైన, అభిజన = కులాదులు, లక్షణాం = సాముద్రికాదిశుభ లక్షణములుకలిగిన, వైదేహీం = సీతనుగూర్చి, రాఘవః = శ్రీరాముడు, అర్హతి = తగుచున్నాడు, అసితేక్షణా = నల్లని నేత్రములుగల, ఇయం చ = ఈసీతయు, తం = ఆశ్రీరాముని గూర్చి, అర్హతి = తగుచున్నది.

తా॥ "అస్యాదేవ్యా మన స్తస్మి న్తస్యచాస్యాం ప్రతిష్ఠితమ్" అను పూర్వోక్త శ్లోకముప్రికారము శీలము, వయస్సు, చరిత్రి, కులము, సాముద్రిక శాస్త్రిది శుభలక్షణములు పరస్పరానుగుణ్యములై యున్నందున శ్రీరామునకు సీతయు, సీతకు శ్రీరామచంద్రుడును తగుదురు, లోకమునం దెక్కడైనా నిట్టి యనుకూలదాంపత్యము లేదనియే హనుమంతుడు తలంచెను. శ్రీరాముడుకూడ "పుంసాం మోహన రూపాయ" పురుషుడై యుండి పురుషులనే మోహింపజేయు సర్వావయవ సౌష్ఠవ సౌకుమార్య సౌందర్యరాసి యైనను అసితేక్షణా యని

సీతకు పునరుక్తి వాడుటలో స్త్రీత్వ విశేషసౌందర్యము అంగీకరించ వచ్చును. శ్రీరాముడుకూడ "నజీవేయం క్షణమపి వినా తా మసితేక్షణామ్" అని చెప్పియుండుటలో సీతయొక్క నల్లని నేత్రముల ప్రత్యేకతయే ద్యోతక మగును.

శ్లో॥ తాం దృష్ట్వా నవహేమాభాం లోకకాన్తా మివశ్రియమ్।
జగామ మనసా రామం వచనం చేదమబ్రవీత్॥ ౭

టీ॥ నవహేమాభాం - నవహేమ = మంచిబంగారమువంటి, ఆభాం = కాంతికలిగినట్టియు, లోకకాన్తాం = త్రిలోకసుందరి అయిన. తాం = ఆ సీతను, శ్రియమివ = లక్ష్మీదేవినివలెనే, దృష్ట్వా = చూచి, మనసా = మనస్సుతో, రామం = శ్రీరామునిగూర్చి, జగామ = వెళ్లెను, ఇదం = ఈ, వచనం = వాక్యమును, అబ్రవీత్ = పలికెను,

తా॥ హనుమంతుడు సువర్ణచ్ఛాయ గలిగి త్రిలోకసుందరి యగు లక్ష్మీదేవి వలె నున్న ఆ సీతను చూచి సాక్షాత్ లక్ష్మియే యని తలంచి సర్వలోకాభిరాముడైన శ్రీరాముని మనసా ధ్యానించి తా నాత్మలో నిలుపుకొన్న శ్రీరాముని గూర్చి యిట్లు పలికెను.

శ్లో॥ అస్యాహేతో ర్విశాలాక్ష్యా హతో వాలీ మహాబలః।
రావణప్రతిమో వీర్యే కబన్ధ శ్చ నిపాతితః॥ ౮

విరాధ శ్చ హతస్సఙ్ఖ్యే రాక్షసో భీమవిక్రమః।
వనే రామేణ విక్రమ్య మహేన్ద్రేణేవ శంబరః॥ ౯

చతుర్దశ సహస్రాణి రక్షసాం భీమకర్మణామ్।
నిహతాని జనస్థానే శరై రగ్నిశిఖోపమైః॥ ౯

ఖర శ్చ నిహత స్సఙ్ఖ్యే త్రిశిరా శ్చ నిపాతితః।
దూషణశ్చ మహాతేజా రామేణ విదితాత్మనా॥ ౧౦

శ్లో॥ ఐశ్వర్యం వానరాణాం చ దుర్లభం వాలిపాలితమ్।
అస్యా నిమిత్తే సుగ్రీవః ప్రాప్తవాన్ లోకసత్కృతమ్॥ ౧౧
సాగరశ్చ మయా క్రాన్త శ్శ్రీమాన్ నదనదీపతిః।
అస్యా హేతో ర్విశాలాక్ష్యాః పురీచేయం నిరీక్షితా॥ ౧౨
యది రామస్సముద్రాన్తాం మేదినీం పరివర్తయేత్।
అస్యాఃకృతే జగచ్చాపి యుక్తమిత్యేవ మే మతిః॥ ౧౩

విశాలాక్ష్యాః = విశాలనేత్రములు గల. అస్యా = ఈమెయొక్క. హేతోః = కారణమువలన, మహాబలః = గొప్పబలవంతుడైన, వాలీ = వాలి, హతః = చంపబడెను, వీర్యే = వీరత్వమందు, రావణప్రతిమః = రావణునితో సమానుడైన, కబన్ధశ్చ = కబంధుడుకూడ, నిపాతితః = చంపబడెను. సంఖ్యే = యుద్ధమునందు, భీమవిక్రమః = భయంకర పరాక్రమవంతుడైన, విరాధః = విరాధుడను, రాక్షసశ్చ = రాక్షసుడుకూడ, వనే = వనమందు, రామేణ = రామునిచే, విక్రమ్య = పరాక్రమించి, మహేన్ద్రేణ = దేవేన్ద్రునిచేత, శమ్బర ఇవ = శంబరాసురునివలె, హతః = చంపబడెను. భీమకర్మణాం = భయంకరకృత్యములుగల, రాక్షసాం = రాక్షసులయొక్క, చతుర్దశసహస్రాణి = పదునాలుగువేలు, అగ్నిశిఖోపమైః = అగ్నిజ్వాలలతో సమానమైన, శరైః = బాణములతో, జనస్థానే = జనస్థానమందు, నిహతాని = సంహరించబడిరి. విదితాత్మనా = భావితాత్ముడైన. రామేణ = రామునిచేత. మహాతేజాః = గొప్పతేజశ్శాలియగు. ఖరశ్చ = ఖరుడును, త్రిశిరాశ్చ = త్రిశిరుడును, దూషణశ్చ = దూషణుడును, సంఖ్యే = యుద్ధమందు, నిపాతితః = చంపబడెను, అస్యాః = ఈసీతయొక్క, నిమిత్తే = కారణమందు, సుగ్రీవః = సుగ్రీవుడు, వాలిపాలితం = వాలిచేపరిపాలింపబడిన, వానరాణాం = వానరులకు, దుర్లభం = పొందశక్యముగాని, ఐశ్వర్యం = ఐశ్వర్యమును, లోకసంస్కృ

తంచ = లోకగౌరవమును, ప్రాప్తవాన్ = పొందెను, విశాలాక్ష్యాః = విశాలనేత్రములుగల, అస్యాః = ఈమెయొక్క, హేతోః = కారణముననే, మయా = నాచేత, శ్రీమాన్ = శోభాయుక్తుడైనట్టియు నదనదీపతిః = నదీనదములకు, ప్రభువైన, సాగరశ్చ = సముద్రుడును, క్రాన్తః = దాటబడెను, ఇయం = ఈ, పురీచ = పట్టణమును, నిరీక్షితా = చూడబడినది, అస్యాః = ఈమెయొక్క, కృతే = కొరకు, రామః = శ్రీరాముడు, సముద్రాన్తాం = సముద్రమువరకుకల్గిన, మేదినీం = భూమిని, జగచ్చాపి = జగత్తును, పరివర్తయేద్యది = చుట్టి పచ్చినను, యుక్తం = తగినదే, ఇతి = ఇట్లు, మే = నాయొక్క, మతిః = బుద్ధి (అయియున్నది)

తా॥ సాక్షాత్ లక్ష్మియగు నీమె కారణముననే మహాబలశాలి యగు వాలి శ్రీరామునిచే చంపబడెను. రావణునితో సమాన బలపరాక్రమములు గల, కబంధుడు చంపబడెను, మహాపరాక్రమశాలి యగు విరాధుడు ఖరుడు,దూషణుడు, త్రిశిరుడు మొదలైన రాక్షసులు చంపబడిరి. కంచు రథములు గల పదునాలుగువేలమంది రాక్షసులు జనస్థానమునందు చంపబడిరి, ఈమెనిమిత్తముగానే సుగ్రీవుడు సామాన్యవానరులకు పొందశక్యముగాని మహదైశ్వర్యయుక్తమగు కిష్కింధారాజ్యమును గొప్ప గౌరవమునుపొందెను. ఈమె కారణముననే నేను మహాసముద్రమునుదాటి యీలంకాపట్టణమును చూడగలిగితిని. శ్రీరాముడే సీతనిమిత్తము యెల్లలోకములను, సముద్రపర్యంతమైన భూమిని తలక్రిందులుగ జేసి గిరగిర త్రిప్పినను యుక్తమనియే నాకు తోచుచున్నది. సీత సర్వసద్గుణరాశి, పతివ్రతాశిరోమణి, యగుటచేత శ్రీరాముడామె రక్షణనిమిత్తమెట్టి కార్యమునైన చేయవచ్చును.

శ్లో॥ రాజ్యం వా త్రిషు లోకేషు సీతా వా జనకాత్మజా।
త్రైలోక్యరాజ్యం సకలం సీతాయా నాప్నుయాత్కళాం॥ ౧౪

టీ॥ త్రిషు లోకేషు = మూడులోకములందలి, రాజ్యంవా = రాజ్యమా? జనకాత్మజా = జనకుని కుమా ర్తెయగు, సీతా వా = సీతయా? సకలం = సమస్తమైన, త్రైలోక్యరాజ్యం = త్రిలోకరాజ్యాధిపత్యము, సీతాయాః = సీతయొక్క, కళాం = షోడశకళనైన, నాప్నుయాత్ = పొందజాలదు.

తా॥ త్రిలోక రాజ్యలక్ష్మియా లేక సీతయా ఎవరు తక్కుష్టమని విచారించిన సీతాదేవియొక్క సుగుణ సౌందర్య సౌకుమార్యాది సంపూర్ణకళలలో త్రిలోకరాజ్యలక్ష్మి పదునారవకళనైనను పొందజాలదని తోచుచున్నది.

శ్లో॥ ఇయం సా ధర్మశీలస్య మైథిలస్య మహాత్మనః।
సుతా జనకరాజస్య సీతా భర్తృదృఢవ్రతా॥ ౧౫
ఉత్థితా మేదినీం భిత్త్వా క్షేత్రే హలముఖక్షతే।
పద్మరేణునిభైః కీర్ణా శుభైః కేదారపాంసుభిః॥ ౧౬
విక్రాన్తస్యార్యశీలస్య సంయుగే ష్వనివర్తినః।
స్నుషా దశరథస్యైషా జ్యేష్ఠా రాజ్ఞో యశస్వినీ॥ ౧౭
ధర్మజ్ఞస్య కృతజ్ఞస్య రామస్య విదితాత్మనః।
ఇయం సా దయితా భార్యా రాక్షసీవశమాగతా॥ ౧౮
సర్వాన్ భోగాన్పరిత్యజ్య భర్తృస్నేహబలాత్కృతా।
అచిన్తయిత్వా దుఃఖాని ప్రవిష్టా నిర్జనం వనమ్॥ ౧౯
సంతుష్టా ఫలమూలేన భర్తృశుశ్రూషణేరతా।
యా పరాం భజతే ప్రీతిం వనేఽపి భవనే యథా॥ ౨౦
సేయం కనకవర్ణాంగీ నిత్యం సుస్మితభాషిణీ।
సహతే యాతనామేతా మనర్థానా మభాగినీ॥ ౨౧

టీ॥ ధర్మశీలస్య = ధర్మమే స్వభావముగా గలిగినట్టియు, మహాత్మనః = గొప్పఆత్మజ్ఞానము కలిగినట్టియు, మైథిలస్య = మిథిలానగరప్రభువైన, జనకరాజస్య = జనకచక్రవర్తికి, సుతా = కుమారియు, భర్తృ

దృఢవ్రతా-భర్తృ = భర్తయందే. దృఢవ్రతా = స్థిరవ్రతముగలిగి నట్టియు, సా = ఆ, సీతా = సీత, ఇయం = ఈమెయే. హాలముఖక్షతే-హాలముఖ = నాగలియొక్క అగ్రభాగముచే, క్షతే = దున్నబడుచున్న, క్షేత్రే = యజ్ఞభూమియందు, పద్మరేణునిభైః-పద్మ = పద్మములయొక్క, రేణు = పరాగములతో, నిభైః = సమానము లైనట్టియు, శుభైః = శుభప్రదములైన, కేదారపాంసుభిః = పుణ్యక్షేత్రి పరాగములతో. వ్యాప్తా = వ్యాపింపబడినదియు. మేదినీం = భూమిని, భిత్వా = భేదించుకొని, ఉత్థితా = పుట్టినది విక్రాన్తస్య = పరాక్రమవంతుడైన. ఆర్యశీలస్య = సత్కార్యాచరణశీలుడైన, సంయుగేషు = యుద్ధములందు, అనివర్తినః = సాహసవంతుడైన. దశరథస్య = దశరథుడనే. రాజ్ఞః = మహారాజునకు, యశస్వినీ = కీర్తివంతురాలైన, జ్యేష్ఠా = పెద్దదైన, స్నుషా = కోడలు, ఏషా = ఈమెయే. ధర్మజ్ఞస్య = సర్వధర్మవేత్తయు, కృతజ్ఞస్య = చేసిన ఉపకారమును మరవనివాడును, విదితాత్మనః = ఆత్మవేత్తయునగు, రామస్య = శ్రీరామునికి, సా = ఆ, ఇయం = ఈమె, దయితా = ప్రియమైన, భార్యా = భార్యయగుసీతయే. రాక్షసీవశం = రాక్షసస్త్రీల అధీనమును. గతా = పొందినది, భర్తృస్నేహబలాత్కృతా-భర్తృ = భర్తయొక్క, స్నేహ = ప్రేమతో. బలాత్కృతా = బలాత్కరించబడినదై (భర్తయందమితప్రేమగలదై) సర్వాన్ = సమస్తములైన, భోగాన్ = భోగములను, పరిత్యజ్య = విడిచిపెట్టి, దుఃఖాని = దుఃఖములను, అచిన్తయిత్వా = లెక్కచేయక, నిర్జనం = జనశూన్యమైన, వనం = అరణ్యమున, ప్రవిష్టా = ప్రవేశించినది, భర్తృశుశ్రూషణే = భర్తసేవయందు. రతా = ఆసక్తికలదగుచు, ఫలమూలేన = కందమూలాదిఫలాదికముచేత, సంతుష్టా = పూర్ణసంతోషము కలదై. యా = ఎవరు. భవనేయథా = గృహమునందువలెనే, వనేఽపి = అరణ్యమందును, పరాం = ఉత్కృష్టమైన. ప్రీతిం = సంతోషమును, భజతే = పొందుచున్నదో. సా = ఆమె, ఇయం = ఈమెయే,

కనక వర్ణాఙ్గీ = బంగారుచాయగల అవయవములు కలిగినట్టియు. నిత్యం = ఎల్లప్పుడు. సుస్మితభాషిణీ = చిరునగవుతో మాట్లాడు, సా = ఆ. అయం = ఈసీత. అభాగినీ = దురదృష్టవంతురాలు అగుచు, ఏతాం = ఈ. అనర్థానాం = కష్టములయొక్క, యాతనాం = తీవ్రవేదనను, సహితే = సహించుచున్నది.

టీ॥ మహాజ్ఞాన సంపన్నుడయిన జనకచక్రవర్తి పవిత్రయజ్ఞక్షేత్రమందు. నాగేటిచాలున, భూదేవి పుత్రికగా గర్భనరకాదులు లేని అయోనిజ. ఆత్మజ్ఞాని అయిన జనకునిచేత, సాక్షాత్ లక్ష్మీభావనతో సుతగా పెంచబడినదియు, మహాత్ముడయినటువంటి శ్రీరాముని భార్యయు, పరాక్రమశాలి యగు దశరధునికి పెద్దకోడలును, కృతజ్ఞుడు ధర్మాత్ముడు సాక్షాత్ పరమేశ్వరుడగు శ్రీరామునికి ప్రేమభార్య యగు సీతయే యీమె. రాక్షసస్త్రీల వశమయ్యెను గదా। పుట్టింటను. అత్తయింటను, అష్టైశ్వర్యాది సర్వభోగాదు లనుభవింప ప్రత్యేకార్హతలు పొందియుండియు, మహారాక్షస క్రూరసింహాది భీకర స్థితులు కంటకగత ప్రాణాది భూసంచారాదులు కలిగి మహాదీనమును ననుభవించే స్థితిలో నున్నదయి పతియందే త్రికరణశుద్ధిగా సర్వస్థితుల యనురక్తయై మహా దృఢమయిన పతిసాన్నిధ్యసుఖము పతిసేవాభాగ్యము సర్వలోక మహా భోగము లన్నియు అల్పము లనే భావనతో వనమందలి భీకరములు బాధాకరము లన్నింటిని సహించుచు తనభర్త సాన్నిహిత్యమే గృహాభోగాదు లన్నింటినిమించినది, కందమూల ఫలభక్ష్యాదులను షడ్రసోపేత మయిన స్వగృహాభోజనము కన్న మిన్నగా తలంచుచు భర్తృసేవాపరాయణతతో వనమునకు వచ్చి యిప్పుడే రాక్షసస్త్రీలకు వశ్యురాలై సహింపరాని దుఃఖము లనుభవించుచున్న ఈమెయే శ్రీరాముని భార్య యగు సీత అయి యుండును.

శ్లో॥ ఇమాం తు శీలసమ్పన్నాం ద్రష్టు మర్హతి రాఘవః।
రావణేన ప్రమధితాం ప్రపామివ పిపాసితః॥ ౨౨

టీ॥ రాఘవః = శ్రీరాముడు, రావణేన = రావణునిచేత, ప్రమథితాం = బాధపెట్టబడినటువంటియు. శీలసమ్పన్నాం = సుగుణములతో కూడి యున్నట్టియు. ఇమాం తు = ఈసీతను, పిపాసితః = దప్పికకొన్నవాడు, ప్రపామివ = చలివేన్ద్రిను వలెనే, ద్రష్టుం = చూచుటకొరకు. అర్హతి = తగుచున్నాడు.

తా॥ దప్పిక గొన్నవాడు దప్పిక తీర్చుకొనుటకై, చలివేన్ద్రిను చూచి దప్పికతీర్చుకొన తొందరపడునట్లు దుర్మార్గుడయిన రావణుని మోసమున హరింపబడి, ఇచ్చట నానాబాధలు పడుచున్న యీ సీతను శ్రీరాముడు,ఆర్తత్రాణపరాయణుడు గనుక వెంటనే చూచుటకుఅర్హుడు.

శ్లో॥ అస్యా నూనం పునర్లాభా ద్రాఘవః ప్రీతిమేష్యతి।
రాజా రాజ్య పరిభ్రష్టః పునః ప్రాప్యేవ మేదినీమ్॥ ౨౩

టీ॥ రాజ్యపరిభ్రష్టః = రాజ్యమునుండి వెడలగొట్టబడిన, రాజా = రాజు, పునః = తిరిగి, మేదినీం = భూమిని, ప్రాప్యేవ = పొందినవలెనే, రాఘవః = శ్రీరాముడు, అస్యాం = ఈమెయొక్క, పునఃలాభాత్ = తిరిగిపొందుటవలన, నూనం = నిశ్చయముగ, ప్రీతిం = సంతోషమును, ఏష్యతి = పొందగలడు,

తా॥ రాజ్యభ్రష్టుడయిన రాజు తిరిగి రాజ్యమును పొంది సంతోషించినట్లు శ్రీరాముడు సీతను తిరిగి పొందుటవల్ల చాలా సంతోషించును.

శ్లో॥ కామభోగైః పరిత్యక్తా హీనా బన్ధుజనేన చ।
ధారయ త్యాత్మనో దేహం తత్సమాగమ కాఙ్క్షిణీ॥ ౨౪

టీ॥ కామభోగైః = కామసుఖములతో, పరిత్యక్తా = విడువబడినదియు, బన్ధుజనేన = బంధుజనములతో, హీనాచ = లేనట్టిదై, తత్సమాగమకాం

క్షిణీ-తత్ = అప్రియబాంధవులయొక్క, సమాగమ = కలయికను, కాంక్షిణీ = కోరుచున్నటువంటిదై, ఆత్మనః = తనయొక్క, దేహం = శరీరమును, ధారయతి = ధరించుచున్నది.

తా॥ ఈసీత ఇప్పుడు కామోపభోగములయిన స్రక్చన్దనాదుల విడిచినదై, స్వజనమునకు దూరమై భర్త అయిన శ్రీరాముని కలయికనే కోరు చుండుటచేతనే బ్రతికియున్నది.

శ్లో॥ నైషా పశ్యతి రాక్షస్యో నేమా న్పుష్పఫలద్రుమాన్।
ఏకస్థ హృదయా నూనం రామమేవానుపశ్యతి॥ ౨౫

టీ॥ ఏషా = ఈసీత, రాక్షస్యః = రాక్షసులను నపశ్యతి = చూడదు, ఇమాన్ = ఈ, ఫలపుష్పద్రుమాన్ = పుష్పఫలభరితమగు, వృక్షము లను, నపశ్యతి = చూడదు, ఏకస్థహృదయా = ఏకాగ్రమనస్సుకలదై రామమేవ = శ్రీరామునే, అనుపశ్యతి = అనుక్షణము చూచున్నది, నూనం = నిశ్చయము.

తా॥ సీతాదేవి శ్రీరామునెడబాటు సహింపలేనిదై, దుఃఖాతిశయమున బాహ్యదృష్టికి దూరమై, స్థిమితములేక దగ్గరనున్న రాక్షసులను పుష్పఫలభరిత సుందర వృక్షజాలమును చూడజాలక ఏకాగ్రచిత్తయై ఆత్మారాముండగు రామునే మనంబున ధ్యానించుచున్నది.

శ్లో॥ భర్తా నామ పరం నార్యా భూషణం భూషణాదపి।
ఏషా తు రహితా తేన భూషణార్హా నశోభతే॥ ౨౬

టీ॥ నార్యా = స్త్రీలు, భూషణాదపి = అలంకరించుకొనుటకంటె, పరం = ఉత్కృష్టమైన, భూషణం = అలంకారము, భర్తానామ = భర్తయేగా, తేన = ఆభర్తతో, రహితా = కలసియుండని, ఏషాతు = ఈమెఅయితే, భూషణార్హా = భూషణములకు అర్హురాలుగా, నశో భతే. = ప్రకాశించదు.

తా॥ స్త్రీకి భర్తకంటె ఇతరభూషణములు త్తమములు కావె. ఇప్పుడే సీతాదేవి అన్నిభూషణములు మించిన భర్త యగు రామభూషణము లేక ప్రకాశించుటలేదు.

శ్లో॥ దుష్కరం కురుతే రామో హీనో యదనయా ప్రభుః।
ధారయ త్యాత్మనో దేహం నదుఃఖే నావసీదతి॥ ౨౭
ఇమా మసిత కేశాన్తాం శతపత్రనిభేక్షణామ్।
సుఖార్హాం దుఃఖితాం దృష్ట్వా మమాపి వ్యథితం మనః॥ ౨౮

టీ॥ యత్ = ఏకారణమువలన, ప్రభుః = ప్రభువు. రామః = శ్రీరాముడు, అనయా = ఈసీతతో, హీనం = శూన్యుడై, ఆత్మనః = తనయొక్క. దేహం = శరీరమును, ధారయతి = ధరించుచున్నాడో, దుఃఖేన = దుఃఖముతో, నావసీదతి = కృంగిపోవుటలేదో, దుష్కరం = దుష్కార్యమును, కురుతే = చేయుచున్నాడు, అసితకేశాన్తాం = నల్లని వెంట్రుకలకొనలు గలదియు, శతపత్రనిభేక్షణాం = పద్మపత్రములతో సమానమైన నేత్రములు గలిగినట్టియు, సుఖార్హాం = సుఖించుటకు, తగినట్టియు, ఇమాం = ఈసీతను. దుఃఖితాం = దుఃఖితురాలినిగా, దృష్ట్వా = చూచి, మమాపి = నాయొక్కయు, మనః = మనస్సు, వ్యథితః = వ్యథచెందుచున్నది.

తా॥ ఎటువంటి ఉత్తమస్త్రీలకును తలవెంట్రుకల కొనలు నల్లగనుండవు. సీత తలవెంట్రుకలు కొనలు నల్లగ నున్నవి. తామరరేకులతో సమమగు సౌందర్యము గల కన్ను లున్నవి, సర్వసద్గుణసౌకుమార్య సౌందర్యరాశి సాధ్వీమణి యగు సీత పద్మపత్రాక్షుడైన శ్రీరామునకు మోహము కలుగజేయుచున్నది. భర్తయగు శ్రీరాముని తొడయందు సుఖముగా కూర్చుండ తగినది ఇప్పుడీ రాక్షసస్త్రీలనడుమ అధికదుఃఖమునను భవించుచున్నది, ఈమెనుచూడ నేబంధములులేని వానరుడనైన నాకు కూడ బాధకలుగుచున్నది, ప్రత్యేక ప్రియబంధములు కలిగిన కరుణామయుడైన శ్రీరాముని మనస్సెంత బాధచెందియుండునోకదా!

శ్లో॥ క్షితిక్షమా పుష్కర సన్నిభాక్షీ
యా రక్షితా రాఘవ లక్ష్మణాభ్యాం।
సా రాక్షసాభి ర్వికృతేక్షణాభి
స్సంరక్ష్యతే సంప్రతి వృక్షమూలే॥ ౨౯

టీ॥ క్షితిక్షమా = భూమియొక్క క్షమాశాంతివంటి సద్గుణయుక్తయు. పుష్కరసన్నిభాక్షీ = సాముద్రికశాస్త్రోక్తశుభలక్షణముల నిండిన నేత్రములు కలిగిన, యా = ఏసీత, రామలక్ష్మణాభ్యాం = శ్రీరామ లక్ష్మణులచే, రక్షితా = రక్షింపబడినదో. సా = ఆమె, సంప్రతి = ఇప్పుడు. వృక్షమూలే = చెట్టుమొదట. వికృతేక్షణాభిః = వికారము లైనసేత్రములుగల (మిడిగ్రుడ్లుగల), రాక్షసీభిః = రాక్షసస్త్రీలచేత. సంరక్ష్యతే = సంరక్షణ చేయబడుచున్నది.

తా॥ భూదేవికివలె శమ దమాది (శాంత) గుణసంపత్తి కలిగి సాముద్రిక శాస్త్రోక్త శుభలక్షణోపేతములైన నేత్రములుగల యీ సీత రామలక్ష్మణులచే రక్షింపబడేది, ఇప్పుడు చెట్టుమొదట మిడిగ్రుడ్లతో భయంకరా కారములుగల రాక్షసస్త్రీల మధ్య నున్నదిగదా।

శ్లో॥ హిమహత నలినీవ నష్టశోభా।
వ్యసన పరంపరయా నిపీడ్య మానా।
సహచర రహితేవ చక్రవాకీ।
జనకసుతా కృపణాం దశాం ప్రపన్నా॥ ౩౦

టీ॥ హిమహతనలినీవ—హిమ = మంచుచేత; హత = కొట్టబడిన, నలినీవ = పద్మమువలె, నష్టశోభా = కాంతివిహీనమైనదై, వ్యసనపరంపరయా—వ్యసన = కష్టములయొక్క, పరంపరయా = సముదాయము చేత. నిపీడ్యమానా = విశేషముగ పీడింపబడుచున్నదై, సహచర

రహితా = భర్తచక్రవాకముతో విడివడిన. చక్రవాకీవ = ఆడచక్రవాకమువలె. జనకసుతా = జానకి, కృపణాం = దీనమైన. దశాం = అవస్థను. ప్రపన్నా = పొందియున్నది.

తా॥ ఈమె జనకుని ముద్దుబిడ్డగాను, తదుపరి శ్రీరాముని ప్రియభార్యగను సర్వసుఖము లనుభవించి ఇప్పుడు శ్రీరామవియోగ దుఃఖముతో సంతోషములేక మంచుతో కళాహీనమైన పద్మమువలె పరంపరగా వచ్చిన కష్టములచే మిగుల పీడింపబడుచు మగచక్రవాకమును పోగొట్టుకొన్న ఆడచక్రవాకమువలె

"ఆయాతి యాతి పునరేవ జలప్రియాతి।
పద్మాంకురాణి విచినోతి ధునోతి పక్షౌ।
ఉన్మత్త మతి కూజతి మందమందమ్।
కాంతావియోగవిధి చక్రవాకః॥"

గొప్ప దయనీయస్థితిని పొందియున్నదిగదా.

శ్లో॥ అస్యా హి పుష్పావనతాగ్రశాఖాః
శోకం దృఢం వై జనయన్త్యశోకాః।
హిమవ్యపాయేన చ మన్దరశ్మిః
రభ్యుత్థితో నైకసహస్రరశ్మిః॥ ౨౯

టీ॥ అస్యాం = ఈసీతకు, పుష్పావనతాగ్రశాఖా-పుష్ప = పుష్పములతో, అవనత = వంచబడిన, అగ్రశాఖాః = శాఖాగ్రములుకలిగిన. అశోకాః = అశోకవృక్షములు, హిమవ్యపాయేన-హిమ = మంచుయొక్క, వ్యపాయేన = పడకుండుటవలన, మన్దరశ్మిం-మన్ద = బాగామందమైన రశ్మిం = కిరణములుకలిగి, అభ్యుత్థితః = ఉదయించిన, సహస్రరశ్మిరివ = సూర్యునివలె, దృఢంవై = గొప్పదైన. శోకంహి = శోకమునే, జనయన్తి = పుట్టించుచున్నది.

తా॥ వసంతకాలమున పుష్పించి ఫలించి క్రిందకు వంగియున్న అశోక వృక్షములు చూచువారలకు ఆనందమును కలుగజేయునవైనా మంచుచే కప్పబడినందువలన మందములగు కిరణములతో యున్నతిని బొందని బాలభానునివలె మిక్కిలి విచారమును కలుగజేయుచున్నది.

శ్లో॥ ఇత్యేవమర్థం కపి రన్వవేక్ష్య।
సీతేయ మిత్యేవ నివిష్టబుద్ధిః।
సంశ్రిత్య తస్మిన్నిషసాద వృక్షే।
బలీ హరీణా మృషభ స్తరస్వీ॥ 32

టీ॥ హరీణాం = వానరులలో, వృషభః = శ్రేష్ఠుడైన, బలీ = బలవంతుడైన, తరస్వీ = వేగవంతుడైన, కపిః = హనుమంతుడు, ఇత్యేవం = ఈప్రకారము, అర్థం = కార్యార్థమును, అన్వవేక్ష్య = చూచి, ఇయమేవ = ఈమెయే, సీత = సీత, ఇతి = అని, నివిష్టబుద్ధిః = నిశ్చయబుద్ధికలవాడై, తస్మిన్ = ఆ, వృక్షే = వృక్షమందు, సంశ్రిత్య = ఆశ్రయించి, నిషసాద = ఉండెను.

తా॥ మహాబలవంతుడు, వేగవంతుడు నగు హనుమంతుడా శింశుపావృక్షమూలమునందున్న స్త్రీని జూచి పూర్వోక్త సర్వశుభలక్షణాదులచే సీతయని నిశ్చయించెను. సందేహములేదని తలంచి తరువాతచేయదగిన కార్యవిధానము నాలోచించుచు ఆ శింశుపావృక్షమునందే యుండెను, సీతాదేవి నశోక వృక్షముక్రింద నుంచవలసిన కారణమేమి? దీనికే సీతా శోకవృక్ష న్యాయమని పేరు. ఏచెట్టుక్రింద నుంచినను ఆచెట్టు క్రింద నుంచవలసిన కారణమేమని ప్రశ్నలు పుట్టును. ఈమె కూర్చుండిన చెట్టునకు సమీపమందే మేడయున్నట్లు హనుమంతుని వాక్యముల వలన తెలియనగు. రావణుడు దానియందామెను ఉంచవలెయుననియే తలంచెను. కాని ఆమె నిరాకరించి సమీపమందున్న చెట్టుక్రింద కూర్చుండెను.

షోడశసర్గము సమాప్తము

# శ్రీమద్వాల్మీకిరామాయణే సున్దరకాణ్డే సప్తదశ స్సర్గః

* హనుమంతుడు సీతాదేవికి కావలియున్న రాక్షసస్త్రీలను జూచుట *

శ్లో॥ తతః కుముదషణ్డాభో నిర్మలో నిర్మలం స్వయమ్।
ప్రజగామ నభ శ్చన్ద్రో హంసో నీలమివోదకమ్॥ ౧

టీ॥ తతః = అటుతరువాత, కుముదషణ్డాభః-కుముదషణ్డ = తెల్లకలువలరేకులవంటి. ఆభః = కాంతికలిగినట్టియు, నిర్మలః = స్వచ్ఛమైన. చన్ద్రః = చంద్రుడు, స్వయం = స్వయముగా, నిర్మలం = నిర్మలమై నీలం = నల్లనైన. ఉదకం = ఉదకమును, హంసఇవ = హంసవలెం నభః = ఆకాశమును, ప్రజగామ = ప్రకాశించెను.

తా॥ తెల్లకలువల రేకులవంటి కాంతిగలిగి నిర్మలుడైన చంద్రుడు నిర్మలముగ నల్లగ నున్న సరోవరము నీటియందలి రాజహంసవలె ఆకాశమున ప్రకాశించుచుండెను.

శ్లో॥ సాచివ్యమివ కుర్వన్ స ప్రభయా నిర్మలప్రభః।
చన్ద్రమా రశ్మిభి శ్శీతై స్సిషేవే పవనాత్మజమ్॥ ౨

టీ॥ నిర్మలప్రభః — నిర్మలమైన కాంతిగల, సః = ఆ, చన్ద్రమాః = చంద్రుడు, ప్రభయా = కాంతిచేత, సాచివ్యం = సహకారమును, కుర్వన్నివ = చేయుచున్నవాడువలె, శీతైః = చల్లనైన. రశ్మిభిః = కిరణముతో, పవనాత్మజం = వాయుకుమారుడైన హనుమంతుని సిషేవే = సేవించెను.

తా॥ షోడశ కళాపూర్ణుడైన చంద్రుడు హనుమంతునికి సీతాన్వేషణమందు సహకార మొనర్చువాడు వలెనే తన చల్లని కిరణములతో సంతోషము కలుగజేయుచుండెను.

శ్లో॥ స దదర్శ తత స్సీతాం పూర్ణచన్ద్ర నిభాననామ్।
శోకభారై రివ న్యస్తాం భారై ర్నావ మివామ్భసి॥ ౩

టీ॥ తతః = అటుతరువాత, సః = హనుమంతుడు, పూర్ణచన్ద్రనిభాననాం- పూర్ణచన్ద్ర = నిండుచంద్రునితో, నిభ = సమానమైన, ఆననాం = ముఖముకలిగినట్టియు, శోకభారైః — అధికదుఃఖములతో, న్యస్తామివ స్థితాం = కృంగిపోవుచున్నదివలె నున్నట్టి, సీతాం = సీతను, అమ్భసి = ఉదకమునందు, భారైః = బరువులతో, న్యస్తాం = కృంగిపోయిన, నావమివ = నావవలెనే, దదర్శ = చూచెను.

తా॥ హనుమంతుడు నిండుచంద్రుని బోలు ముఖవర్చస్సు గలదైనను ప్రస్తుత దుఃఖభారముచేత నదీప్రవాహమున నెక్కువ భారముతో క్రుంగిపోవుచున్న నావవలె క్రుంగిపోవుచున్న సీతను చూచెను.

శ్లో॥ దిదృక్షమాణో వైదేహీం హనుమా న్మారుతాత్మజః।
సదదర్శా విదూరస్థా రాక్షసీ ర్ఘోరదర్శనాః॥ ౪

టీ॥ మారుతాత్మజః = వాయుపుత్రుడయిన, సః = ఆ, హనుమాన్ = హనుమంతుడు, వైదేహీం = సీతను, దిదృక్షమాణః = చూడ నిచ్ఛగలవాడై, అవిదూరస్థాః = ఆసమీపస్థులయినట్టియు, ఘోరదర్శనాః = భయంకరాకారులయిన, రాక్షసీః = రాక్షసస్త్రీలను, దదర్శ = చూచెను.

తా॥ మహాత్ముడయిన హనుమంతుడు. సీతను చూడదలచినవాడై, ఆసమీపముననే వికృతరూపములతో భయంకరాకారులైన రాక్షసస్త్రీలను చూచెను.

శ్లో॥ ఏకాక్షీ మేకకర్ణాం చ కర్ణప్రావరణాం తథా।
అకర్ణాం శఙ్కుకర్ణాం చ మస్తకోచ్ఛ్వాసనాసికామ్॥ ౫

అతికాయోత్తమాంగీం చ తను దీర్ఘశిరోధరామ్।
ధ్వస్తకేశీం తథాఽకేశీం కేశకమ్బళ ధారిణీమ్॥ ౬
లమ్బకర్ణలలాటాం చ లమ్బోదర పయోధరామ్।
లమ్బోష్ఠీ చుబుకోష్ఠీం చ లమ్బాస్యాం లమ్బజానుకామ్॥ ౭
హ్రస్వాం దీర్ఘాం తథా కుబ్జాం వికటాం వామనాం తథా।
కరాళాం భుగ్నవక్త్రాం చ పిఙ్గాక్షీం వికృతాననామ్॥ ౮

టీ॥ ఏకాక్షీం = ఒకకన్నుకలదానిని, ఏకకర్ణాం చ = ఒకచెవికలదానిని, తథా = ఆప్రకారముగనే, కర్ణప్రావరణాం = ఆవరించిన చెవులు కలదానిని, శఙ్కుకర్ణాం చ = మేకువంటి చెవులు కలదానిని, మస్తకోచ్ఛ్వాసనాసికాం = ఊర్ధ్వముఖ నాసిక కలదానిని, అతికాయోత్తమాఙ్గీంచ = పెద్ద శరీరము పెద్దతల కలదానిని, తనుదీర్ఘశిరోధరాం = పొడవుకంఠముకల దానిని, ధ్వస్తకేశీం = చింపిరిజుత్తు కలదానిని, కేశకమ్బళధారిణీమ్ = వెంట్రుకల కంబళము కలదానిని, అకేశీం = బోడితలకలదానిని, లమ్బకర్ణలలాటాం = వ్రేలాడు చెవులు కలదానిని, నొసలు కలదానిని, లమ్బోదరపయోధరాం = వ్రేలాడు పొట్ట స్తనములు గలదానిని, లమ్బోష్ఠీం = వ్రేలాడు అధరోష్ఠములు కలదానిని, లమ్బాస్యాం = వ్రేలాడు ముఖము కలదానిని, లమ్బజానుకాం = వంగి తగులుకొను మోకాళ్లు కలదానిని, హ్రస్వాం = పొట్టిదానిని, దీర్ఘాం = అతిపొడవయిన దానిని, తథా = ఆప్రకారముగా, కుబ్జాం = గూనిదానిని, వికటాం = వికారమయినదానిని, వామనాం = పొట్టిదానిని, తథా = ఆప్రకారము, కరాళాం = తీవ్రమయినదానిని, భుగ్నవక్త్రాంచ = సన్నముఖము కలదానిని, పింగాక్షీం = గోరోజనము రంగువంటి నేత్రములు కలదానిని, వికృతాననాం = వికారముగనున్న ముఖము గలదానిని.

తా॥ హనుమంతుడు శింశుపా వృక్షము మొదటనున్న సీతకు కావలిగా నున్న నానా వికారులయిన రాక్షసస్త్రీలను చూచెను.

శ్లో॥ వికృతాః పిఙ్గళాః కాళీః క్రోధనాః కలహప్రియాః।
కాలాయస మహాశూల కూట ముద్గర ధారిణీః॥ ౯
వరాహ మృగ శార్దూల మహిషాజ శివాముఖీః।
గజోష్ట్రహయ పాదీశ్చ నిఖాత శిరసోఽపరాః॥ ౧౦
ఏకహస్తైక పాదాశ్చ ఖరకర్ణ్యశ్వ కర్ణికాః।
గోకర్ణీ ర్హస్తికర్ణీశ్చ హరికర్ణీ స్తథాపరాః॥ ౧౧
అనాసా అతినాసా శ్చ తిర్యఙ్నాసావినాసికాః।
గజ సన్నిభ నాసాశ్చ లలాటోచ్ఛ్వాసనాసికాః॥ ౧౨
హస్తిపాదా మహాపాదా గోపాదాః పాదచూళికాః।
అతిమాత్ర శిరోగ్రీవా అతిమాత్రకుచోదరీః॥ ౧౩
అతిమాత్రాస్య నేత్రాశ్చ దీర్ఘజిహ్వా నఖా స్తథా।
అజాముఖీ ర్హస్తిముఖీ ర్గోముఖీ స్సూకరీముఖీః॥ ౧౪
హయోష్ట్రి ఖరవక్త్రాశ్చ రాక్షసీ ర్ఘోరదర్శనా।
శూలముద్గర హస్తాశ్చ క్రోధనాః కలహప్రియాః॥ ౧౫
కరాళా ధూమ్రకేశీశ్చ రాక్షసీ ర్వికృతాననాః।
పిబన్తి స్సతతం పానం సదా మాంస సురాప్రియాః॥ ౧౬
మాంస శోణిత దిగ్ధాఙ్గీ ర్మాంస శోణిత భోజనాః।
తా దదర్శ కపి శ్రేష్ఠో రోమహర్షణ దర్శనాః॥ ౧౭
స్కన్ధవన్త ముపాసీనాః పరివార్యవనస్పతిమ్।

టీ॥ వికృతాః = వికారముగనున్నవారిని, పిఙ్గళాః = గోరోచనవర్ణము గలవారిని, కాళీః = బొగ్గువలె నల్లగ నున్నవారిని, క్రోధనాః = మిగులకోపము కలవారిని, కలహప్రియాః = కలహమందిష్టము కలవారిని. కాలాయసమహాశూలకూటముద్గరధారిణీః - కాలాయస = ఉక్కుతో చేయబడిన, మహాశూల = పెద్దశూలములు, కూట = కత్తి, ముద్గర = ముద్గరమనే ఆయుధములు, ధారిణీః = ధరించినవారిని, వరాహమృగ

శార్దూల మహిషాజ శివాముఖీః-వరాహ = పంది, మృగ = లేడి, శార్దూల = సింహము, మహిష = దున్నపోతు, అజ = మేక, శివ = నక్క, ముఖీ = ముఖములు కలవారిని, గజోష్ట్రహయపాదీశ్చ- గజ = ఏనుగు, ఉష్ట్ర = ఒంటె, హయ = గుఱ్ఱము, పాదీశ్చ = పాదములు గలవారిని. ఏకహస్తైక పాదాశ్చ — ఏకహస్త = ఒకే చెయ్యి,ఏకపాదాశ్చ = ఒకేపాదముగలవారిని. అపరాః = మరికొందరు, నిఖాతశిరసః = గుంటలు పడిన తలలు కలవారిని, ఖరకర్ణ్యశ్వ కర్ణికాః — ఖరకర్ణి = గాడిదచెవి. అశ్వకర్ణికాః = గుఱ్ఱపుచెవులు గల వారిని, గోకర్ణీ = ఆవుచెవులు గలవారిని, హస్తికర్ణీశ్చ = ఏనుగు చెవులు గలవారిని, తదా = ఆప్రకారము, అపరాః = మరికొందరు, హరికర్ణీశ్చ = కోతిచెవులు కలవారిని, అనాసాః = ముక్కులులేనివారిని, అతినాసాశ్చ = పెద్దముక్కులుకలవారిని, తిర్యఙ్నాసాః = అడ్డ ముక్కులు కలవారిని, వినాసికాః = నాసికలుపోయి బొత్తలున్నవారిని, గజసన్నిభ నాసాశ్చ = ఏనుగుతొండములవంటి ముక్కులు గలవారిని, లలాటోచ్ఛ్వాసనాసికాః = నొసలువరకు ముక్కులుగలవారిని, హస్తి పాదాః = ఏనుగుపాదములు కలవారిని. మహాపాదాః = గొప్పపాదములు కలవారిని, గోపాదాః = ఆవుపాదములు కలవారిని, పాదచూళికాః = కడియములవంటి. పాదములు గలవారిని, అతిమాత్రశిరోగ్రీవాః = పెద్దతల మెడకలవారిని, అతిమాత్ర కుచోదరీః = పెద్దపొట్టలు స్తనములు కలవారిని, అతిమాత్రస్యనేత్రాః = పెద్దముఖములుపెద్దనేత్రములుగలవారిని, దీర్ఘజిహ్వానఖాః = పెద్దనాలుకలు కలవారిని, పొడవయినగోళ్లుకలవారిని. తథా = ఆప్రకారం, అజాముఖీ = మేకముఖములు గలవారిని, హస్తిముఖీ = ఏనుగు ముఖములు కలవారిని, గోముఖీ = ఆవుముఖములు గలవారిని, సూకరముఖీః = పందిముఖము కలవారిని, హయోష్ట్రఖరవక్త్రాశ్చ-హయ = గుఱ్ఱములు, ఉష్ట్ర = ఒంటెలు, ఖర = గాడిదలయొక్క, వక్త్రాశ్చ = ముఖములు కల

వారిని ఘోరదర్శనాః = భయంకరముగా కనపడేవారిని. రాక్షసీః = రాక్షసస్త్రీలను, శూలముద్గర హస్తాః = చేతియందు శూల ముద్గ రాయుధములు కలవారిని, కలహప్రియాః = పోట్లాటలయందు ఇష్టము కలవారిని ధూమ్రకేశీశ్చ = పొగచూరిన వెంట్రుకలు కలవారిని, వికృతాననాః = వికారముఖములు గల, రాక్షసీః = రాక్షసస్త్రీలను, సతతం = ఎల్లప్పుడు పానం = మద్యపానమును, పిబన్తీః = త్రాగుచున్నవారిని, సదా = ఎల్లప్పుడు, మాంససురాప్రియాః = మాంసము మద్య మందు ఇష్టము గల వారిని, మాంసశోణితదిగ్ధాంగీః = మాంసరక్తములతో పూయబడిన అవయవములు కలవారిని, మాంస శోణిత భోజనాః = రక్తము మాంసము ఆహారము కలవారిని, రోమహర్షణదర్శనాః = చూడగానే గగుర్పాటు కలిగించే వారిని, స్కన్ధవంతం = కొమ్మలతోకూడినటువంటి, వనస్పతీం = పూయకనే కాచే ఆచెట్టును, పరివార్య = చుట్టుముట్టి, ఉపాసీనాః = కూర్చుండియున్న, తాం = ఆరాక్షసస్త్రీలను, కపిశ్రేష్ఠః = వానరశ్రేష్ఠుడయిన హనుమంతుడు, దదర్శ = చూచెను.

తా॥ వికృతమయిన శరీరకాంతులుగల్గి భయంకర శల్యాయుధములు ధరించి అడవిపంది జింక, పులి, మేక, నక్క, మొదలుగాగల మృగజాతి యొక్క అవయవములతో సమానములయిన, ముఖ, కర, చరణాద్యవయవములు కలిగి క్రోధ స్వభావములు కలిగి ఆశింశుపావృక్షమును చుట్టి కూర్చుండియున్న, రాక్షసస్త్రీలను హనుమంతుడు గాంచెను,

శ్లో॥ తస్యాధస్తాచ్చ తాం దేవీం రాజపుత్రీ మనిన్దితామ్॥ ౧౮
లక్షయామాస లక్ష్మీవాన్ హనుమాన్ జనకాత్మజామ్।
నిష్ప్రభాం శోకసంతప్తాం మలసఙ్కుల మూర్ధజామ్॥ ౧౯
క్షీణపుణ్యాం చ్యుతాం భూమౌ తారాం నిపతితా మివ।
చారిత్ర వ్యపదేశాఢ్యాం భర్తృ దర్శన దుర్గతామ్॥ ౨౦

శ్లో॥ భూషణై రుత్తమై ర్హీనాం భర్తృ వాత్సల్య భూషణామ్।
రాక్షసాధిప సంరుద్ధాం బన్ధుభిశ్చ వినాకృతామ్॥ ౨౧
వియూథాం సింహసంరుద్ధాం బద్ధాం గజవధూ మివ।
చన్ద్రరేఖాం పయోదా న్తే శారదాభ్రై రివావృతామ్॥ ౨౨
క్లిష్టరూపా మసంస్పర్శా దయుక్తా మివ పల్లకీమ్।

టీ॥ లక్ష్మీవాన్ = శోభాయుక్తు డయిన. హనుమాన్ = హనుమంతుడు. తస్య = ఆ చెట్టుయొక్క, అధస్తాచ్చ = క్రిందనుండియే రాజపుత్రీం = రాజకుమార్తె అయినట్టియు, అనిన్దితామ్ = నిర్దోషురాలై నట్టియు, జనకాత్మజాం = జనకుని కుమార్తె అయిన, తాం = ఆ, దేవీం = సీతాదేవిని, లక్షయామాస = చూచెను, నిష్ప్రభాం = కాంతి లేనట్టియు, మలసఙ్కులమూర్ధజామ్—మల = ధూళిచే, సఙ్కుల = కప్పబడిన, మూర్ధజాం = శిరోజములు కలిగినట్టి, క్షీణపుణ్యాం = పుణ్యక్షీణమయినట్టిదై, చ్యుతాం = జారిపడుచున్నదగుచు, భూమౌ = భూమియందు, నిపతితాం = పడినటువంటి, తారామివ (స్థితాం) = నక్షత్రమువలె నున్నటువంటి. భర్తృదర్శనదుర్గతాం — భర్తృదర్శన = భర్తయొక్కదర్శనము, దుర్గతాం = పొందజాలనట్టియు, ఉత్తమైః = ఉత్తములయిన, భూషణైః = అలంకారములతో, హీనాం = శూన్యురాలై నట్టియు, భర్తృవాత్సల్య భూషణాం—భర్తృవాత్సల్య = భర్తయొక్క ప్రేమయే, భూషణాం = అలంకారముగ గలిగినట్టియు. రాక్షసాధిపసంరుద్ధాం-రాక్షసాధిప = రావణునిచే, సంరుద్ధాం = నిర్బంధింపబడినట్టియు. వియుథాం = గుంపులేనట్టియు, సింహసంరుద్ధాం = సింహముచే జిక్కినటువంటిదై, బద్ధాం = పట్టుకోబడిన, గజవధూ మివ (స్థితాం) = ఆడుయేనుగువలె నున్నటువంటియు, క్లిష్టరూపాం = కృశించినరూపముగలదానిని. అసంస్ప

ర్యాత్ = తాకకపోవుటవలన (మూలపడవేసియుంచుటవలన), అయు
క్తాం = చెడిపోయిన. వల్లకీమివస్థితాం = వీణవలెనున్న. తాం = ఆ
దేవీం = సీతాదేవిని, లక్షయామాస = చూచెను.

తా॥ హనుమంతుడు శోభగలవాడై. రాజకళగలిగి మహారాజు జనకుని
కుమార్తై పరస్థానవాసియైనను, విర్ధోషురాలై పరమపతివ్రతయై శోకసం
తాపములు చెందియుండుటచే కాంతిహీనయు దుమ్ముతోనిండి చిక్కులు
పడియున్న కేశజాలము కలదియు. పుణ్యక్షీణతచే, ఆకాశమునుండి
జారిభూమిపై పడిన నక్షత్రమువలె నున్నదియు, మహాపవిత్ర చరిత్రి
గలదియు, భర్తదర్శనము లేక దుఃఖించుచున్నదియు. ఉత్త
మాలంకార రహిత అయినను భర్తధ్యానమే యుత్తమాలంకారముగా
గలదియు. స్వజనులనుండి రావణునిచే హరింపబడి గుంపునుండివీడి
సింహమువాతపడిన ఆడు ఏనుగు చందమున తల్లడిల్లుచున్నదియు.
శరత్కాలమున మేఘములచే కప్పబడిన చంద్రరేఖవలె నున్నదియు
వాడక మూలపడవైచిన సాధనలేని వీణవలె శోభహీనయగు సీతను
చూచెను.

శ్లో॥ సీతాం భర్తృవశే యుక్తామయుక్తాం రాక్షసీవశే॥ ౨౩
ఆశోకవనికా మధ్యే శోకసాగర మాప్లుతామ్।
తాభిః పరివృతాం తత్రసగ్రహామివ రోహిణీమ్॥ ౨౪
దదర్శ హనుమా న్దేవీం లతా మకుసుమా మివ।

టీ॥ తత్ర = అక్కడ. హనుమాన్ = హనుమంతుడు. భర్తృవశే =
భర్తయగు శ్రీరాముని యధీనమందు. యుక్తాం = తగినటువంటియు.
రాక్షసీవశే = రాక్షసవశమందు. అయుక్తాం = తగనటువంటియు. అశో
కవనికామధ్యే = అశోకవనమధ్యయందు. శోకసాగరం = దుఃఖసము
ద్రమును, ఆప్లుతాం = ఈదుచున్నటువంటియు, సగ్రహాం = క్రూరగ్ర
హావిష్టమయిన, రోహిణీ మివ = రోహిణివలె, తాభిః = ఆరాక్షస

స్త్రీలచేత, పరివృతాం = ఆవరించబడియున్నటువంటియు. అకుసుమాం = పుష్పహీనమయిన, లతామివ = లతవలెనున్న, సీతాదేవీం = సీతాదేవిని, దదర్శ = చూచెను.

తా॥ భర్తయగు శ్రీరాముని కనుకూలవతియు రాక్షసస్త్రీల కనువుగానిదియు అశోకవన మధ్యమున దుఃఖసాగరమునబడి దుష్టగ్రహావాత బడిన రోహిణీ నక్షత్రమువలె రాక్షసస్త్రీలచే ముట్టడింపబడియున్నదియు. పుష్పములులేని లతవలె నున్నదియు, వెలవెలబోవుచున్న సీతను హనుమంతుడు చూచెను.

శ్లో॥ సా మలేన చ దిగ్ధాఙ్గీ వపుషా చాప్యలఙ్కృతా॥ ౨౫
మృణాళీ పంకదిగ్ధేవ విభాతి న విభాతి చ।
మలినేన తు వస్త్రేణ పరిక్లిష్టేన భామినీమ్॥ ౨౬
సంవృతాం మృగశాబాక్షీం దదర్శ హనుమాన్కపిః।
తాం దేవీం దీనవదనా మదీనాం భర్తృతేజసా॥ ౨౭
రక్షితాం స్వేన శీలేన సీతా మసితలోచనామ్।

టీ॥ కపిః = వానరుడయిన, హనుమాన్ = హనుమంతుడు, సా = ఆసీత, మలేన = దుమ్ముచేత, దిగ్ధాఙ్గీ = పూయబడిన, అవయవములుకలిగి, వపుషాపిచ = శరీరముచేత నైతే, అలఙ్కృతా = అలంకరించబడినదై, మృణాళీపంకదిగ్ధేవ = బురదతోపూయబడిన పద్మమువలెనే, విభాతి = ప్రకాశించుచున్నది, నవిభాతిచ = ప్రకాశించుటలేదు, భామినీం = ఉత్తమస్త్రీ అయినటువంటియు, మలినేన = మురికితో కూడినట్టియు, పరిక్లిష్టేన = క్లిష్టావస్థగా నున్నట్టియు, వస్త్రేణతు = వస్త్రముతో, సంవృతాం = కూడియున్నట్టియు, మృగశాబాక్షీం = లేడికూన చూపులుకలిగినట్టియు, దీనవదనాం = విచారముఖముకలదియు, భర్తృతేజసా = భర్తయగు శ్రీరాముని తేజస్సుతో, అదీనాం = ధైర్యమును వహించుచున్నదియు, స్వేన = స్వకీయమయిన, శీలేన =

సౌశీల్యముచేత, రక్షితాం = రక్షింపబడుచున్నట్టియు, అసితలోచనాం = నల్లని నేత్రములు కలిగినట్టియు, దేవీం = దివ్యతేజోవిరాజితయునగు, తాం = ఆ, సీతాం = సీతను, హనుమాన్ = హనుమంతుడు, దదర్శ = చూచెను.

తా॥ దుష్టరావణాపహృతయై అశోకవనమం దుంచబడిన సీత స్నానాదులు లేనందున మురికితో దట్టముగ నిండిన శరీరము కలదయినను మాసినదియు చాలీచాలని వస్త్రముతో అధికదుఃఖము ననుభవించుచున్నను స్వభావసిద్ధమయిన స్వశీలముచేత, అడుసులో పెరిగిన తామరపూవు వలె, ప్రకాశించుచు ప్రకాశములేనిదాని వలె నుండెను. అమితదుఃఖముచే దీనదశ బొందియు శ్రీరాముని తేజోధైర్యసాహసముల నెరుంగుటచే ధైర్యము వహించుచు రాక్షసస్త్రీలభయమున బెదరిన లేడికూనవలె నల్దిశల జూచుచు తన శీలాదులచే దుష్టరావణసంహార మొనర్పగల మహత్తర స్త్రీశక్తి కలిగియున్న సీతాదేవిని హనుమంతుడు చూచెను.

శ్లో॥ తాం దృష్ట్వా హనుమాన్ సీతాం మృగశాబనిభేక్షణామ్॥ ౨౮
మృగకన్యామివ త్రస్తాం వీక్షమాణాం సమన్తతః।
దహన్తీమివ నిశ్వాసై ర్వృక్షా న్పల్లవ ధారిణః॥ ౨౯

టీ॥ హనుమాన్ = హనుమంతుడు, మృగశాబనిభేక్షణామ్-మృగశాబ = లేడికూనయొక్క, నిభేక్షణామ్ = చూపులువంటి చూపులుగలిగినట్టియు, త్రస్తాం = భయబడిన, మృగకన్యామివ = కన్నెలేడివలె, సమన్తతః = అంతట, వీక్షమాణాం = చూచుచున్నట్టియు, నిశ్వాసైః = నిట్టూర్పులతో, పల్లవధారిణః = చిగుళ్లతోనున్న, వృక్షాన్ = వృక్షములను, దహన్తీమివ = తగులబెట్టుచున్నట్లున్న, తాం = ఆ, సీతాం = సీతను, దృష్ట్వా = చూచెను.

తా॥ బెదిరిన లేడిచూపులు గలిగిన భయపడిన కన్నెలేడివలె అంతట చూచుచు నిట్టూర్పులతోనే వృక్షజాలమును దహించునదివలె నున్న సీతను హనుమంతుడు చూచి సంతోషించెను.

శ్లో॥ సఙ్ఘాతమివ శోకానాం దుఃఖస్యోర్మిమివోత్థితామ్।
తాం క్షమాం సువిభక్తాఙ్గీం వినాభరణశోభినీమ్॥ ౩౦
ప్రహర్ష మతులం లేభే మారుతిః ప్రేక్ష్య మైథిలీమ్।

టీ॥ శోకానాం = శోకములయొక్క, సఙ్ఘాతమివ = సమూహమువలెను, దుఃఖస్య = దుఃఖముయొక్క, ఉత్థితాం = లేచిపడుచున్న, ఊర్మిమివ = కెరటమువలెనున్నట్టియు, క్షమాం = ఓర్పుగలదియు, సువిభక్తాఙ్గీం = శుభావయవములు గలిగినట్టియు, వినాభరణశోభినీం = ఆభరణశూన్యమైనను శోభించుచున్న, తాం = ఆ, మైథిలీం = సీతను, ప్రేక్ష్య = చూచి, మారుతిః = హనుమంతుడు, అతులం = సాటిలేని, ప్రహర్షం = అధికసంతోషమును, లేభే = పొందెను.

తా॥ దుఃఖములన్నియు గుమిగూడి మూర్తీభవించినట్లున్నదియు, దుఃఖసముద్రమునకు అలమాదిరిగ నున్నదియు, కృశించియు, శుభావయవములుగలది గనుక ధరింపకపోయినను స్వభావసిద్ధ సౌందర్యముచే ప్రకాశించుచున్న సీతను హనుమంతుడు చూచి మిగుల సంతోషించెను.

శ్లో॥ హర్ష జాని చ సోఽశ్రూణి తాం దృష్ట్వా మదిరేక్షణామ్॥ ౩౧
ముమోచ హనుమాం స్తత్ర నమశ్చక్రే చ రాఘవమ్।
నమస్కృత్వా స రామాయ లక్ష్మణాయ చ వీర్యవాన్॥ ౩౨
సీతాదర్శన సంహృష్టో హనుమాన్ సంవృతోఽభవత్।

టీ॥ సః = ఆ, హనుమాన్ = హనుమంతుడు, హర్షజాని = సంతోషజనితమయిన, అశ్రూణి = కన్నీళ్ళను, తాం = ఆ, మదిరేక్షణాం =

మత్తేక్షించిన చూపులు కలదాని. దృష్ట్వా = చూచి, ముమోచచ = విడచిపెట్టెనట, తత్రచ = అక్కడనే. రాఘవః = శ్రీరామునిగూర్చి, నమశ్చక్రే = నమస్కరించెను. వీర్యవాన్ = పరాక్రమవంతుడయినవాఁ. హనుమాన్ = హనుమంతుడు. సరామాయా = శ్రీరామసహితుడయిన లక్ష్మణాయ = లక్ష్మణునికొరకు, నమస్కృత్వా = నమస్కరించి. సీతాదర్శనసంహృష్టః-సీతాదర్శన = సీతయొక్కదర్శనమువలన. సం హృష్టః = మిక్కిలిసంతోషించినవాడై. సంవృతః = సంక్షేపరూపము గలవాడై, అభవత్ = అయెను,

తా॥ హనుమంతుడు సీతను చూచి ఆనందబాష్పములు విడిచి పవిత్ర మూర్తి, యగు సీతను దర్శించు భాగ్యమును శ్రీరాముని అనుగ్రహము వలన లభించినదని యెంచి సోదరులగు, రామలక్ష్మణులకు, నమస్క రించెను, పరియాసపడి వెదకినందు కాప్రయాసము వ్యర్థముగాక సీతా దర్శనముచే సఫలమాయెనుగదా యని ఉప్పొంగినవాడై. ఎవరికిని కనబడక ఆ శింశుపావృక్షము మీదనే దాగుకొని యుండెను.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే వాల్మీకియే చతుర్వింశత్సహస్రి కాయాం సంహితాయాం శ్రీమత్సుందరకాండే అష్టషష్టితను స్సర్గాణాం లక్ష్మీనారాయణ దాసకృత సులభ పదార్థ తాత్పర్య కవిత చతుర్భాగేషు

ప్రథమభాగః సంపూర్ణమ్

శ్రీహనుమద్దేవతార్పణమస్తు

